10
A Glorious Decade

తెలుగు జాతీయ దినపత్రిక
వార్త
గుంటూరు
04-02-2006



# ప్రజల అండగా ... పదేళ్ళ పండుగ

## దశమ వార్షికోత్సవ

## ప్రత్యేక అనుబంధం

# అభివృద్ధిపథంలో తెనాలి పురపాలకసంఘం



శ్రీ కోనేరు రంగారావు గారు
రాష్ట్ర మునిసిపల్ శాఖామాత్యులు

శ్రీ వల్లభనేని బాలశౌరి గారు
ఎం.పి, తెనాలి

శ్రీ నాదెండ్ల మనోహర్ గారు
ఎమ్మెల్యే, తెనాలి.

శ్రీమతి డాక్టర్ తాడిబోయిన మస్తానమ్మ గారు
చైర్‌పర్సన్, తెనాలి



ఈదర వెంకట శివరామకృష్ణప్రసాద్
1వ వార్డు కౌన్సిలరు



మోపిదేవి ఫణిరాందేవ్
10వ వార్డు కౌన్సిలరు

★ 416 మందికి రాజీవ్ గృహకల్ప పథకం కింద గృహాలు మంజూరు.

★ రూ.48.16లక్షల నిధులతో జాతీయ మురికివాడల అభివృద్ధి పథకం కింద సి.సి రోడ్లు మరియు కాలువల నిర్మాణం కొరకు పనులు మంజూరు.

★ రూ.30లక్షల విలువతో పార్కులు మరియు ఆటస్థలముల అభివృద్ధి కొరకు పనులు చేపట్టుట జరుగుచున్నవి.

★ రూ.30లక్షలతో పురపాలకసంఘమునకు చెందిన భవనముల నిర్మాణమునకు నిధుల మంజూరు.

★ ఎ.పి.యు.ఎస్.పి పథకం అమలులో భాగంగా మూడవ దఫా కింద (సి మ్యాప్-2), రూ.507లక్షలతో మురికివాడల అభివృద్ధి నిమిత్తము 27 పనులు చేపట్టడమైనది.

★ ఎపియుఆర్‌యంఎస్‌పి పథకము అమలు నిమిత్తము మొదటి సంవత్సరము పనులకు సంబంధించి రూ.279 లక్షలతో మురుగుకాలువల నిర్మాణము చేపట్టడమైనది.

★ ఐ.ఎల్.సి.ఎస్ :- 822మంది లబ్ధిదారులకు వ్యక్తిగత మరుగుదొడ్ల పథకం కింద లెట్రిన్స్ నిర్మాణము చేయడమైనది. ఇంకను 176 మరుగుదొడ్లు నిర్మించుటకు మంజూరు చేయడమైనది.

★ వృద్ధాప్య ఫించనులు :- 1617 మంది వృద్ధులకు మరియు 202 మంది వితంతువులకు, 122మంది వికలాంగులకు ప్రతినెలా నెలకు రూ.100 చొప్పున ఫించను చెల్లించుట జరుగుచున్నది.

★ గార్బేజి కలెక్షను :- పట్టణములో ఇంటింటికి తిరిగి చెత్త చెదారములను పురపాలకసంఘ ప్రజారోగ్య సిబ్బందిచే సేకరించి ట్రై సైకిళ్ల ద్వారా తీసుకొను వెళ్లు కార్యక్రమము అంచెలవారీగా ప్రారంభించబడినది.

★ రూ.1200లకు ఇంటి సర్వీసు కుళాయిలు 105 నెంబర్లు మంజూరు చేయడమైనది.

★ ఎ.పి.యు.ఎస్.పి పథకం ద్వారా పట్టణములో వున్న నిరుపేదలైన స్వయం సహాయక గ్రూపులకు ఆర్థిక సహాయం కల్పించి బలోపేతము చేయు కార్యక్రమం చేపట్టబడినది.

★ ఇందిరమ్మ ఆదర్శ పథకం కింద ఎంపికైన 13వార్డులలో మౌలిక మరియు వ్యక్తిగత అవసరాల నిమిత్తం ప్రతిపాదనలు తయారు చేయుటమైనది.



వంపుగళ్ల సాల్మన్‌రాజు
2వ వార్డు కౌన్సిలరు



షేక్ కాలేషావలి
3వ వార్డు కౌన్సిలరు



హరిదాసు గౌరీశంకర్
11వ వార్డు కౌన్సిలరు



రమావత్ ఫిరంగి
12వ వార్డు కౌన్సిలరు



ఉప్పులేటి జాషువా చంద్రరావు
వైస్‌చైర్మన్, 4వ వార్డు కౌన్సిలరు



చెరుకుమల్లి సింగారావు
5వ వార్డు కౌన్సిలరు



సూర్యదేవర సాంబశివరావు
13వ వార్డు కౌన్సిలరు



ముక్కు స్వర్ణలత
14వ వార్డు కౌన్సిలరు



దేవినేని రమాదేవి
6వ వార్డు కౌన్సిలరు



జవ్వాది వెంకట సుబ్రహ్మణ్యం
7వ వార్డు కౌన్సిలరు



పాటిబండ్ల రామకృష్ణ
15వ వార్డు కౌన్సిలరు



బుస్సా సుబ్బారావు
16వ వార్డు కౌన్సిలరు



తాడిబోయిన రాధిక
8వ వార్డు కౌన్సిలరు



పసుపులేటి సుజాత
9వ వార్డు కౌన్సిలరు



అన్నం పిన్నారావు
17వ వార్డు కౌన్సిలరు



మహమ్మద్ ఖుద్దూస్
18వ వార్డు కౌన్సిలరు






పసుపులేటి బాలచంద్రుడు — 19వ వార్డు కౌన్సిలరు
దామర్ల విజయప్రభాకర్ — 20వ వార్డు కౌన్సిలరు
పొత్తూరు వాసుదేవశర్మరావు — 21వ వార్డు కౌన్సిలరు
షేక్ జాకీర్‌హుస్సేన్ — 22వ వార్డు కౌన్సిలరు
నల్లగొర్ల పద్మావతి — 23వ వార్డు కౌన్సిలరు
కరేటి వీరయ్య — 24వ వార్డు కౌన్సిలరు
యలవర్తి గీతారాణి — 26వ వార్డు కౌన్సిలరు
కొగంటి పద్మజ — 27వ వార్డు కౌన్సిలరు
అప్పసాని బోసుబాబు — 28వ వార్డు కౌన్సిలరు
రమావత్ ధనలక్ష్మి — 29వ వార్డు కౌన్సిలరు
వేజెండ్ల శ్రీలక్ష్మి — 30వ వార్డు కౌన్సిలరు



...గెళ్ల అనురాధ — ...కౌన్సిలరు
అక్కినా...
ఆరాధ్యుల సుబ్బరాజ్యాదేవి
తాడికొండ నాగేశ్వరమ్మ — 34వ వార్డు కౌన్సిలరు
గదువర్తి శ్రీదేవి — 35వ వార్డు కౌన్సిలరు
...బట్టా సోమేశ్వరరావు — 36వ వార్డు కౌన్సిలరు
దొడ్డక సీతామహాలక్ష్మి — 37వ వార్డు కౌన్సిలరు
మునిపల్లి ప్రసాదరావు — 38వ వార్డు కౌన్సిలరు
గద్దెటి మరియకుమారి — 39వ వార్డు కౌన్సిలరు
మేకల చిట్టిబాబు — 40వ వార్డు కౌన్సిలరు

# అమరధామంగా శోభిల్లుతోన్న అమరావతి

అమరావతి, జనవరి 27(ప్రభాతవార్త): పుట్టుకలో అందం, పేరులో చందాలతో పాటు ప్రముఖ శైవ క్షేత్రంగా, పంచా రామక్షేత్రాలలో అగ్రగామిగా, అంతర్జాతీయ బౌద్ధ క్షేత్రం, సిద్ద క్షేత్రంగా దక్షిణ కాశీగా ప్రసిద్ది గాంచిన కృష్ణవేణి, పాటల కాశీగా ప్రసిద్ది గాంచిన కృష్ణవేణి, పాటల పెన్నిధి అమరావతీ-అమరారామ దివ్య క్షేత్రం కృష్ణానది తీరాన అమరధామంగా శోభిల్లుతున్నది. ఈ క్షేత్రం గుంటూరుకు 33 కిలో మీటర్ల దూరంలో ఇతిహాస పూర్వకంగా చారిత్రత్మాకంగా ప్రసిద్ది చెందింది. ఈ క్షేత్ర మహిమను గురించి స్కాంద, బ్రహ్మ పురాణాలలోని పూర్వ ఖండంలోను, పద్మ పురాణంలోని ఉత్తర భాగం లోను చెప్పబడింది. పరమ పావని కృష్ణానది తీరాన క్రాంచగిరి పై వెలసిన అమరేశ్వరుని అమరేంద్రుడు ముక్కోటి దేవతల సమక్షంలో ఆశ్వీయుజ శుద్ది దశమినాడు ప్రతిష్టించి అమరేశ్వరునిగా నామకరణం చేసి పవిత్రుడయ్యాడు. అమరులు మసలిన తావు గనుక అమరావతి క్షేత్రంగా ప్రఖ్యాతి గాంచింది. అమరావతి అమరేశ్వరుడు లింగాకార రూపంలో స్పటికవలె తెల్లగా వుంటుంది. దీని ఎత్తు 5 గజాల చుట్టు కొలతలో 3 అడుగులు లింగానికి అభిషేకించటానికి మట్లెక్కి పై అంతస్తుకి పోవాలి. దీనిపై గల గుంట పూర్వ అర్జనుడు కిరాతక రూవంలో నున్నప్పుడు కొట్టగా ఏర్పడినదని, దీనికి గల చారలతోఒకటి బాణం, దెబ్బ వల్ల ఏర్పడ్డ రక్త దార అని, మరోకటి దేవతాభిషేకానికి సంబంధించిన ప్రధారగా చెప్పబడుతుంది. ఇక్కడగల శిలా శాసనాలను అనునరించి క్రీస్తు శకం 1158 లో కొమ్మ నాయకుడు 1183 కోట క్షేత్రమరాజులు, 1621 హంద్రిక పెద్దపు ఈ ఆలయాన్ని దర్శించి విశేషకానుకలు మాన్యాల ఇచ్చి చరితార్థుల య్యారని తెలుస్తున్నది. క్రీన్తు శకము 1783-1861 లో ఈ ప్రాంతాన్ని పాలించిన రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు హయాంలో ఈ ఆలయం అత్యంత సుందరంగా రూపొందింది.



అమరేశ్వరస్వామి ఆలయం విహంగవీక్షణం

**క్షేత్ర విశేషం:** మూడు ప్రాకారాలతో సువిశాలమైన ఆవరణలో నిర్మింపబడిన ఈ ఆలయం భక్తులకు కావాలసిన మానసిక ప్రశాంతతను, చిత్తశుద్దిని కల్గిస్తోంది.

మొదటి ప్రాకారంలో ప్రణవేశ్వరుడు, కాశీ విశ్వేశ్వరుడు ఉమామహేశ్వరుడు, ఆగస్తీశ్వరుడు, పార్ది వేశ్వరుడు, సోమేశ్వరుడు, నాగేశ్వరుడు, కోసలేశ్వరుడు, వీరభద్రుడు, త్రిపుర సుందరీదేవి, జ్వాల ముఖి అమ్మవారి కృష్ణానది త్రోవలా కళ్యాణ మండపం నిర్మించారు. రెండవ ప్రాకారంలో విఘ్నేశ్వరుడు, కాల భైరవుడు, కుమారస్వామి, ఆరియాలు, నవ గ్రహ మండపం, యజ్ఞశాల, అభిషేక మండపం, నిర్మించారు. మూడవ ప్రాకారంలో నైరుతి దిక్కున శ్రీశైల మల్లేశ్వరుడు వాయువ్య దిశలో కాశీ విశ్వేశ్వరుడు ఈశాన్యాన చండేశ్వరుడు, ఆగ్నేయాన శ్రీ కాశీ వాస్తేశ్వరుడు, తూర్పున సూర్య భగవానుని ఆలయాలు ఉన్నాయి.



అమరావతిని ఇటీవల సందర్శించిన మంత్రి గీతారెడ్డి

శివ కాశ అబౌద నిరూవణ కన్నట్లుగా శ్రీ వేణు గోపాల స్వామి ఆలయం క్షేత్ర పాలకు నిధి ప్రతిష్టించ బడి వుండటం ఇక్కడి విశేషం. అమరావతికి పంచాయతాన శివ క్షేత్రం దీనికి తార్కాణంగా ఈ ఆలయంలో గణపతి వేణు గోపాలస్వామి, సూర్యుడు కాన ఇది చాముడిగా ఆలయాలు ఉన్నాయి. కాన ఇది పంచాయతానానికి నాందీ వాక్యం పలుకుతుంది. ఈ క్షేత్రం దర్శించిన వారికి ఏడు పుణ్య క్షేత్రాల దర్శన ఫలం లభిస్తుంది. 1980, 1992, 2004 సంవత్సరాల్లో జరిగిన కృష్ణ పుష్కరాల్లో ఆలయంలో అభివృద్ది పనులు జరిగాయి. కాలచక్ర పూజ నిమిత్తం ఆలయంలో సిమ్మెంటు రోడ్డు, క్యూలైన్లు ఏర్పాటు చేశారు. శివరాత్రికి జరిగే బ్రహ్మోత్సవాలు దసరా రోజు జరిగే చండీ కళ్యాణం, ఈ క్షేత్రంలో పేరెన్నిక గన్న ఉత్సవాలు. కార్తీక మాసంలో లక్షలాది భక్తులు పలు ప్రాంతాల నుంచి విచ్చేసి స్వామిని సేవించి తరిస్తారు. ప్రతి నిత్యం వందలాది భక్తులు వివిధ ప్రాంతాలనుంచి వస్తారు. అందమైన ప్రశాంత ప్రకృతి బడిలో నెలకొని వున్న ఈ క్షేత్రానికి గుంటూరు, సత్తెనపల్లి, విజయవాడ నుంచి విరివిగా రవాణా సౌకర్యం కృష్ణా జిల్లా నుంచి లాంచీ సౌకర్యం వుంది.

అమరావతి భక్తులు పర్యాటకుల కోసం (ప్రభుత్వ విశ్రాంత గృహాలతోపాటు ప్రవేటు వసతి గృహాలు కలవు. అమరేశ్వరాలయం మరింత అభివృద్ది జరగాల్సిన అవసరం ఎంతైనా వుంది.

10
A Glorious Decade

# వార్తకు 10వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



శ్రీమతి సోనియాగాంధీ
ఎఐసిసి అధ్యక్షురాలు

డా॥ వై.యస్. రాజశేఖర రెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు

శ్రీ కె. కేశవరావు
పిసిసి అధ్యక్షులు

శ్రీ కెవిపి రామచంద్రరావు
రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు



అశేష ఆంధ్రుల అభిమాన
దినపత్రిక వార్త దశాబ్ది కాలంగా
పత్రికారంగంలో ఎన్నో
విప్లవాత్మక మార్పులతో
10 వసంతాలు పూర్తి చేసుకున్న
శుభసందర్భముగా
యాజమాన్యానికి, సిబ్బందికి,
పాత్రికేయ మిత్రులకు నా
హార్థిక శుభాకాంక్షలు

## తాడిశెట్టి వెంకటరావు

శాసన సభ్యులు, గుంటూరు-2
రాష్ట్ర యువజన కాంగ్రెస్ అధ్యక్షులు

## కృష్ణమ్మ చెంతన

# ధ్యానాంజనేయుడు

**(ప్రభాతవార్త-అమరావతి)**

రామభక్త హనుమాన్ విగ్రహాలు ప్రపంచ మంతటా ఎన్నో భంగిమలున్నా, అమరావతిలో 21 అడుగుల ఎత్తున అత్యంత సుందరంగా నిర్మించిన ధ్యాన దీక్షలో ఉన్న వాయునందుని విగ్రహం నభూతో నభవిష్యత్ అని దర్శనాభిలాషులు అభిప్రాయపడుతున్నారు. కలియుగ కైలాసంగా పేరు గాంచిన అమరావతి కృష్ణానది తీరాన నిర్మించిన షిర్డిసాయిబాబా పర్తిసాయి కపోతేశ్వర ధ్యాన మందిరం ప్రాంగణంలో ఈ దాసాంజనేయ స్వామి విగ్రహాన్ని నిర్మించారు. సత్యసాయి సేవా సమితి రాష్ట్ర కో-ఆర్డినేటర్ కె.నారాయణరావు ఆధ్వర్యంలో 2 లక్షల వ్యయంతో నిర్మించారు. మహాబలశాలి అయిన ధ్యానాంజనేయ స్వామి విగ్రహాన్ని రూప కల్పన చేసిన శిల్పి బుడతా రామారావు దక్షిణ భారతదేశంలోనే సహజ శిల్పిగా పేరు గాంచారు.

సుమారు నాలుగు వందల చదరపు మీటర్ల సువిశాల మైదానంలో తొమ్మది సిమ్మెంటు పిల్లర్ల సహాయంతో రెండు వందల చదరపు అడుగుల పీఠం పై ఆరు అడుగుల ఎత్తులో విగ్రహాన్ని నిర్మించారు. అందులో స్వామి విగ్రహం కోసం 90 చదరపు అడుగుల ప్రత్యేక గర్భ పీఠం ఏర్పాటు చేశారు. గంభీరమైన వక్షస్థలం మెడలో రుద్రాక్షమాల, కంఠం వద్ద ఏకముఖి రుద్రాక్షలో సహా సర్వ కంఠాభరణాలతో విగ్రహం నిర్మించారు. దర్శనాభిలాషులు ధ్యానం చేసుకునేందుకు వీలుగా ప్రాకారంలో మొజాయిక్ ద్వారాలు ఏర్పాటు చేశారు. ధ్యాన ఆంజనేయస్వామి వారికి ఎదురు ఆయన వాహనం అయిన ఒంటె విగ్రహాన్ని అపురూపంగా నిర్మించటం గమనార్హం. విగ్రహ పీఠానికి చుట్టూ ఒంటె విగ్రహాలను చిత్రీకరించారు. 1995 వ సంవత్సరం ఫిబ్రబరి 6 న అత్యంతవైభవంగా కనీవినీ ఎరుగని రీతిలో షిర్డి సాయి విగ్రహానికి స్పటిక లింగాలకు ప్రతిష్టాత్సవ కార్యక్రమాలు నిర్వహించారు. గలగల పారే కృష్ణానది తీరాన మనస్సుకు భక్తి భావనా స్ఫూర్తితో కూడిన మానసిక ఆనందాన్ని కలిగించే శాంతి మందిరం షిర్డిసాయి పూర్తి రూపంలో అవతరించి, పరమత సహనాన్ని ప్రేమ తత్వాన్ని బోధించే విధంగా జైపూర్‌లోని పాలరాతితో తయారు చేయించి ఇక్కడ ప్రతిష్టించారు. మహారాష్ట్రలోని కాంబూరు నుంచి స్పటిక లింగాలను తెప్పించి ప్రతిష్ఠించారు. ఇక్కడున్న ఆత్మలింగ స్వరూప 365 స్పటిక లింగా రుద్రమండలాన్ని ఒక్కసారి అభిషేకిస్తే చాలు 365 రోజులు అభిషేకం చేసిన ఫలితాన్ని పొందవచ్చు. షిర్డి సాయి తెచ్చిన అగ్నిధుని ఎప్పుడు వెలుగుతూనే వుంది. షిర్డిసాయినాధునికి జరిగిన విధంగానే ఇక్కడ పూజలు జరుగుతాయి.



ధ్యానాంజనేయస్వామిని దర్శించుకుంటున్న భక్తులు



అమరేశ్వరస్వామి బాలాత్రిపురసుందరీదేవి



# వార్తకు శుభాకాంక్షలు

10 A Glorious Decade

ప్రజాశ్రేయస్సుకోసం పరితపిస్తూ.... ప్రజాసమస్య లపై స్పందిస్తూ.... నేటి యువజనసమాజంకోసం ఉన్నత మార్గాలను అన్వేషిస్తూ... విజ్ఞానవీచికలను అందిస్తూ.... అక్షరాయుధాలను సంధిస్తూ... ముందుకు సాగుతున్న 'వార్త' 10వసంతాలు పూర్తిచేసుకున్న శుభసందర్భంలో యాజమాన్యానికి, సిబ్బందికి శుభాకాంక్షలు తెలియజేస్తూ....

ప్రతిగుండెలో శాంతి, సంతృప్తి ఇదే మన లక్ష్యం... అందుకే అందరం సమిష్టిగా శ్రమించి నియోజకవర్గ అభివృద్ధికి పునరంకితులవుదాం....

ఈశుభసందర్భంలో నరసరావుపేట నియోజకవర్గ ప్రజలకు శివరాత్రి శుభాకాంక్షలు తెలుపుతూ...



సదా మీ సేవలో...

## కాసు కృష్ణారెడ్డి

### నరసరావుపేట శాసనసభ్యులు

# మోర్జంపాడు శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయంలో 6 నుంచి కళ్యాణ మహోత్సవాలు

మాచవరం మండలంలోని మోర్జంపాడు గ్రామంలో శ్రీ లక్ష్మీనరసింహస్వామి 50వ కళ్యాణ మహోత్సవాలు ఫిబ్రవరి 6 నుంచి 11వ తేదీ వరకు జరుగుతాయని దేవస్థాన కమిటీ ఒకప్రకటనలో తెలిపింది. స్వామివారి సేవా కార్యక్రమం 6వ తేదీన, కల్యాణం 7వ తేదీన మధ్యాహ్నం 11 గంటలకు అత్యంత వైభవంగా జరుగుతుందని కమిటీ పేర్కొంది. ప్రతిఏటా వైభవంగా తిరునాళ్ళ జరిగే శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవాలయాన్ని సుమారు 300 సంవత్సరాల క్రిందట ప్రతిష్టించారు. వేలాది మంది భక్తులు కొలుస్తూ స్వామిని తమ కొంగుబంగారంగా భావిస్తారు. స్వామివారి దేవాలయం వద్ద వున్న శిలాశాసనం ప్రకారం క్రీ.శ. 1656వ సంవత్సరంలో హంసావత్ జీవానాయక్ తుమ్మలచెరువు గ్రామంవెళ్ళి తిరిగి వస్తూ బ్రాహ్మణపల్లి గ్రామం దారిమధ్యలో శ్రీ నరసింహస్వామి వారి యంత్రం దొరికింది. జీవానాయక్ ఆ యంత్రాన్ని తెచ్చి మోర్జంపాడు గ్రామంలోని రామన్నపేటలో వున్న ఒక మట్టిమిద్దెలో వుంచారు. శ్రీ నరసింహస్వామి వారి యంత్రానికి క్రీ.శ. 1944 వరకు సుమారు 300 సంవత్సరాలు పూజా పునస్కారాలు జరుపలేదు.

అటు తరువాత హంసావత్ జైత్రానాయక్ కుమారుడు భీమానాయక్ కొంత స్థలాన్ని కొని అందులో బండల గుడి ఏర్పాటుచేసి లక్ష్మీనరసింహస్వామి యంత్రాన్ని అందులో వుంచి నైవేద్యాలు సమర్పించి దీపారాధన జరుపుతుండేవారు. మోర్జంపాడులోని రామన్నపేట వాస్తవ్యుడైన ఇప్పళ్ళ గోత్రోద్భవుడైన కోట చెన్నారెడ్డి కుమారుడు నాగిరెడ్డికి జబ్బు చేసింది. ఎక్కడికి వెళ్ళినా జబ్బు నయం కాకపోవడంతో శ్రీ లక్ష్మీనరసింహస్వామి యంత్రానికి ప్రదక్షిణలు చేయగా, వ్యాధి నయమైంది. వ్యాధి నయం కావడంతో 1956లో నరసింహస్వామివారి దేవాలయాన్ని కట్టించి 57లో లక్ష్మీనరసింహస్వామి విగ్రహాలు పెట్టించి ఫిబ్రవరి 10న ప్రతిష్టింపజేశారు. స్వామివారి అర్చక నైవేద్యాలు భీమానాయకుడు వంశీయులు సమర్పించేలా ప్రతిసంవత్సరం కల్యాణానికి అయ్యే ఖర్చులు నాగిరెడ్డి చెల్లించేలా ఒప్పందం కుదిరింది. నరసింహస్వామి గుడిని రొక్కం వెంకటసుబ్బారెడ్డి జ్ఞాపకార్థం వారి భార్య నాగమ్మ నిర్మించారు. ఆంజనేయ స్వామి విగ్రహాన్ని ప్రతిష్టింపజేశారు.

ప్రతి ఏడాది శ్రీ లక్ష్మీనర సింహస్వామి కల్యాణం మోర్జంపాడు గ్రామస్తులంతా కలిసి భక్తిశ్రద్ధలతో జరుపుకుంటారు. స్వామివారి కల్యాణాన్ని తిలకించేందుకు గుంటూరు, కృష్ణ, నల్గొండ జిల్లాల నుంచి భక్తులు పెద్ద సంఖ్యలో హాజరవుతారు. స్వామివారి దేవాలయం వద్ద ప్రతిశనివారం వందలాది భక్తులు హాజరై తమ కోర్కెలు నెరవేరేందుకు స్వామివారికి ప్రదక్షిణలు చేసి తెల్లవార్లు భజన కార్యక్రమాలు నిర్వహిస్తుంటారు. నరసింహస్వామి దేవాలయాన్ని వారాలు తిరిగి శనివారం రోజు దేవాలయం ఆవరణలో నిద్రిస్తే సంతానం లేనివారికి సంతానం కలుగుతుందని భక్తుల నమ్మకం. కొందరు భక్తులు శారీరక రుగ్మతలు తొలగించుకునేందుకు కూడా దేవాలయానికి రావడం విశేషం. ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా ఫిబ్రవరి 6 నుంచి 11వ తేదీ వరకు కల్యాణ మహోత్సవాలు ఘనంగా నిర్వహించేందుకు దేవాలయ కమిటీ ముమ్మర ప్రయత్నాలు ప్రారంభించింది. ఈ సందర్భంగా గ్రామంలో రాష్ట్రస్థాయి ఎడ్లపందాలు, ఆటల పోటీలు, పలు రకాల సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించనున్నారు.

(ప్రభాతవార్త, మాచవరం)





# 'వార్త' దినపత్రికకు దశమ
# వార్షికోత్సవ శుభాకాంక్షలు

అరుణ ప్రభాత కిరణ లహరి
విరిసే తాజా వార్తల వల్లరి
దశాబ్ది కాలహేళిలో
అద్భుత కథనాలతో
అబ్బురపరిచే సంచలనాలతో
సత్యాన్ని మరుగుచేసే
పెట్టుబడులకు, కట్టుకథలకు
పుట్టిన విషపుత్రికలవంటి
పత్రికలవలె కాకుండా

వాస్తవాన్ని వాస్తవంగా
దిశానిర్దేశం చేసే
వార్తలందించే ఏకైక పత్రిక
'వార్త' మాత్రమే అని నాకు
అభిప్రాయం కలిగింది.

ఉదయాన్ని పరిహసించటం
సంతృప్తి పరచవచ్చునేమోగాని
సత్య 'వార్త'ను మరుగుపరచటం సాధ్యంకాదు
వార్త దినపత్రిక ఆవిర్భావం నుండి
ఈనాటి వరకు నేను పాఠకుణ్ణి

'వార్త'లో నిజముంది
హ్యూమనిజముంది
సంఘీ సంపూర్ణసత్యం కాకపోవచ్చు
'వార్త' మాత్రం అక్షరాక్షర సత్యం

అందుకే వార్త సంపాదకులకు,
విలేకరులకు, ఇంతమందికి
ఇంతమంచి అవకాశం కల్పించిన
సంఘీ యాజమాన్యానికి
దశమ వార్షికోత్సవం
సందర్భంగా అందరికీ

నా శుభాకాంక్షలు



## డాక్టర్ సతీష్ పాల్‌రాజ్
శాసనసభ్యులు, వేమూరు, గుంటూరు జిల్లా

# భేతాళ కళ! సాముగరిడీ భళా!!

(ప్రభాతవార్త - క్రోసూరు)

సాధన విద్యలో రాష్ట్ర వ్యాప్తంగా పేరు ప్రఖ్యాతులు గడించింది క్రోసూరు మండలంలోని అందుకూరు గ్రామం. ఈ గ్రామం గత రెండు దశాబ్దాల నుంచి సాధన విద్యకు పట్టుకొమ్మగా ఉంది. చతుషష్టి (అనగా 64) కళల్లో సాముగరిడీ ఒకటి. ఇది అతి ప్రాచీన కళ. భేతాళుడు ఈ విద్యను కనిపెట్టినట్లు చెబుతుంటారు. దీనిని సాధన, సాముగరిడీ అనే పేర్లతో పిలుస్తున్నారు. దీన్ని నేటికీ ప్రజలు ఆదరిస్తుంటారు. ప్రతి కళకు ఎంతో కొంత ప్రయోజనం ఉంటుంది. ప్రయోజనాన్ని బట్టి కూడా పది కాలాలపాటు ఆ కళలు నిలిచి ఉంటాయి. ఏ కళ అయినా ప్రజలకు ఆనందం కలిగించడమే ప్రయోజనం. సాధనతో ఎన్నో లాభాలు ఉన్నాయి. రాజులు రాజ్యపాలనలో ఈ విద్య ఎంతో ఉపయోగపడింది. రాజులు ఈ విద్యను కాపాడుతూ వచ్చారు. కనుక దీనిని 'రాచ' విద్య అని కూడా అంటారు. గ్రామంలో చిన్ననాగులు, పెద్దనాగులు అనువారు ఈ విద్యను ప్రవేశపెట్టి శిష్య ప్రశిష్యులను తయారు చేశారు. విద్యనభ్యసించిన వారు నేటికీ సాముగరిడీ ప్రదర్శనలు చేస్తూనే ఉన్నారు. జంగా నరసింహారావు, వాసిరెడ్డి చంద్రమౌళి, వాసిరెడ్డి సత్యం (కీ.శే.) గురువులుగా ఉన్నారు. గ్రామంలో ఈత రానివాడు, తాడిచెట్టు ఎక్కనివాడు, సాధన చేయని వారు లేరు. కోలాటాలు, భజనలు, రంగస్థల కళాకారులు నాటకాలు ప్రదర్శించటంలో గ్రామానికి మంచి పేరుంది.

సాధన విద్యలో అనేక విన్యాసాలను ప్రదర్శిస్తారు. అందుకు అవసరమైన ఆయుధాలు కూడా వాడుతుంటారు. కత్తి-డాలు, ఈటెల ప్రదర్శన, బంతులు తిప్పటం, కొమ్ము విన్యాసం, గదా యుద్ధం, చతురంగ యుద్ధం, కర్రతిప్పటం, కుస్తీ పట్టు, బండిపాలు నడుముపై పెట్టుకుని తిప్పటం మొదలైనవి ప్రదర్శించే సమయంలో శాస్త్రబద్ధమైన అడుగులు వేయడం, హావభావాలు ప్రదర్శించటం ప్రజలను ఆకుట్టుకుంటాయి. గదా యుద్దం చేస్తుంటే రెండు మదపుటేనుగులు పోట్లాడుకుంటున్నట్లు



బాకులతో భీకరపోరు సలుపుతున్న జంగా నరసింహారావు



ప్రదర్శనకు ముందు భేతాళ పూజ చేస్తున్న సాముగరిడీ అభ్యాసకులు

ఉంటుంది. చూసేవారు ఉత్కంఠగా తలతిప్పలేనంతగా ఆకర్షితులౌతారు. విద్య ప్రదర్శించే సమయంలో ఆదమరిస్తే ప్రాణాలు హరీ మంటాయి. అంత బలమైన దెబ్బలు తగిలే అవకాలున్నాయి. విద్య ప్రదర్శించే ముందు భేతాళ పూజ చేయడం ఆనవాయితీగా వస్తున్నది.

రాష్ట్రస్థాయిలో అనేక పోటీలు జరిగాయి. ఎన్నోసార్లు అందుకూరు గ్రామస్తులనే విజయం వరించింది. వెండి, బంగారు తోడాలు బహుమతులుగా వచ్చాయి. 2002లో జరిగిన అమరావతి ఉత్సవాల్లో నిర్వహించిన పోటీల్లో అందుకూరు గ్రామస్థులే విజయం సాధించారు. గురువుగా ఉన్న జంగా నరసింహారావు బండిపాలును నడుముపై పెట్టుకుని వేగంగా తిప్పటం ఎంతో మంది చూపరులను ఆకట్టుకుంది. అప్పటి గవర్నర్ రంగరాజన్, నాటి మంత్రి కోడెల శివప్రసాదరావులతో ప్రశంసలు, బహుమానాలు అందుకున్నారు. నేటికీ అనేక మంది యువకులు కలసి గ్రామాలలో ప్రదర్శనలు చేస్తుంటారు. నాడు రాజులు రాజ్యాలను కాపాడుకోవటానికి ఈ విద్యను అనుసరించగా నేడు ఆత్మరక్షణకు, వ్యాయామానికి ఈ విద్యను నేర్చుకుంటున్నారు.

చావా నాగేశ్వరరావు, వాసిరెడ్డి శ్రీనివాసరావు, వాసిరెడ్డి అప్పారావు, దిగుమర్తి వెంకటగిరి, దిగుమర్తి అప్పారావు, పూర్ణయ్య, ఏడుకొండలు, వాసిరెడ్డి శ్రీనివాసరావు తదితరులు నేర్చుకుని భవిష్యత్తు తరాలవారికి మార్గదర్శకంగా నిలిచారు. గ్రామంలో ప్రతి రెండేళ్ళకోసారి గురువులు సమాధి వద్ద సాధనోత్సవం జరుపుతారు. ఆయుధ పూజ చేస్తారు. ప్రదర్శనకు ముందు విద్యకు ఆద్యుడైన భేతాళుడిని ఆరాధించి, డప్పు వాయిద్యాల మధ్య ప్రజల హర్షాధ్వానాల మధ్య సాముగరిడీని ప్రదర్శిస్తారు.

# వార్తకు 10వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

10 A Glorious Decade

10 A Glorious Decade



శ్రీమతి సోనియాగాంధి — ఏఐసిసి అధ్యక్షురాలు
డా॥ వై.యస్.రాజశేఖర్ రెడ్డి — రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు
శ్రీ కె.కేశవరావు — పిసిసి అధ్యక్షులు
శ్రీ కెవిపి రామచంద్రరావు — రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు
తాడిశెట్టి వెంకటరావు — శాసనసభ్యులు, గుంటూరు-2, రాష్ట్ర యువజన కాంగ్రెస్ అధ్యక్షులు



పది సంవత్సరాల కాలంలోనే వేల
సంవత్సరాల ఖ్యాతి గడించిన దినపత్రిక
"వార్త" పజలకు ప్రభుత్వానికి మధ్య వారధిగా
ఉంటూ రాష్ట్రాభివృద్ధికి సహకరిస్తున్న
దినపత్రికగా ఆవిర్భవించి
నేడు 10వ వార్షికోత్సవం
జరుపుకుంటున్న శుభసందర్భంలో
యాజమాన్యానికి, సిబ్బందికి, పాత్రికేయ
మిత్రులకు నా హృదయ పూర్వక
శుభాకాంక్షలు

## తాడిశెట్టి మురళీమోహన్

డిప్యూటి మేయర్, నగరపాలక సంస్థ, గుంటూరు
టిటిడి సలహామండలి సభ్యులు

# మహిమాన్వితుడు భీమలింగేశ్వరుడు

**పాతూరు శ్రీ భీమలింగేశ్వరస్వామిని భక్తులు మహిమాన్విత దైవంగా ఆరాధిస్తున్నారు. పురాతన చరిత్రగల ఆలయంగా పట్టణంలో ప్రసిద్ధిచెందింది. భీమలింగేశ్వరుడు శక్తివంతమైన దైవంగా పట్టణ ప్రజలు భావిస్తారు. ఆలయ చరిత్ర పరిశీలిస్తే ఈ ఆలయానికి వెయ్యేళ్ళ చరిత్ర ఉంది.**

(ప్రభాతవార్త-నరసరావుపేటటౌన్)

వేయి సంవత్సరాల క్రితం ప్రస్తుతం ఉన్న ఆలయ ప్రదేశంలో ఒక పూరిపాక ఉండేదని, శివలింగం ఉన్న చోటో ఒక పుట్టఉండేదని చరిత్రచెబుతోంది. పుట్ట ఉన్న ప్రాంతంలో ఒక మహాసర్పం సంచరిస్తుండడంతో భీతి చెందిన ఆ పాక యజమాని పుట్టను తవ్వించగా అందులోంచి పానపట్టంతో కూడిన శివలింగం బయటపడిందని అక్కడే భీమలింగేశ్వర ఆలయం నిర్మించినట్లు ఆలయ చరిత్రలో ఉంది. కాలక్రమంలో నరసరావుపేట అభివృద్ధి చెందడంతో అప్పట్లో ప్రముఖ న్యాయవాదులు కోటంరాజు, వియ్యన్నవంతులు, చిలకపూడి రామస్వామి జీర్ణావస్థలో ఉన్న ఆలయాన్ని పునరుద్ధరించారు. గర్భాలయం అభిషేకాదులకు ఇబ్బందిగా ఉన్నందున మట్టిని తవ్వించగా దానికింద మరో పానపట్టం కన్పించడం, మరికొంత తవ్వగా క్రమంగా ఏడు పానపట్టలు వెలువడడంతో పాటు నీటిజల బయల్పడింది. ఈ వింతచూసిన ప్రజలు భయపడి తవ్వకాలు ఆపివేసి అగాధాన్ని పూడ్చివేశారు. ఆలయంలో కళ్యాణ మండపాన్ని కట్టించి ముఖమండపాలను ఏర్పాటు చేశారు. ఈ ఆలయంలో సభాపతి మేళ్ళ చెర్వురామయ్య విఘ్నేశ్వర ప్రతిష్ట చేశారు. 1920లో మైసూరు వాసులు శ్యామయ్య తాతగారుగా పేరు తెచ్చుకుని దేవాలయంలో సపర్యలు చేస్తుండేవారు. భక్తులు, ఆర్యవైశ్య సంఘం ఇచ్చిన విరాళాలతో ప్రహరిగోడ, సింహద్వారం, తదితర కట్టడాలను నిర్మించారు. 110ఏళ్ళ వయస్సులో శ్యామయ్య లింగైక్యం చెందారు. ఆ తర్వాత 1932వరకు దేవాలయ అభివృద్ధిని ఎవరూ పట్టించుకోలేదు. వంచాంగకర్త చింతలపాటి సుందరామ సిద్ధాంతి నిత్య శివదర్శనం ఏర్పాటు చేశారు. 1933లో ఈ దేవాలయం ఉమ్మడి మద్రాసు హిందూమత దేవాలయాల బోర్డు కిందకు చేరింది. అయితే 1797లో 'కోట' నిర్మాణ సమయంలో దివ్వాజీ బసవలింగమనే శివభక్తుడు ఆలయ దక్షిణ భాగంలో భద్రకాళీ సహిత విగ్రహాన్ని ప్రతిష్ట జరపడంతో వీరభద్రస్వామి, కాత్యాయనీ సమేత భీమలింగేశ్వరునిగా పేరుపొందారు. 1802 ఈనాం స్టేట్‌మెంట్ ప్రకారం అట్లూరి కోటంరాజు ధర్మకర్తగా ఉండేవారు. 1934లో ఆ ఆలయాన్ని దేవాదాయశాఖ పబ్లిక్ టెంపుల్‌గా ప్రకటించింది. అట్లూరి కుటుంబంలో ఒకరిని ట్రస్టీగా ఎన్నుకున్నారు.

1980 నుంచి ఆలయ అభివృద్ధికి ఎందరో తమ సహాయ సహకారాలను అందిస్తున్నారు. అయితే ఈ ఆలయం ఆశించిన స్థాయిలో అభివృద్ధి చెందకపోవడంతో మూలవిరాట్టుతో సహా ఇతర ప్రాకారాలు శిధిలావస్థకు చేరుకుంటున్నాయి. గతంలో అంతంత మాత్రంగా ఉన్న భక్తుల సంఖ్య ప్రస్తుతం నిత్యం వందలాది భక్తులు, పండుగల సమయంలో వేలాదిమంది భక్తులు భీమలింగేశ్వరుడ్ని దర్శించుకుని ప్రత్యేక పూజలు నిర్వహిస్తుంటారు. శనిదోషాలకు, అభిషేకాలకు ఆ ఆలయం ప్రత్యేకత సంతరించుకుంది. భీమలింగేశ్వరుని మూలవిరాట్టు పక్కనే రాజరాజేశ్వరి అమ్మవారికి కొలిచిన వారికి కొంగుబంగారమై భక్తులను అలరిస్తున్నారు. చరిత్ర కల్గిన ఈ ఆలయాన్ని దేవాదాయశాఖ, స్థానిక ప్రజాప్రతినిధులు జీర్ణోద్ధరణ గావించేందుకు కృషి చేయాల్సిన ఆవశ్యకత ఉంది.



భీమలింగేశ్వరస్వామివారి మూలవిరాట్టు



భీమలింగేశ్వరస్వామివారి గాలిగోపురం



రాజరాజేశ్వరి అమ్మవారి మూలవిరాట్టు

# ఆలయ నిర్మాణంలో ఆంతర్యం ఏమిటంటే!

(పొన్నూరు, ప్రభాతవార్త)

పురాతన సంస్కృతి, సాంప్రదాయాలను, శిల్పాచార్యుల నైపుణ్యాన్ని భవిష్యత్ తరాలకు తెలియచేయడంలో హిందూ దేవాలయాల పాత్ర ఎంతో ఉంది. వీటితో పాటు ఈ దేవాలయాలు మరికొన్ని ముఖ్యమైన కార్యక్రమాల్ని కూడా నిర్వహిస్తున్నాయి. అదే పది మందికి ఉపాధి, ప్రశాంత వాతావరణం, కాలుష్య నివారణ కార్యక్రమాలను చేపడుతున్నాయి. ఎలాగంటారా!

దేవాలయం నిర్మాణమంటే ఆషామాషీ వ్యవహారం కాదు. శిల్పాచార్యులు, వాస్తు నిపుణులు, కూలీలు తదితరులు కృషి ఫలితంగా ఒక ఆలయం నిర్మితమవుతుంది. దీని ఫలితంగా ఆలయ నిర్మాణ సమయంలో వివిధ వర్గాలవారికి పని దొరుకుతుంది. నిరుద్యోగిత తొలగుతుంది. ఒకే సమయంలో ఆయా శాఖల వారికి పని కల్పించే అవకాశం ఉంటుంది. ఆలయాన్ని నిర్మించిన తర్వాత దైవార్చనకు ఒక పూజారిని, ఆలయం శుభ్రం చేయడానికి కొంతమంది పనివారిని, ఆలయంలో ఇతర కైంకర్యాలకు వివిధ శాఖలవారిని ఏర్పాటు చేయడంతో మరి కొంత మందికి ఉద్యోగం కల్పించినట్లు అవుతుంది. వీటికి తోడు మన పూర్వీకులు దేవాలయాల్లో నిత్య ప్రసాద వినియోగం, ఆలయాలను సమర్ధవంతంగా నిర్వహించే నిమిత్తం ప్రతి దేవాలయానికి కొంత భూమిని ఇచ్చారు. ఈ భూములను సాగు చేసుకోవడానికి కొంత మంది రైతులకు కౌలుకు ఇవ్వడం జరుగుతుంది. ఫలితంగా మరికొంత మంది రైతులు ఈ భూమిని నమ్ముకొని జీవిస్తున్నారు.

దేవాలయాలు విశాలమైన ప్రాకారాన్ని కలిగి ఉండడంతో బాటసారులు (ఇప్పుడు బాటసారులు ఉండడం లేదు), నిరాశ్రయులు, భిక్షకులు రాత్రులందు ఇక్కడ విశ్రమించే అవకాశం ఉంది. దీంతో కొంత మంది నిర్భాగ్యులు, అనాధలకు తల దాచుకునే అవకాశం కూడా ఉంది.

**ప్రశాంత వాతావరణం:**

ఇక ఆలయాన్ని నిర్మించే సమయంలో ప్రశాంత వాతావరణం ఉండే విధంగా వాస్తు శాస్త్రనిపుణులు ప్లాన్ తయారు చేసి ఆలయాన్ని నిర్మించడంతో భక్తులు దైవ దర్శనానికి వచ్చినప్పుడు ఇక్కడ ఒకవిధమైన ప్రశాంతతను పొందగలుగుతారు. ఈ ప్రశాంతత ఎన్ని కోట్లు వెచ్చించినా తాము తెచ్చుకోలేరన్నది జగమెరిగిన సత్యం.

**కాలుష్య నివారణ:**

పండుగలు, పర్వదినాల సందర్భంగా దేవాలయాల్లో ప్రత్యేక పూజలు, యజ్ఞ యాగాదులు నిర్వహిస్తారు. దీని ఫలితంగా ప్రకృతి శుద్ధమై వాతావరణ కాలుష్యం కొంత వరకు హరించి వేస్తుంది. ఈ వాయువులను పీల్చిన భక్తులకు కూడా కొంత వరకు వారి శరీరంలోని రోగాలు నయమవుతాయి. వీటికి తోడు ఇక్కడ పురాణ కాలక్షేపాలు, సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటు చేస్తున్నారు. ఈ కారణంగా భక్తులకు నాలుగు మంచి మాటలను చెప్పడానికి వచ్చే పౌరాణికులు, సాంస్కృతిక కళాకారులకు భుక్తి గడుస్తుంది. అలాగే ఈ మాటలను విన్న అందరిలో కాకపోయినా కొందరిలో నైనా మంచి పనులను చేయాలనే దృక్పధం ఏర్పడుతుంది. దీని వలన సమాజం కొంత వరకు ఉద్ధరించబడే అవకాశం ఉంటుంది.

**పాత రుచులు కొనసాగింపు:**

ప్రస్తుతం ఎన్నో రకాల కొత్త కొత్త తినుబండారాలు, పిండివంటలు వస్తున్నప్పటికీ దేవాలయాల్లో అవి నిర్మించేటప్పుడు ఆచరణలో ఉన్న ప్రసాదాలనే ఇప్పటికీ కొనసాగిస్తున్నారు. దీని వలన ఆనాటి రుచులు, సాంప్రదాయాలు తదితర విషయాలు ఈనాటి కాలంలో మరచిపోయే అవకాశం ఉండదు.

# పోదాం రండి పొన్నూరు

(ప్రభాతవార్త.. పొన్నూరు)

గుంటూరు జిల్లాలోని పొన్నూరు అంటే ఆంజనేయ స్వామి, ఆంజనేయ స్వామి అంటే పొన్నూరు అని ప్రసిద్ధి. గుంటూరుకు 21 కి.మీ దూరంలో ఉన్న పొన్నూరులోని శ్రీ సహస్ర లింగేశ్వర స్వామి,శ్రీ ఆంజనేయ స్వామి దేవస్థానాలు నిత్యం భక్తుల రాకపోకలతో, నిత్య ధూప దీప నైవేద్యాలతో విరాజిల్లుతున్నాయి. జిల్లాలోనే కాక పరిసర జిల్లాల నుంచి కూడా భక్తులు వేలాది సంఖ్యలో ఇక్కడికి రావడం నిత్యకృత్యం.... ఆలయ చరిత్ర: సుమారు 60 సంవత్సరాల క్రితం చేబ్రోలు మండలం రెడ్డిపాలెం గ్రామ వాస్తవ్యుడైన కోట జగన్నాథ స్వామి జన్మతః భగవత్ భక్తుడు. ఆయన స్వగ్రామంలో శ్రీ ఆంజనేయ స్వామి దేవాలయం నిర్మింపచేసి నిరంతరం భజన కాలక్షేపాలతో గడిపేవారు. ఒక మంచి రోజున దక్షిణ కాశీగా పేరుగాంచిన పొన్నూరులో దేవాలయం నిర్మించాలని సంకల్పం కలగడంతో గ్రామ గ్రామాన తిండితిప్పలు లేకుండా కఠోర దీక్షతో చందాలు వసూలు చేసి శ్రీ సహస్ర లింగేశ్వరాలయాన్ని ప్రారంభించారు. పొన్నూరు, గుంటూరు రోడ్డులో ఏడు ఎకరాల సువిశాలమైన స్థలంలో మానవుని శారీరక నిర్మాణమును బట్టి ఈ సహస్ర లింగేశ్వరాలయం నిర్మించారు. ఏక ముహూర్తమున కాశీ నుంచి తీసుకు వచ్చిన 1108 శివలింగములను 1962వ సంవత్సరంలో ప్రతిష్ఠించారు. ఈ ఆలయంలో మూల విరాట్టు లింగ రూపమునగాక పాలరాతి శంకరుని విగ్రహం ప్రతిష్ఠించారు. ఇచ్చటి పరమేశ్వరుని విగ్రహము ముందు లింగాకారములో ఉన్న ఈశ్వర లింగానికి నిత్యం గంధాభిషేకం నిర్వహిస్తారు. ప్రతి మహా శివరాత్రికి జరిగే ఉత్సవాలలో అభిషేకం చేసిన గంధమును తొలిచి భక్తులకు పంచి పెడ్తారు. బ్రహ్మశ్రీ జగన్నాథ స్వామి వారు దేవాలయాల అభివృద్ధికి నిరంతరం అత్యంత భక్తి శ్రద్ధలతో పాటుపడేవారు. వీరికి చేదోడువాదోడుగా కుమ్మమూరు నరశింహారావు తన కరణీకానికి రాజీనామా చేసి నిర్మాణ కార్యక్రమాలలో సహకరించేవారు. 1940,60 ప్రాంతంలో గరుత్మంతుని విగ్రహం మేడికొండూరుకు సమీపంలోని గుళ్ళపాలెంలో చెక్కే సమయంలో సంవత్సరం పాటు అక్కడే ఉండి ఆ పని పూర్తి చేసిన నరశింహారావును శ్రీ జగన్నాథ స్వామి అభినందించారు. సహస్ర లింగేశ్వర స్వామి దేవాలయ ఆవరణలో శ్రీ పార్వతీ అమ్మవారు,పెద్ద నందీశ్వరుడు,నవగ్రహ మండపాలున్నాయి. ఈ దేవాలయానికి ఎదురుగా దశావతార దేవాలయాలు కలవు. ఇక్కడ సాక్షాత్ శ్రీమన్నారాయణుని విగ్రహమును ప్రతిష్ఠించారు. ఇక్కడ గల గొప్ప విశేషాలలో ఆంధ్రదేశమందేకాక యావద్భారత దేశంలోనే అపురూపమైన శిల్పాలు శ్రీ ఆంజనేయ స్వామి, శ్రీ గరుత్మంత స్వామి విగ్రహాలు



శ్రీ వీరాంజనేయ స్వామి

15సంవత్సరాల ముక్కువచ్చలారని యువ శిల్పి, మద్రాసు వాస్తవ్యుడు స్థపతి పొన్నమలై ఆచారి బ్రహ్మశ్రీ జగన్నాథ స్వామి వారి కోరికపై మలచి దేశంలోనే అఖండ శిల్ప నైపుణ్యమును ప్రదర్శిం చడంతో పాటు సుస్థిరమైన కీర్తినార్జించాడు.

శ్రీ వీరాంజనేయ స్వామి విగ్రహము 24అడుగుల ఎత్తు,12 అడుగుల వెడల్పు,3అడుగుల మందంతో అతి గంభీరమూర్తిగా మలచబడింది. ఇలాగే గరుత్మంత స్వామి 30 అడుగుల ఎత్తు, 15అడుగుల వెడల్పు,నాలుగు అడుగుల మందంతో చెక్కబడింది. ఈ రెండు ఏకశిలా విగ్రహాలను 1969 ఫిబ్రవరి 26న ప్రతిష్ఠించారు. సమీపంలో కాలభైరవ స్వామి దేవాలయం కలదు.

**అఖండ జ్యోతులు:** శ్రీ సహస్ర లింగేశ్వరాలయం ఆవరణలో ఎక్కడా లేని రీతిలో ఉండే అఖండ జ్యోతులు భక్తులను విశేషంగా ఆకర్షిస్తాయి. బ్రహ్మశ్రీ సద్గురు జగన్నాథ స్వామి ఆశ్రమ సేవా సమితి శాశ్వత అధ్యక్షురాలిగా మాతృశ్రీ లక్ష్మీకాంతమ్మ(అమ్మ) నియమింపబడి అనేక అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీ జగన్నాథ స్వామివారి నిలయం శ్రీ జగన్నాథ స్వామి వారి మండపంతో పాటు లక్ష రూపాయలతో శ్రీ జగన్నాథ స్వామి వారి కళ్యాణ మంటపం నిర్మించారు. లక్ష్మీకాంతమ్మ(అమ్మ) ఆధ్వర్యంలో అగ్ని,వాయువు,జల,పృధ్వి, ఆకాశ, శాశ్వత పంచ అఖండ జ్యోతి స్తంభాల మందిరాలు నిర్మించారు.సహస్ర లింగేశ్వర స్వామి దేవస్థానానికి ఎదురుగా భారత దేశంలో ఎక్కడా లేని విధంగా శ్రీ మహావిష్ణువు దశావతారముల న్నియూ ప్రతిష్ఠించారు.

ఆలయాల జీర్ణోద్ధారణకు రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయ శాఖ సర్వ శ్రేయోనిధి నుంచి రూ.18లక్షల ఆర్థిక సహాయంతో పాటు దాతలు సమకూర్చిన మొత్తం కోటి 25లక్షలు ఖర్చుతో జీర్ణోద్ధారణ కార్యక్రమాలు పూర్తి అయ్యాయి. ఈ కార్యక్రమాల్లో భాగంగా రాజగోపురం,కోనేరు యాత్రికుల విశ్రాంతి భవనాల నిర్మాణానికి ఆశ్రమ సేవా సమితి అధ్యక్షురాలు లక్ష్మీకాంతమ్మ సహకరించారు. ఈ దేవాలయానికి ఆస్తులు అంతగా లేకపోయినా ఈ దేవాలయాల అంతస్తులను పెంచి రాష్ట్రంలోనే నెంబర్‌వన్‌గా తేవాలన్న తలంపుతో ఇంతటి ప్రతిసృష్టి చేయించిన అప్పటి దేవస్థానం ధర్మకర్తల మండలి అధ్యక్షుడు సర్దార్ బూసా కోటయ్య,కార్య నిర్వహణాధికారి కె.వి బాల ప్రసాద్,పాలక మండలి సభ్యులు అభినందనీయులు. శ్రీ వీరాంజనేయ స్వామి దేవాలయాల జీర్ణోద్ధారణకు ఇ.ఓ బాలప్రసాద్ శ్రీ వీరాంజనేయ స్వామి దద్దడంపై వంద అడుగుల విమాన గోపురం నిర్మించడం విశేషం. శ్రీ వీరాంజనేయ స్వామివారి గర్భాలయంపై నిర్మించిన విమాన గోపుర నిర్మాణానికి క్రేన్ గ్రూపుల అధినేత గ్రంధి సుబ్బారావు, పలు నూతన నిర్మాణాలకు ప్రస్తుత శాసన సభ్యుడు ధూళిపాళ్ళ నరేంద్ర కుమార్ సహకారం అందించారు. ఆనాడు బ్రహ్మశ్రీ జగన్నాథ స్వామి శ్రీ వీరాంజనేయ స్వామి,శ్రీ గరుత్మంతుని దేవాలయాల మధ్య కోనేరు,గాలి గోపురాలు నిర్మించాలని కన్న కలలకు నేడు జరిగిన జీర్ణోద్ధారణ పనులే తార్కాణం.

# కొండంత అభివృద్ధి దిశగా గోరంట్ల పంచాయితీ



యర్రంశెట్టి వేణుగోపాల్
మండల కాంగ్రెస్ అధ్యక్షులు



గ్రామ పంచాయితీ కార్యాలయం



యర్రంశెట్టి విజయ్
సర్పంచ్

**(ప్రభాతవార్త – గుంటూరు)**

గోరంట్ల గ్రామం అభివృద్ధి పథంలో పయనించడానికి కారణం యర్రంశెట్టి కుటుంబం. గోరంట్ల గ్రామం అభివృద్ధిలో యర్రంశెట్టి కుటుంబీకుల పాత్ర ఎంతో కీలకమైంది. గుంటూరు రూరల్ మండల పరిధిలోని గోరంట్లకు సర్పంచ్ అంటే యర్రంశెట్టి వారి పేరు వినిపించాల్సిందే. వారి కుటుంబమంతా కాంగ్రెస్ పార్టీకే అంకితమైంది. పార్టీ సహకారంతో గ్రామాన్ని అభివృద్ధి పథంలో పయనింపచేస్తున్నారు. గోరంట్ల గ్రామానికి గతంలో యర్రంశెట్టి నాగయ్య సర్పంచిగా పదవి బాద్యతలు చేపట్టి గ్రామాభివృద్ధికి విశేషమైన కృషి చేశారు. అనంతరం, నాగయ్య భార్య యర్రంశెట్టి సూరమ్మ గ్రామ సర్పంచ్‌గా బాధ్యతలు చేపట్టి గ్రామాభివృద్ధికి తన వంతు కృషి చేశారు.

తల్లిదండ్రులను ఆదర్శంగా తీసుకొని వారి అనంతరం వీరి కుమారుడు యర్రంశెట్టి వేణుగోపాల్ గోరంట్ల గ్రామ సర్పంచిగా పదవి భాద్యతలు చేపట్టి గ్రామాన్ని మరింత అభివృద్ధి పథంలోకి తీసుకువచ్చారు. తనకున్న రాజకీయ పలుకుబడితో, గ్రామానికి ఎన్నో నిధులు మంజూరు చేయించి గ్రామంలో ఎన్నో అభివృద్ధి పనులు నిర్వహించారు. గ్రామ ప్రజలకు ఎల్లప్పుడు అందుబాటులో ఉంటూ తన దైన శైలిలో ప్రజల మన్ననలు పొందుతూ ముందుకు పయనిస్తున్నారు. ఈయన హమాంలో గ్రామంలో పంచాయితీ కార్యలయం భవనం, పశువుల వైద్యశాల, ప్రజాల దాహర్తిని తీర్చేందుకు 12 లక్షలతో మంచి నీటి ట్యాంకర్‌ను నిర్మించారు. వీటితో పాటుగా గ్రామంలోని దేవాలయాల అభివృద్ధికి విశేషమైన కృషిచేశారు. దేవుళ్ళపై భక్తితో తన స్వంత ఖర్చుతో గ్రామంలో ఉన్న పురాతన దేవాలయాలైన ఆంజనేయస్వామి దేవాలయం, శివాలయాల మరమత్తులు నిర్వహించి వాటికి ప్రహరిలను ఏర్పాటుచేశారు.



అభివృద్ధి చేసిన పురాతన రామాలయం

వీటితో పాటుగా వెంకటేశ్వరస్వామి దేవాలయం, ఆంజనేయస్వామి దేవాలయం, పోలేరమ్మ దేవాలయం, అయ్యప్పస్వామి దేవాలయలంలో విగ్రహాల ప్రతిష్ట వంటి వాటిని తన సోంత ఖర్చుతో అభివృద్ధిపరిచారు. గ్రామంలోని వెనుక బడిన వర్గాల వారికోసం చర్చిలకు, మసీదుల నిర్మాణాలకు సహకారం అందించారు. తమ కుటుంబీలను ఆదర్శంగా తీసుకోని ప్రస్తుతం వేణుగోపాల్ కుమారుడు యర్రంశెట్టి విజయ్ గ్రామ సర్పంచిగా పదవని నిర్వహిస్తున్నారు. యవకుడు, విద్యావంతుడైన విజయ్ హయాంలో కూడా గ్రామంలో పూర్తిస్థాయిలో అభివృద్ధి పనులు జరుగుతున్నాయి.

**24 గంటల నీటి వసతి కల్పించడమే ధ్యేయం: వేణు**

గ్రామ ప్రజలకు 24 గంటల మంచి నీటి వసతి కల్పించడమే తన ధ్యేయమని యర్రంశెట్టి వేణుగోపాల్ తెలిపారు. కాంగ్రెస్ పార్టీ తన సేవాలను గుర్తించి గుంటూరు రూరల్ మండల పార్టీ అధ్యక్షునిగా నియమించింది. కాంగ్రెస్ సహకారంతో గోరంట్ల గ్రామానికి 24 గంటల మంచినీటి సౌకర్యాన్ని కల్పిస్తానని వేణు తెలిపారు. గోరంట్లను ఆదర్శ గ్రామంగా తీర్చిదిద్దుతానని, గ్రామంలో సమస్యలు లేకుండా చేసి ప్రజల మన్ననలు పోందాడమే తన లక్ష్యామన్నారు. ప్రస్తుతం మండల కాంగ్రెస్ పార్టీ అధ్యక్షునిగానే కాక గోరంట్ల వెంకటేశ్వర స్వామి దేవాలయానికి ఉపాధ్యక్షులుగా పని చేస్తు దేవాలయ అభివృద్ధికి తనవంతు కృషి చేస్తున్నారు.

# మూఢ విశ్వాసాలపై సింహగర్జన చేసిన కవిరాజు కొండవీటి వేంకట కవి

(ప్రభాతవార్త - క్రోసూరు)

కలమే ఖడ్గంగా, కవిత్వమే ఆయుధంగా చేసుకుని సంఘ సంస్కరణకు పూనుకున్న కవిరాజు కొండవీటి వేంకట కవి గుంటూరు జిల్లా క్రోసూరు మండలం విప్పర్ల గ్రామంలో 1918 జనవరి 25న జన్మించారు. శేషమ్మ, నారాయణయ్య వీరి తల్లిదండ్రులు, ఎవరు ఏమనుకుంటే నాకేమిటి, నేను నమ్మినదే సత్యం, నా మార్గం అనితర సాధ్యం అన్నట్లుగా కొండవీటి వేంకటకవి కవితా ప్రస్థానం మొదలైంది.



మూఢవిశ్వాసాలపై సింహగర్జన చేశారు. తరాలు మారినా, మనుషుల భావాలు మారని మూర్ఖులు మన సమాజంలో ఉన్నారని తన కవిత్వంలో ఎత్తి పొడిచారు. తాను నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి ఉండే వారు. సామ్యవాద సిద్ధాంతం, మతమౌఢ్యం, నిరసన, హేతువాద దృక్పథం, వీరి కవిత్వానికి జీవధాతువులు. వేమన, త్రిపురనేని రామస్వామిచౌదరి, కందుకూరి వంటి వారు స్ఫూర్తి ప్రదాతలు, మార్గదర్శకులు.

## కవి రాజు రచనల్లో వైవిధ్యం

సంఘంలో జరుగుతున్న అన్యాయాలను తన కవిత్వానికి ఇతివృత్తంగా స్వీకరించారు. ఆంధ్రదేశం వ్యవసాయ ప్రధానమైంది. రైతన్న నిరంతరం స్వేదం చిందించి పండించిన పంట దళారులకు నైవేద్యంగా మారుతుంది. దగా పడే రైతన్న గురించి ఎవరు పట్టించుకోవటంలేదని ఆవేదన చెందారు. 'కర్షకా' అనే శతకంలో 'కవుల కలాలు డబ్బుగల గాడిదలకే బలైపోయే కదా కర్షకా' అన్నారు. జవహర్‌లాల్ నెహ్రూ లోక కళ్యాణాన్ని ఆశించి కుల, మత, భేద రహితమైన సమసమాజ స్థాపన జరగాలని కన్న కలల్నే నెహ్రూ చరిత్రగా రచించారు. కర్మ వాదాన్ని పట్టుకుని నిద్రిస్తున్న పీడిత ప్రజానీకాన్ని చైతన్య పర్చటమే 'మేలు కొలుపు' వీరి విమర్శనాత్మక కావ్యం.

## సినీ రచయితగా ప్రస్థానం

పౌరాణిక సినిమాలకు మంచి ఆదరణ ఉన్న కాలం. నందమూరి తారకరామారావు కాలేజీలో చదువుకునే రోజుల్లో నుంచే 'కర్ణ' డ్రామాగా వేయాలనుకునే వారు. దీని కథను ఎవరు రాయాలి. సమర్థుడు ఎవరని ఎన్.టి.ఆర్. ఆలోచిస్తుంటే మోదుకూరి జాన్సన్, కొండవీటి వేంకట కవి పేరు చెప్పటం జరిగింది. వెంటనే ఎన్.టి.ఆర్. కొండవీటిని ఆహ్వానించారు. దుర్యోధనుడు, కర్ణుడు దుర్మార్గులు కారు. వారు ఆదర్శం కోసం బలైపోయిన మహానుభావులని చెప్పారు. ఈ విధంగా కొండవీటి తనలోని భావాలకు అక్షర రూపమిచ్చారు. 'దానవీరశూరకర్ణ' సినిమాకు కావాల్సిన సంభాషణలు 22 రోజుల్లో పూర్తి చేశారు. ఈ సినిమాకు ఆంధ్ర ప్రజానీకం హారతి పట్టడం, విజయవంతం కావటం జరిగింది. దీంతో ఎన్.టి.ఆర్. సత్తెనపల్లి శరభయ్య హైస్కూల్‌లో కొండవీటికి ఘనంగా సత్కరించారు. సినీ ప్రముఖులు, సాహితి వేత్తలు, కవులు, అశేష ప్రజానీకం హర్షధ్వానాల మధ్య ఏనుగుపై అంబారీ కట్టి ఊరేగించి సత్కారం చేశారు. 1950లో కవి భూషణ, 1953లో కవిరాజు(పెదకూరపాడుసభ), 1961లో నెహ్రూచే సన్మానం, 1971లో కళాప్రపూర్ణ బిరుదులు, తాండ్రపాపారాయుడు సినిమాకు మాటలు రాసినందుకు నంది అవార్డు పొందారు. కొండవీటి గొప్పతనాన్ని ప్రశంసిస్తూ నాగభైరవ కోటేశ్వరరావు వేంకట కవి కుకవులకు సంకట కవి, ఎవరికి జంకని కవి అన్నారు. ఉపాధ్యాయ వృత్తి చేపట్టి ప్రవృత్తిగా కవిత్వం రాశారు. కవిగా, సంస్కర్తగా, హేతువాదిగా, మానవతా వాదిగా, విమర్శకుడిగా ప్రఖ్యాతి పొందారు.

# కళాకారులకు పెట్టనికోట నరసరావుపేట

(ప్రభాతవార్త-నరసరావుపేటటౌన్)



బెల్లకొండ సుబ్బారావు · వి.వి.స్వామి · అర్వపల్లి సుబ్బారావు · ఈశ్వరీదేవి · నాయని కృష్ణకుమారి

ప్రాచీనాంధ్ర సాహిత్యం నుంచి ఆధునిక సాహిత్యం వరకు నరసరావుపేట కళలకు, కళాకారులకు పెట్టనికోటగా విరాజిల్లింది. పద్య, గద్య కావ్యాలు, యక్షగానాలు, బుర్రకథలు, నవలలు, కథలు, కథానికలు, జీవిత చరిత్రలు, విమర్శలు, పరిశోధనలవంటి అనేక ప్రక్రియలు ఈప్రాంత కవులు, పండితులు, రచయితల కలం నుంచి వెలువడ్డాయి. తెలుగు సాహితీరంగంలో నూతన ఒరవడికి నాందిపలికిన నయాగరా కవితా సంపుటి ఆవిర్భవించింది కూడా ఇక్కడే. నరసరావుపేట జమీందార్ రాజామల్రాజ్ వెంకట గుండారాయుడు తన ఆస్థానంలో కవులు, సముచిత స్థానం కల్పించి సాహితీ సౌరభాలు విరాజిల్లడానికి కృషిచేశాడు. ఆయన ఆస్థానంలో రాళ్ళబండి వట్టాభిరామ కవి, తాడికొండ మల్లా నారాయణుడు, మతుకుమల్లి కనకాద్రిశాస్త్రి వంటి కవులు తెలుగు సాహితీరంగంలో చిరస్థాయిగా నిలిచిపోయారు. రాజా మల్రాజ్ వెంకట నరసింహారావు ఆస్థానంలో శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తి, వెంకటరామకృష్ణచార్యులు, ప్రముఖ వేదపండితులు విక్రాల రామచంద్రాచార్యులు తమసాహిత్య ప్రతిభతో ఘనసన్మానాలు పొందారు. అష్టావధానం, శతావధానాలలో తెలుగు సాహితీరంగాలలో మకుటంలేని మహారాజులుగా వెలుగొందిన తిరుపతి వెంకట కవులను ఢీకొన్న కొప్పరపు కవులు కూడా ఇక్కడి వారే. రామరాయ కవి, విశ్వనాధ సత్యనారాయణ వేయిపడగల్లో రాఘవరావు పాత్రను ప్రముఖకవి బెల్లంకొండ రాఘవరావును దృష్టిలో పెట్టుకొని చిత్రీకరించిందే. స్త్రీ స్వేచ్ఛ కోసం రచనలు చేసిన గుడిపాటి వెంకటాచలం కొంతకాలం నరసరావుపేటలో ఉండి సాహిత్యసేవ చేశారు. రాయపాటి లక్ష్మినారాయణ, లంకా సీతారామశాస్త్రి, భాగవతుల సుబ్బారావు, మద్దులపల్లి సత్యనారాయణశాస్త్రి, వారణాశి వెంకటేశ్వర్లు, వడ్లమూడి సిద్దయ్యకవి, కేశానుపల్లి లక్ష్మినారాయణకవి, గోపాలుని సుబ్రహ్మణ్యం తెలుగుసాహిత్యానికి సేవలందించారు. నాయని సుబ్బారావు భావకవిగా సుప్రసిద్ధులు కాగా ఆయన కుమార్తె తెలుగు విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్‌గా పనిచేసిన నాయని కృష్ణకుమారి సాహితీ రంగానికి సేవలందించింది. కుందుర్తి ఆంజనేయులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసులు నయాగరా కవులుగా సుప్రసిద్ధులు.

సినీ దర్శకులు అనిశెట్టి సుబ్బారావు కూడా నరసరావుపేట వాస్తవ్యులే. వేణువాద్య నిపుణులు పద్మశ్రీ విజయరాఘవరావుకు జన్మనిచ్చిన గడ్డ నరసరావుపేట. అంతర్జాతీయంగా విశేషఖ్యాతిపొందిన త్రివేణి పత్రికను కోలవెన్ను రామకోటేశ్వరరావు నరసరావుపేట నుంచే నడిపారు. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, భోగరాజు పట్టాభి సీతారామయ్య, ప్రొఫెసర్ కె.టి.షా, ఎం.ఎస్.చలపతిరావు, కె.చంద్రశేఖర్, సావిత్రమ్మాల్, అడివి బాపిరాజు వంటి సాహితీ దిగ్గజాలు ఈపత్రికకు సంపాదకులుగా వ్యవహరించారు. సుప్రసిద్ధ కళారచయితలు అనిశెట్టి అప్పారావు, గంధం యాజ్ఞవల్క్యశర్మ, గోపరాజు నాగేశ్వరరావు, కందా నాగేశ్వరరావు, కాలపర్తి వేణుగోపాలరావు, భక్తవత్సలరావు, ప్రతాప రవి శంకర్‌లు ఇక్కడివారే. సుప్రసిద్ధ ధార్మిక ప్రచారకులు పి.వి.రమణా రెడ్డి, మంజుశ్రీ, అక్కిరాజు సుందరరామకృష్ణ, అల్లూరి గోపాలకృష్ణ, వేదాన్తం పెదరాఘవాచార్యులు, విద్వాన్ ఏలియా వంటి సాహితీవేత్తలకు జన్మనిచ్చిన నరసరావుపేట తెలుగు సాహితీ ప్రపంచంలో చిరస్థాయిగా నిలిచిపోయింది.

## నాటకచరిత్ర

రెండువందల సంవత్సరాలకు పైబడిన చరిత్రగల్గిన నరసరావుపేటకు వంద సంవత్సరాలు పైబడిన నాటకచరిత్ర ఉంది. 1890వ సంవత్సరంలో విక్టోరియా మెమోరియల్ థియేట్రికల్ కంపెనీని స్థాపించగా ఆనమాజంలో వంగల ఆంజనేయులు, బెల్లంకొండ సుబ్బారావులు ముఖ్యభూమికను పోషించారు. 1901వ సంవత్సరంలో సురభివారి మొట్టమొదటిసారిగా నరసరావుపేటలో శుభద్ర పరిణయం, రుక్మాంగధర నాటకాలను ప్రదర్శించారు. 1936లో అర్వపల్లి సుబ్బారావు రాయల్ థియేటర్ ఆర్ట్స్‌ను స్థాపించి నాటకాలు ప్రదర్శించారు. మీసాల కృష్ణుడుగా ఆంధ్రప్రేక్షక హృదయాల్లో చెరగని ముద్ర వేసిన బెల్లకొండ సుబ్బారావు ఇక్కడి వారే. అర్జునపాత్రనే కాక విభిన్న పాత్రలను తనదైన శైలిలో ప్రదర్శించి ప్రతి పాత్రకు పాత్రోచితమైన రూపకల్పన చేసిన మహానటుడు చోరగుడి దాశరధిరావు నరసరావుపేట సమీపంలోని అన్నవరం గ్రామంలో జన్మించారు. కురుక్షేత్ర నాటకంలో తనకంటూ ఒక ప్రత్యేకతను చాటుకున్న వెండిగదతో సన్మానం పొందిన భీమపాత్రధారి నంద్యాల కోటిరెడ్డి, కొప్పరపు పురుషోత్తమరావు, పోలెపెద్ది లక్ష్మికాంతారావు తెలుగు నాటక చరిత్రలో అత్యుత్తమ నటులుగా పేరుపొందారు. హాస్యనట చక్రవర్తి, హాస్యనట సార్వభౌమ బిరుదులందుకున్న సుబ్బిశెట్టి ఫేం వి.వి.స్వామి పట్టణానికి పేరుప్రఖ్యాతులు తెచ్చిపెట్టారు. సురభి కంపెనీకి చెందిన కళాకారిణి ఈశ్వరీదేవి, చింతామణి పాత్రధారిణి లతాలక్ష్మి, భానుమతి, హరికథా భాగవతారిణి మిట్టెల పరమేశ్వరి తదితర నటీనటులు పట్టణానికి ఖ్యాతినార్జించిపెట్టారు. కాలక్రమంలో నాటకసమాజాలు అంతరించినప్పటికీ కళలపై మక్కువగల కొంతమంది కళాకారులు ఈరంగాన్ని బ్రతికించేందుకు తమవంతు కృషిచేస్తూనే ఉన్నారు.

## చరిత్ర గల స్వామికి చింత తీరే దారేది ?

(ప్రభాతవార్త - క్రోసూరు)

చరిత్ర ప్రసిద్ధిగల క్రోసూరు కొండపై ఉన్న శ్రీ లక్ష్మి నర సింహాస్వామి ఆలయానికి ఆదరణ కరువైంది. కొండపై పశ్చిమ భాగంలో వాయువ్య ముఖశీనుడైన స్వామి స్వయంభు:. ఈ ఆలయానికి శతాబ్దాల చరిత్ర ఉంది. నాటి నుండి నేటి వరకు జీర్ణోద్ధరణకు నోచుకోలేదు. కొండగుహా లోపల చుట్టబండకు విగ్రహా రూపంలో స్వామి ఆకారం ఉంటుంది. చీకటిగా ఉన్న గుహలోని మెట్లు మీదగా వెళ్ళాలంటే ప్రజలు భయపడతారు. దాతలు కొంత విరాళాలను ఏర్పాటు చేసుకుని ఆలయ ధ్వజస్థంభం, బండలు పరవడం వంటివి చేశారు. ఈ మధ్య కాలంలో రెండుసార్లు దొంగతనం జరగడంతో ధ్వజస్థంభానికి ఉన్న ఇత్తడి తొడుగులను అపహరించుకుపోయారు. అనంతరం ఆదరణ కరువైంది. ఇక్కడే కొండపై సీతమ్మ వారి పాదముద్రలున్నాయి. ఆలయం శిథిలమైంది. ఆలయం ముందు ఉన్న చెరువు సుమారు 480 ఎకరాలకుపై బడి ఉంది. జిల్లాలోని పెద్ద చెరువులో రెండవ స్థానం ఆక్రమించింది.

కొండపైకి ఘాట్‌రోడ్డు నిర్మించాలని ప్రజలు కోరుతున్నారు. పెదకూరపాడు నియోజకవర్గ ఎమ్మెల్యే, రాష్ట్ర సహకార శాఖా మంత్రి కన్నా లక్ష్మినారాయణ చొరవ చూపి ఘాట్ నిర్మాణం చేపట్టాలని ప్రజలు కోరుతున్నారు.

# అందరికీ విద్యను అందించడమే దూరవిద్య లక్ష్యం



(ప్రభాతవార్త- ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం)

***ఎఎన్‌యు దూరవిద్యాకేంద్రం లక్ష్యం ఏమిటి?***

అందరికీ విద్య, అందుబాటులో విద్య, నాణ్యమైన, ఉన్నత ప్రమాణాలు కలిగిన విద్యను అందించాలన్న లక్ష్యాలతో ఈ కేంద్రాన్ని స్థాపించారు. ఆర్థిక, సామాజిక కుటుంబ పరిస్థితులు అనుకూలించక చదువు మధ్యలో ఆపివేసిన వారికి, ఉద్యోగంలో చేరి ప్రమోషన్లకవసరమైన ఉన్నత విద్యార్హతలు సాధించాలనుకొనేవారికి, వ్యాపార వ్యవహారాలు నిర్వహించుకొనే వారికి, స్వయం ఉపాధి కార్యక్రమాలు చేసుకొనేవారికి వయసుతో నిమిత్తం లేకుండా అందరికి అందుబాటులో వుండే ఫీజులతో చదువుకునే అవకాశాన్ని కల్పించవలసిన బాధ్యతను నెరవేర్చే ప్రయత్నంలో భాగంగా దీని స్థాపన జరిగింది.

***ఏ ఏ కోర్సులను అందిస్తున్నారు?***

డిగ్రీ స్థాయిలో బి.ఎ, బి.కాం, బి.ఎస్.సి, బి.బి.ఎం కోర్సులు, పి.జి స్థాయిలో ఎం.కాం, ఎం.బి.ఏ, ఎం.సి.ఎ, ఎల్.ఎల్.ఎం, ఎమ్.హెచ్.ఆర్.ఎం, బి.ఎల్.ఐ.ఎస్.సి, ఎం.ఎ (ఇంగ్లీషు, తెలుగు, హిస్టరీ, ఎకనామిక్స్, పొలిటకల్‌సైన్స్, సోషియాలజి), ఎం.ఎస్.సి (బోటనీ, జువాలజీ, ఫిజిక్స్, కెమిస్ట్రీ, మైక్రోబయాలజీ), పి.జి డిప్లొమో ఇన్ బయోటెక్నాలజీ, బయో-ఇన్‌ఫర్‌మెటిక్స్, హాస్పిటల్ అండ్ హెల్త్ కేర్ మేనేజ్‌మెంట్, బిజినెస్ మేనేజ్‌మెంట్, మార్కెటింగ్ మేనేజ్‌మెంట్, హ్యూమన్ రిసోర్స్ మేనేజ్‌మెంట్, ఫైనాన్షియల్ మేనేజ్‌మెంట్, బాంకింగ్ అండ్ ఫైనాన్షియల్ మేనేజ్‌మెంట్, ఇన్సూరెన్స్ మేనేజ్‌మెంట్, ఇంటర్నేషనల్ బిజినెస్, ట్రావెల్ అండ్ టూరిజం మేనేజ్‌మెంట్ కోర్సులను అందిస్తున్నామని, భవిష్యత్తులో ఎం.ఫిల్ డిగ్రీ తదితర నూతన కోర్సులను ప్రారంభిస్తామన్నారు.

***మీ కోర్సుల ప్రాధాన్యత గురించి తెలియజేయండి***

రాష్ట్రంలో మొట్టమొదటసారిగా డిగ్రీ, పి.జి స్థాయిలో సైన్స్ సబ్జెక్టులను ప్రవేశ పెట్టిన ఘనత ఎ.ఎన్.యు.కే దక్కుతుంది. డిగ్రీ స్థాయిలో తెలుగు, ఇంగ్లీషు మీడియంలలో కామన్‌కోర్ సిలబస్ ప్రకారం కోర్సులను అందిస్తున్నాం. ఇంటర్మీడియట్, తత్సమానమైన అర్హత కలిగిన అభ్యర్థులు నేరుగా ఈ కోర్సులలో అడ్మిషన్ పొందవచ్చు. ఎటువంటి విద్యార్హతలు లేనివారు ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణత ద్వారా ప్రవేశం పొందవచ్చు అన్నారు. నిపుణుల పర్యవేక్షణలో నాణ్యమైన స్టడీ మెటీరియల్‌ను తయారు చేయిస్తున్నాం. ఎం.ఎ. కోర్సులకు తెలుగు మీడియంలో మెటీరియల్‌ను అందిస్తున్నాం. మౌలిక సదుపాయాలు కలిగిన కళాశాలలోనే అధ్యయన కేంద్రాలను ఏంపిక చేస్తున్నామన్నారు.

***దూరవిద్యలో విద్యార్థులకు ఎటువంటి సౌకర్యాలు కల్పిస్తున్నారు ?***

ఫీజు చెల్లించిన వెంటనే స్టడీ మెటీరియల్, క్రమపద్ధతిలో క్లాసులు నిర్వహణ, అడ్మిషన్ పొందిన వారికి గుర్తింపు కార్డులు ఇస్తున్నాం. ప్రతికోర్సుకు ఒక అనుభవజ్ఞుడైన ప్రొఫెసర్‌ను కో-ఆర్డినేటర్‌గా నియమించాం. విద్యార్థులకు సేవలు అందించే నిమిత్తం ప్రత్యేక సెల్‌ను ఏర్పాటు చేశాం.

***దూరవిద్య ద్వారా పొందే డిగ్రీలకు, రెగ్యులర్‌గా పొందే డిగ్రీలకు మధ్య వ్యత్యాసం ఏమిటి ?***

దూరవిద్య ద్వారా పొందే డిగ్రీలకు, రెగ్యులర్‌గా పోందే డిగ్రీలకు మధ్య ఎటువంటి వ్యత్యాసం లేదు. దీనిపై ఎటువంటి అపోహలు అవసరం లేదు.

***దీనిలో అభ్యసించే వారికి ఉత్తమ ఫలితాలు పొందే అవకాశం ఎంత వరకు ఉంటుంది ?***

దూరవిద్య ద్వారా చదివే వారికి మార్కులు సరిగా ఇవ్వరు అనే అపోహ ఉంది. కానీ ఇది నిజం కాదు. పరీక్షలు బాగా రాసినవారు ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణత సాధించవచ్చు. విద్యార్థులకు స్పూర్తిని కలిగించేందుకు వివిధ కోర్సులలో వర్సిటీ స్నాతకోత్సవాలలో బంగారు పతకాలను పొందే అవకాశం కూడా కల్పించాం. కెమిస్ట్రీలో ప్రొఫెసర్ జె.అనందస్వామి మెమోరియల్, తెలుగులో శ్రీమతి కొల్లిమర్ల జయశ్రీ మెమోరియల్, ఎం.కాంలో శ్రీ డోగిపర్తి చిన్నపుల్లయ్య మెమోరియల్ బంగారు పతకాలను ఇవ్వనున్నాము.

***పరీక్షల నిర్వహణలోఎటువంటి జాగ్రత్తలు తీసుకుంటున్నారు ?***

విద్యార్థులకు పరీక్షలను జంబ్లింగ్ పద్ధతి ద్వారా నిర్వహిస్తున్నాం. అధ్యయన కేంద్రాలకు పరీక్షల నిర్వహణ విషయంలో ఎటువంటి సంబంధం లేదన్నారు. వర్సిటీ పరిశీలకుల పర్యవేక్షణలో పటిష్టంగా పరీక్షలు నిర్వహిస్తున్నామన్నారు.

***విద్యార్థులకు మీరిచ్చే సూచనలు ఏమిటి ?***

వర్సిటీ నిర్ణయించిన ఫీజులు మినహా ఎటువంటి ఫీజులు అధ్యయన కేంద్రాలలో చెల్లించనవసరం లేదన్నారు. ఫీజులను డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా చెల్లించాలన్నారు. ఎటువంటి సమాచారం కోసమైన దూరవిద్యా కేంద్రాన్ని సంప్రదించాలన్నారు. కష్టపడి చదివిన వారు మంచి మార్కులు తెచ్చుకోవచ్చు.

# పోరాటాల పోతుగడ్డ 'రేపల్లె' తీరప్రాంతం



(ప్రభాతవార్త-రేపల్లె)

రేపల్లె ప్రాంతం పోరాటాల పోతుగడ్డగా ప్రసిద్ధి చెందింది. స్వాతంత్ర్య పోరాటాల కాలంలో పేదల విముక్తి కోసం నాయకులు అమరవీరులుగా మారారు. అమరవీరుల త్యాగాలకు నిదర్శనంగా పట్టణంలోని ఇసుకపల్లి ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ నాయకులు అమరవీరుల స్థూపాన్ని ఏర్పాటుచేశారు. ఏటా అమరవీరుల సంస్మరణ సభలునిర్వహించడం ఇక్కడ అనవాయితీగా వస్తోంది. ఆనాడు ప్రజలు ఫ్యూడల్ విధానం ఫలితంగా బానిసత్వానికి బందీలయ్యారు. భారత కమ్యూనిస్టు పార్టీ విముక్తి పోరాటాలను నిర్వహించింది. భూస్వాములకు అండగా నిలిచిన నాటి ప్రభుత్వం ఆందోళనకారులపై ఉక్కుపాదం మోపుతున్న తరుణంలో అమరవీరులు ప్రాణాలు కోల్పోయారు. వీరు తెలంగాణా సాయుధ పోరాటంలో ప్రధానపాత్ర పోషించడం విశేషం. ప్రముఖ నాయకులు గుమ్మడి సీతారామయ్య, కంఠమనేని వెంకటరత్నం, దాసరి సుబ్బయ్య, మోటూరు వెంకటరత్నం, కస్తూరు కుటుంబరావు, ముత్తిరెడ్డి వెంకటాచలం, మరో మూడేళ్ళ పాప అమరవీరుల జాబితాలో స్థానం పొందారు. కమ్యూనిస్టుల ఔన్నత్యాన్ని నిరూపించిన ఘనత వా.రికి దక్కింది. భట్టిప్రోలు మండలంలోని ఓలేరుకు చెందిన ముత్తిరెడ్డి వెంకటాచలం స్వాతంత్ర్యపోరాటం తారాస్థాయికిచేరిన నేపథ్యంలో కమ్యూనిస్టు ఉద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. 1948-49లో అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీ సభ్యులపై నిర్బంధాన్ని విధించింది. కృష్ణా జిల్లాలోని గెరిల్లా దళాన్ని సురక్షితంగా తెలంగాణా ప్రాంతానికి తరలించే బాధ్యతను ఆ పార్టీ అధిష్టానవర్గం వెంకటాచలానికి అప్పగించింది. కృష్ణానది ఉధృతంగా ప్రవహిస్తున్నప్పటికి ముత్తిరెడ్డి సింహాచలం కృష్ణానదిని అవలీలగా ఈదుతూ కృష్ణాజిల్లాకు చేరి గెరిల్లా దళాన్ని తెలంగాణా ప్రాంతానికి తరలించారు. తెలంగాణా సాయుధ పోరాటం ఉపసంహరించిన కొన్నాళ్ళకు ఎన్నికల ప్రచారం నిర్వహిస్తున్న ముత్తిరెడ్డి సింహాచలం పోలీసుల కాల్పులలో ప్రాణాలు కోల్పోయారు. యువజన, రైతు, కార్మిక సంఘాల ఆవిర్భావానికి కారకుడైన దాసరి సుబ్బయ్య నాడు భూస్వాములకు సింహస్వప్నంగా నిలిచారు. కార్మికులను ఉద్యమం వైపుకు తీసుకువెళ్ళి ఆందోళన కార్యక్రమాలను కొనసాగించారు. దీంతో పోలీసులను భూస్వాములు ఆశ్రయించారు. ఇసుకపల్లికి చెందిన దాసరి సుబ్బయ్యను భట్టిప్రోలు మండలంలోని గొరిగపూడిలో పోలీసులు అంతమొందించారు. భట్టిప్రోలు మండలంలోని పల్లెకోనకు చెందిన సర్పంచ్ వెంకటరత్నం, వెల్లటూరుకు చెందిన మోటూరు వెంకటరత్నం, మూడేళ్ళ పాపను పోలీసులు కాల్చిచంపారు. వ్యవసాయ, కార్మిక ఉద్యమాలకు వారు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేయడమే కారణం.



ఇసుకపల్లిలో అమరవీరుల స్థూపం

ఉపాధ్యాయ వృత్తిలో కొనసాగుతూ చేనేత కార్మిక ఉద్యమంలో ప్రధానపాత్ర పోషించిన చెరుకుపల్లి మండలంలోని కనగాలకు చెందిన కస్తూరి కుటుంబరావు, పేదల విముక్తి కోసం ఉద్యమాలను నిర్వహించిన రేవల్లె మండలంలోని గుడ్డికాయలంకకు చెందిన గుమ్మడి సీతారమయ్యలు పోలీసుల తూటాలకు అమరవీరులయ్యారు. వీరి త్యాగాలను దృష్టిలో వుంచుకుని ప్రస్తుత సి.పి.ఎం పార్టీ నాయకులు వారి సేవలను ఆదర్శవంతంగా తీసుకుని ఉద్యమాల ద్వారా ప్రజల సమస్యలను పరిష్కరించగలగాలని పిలుపునిస్తున్నారు.



# సాక్ష్యమిచ్చిన భావన్నారాయణుడు

(పొన్నూరు-ప్రభాతవార్త)

ఆంధ్రప్రదేశ్‌లో ప్రసిద్ధి చెందినది పొన్నూరు శ్రీ భావన్నారాయణ స్వామి క్షేత్రరాజం. పూర్వం అత్రి మహర్షి కాశీ క్షేత్రంలో నివశిస్తూ శ్రీమన్నారాయణుని గూర్చి తపము నరించగా నారాయణుడు ప్రత్యక్షమై మనో వాంఛితాలు తెలపమన్నాడు. మహర్షి సంతోషించి నవరివారంగా స్వామిని ఈ స్థలంలోనే ఉండవలసిందిగా కోరాడట. స్వామి దీనికి ఇష్టపడి ఒకానొక భక్తునికి సాక్ష్య మీయడానికి పొన్నూరుకు విచ్చేసి కల్పాంతపర్యంతం నివశిస్తానని పలి కారు. తదుపరి కొంతకాలానికి సంతానం లేదని బాధపడుతున్న కేశవయ్య అనే గృహస్థు తన మేనల్లుడైన గూను గోవిందుని వెంట బెట్టుకొని దివ్య క్షేత్రాలు సందర్శిస్తూ చివరకు భావన్నారాయణ స్వామి దేవాలయంలోకి ప్రవేశించి తన తనకొక కుమార్తె కలిగితే ఆమెను అల్లుడు గూను గోవిందుకు ఇచ్చి వివాహం చేస్తానని మాట ఇచ్చాడు. కేశవయ్యకు ఒక బాలిక కలిగింది. ఈబాలికను వికృతాకారుడైన గోవిందుకు ఇవ్వడానికి మనసొప్పక మరొక సంబంధం వెతకసాగాడు. ఈ సంగతి తెలిసిన గోవిందుడు కేశవయ్యతో భావన్నారాయణను సన్నిధిలో తనకు చేసిన వాగ్దానమును గుర్తు చేయగా భావన్నారాయణుని సాక్ష్య మిప్పిస్తే అటులనే వివాహం జరిపించెదనని అన్నాడు. దీనితో గోవిందుడు కాశీకి వెళ్ళి భావన్నారాయణ స్వామితో మొరపెట్టుకొంటుండగా అచ్చట అత్రి మహాముని ఈ భక్తవర్యుని చూసి విషయం తెలుసుకొని భగవంతునితో తనను వీడి ఈ భక్తునితో వెడలిన తన గతిఏమిటని వాపోయాడు. అప్పుడు స్వామి ప్రక్కనే ఉన్న పేరులేని పెద్దమాను, విశ్వనాధుడు, తుంగభద్రా నదులను వెంట బెట్టుకొని గోవిందునితో వెనుదిరిగి చూడకుండా వెళ్ళమని తెలిపాడు. అనంతరం స్వామివారితో గోష్పీవనం సమీపానికి వచ్చిన తరువాత అనుమానంతో గోవిందుడు వెనుదిరిగి చూడగా స్వామివారు అక్కడే అర్చారూపం పొందాడు. గోష్పీవనానికి వచ్చిన సాక్షి దేవుని సంగతి తెలుసుకున్నవాడై మామ కేశవయ్య బంధుమిత్రులు, ఆలుబిడ్డలతో అక్కడికి వచ్చి స్వామి వారిని దర్శించుకున్నాడు. అనంతరం స్వామివారు గోవిందుని వికృతరూపం పోగొట్టి సౌందర్యవంతునిగా మార్చినారు. తదనంతరం గోవిందునికి, కేశవయ్య కుమార్తె అక్కలక్ష్మికి రంగరంగ వైభవంగా వివాహం జరిగింది. స్వామివారు సాక్ష్యానికై ఇక్కడికి రావడం వలన ఆనాటి నుంచి సాక్షి భావన్నారాయణ స్వామి అని ఖ్యాతి కలిగింది.



శ్రీ సుందరవల్లీ రాజ్యలక్ష్మీ సమేత సాక్షిశ్రీ భావన్నారాయణ స్వామి

**చారిత్రాత్మక అంశం:** అవుకు మండలాధిపతియైన నంధ్యాల నార పరాజు శ్రీ భావన్నారాయణ స్వామి ఆలయం నిర్మాణమొన రించాడు. ఆయనకు కుళోత్తుంగ చోళ దేవ మహారాజు క్రీ.శ 1119 వైశాఖ మాసం లో జరుగు స్వామివారి కళ్యాణోత్స వాలకు, అర్చన భోగాలకు పార టూరు, కొండమూది, బాదం పాడు, మన్నూరు, ములుకుదురు, గ్రామాలు ఇచ్చినట్లు ఆలయ ప్రాంగణం లోని శిలాశాసనం వలన తెలుస్తుంది. గుంటుపల్లి ముత్తు రాజయ్య క్రీ.శ 1555 లోకొన్ని ఈనాములు ఇచ్చారు. తద నంతరం రాచూరి జమీందారులగు శ్రీ మాణిక్యరావు జగన్నారావు 1772లో దేవాలయానికి ప్రాకారములు నిర్మించారు. వీరి అనంతరం రాజభావయ్య మాణిక్యారాయణిం గారు క్రీ.శ 1804లో శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయునిం గారికి సర్వ హక్కులతో ఇచ్చారు. నేడు శ్రీ భావన్నారాయణ స్వామి వారి దేవాలయంలో జరిగే భోగాలన్నీ వారు ఏర్పాటుచేసినదే.

# కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత పులుపుల వెంకటశివయ్య

(ప్రభాతవార్త-వినుకొండ): వర్ణధర్మాలున్న ఉక్కుచట్రం వగిలి మాల కన్నమదాసు మనసైన సుతుడిగా వీరవైష్ణవ మొచ్చురా! "పలనాడు వెలలేని మాగాణిరా" లాంటి గేయాలు రచించిన భారత స్వాతంత్ర్య పోరాట సమరయోధుడు, మార్క్సిస్టు తత్వవేత్త, కమ్యూనిష్టు ఉద్యమ నిర్మాత పులుపుల వెంకటశివయ్య. రొంపిచర్ల గ్రామంలోని సాంప్రదాయ బ్రహ్మణ కుటుంబంలో 1910వ సంవత్సరంలో జన్మించాడు. ప్రాథమిక విద్యను అక్కడే పూర్తిచేసిన ఆయన బెనారస్‌లో బియస్‌సి ఆనర్స్ చదువుతూ మార్క్సిస్టు తత్వవేత్తగా మారారు. మార్క్సిజాన్ని గురించి చిన్నచిన్న కథల్లో చెబుతున్నందుకు ఆయనను 'తాత' అని పిలవటం బెనారస్‌లో పరిపాటిగా మారింది. అక్కడ ప్రొఫెసర్‌గా పని చేసిన ఆర్‌ఎస్‌ఎస్ మాజీ అధినేత గురు జీ, రేంగ్దేజీలు శివయ్యను తమవైపు తీసుకెళ్ళటానికి జరిపినా కమ్యూనిజంపట్ల ఆయనకున్న ఆసక్తితో అందులోకి వెళ్ళలేకపో యారు. చదువు ఆపేసిన అనంతరం బెనారస్ నుండి గంగాజలాన్ని కాకుండా మార్క్సిజాన్ని తెచ్చి ఆంధ్రలో వెదజల్లారు. 'సైమన్ గోబ్యాక్' ఉద్యమాన్ని ఆంధ్రకేసరి నడిపినప్పుడు యువ సోషలిస్టులకు నాయ కత్వం వహించి శివయ్య పోరాడాడు. 'చౌరాచౌరీ' రైతు పోరాట సమయంలో మహాత్మాగాంధి ఉద్యమాన్ని ఆపివేయగా అనేకమంది అతివాదులు ఉద్యమాన్ని తిరిగి నడపాలని నిర్ణయించినప్పుడు శివయ్య కాం గ్రెస్ నుండి కమ్యూనిస్టుల వైపు ఆకర్షితులైన వారిలో ఒకరు. అప్పటి నుండి ఆంధ్రరాష్ట్రంలో కమ్యూనిస్టు పార్టీ స్థావనకు గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి, నెల్లూరు జిల్లాలలో ఉద్యమాన్ని నడిపారు. కొత్తపట్నం, మంతెన వారిపాలెంలో రాజకీయ పాఠశాలకు ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. శివయ్య తనజీవిత కాలం లో నాలుగేళ్ళు రహస్య జీవితం అనుభవించారు. ప్రముఖ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత 'డాంగే' రచించిన 'ప్రిమిటవ్ కమ్యూనిజం టు స్లేవ్ ఇం డియా' అనే ఆంధ్ర పుస్తకాన్ని ఆదిమ కమ్యూనిష్టు సమాజం నుండి భావి సమాజంకు అర్థమయ్యేరీతిలో తెలుగులోకి అనువదించారు. ఆయన రాజకీయ పాఠశాలలో శిక్షణ పొందిన ప్రముఖుల్లో నక్సలైట్ నాయకుడు కొండపల్లి సీతారామయ్య, సిపిఐ అగ్రనేత చండ్రా రాజేశ్వరరావులున్నారు. విశాలాంధ్ర పత్రికలో శివయ్య కొద్దిరోజులు సంపాదకత్వ బాధ్యతలు కూడా నిర్వ హించాడు. అనంతరం రాజకీయ రంగప్రవేశం చేశాడు.



పులుపుల వెంకటశివయ్య

**రాజకీయ విశేషాలు:** వినుకొండ పంచాయితీ సర్పంచ్‌గా పనిచేశారు. అనంతరం రాజకీయాల్లో చురుకైన పాత్ర పోషిస్తున్న శివయ్యను గుర్తించిన నాయకత్వం పోటీలో నిలిపింది. 1952సంవత్సరంలో వినుకొండ నుండి కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిగా పోటీచేసి విజయం సాధించారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ఉపసభాపతిగా పనిచేసి రాణించారు. అనంతరం 1962లో మరలా పోటీచేసి గెలుపొందారు. రాష్ట్రంలో జరిగిన అనేకపోరాటాలకు నాయకత్వం వహించి ప్రత్యేక ఆంధ్ర ఉద్యమాలకు వ్యతిరేకంగా 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' ఉద్యమానికి మద్దతు పలికారు. అనంతరం తన శాసనసభా సభ్యత్వానికి రాజీనామా చేసి సంచలనం సృష్టించారు. వినుకొండ ప్రాంతంలో తొలిసారిగా అటవీపుల్లరి వ్యవసాయ ఉద్యమం నడిపి రాష్ట్ర వ్యాప్తంగా పుల్లరిని రద్దుచేయించిన పోరాటయోధుడు పులుపుల వెం కటశివయ్య. ప్రముఖ రచయిత తుమ్మల వెంకటరామయ్య, వరకాల వట్టాభిరావు, వానుదేవరావులు సమకాలీన రచయితలు. కాగా నీలం రాజశేఖరరెడ్డి శివయ్య రాజకీయ సహచరులు. 1970 సంవత్సరంలో రాష్ట్ర కమ్యూనిష్టు శాంతి సంఘాల ఆహ్వానం మేరకు రష్యా వెళ్ళిన పులుపుల శివయ్య అక్కడే తన తుదిశ్వాస విడిచారు.










# తరాలు మారినా...అభివృద్ధి శూన్యం

## - వీరత్వం కోల్పోతున్న 'వీరులు' ఆలయం - గతితప్పుతున్న చరిత్ర స్మృతులు

(ప్రభాతవార్త, కారంపూడి/పిడుగురాళ్ళ)

శతాబ్దాల చరిత్ర కలిగిన ఆలయాలు శిథిలావస్థకు చేరుకుంటున్నాయి...ఘనచరిత్ర కలిగిన ఈ ఆలయాలను మచ్చుకైనా అభివృద్ధి పరిచేవారు కరువై నేడు వెలవెలబోతున్నాయి. పల్నాటి యుద్ధానికి కేంద్ర బిందువు అయిన కారంపూడిలో వున్న అవశేషాలలో వీరుల దేవాలయం ఒకటిగా పేర్కొనవచ్చు. ఈ దేవాలయానికి ఎంతో విశిష్టత వుంది. జాతి సమైఖ్యతకు ప్రతీకగా వీరారాధన ఉత్సవాలు ఇక్కడ జరుగడం అనాదిగా వస్తున్న ఆనవాయితీ. తరాలు మారిపోతున్నాయి...పాలకులు మారుతున్నారు...కొత్తనీరు వస్తుంది...పాతనీరు అంతరించిపోతుంది...అన్న చందంగానే పాతచరిత్రకు పాతర వేస్తున్నారు నేటి పాలకులు. కారణాలు ఏమైనప్పటికీ ఘనచరిత్ర కలిగిన దేవాలయాలు సైతం అభివృద్ధికి ఆమడదూరంలో వుంటూశతాబ్దాల చరిత్ర కలిగివుండి నేడు శిథిలాల జాబితాలోకి చేరుతున్నాయంటే ఆశ్చర్యంకాదు. వీటిని మచ్చుకైనా పట్టించుకొని అభివృద్ధి చేయాలన్న ఆలోచన లేకపోవడం గత చరిత్రకు పాతర వేయడమే కాక మరొకటి


వీరుల ఆలయ ముఖద్వారం

ఏముంటుంది.

### ఆలయ చరిత్ర ఇది

పల్నాటి యుద్ధానికి ప్రతీకగా నిలిచిన కారంపూడిలో పల్నాటి వీరోత్సవాలను సుమారు 800 సంవత్సరాల నుంచి నిరాటంకంగా నిర్వహిస్తుంటారు ఈ ప్రాంతవాసులు. ప్రతి ఏడాది కార్తీకపౌర్ణమి రోజున బ్రహ్మనాయుని నృశింహకుంతము, బాలచంద్రుని సామంతము, కన్నమదాసు భైరవఖడ్గము తదితర కొణతములను తీసుకొని నాగులేటిలో స్నానం చేయించి వాటిని అలంకరించి గ్రామోత్సవాన్ని జరుపుతారు. వీర్ల సేవాస్థానంలో పోతురాజుకు పడిగం కట్టడం (నూలిపోగులు చుట్టి గుడిని రక్షింపుమని ఆనకట్టు)తోఉత్సవాలు ప్రారంభమవుతాయి. మరుసటి రోజు పీఠాధిపతి, పూజారులు, వీర్ల సేవాస్థానానికి వెళ్ళి ఈ ఉత్సవాలను కార్తీక అమావాస్య నుంచి వరుసగా ఐదురోజులు పాటు నిర్వహిస్తారు. రాచమడుగు, రాయభారం, మందపోరు, కోడిపోరు, కల్లిపాడు అనే పేర్లతో రోజుకొక నామధేయంతో ఈ వీరారాధన ఉత్సవాలను నిర్వహించడం ఇక్కడ పరిపాటి.

పల్నాటి వీరాచారం జరుపువారిని పల్నాటి వీరాచారవంతులు అని పిలుస్తారు. వీరు గుంటూరు, కృష్ణా, ప్రకాశం, నెల్లూరు, ఖమ్మం, చిత్తూరు, కడప, కర్నూలు, ఉభయగోదావరి జిల్లాలలో వుంటారు. ప్రతిఏడాది జరిగే ఈ ఉత్సవాలలో వీరు స్వయంగా పాల్గొని వారికి సంబంధించిన కుంతములు తీసుకొని కారంపూడివచ్చి సేవలో పాల్గొని తిరిగి ఆ కుంతములను తీసుకొని వెళ్తారు. ఆ కొణతములను వారివారి గ్రామాలలో శ్రీ చెన్నకేశవస్వామి, బ్రహ్మనాయుని నృశింహకుంతములుగా భావించి కొలుస్తారు. పల్నాటి వీర్ల అంకమ్మకు గుర్తుగా ఓ కలశాన్ని కూడా అలంకరించి పూజచేసి ఎదురుబుట్టలో పెట్టి పూజిస్తారు.


ఆలయం ఏరియల్ వ్యూ



అలంకార ప్రాయంగా మారిన టూరిజం బోర్డు

ప్రపంచంలో ఈ విధమైన ఉత్సవాలు రెండుచోట్ల జరుగుతాయని ప్రతీతి. రోమ్‌నగరంలో జరిగే వీరారాధన ఉత్సవం మొదటిదైతే...భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గుంటూరు జిల్లా కారంపూడిలో జరిగే ఈ ఉత్సవాలు రెండవదిగా చెబుతుంటారు. చరిత్రకారుడు కార్లైలు వీరపూజ గురించి బహుళ ప్రచారం చేశారు. ఈ వీరులను స్మరిస్తూ దైవాలుగా భావించి పూజించే ఈ వీరాచారం పల్నాటి ప్రాంతంలో వుండటం గర్వించదగ్గ విషయం. బ్రహ్మనాయుడు పల్నాటి యుద్ధానంతరం తమతోటి 66 గురు వీరనాయకులతో గుత్తికొండబిలం వెళ్ళారని ప్రసిద్ధి. యుద్ధంలో పాల్గొన్న వీరులంతా తమ స్మృతికి చిహ్నంగా ఒక్కొక్కరు ఒక్కొక్క రాయిచొప్పున బ్రహ్మనాయుడుకిచ్చి ఆ యుద్ధంలో ఆగిపోయారని చెబుతుంటారు. ఈ 66 మంది వీరులకు గుర్తుగా వున్న ఆ వీరుగల్లులను సమతావాది సిద్ధాంతాన్ని పాటించే వీరాచారాన్ని అనుసరించేవారి నిమిత్తం ఆ విధానాన్ని బ్రహ్మనాయుడు ఈ కారంపూడి యుద్ధక్షేత్రంలో సజీవంగా నిలిపే నిమిత్తం ఒక పీఠాన్ని ఏర్పరచి ఆ పీఠంలో వీరాచార్యం పటిష్టంగా జరగాలని ఆదేశించారని పేర్కొంటుంటారు. ఔరంగాజేబు పరిపాలన కాలంలో జాఫర్, ఫరీద్ అనే ఇద్దరు ముస్లిం సర్దార్‌లు పల్నాటి వీరులైన ఆ 66 వీరనాయకుల శిలలకు గుడి నిర్మించారు. అప్పటికి సుమారు 600 సంవత్సరాల నాడు యుద్ధంలో పాల్గొన్న వీరులకు ఈనాటికి వీరపూజలు నిర్వహిస్తుంటే మనం ఎన్నో యుద్ధాలలో పాల్గొన్నాం. మనల్ని ఎవరు వీరులుగా గుర్తిస్తారు అని మనసు కలతచెంది తాము కూడా ఇక్కడే సమాది అయితే తమకు కూడా


గంగసారీ మడుగు ఇదే

వీరపూజలు అందుతాయని ఆ ఇద్దరు సోదరులు జీవసమాది అయ్యారు. వీరులగుడిలోనే హరిజనుడైన కన్నమదాసుకు ఓ చిన్నగుడి నిర్మించారు. దళితులకు ఆలయప్రవేశం కల్పించి సర్వమత సమానత్వాన్ని చాటిచెప్పిన బ్రహ్మనాయుడు చాపకూడు సిద్ధాంతాన్ని కూడా ఇక్కడే అమలుపరచడం మరొక విశేషం. కార్తీకపౌర్ణమి రోజున పోతురాజుకు వడిగం కట్టడంతో వీరోత్సవాలకు అంకురార్పణ జరుగుతుంది.

### గంగధారి మడుగు ప్రశస్తి

కారంపూడిలో సుప్రసిద్ధమైన నాగులేరు వుంది. నాగులేరు ఇక్కడ దక్షణం నుంచి ఉత్తరం వైపు ప్రవహిస్తుంది. పూర్వం నాగులు అనే జాతులవారు ఈ ప్రాంతంలో సంచరించడం వల్లనే నాగులేరు అని పేరు వచ్చిందని పేర్కొంటున్నారు. వీరులగుడికి ఆనుకొనివున్న ఈ నాగులేరులో ఓ నీటిమడుగు అంతర్‌వాహినిగా వుందని, దానిని గంగధారి మడుగుగా ప్రబోదిస్తుంటారు. ఈ గంగధారి మడుగును కాశీలోని మణికర్ణిక ఘట్టంతో శ్రీనాధ మహాకవి పోల్చడం జరిగింది. ఇంతటి ప్రశస్తి కలిగిన నాగులేరు పునఃవైభవాన్ని కోల్పోకుండా కాపాడాల్సిందిగా అధికారులు చర్యలు తీసుకోవాలని కోరుతున్నారు.

ఎంతో ఘనచరిత్ర కలిగిన వీరులకు నీరాజనాలు అర్పించే ఏకైక చరిత్రగా *(మిగతా 21వ పేజీలో..)*



శిథిలావస్థలో అలనాటి గృహాలు



ఆలయాన్ని నిర్మించిన ముస్లిం సర్దారుల ఘోరీలు

# తరాలు మారినా...

(20వ పేజీ తరువాయి)

పేరొందిన ఈ ఉత్సవాలకు విచ్చేసే ఆచారవంతులకు కనీస వసతులు లేక నేడు అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ప్రభుత్వం ఇంత వరకు ఈ దేవాలయాన్ని గుర్తించిన పాపానపోలేదంటూ స్థానికులు పేర్కొంటున్నారు. పర్యాటకశాఖ వారు ఆలయానికి వచ్చి బోర్డు మాత్రమే ఏర్పాటు చేశారే తప్ప ఆలయ అభివృద్ధికి ఎలాంటి చర్యలు తీసుకోకపోవడంతో ప్రజలు నిరుత్సాహానికి గురవుతున్నారు. మత సామరస్యానికి ఏకైక ప్రతీకగా నిలిచిన ఈ ఉత్సవాల చారిత్రక చిహ్నాలు నేడు కనుమరుగవుతున్నాయి. దీనిని పర్యాటక కేంద్రంగా అభివృద్ధి పరచాల్సిన ఆవశ్యకత ఎంతైనా వున్నప్పటికీ తుతుమంత్రంగానే ప్రభుత్వం తాత్కాలిక ఏర్పాట్లు, మరమ్మతులు చేసి చేతులు దులుపుకుంటుంది. చరిత్రలో శాశ్వితంగా నిలిచిపోయేటట్లు ఈ దేవాలయాన్ని అభివృద్ధి పరచాల్సిన అవసరం ఎంతైనా వుందంటూ పీఠాధిపతి పిడుగు వెంకట శివప్రసాద్ అయ్యావార్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నారు. ఇది ఎప్పటికి నెరవేరుతుందో వేచిచూద్దాం మరి.



శిథిలావస్థకు చేరిన అలనాటి గృహాలు

# భక్తుల కొంగుబంగారం ఈ పరమశివుడు

(ప్రభాతవార్త, మాచవరం)



శిలాశాసనం

గుంటూరు జిల్లా మాచవరం మండలంలోని మోర్జంపాడు గ్రామ నడిబొడ్డున వున్న దిగుడుబావిలోని మెట్లపై వున్న పురాతన శివాలయంలోని స్పటిక లింగానికి గ్రామస్తులు, అయ్యప్పస్వామి భక్తులు ప్రత్యేక పూజలు నిర్వహిస్తున్నారు. సుమారు 1700, 1800 శతాబ్దంలోని రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు పరిపాలన కాలంలో ఈ దిగుడుబావి మెట్లపై చిన్న పాటి శివాలయాన్ని ఏర్పాటు చేసి అందులో ప్రత్యేకమైన స్పటిక లింగాన్ని ఏర్పాటు చేసినట్లు గ్రామస్తులు చెబుతున్నారు.

కాలక్రమేణ దిగుడుబావిలోని నీరు చెడిపోవడంతో అదికాస్త చెత్తచెదారంతో పూడిపోయింది. ఈ క్రమంలోనే బావిమెట్లపై వున్న శివాలయం కూడా అందులో కలిసిపోయిందని తెలిపారు. దిగుడుబావిలోని నీటిని అప్పట్లో గ్రామం మొత్తం ఉపయోగించుకునే వారని, గ్రామంలో అక్కడక్కడ బావులు, బోర్లు వేయడం వల్ల దిగుడుబావిలో నీటిని ఎవరూ వినియోగించకపోవడంతో ఆనీరు పాడైపోయి చివరకు బావికూడా పూర్తిగా పూడిపోయింది. బావిపక్కనే వున్న ఒక గదిలో అయ్యప్పస్వామి భక్తులు ప్రతిరోజు పూజలు చేస్తుండేవారు. దీనిలో భాగంగా ఒకరోజు బావిఒడ్డున నిలబడిన భక్తులు మాట్లాడుకుంటూ ఇక్కడ శివాలయం వున్నట్లు వారిలో వారు అనుకొని తొవ్వడం మొదలెట్టారు.



దిగుడుబావిలోని శివాలయం

సుమారు 10, 15 అడుగులు తొవ్వేసరికి శివాలయం కనపడిందని తెలిపారు. శివాలయం చుట్టూ వున్న మట్టిని తొలగించి శుభ్రం చేశారు. శివాలయంలో వున్న నీటిని ఆయిల్ ఇంజన్‌పెట్టి తోడించినా తరగలేదని పేర్కొన్నారు. గ్రామపెద్దలు సూచనల మేరకు శివాలయంలో శివలింగానికి అభిషేకాలు చేయించడంతో నీరురావడం తగ్గిపోయిందని, అప్పటి నుంచి ప్రతిరోజు గ్రామస్తులు, అయ్యప్పభక్తులు పూజలు చేయడం ప్రారంభించారని పేర్కొన్నారు. శివాలయానికి సుమారు 20 అడుగుల దూరంలో వినాయకస్వామి గుడి కూడా వుంది.

శివాలయానికి ఎదురుగా అప్పటి బాషలో లిఖింపదగిన శిలాశాసనం కూడా కలదు. గ్రామంలోని ప్రముఖ సిద్ధాంతకర్త జగ్గయ్య శివాలయ ప్రాంగణం శుభ్రంచేసి పూజలు నిర్వహించి అభివృద్ధి చేయాలని సూచించినట్లు గ్రామస్తులు తెలిపారు. మరికొంతమంది గ్రామస్తులు కృష్ణానది పుట్టుక నుంచి సముద్రంలో కలిసేవరకు నదివెంబడి 101 శివలింగాలు అప్పటిరాజులు ప్రతిష్టింపజేసినట్లు చెబుతున్నారు.



శివాలయంలో వున్న స్పటిక లింగాకారం

మోర్జంపాడు గ్రామసమీపంలోని బుగ్గమల్లయ్య స్వామి, గోవిందాపురం సమీపంలోని తాడుట్ల, దైద, సత్రశాల తదితర ప్రాంతాలలో శివాలయాలు వెలిశాయని చెబుతున్నారు. అయితే ఇక్కడ వున్న శివలింగం స్పటిక శివలింగంగా సిద్ధాంతకర్త జగ్గయ్య చెబుతున్నారని, ఇలాంటి శివలింగం జిల్లాలో ఎక్కడాలేదని పేర్కొంటున్నారు. శివలింగంపై చెయ్యి వేస్తే చల్లగా జారిపోతూ వుంటుందన్నారు. అయ్యప్ప భక్తులు దారం లచ్చిరెడ్డి, బాగం వీరారెడ్డి, గుణపాటి రంగారెడ్డి తదితరులు శివాలయం చుట్టూ శుభ్రంచేసి సిమెంట్ ఇటుకలతో చిన్న ప్రహరీ నిర్మించారు. శివాలయ అభివృద్ధికి దాతలు ముందుకు రావాలని గ్రామస్తులు, భక్తులు కోరుతున్నారు.

# జాషువా ఖ్యాతిని చాటుతున్న వినుకొండ కవులు

(ప్రభాతవార్త-వినుకొండ)

నవయుగ కవిచక్రవర్తి గుర్రం జాషువా పుట్టిన వినుకొండ గడ్డపై జాషువాఖ్యాతీని నిలబెట్టేందుకు ఆయన ఆరాధకులు విశేషకృషి చేస్తు న్నారు. సహజకవి దుబ్బల దాసు, గాయకుడు వై.జయచంద్ర, కవి కరీ ముల్లా, మధుర కవి కంచర్ల పాండు రంగశర్మ తదితరులు జాషువా కీర్తి ప్రతిష్టలను రాష్ట్రంయావత్తు వారి సాహిత్యం, పద్యకావ్యాల ద్వారా నిలువుతున్నారు. రాష్ట్రస్థాయిలో పలుపోటీల్లో పాల్గొని అనేక బహు మతులు గెలవటం జరిగింది. ఇం దులో భాగంగా పోలీస్ ఉద్యోగం చేస్తూ తనదైనశైలిలో పద్యఖండ కావ్యాలు రాస్తూ అందరినీ ఆకర్షింప చేస్తున్నారు దుబ్బలదాసు. దుబ్బల దాసు రచించిన కొన్ని ఖండాలు.

ఆ.వె.: మహాకవి జాషువాపై రాసి న ఖండాకావ్యం. విశ్వశాంతి కళలు వెలుగులై వినుకొండ కవుల గాయకాది గళములందు శాశ్విత యశ శ్రీల చరిత్రగా నిలవాలి తిరుగులేని కీర్తి తెజరిల్ల. సీ.: సప్తమ ఖండాలు సమసృష్టి గావించి పండితామోదము బడసెకవిగ పంచమకావ్యాలు భార తాంధ్రకు దించి కలియుగ శ్రీనాధ ఘనత బడసె. కాలికందియనంది కరి మీద వూరేగి మీసాలు మెలిసిన రోష ాడు చావుపుట్టుకలకు సమభావ మివ రించి తనకథ వివరించే ధన్యజీవి. తే.గీ: తల్లి లింగమ్మవీరయ్య తన యుడితడు చాట్రగడ్డపాడాంధ్రీయ



సహజకవి దుబ్బలదాసు

సజ్జనుండు పుడమి వినుకొండ నేలపై నడకనేర్చి కదిలె గుర్రము జాషువా కవనమాలి. పులువుల వెంకట శివయ్య.

సీ.: పుడమిన శ్రమజీవ బడలిక సడలించ పులుపుల జన్మించే పల నాట ఆచార ఖైదును, అలనాడె విడ నాడె ప్రజల సేవకు తాను వయ నమాయె చదువుల విలువైన సారా న్ని సమకూర్చి బోధించే గురువుగా బాధలెరిగి స్వాతంత్ర్య దీక్షలో సమ రనినాధుడై జైలువాసము జేసె జాతి కొరకు. ఆ.వె.: కన్నెగంటి వీరహ నుమంతు శౌర్యాన్ని పుణికి పుచ్చు కున్న పులుపుల మృతి మరువలేని దిగులు మమతాను బంధమై దిగుల కిరణ మిచట వెలుగుచుండె. విను కొండ ఘనత.

సీ.మాల: "శ్రీనాధ శృంగారి" శ్రీనృతి సాహితీ శృతగిరి లోగిటే సెకలునేర్చె 'బీర్నీడి తాతయ్య' దరిజేరి వూపెను 'చీకటికేకలు చిందు ద్రొక్కి అనమానతల దాన్య వాగ్ధార యెలుగెత్తి కాశీని కదిలించే 'జాష్వ కవిత' గద్దల జోసెపు'కన్నీటి కబురు' తో గుండె బరువు కొంత దండిరేగె తురక విలువలన్ని తుగాడి నర్తించే 'ఆం ధ్రకవి ఫరీదు' ఆత్మవర్తి తెలుగు తల్లి పిలుపు బలముతో పులకించి కలము కదుపుచున్న కవులు మెండు తే.గీ.: ఇంత చుతరత కలిగి విఖ్యా తులైన కావ్యమూర్తులు వెదిలిన కవనగిరిది సీతచెర బాధ శ్రీరామ చంద్ర ప్రభుకు, చెవిన జేర్చిన సేవకీ 'విన్నకొండ'.!

# రాజకీయ ఘనాపాటి

# కాసు బ్రహ్మానందరెడ్డి

(ప్రభాతవార్త-నరసరావుపేట)

రాజకీయ చరిత్రలో కాసు బ్రహ్మానందరెడ్డికి సముచితమైన స్థానం, చరిత్ర ఉంది. ఎంతటి ప్రతికూల పరిస్థితినైనా అనుకూల పరిస్థితికి తీసుకురాగల రాజకీయ ఘనాపాటిగా పేరుంది. దీనికితోడు నైతిక విలువలు కలిగి ఆంధ్రరాష్ట్రం ముక్కచెక్కలు కాకుండా అడ్డుపడి సమైక్యతా వాదిగా పేరుపడ్డ మేరునగ ధీరుడు కాసు బ్రహ్మానందరెడ్డి. 1964 ఫిబ్రవరి 29నుంచి 1971 సెప్టెంబర్ 30వరకు అవిచ్ఛిన్న ఆంధ్రరాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పనిచేశారు. సుదీర్ఘకాలం ఆంధ్రప్రదేశ్‌ను పరిపాలించిన ముఖ్యమంత్రుల్లో ఆయన మొదటివారు. ఈయన సుస్థిర పరిపాలనను అందించడంతోపాటు ప్రతిజిల్లానుంచి మెరికలవంటి నాయకులను తయారుచేశారు. ఉపనాయకత్వాన్ని ప్రోత్సహిస్తే తనకు ఇబ్బంది అన్న మనస్తత్వం ఆయనదికాదు. అందువల్లే మంచి నాయకత్వం, సేవాదృక్పథంగల నాయకులను తయారుచేయడంలో ఆయన ఎక్కువ మక్కువచూపారు. అప్పట్లో ఆయన రాష్ట్రానికి ప్రసాదించిన రాజకీయ సుస్థిరత్వాన్ని, సమర్థపాలనను చూసి ఓర్వలేని కొందరు నాయకులు ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని కూడా ప్రారంభించారు.



కాసు బ్రహ్మానందరెడ్డి

అప్పట్లో ఆయన ఎదుర్కొన్న రాజకీయ ఒత్తిడి, ఆందోళనలకు ధీటైన మహోద్యమం, ఉదృతిని ఎదుర్కొనడంలో ఆయనకు ఆయనే సాటి. తనమంత్రివర్గంలో కొందరినుంచి ఎదురైన వ్యతిరేకత, అసమ్మతిని ఎదుర్కొనడంలో ఆయన వహించిన మనోనిబ్బరం శ్లాఘనీయం. క్లిష్టసమయాల్లో ధైర్యంగా నిలబడి సమస్యలనెదుర్కొనడంలో ఆయనకు సాటి మరెవరూలేరు. ఎంతటి సమస్యనైనా చాకచక్యంగా, సర్వసమ్మతంగా పరిష్కరించడంఆయనకు వెన్నతో పెట్టిన విద్య.

1956లో ఎపి కాంగ్రెస్ లెజిస్లేటివ్‌పార్టీ నాయకుడుగా నీలం సంజీవరెడ్డిని ఎన్నుకోవడంలో బ్రహ్మానందరెడ్డి పాత్ర కీలకమైంది. అప్పట్లో సంజీవరెడ్డి మంత్రివర్గంలో మంత్రిగా పనిచేశారు. 1962లో సంజీవరెడ్డి రెండోపర్యాయం ముఖ్యమంత్రి అయినప్పుడు బ్రహ్మానందరెడ్డి ఆర్థికమంత్రిగా పనిచేశారు. 1964 ఫిబ్రవరిలో కర్నూలు జిల్లాలో బస్సుల జాతీయకరణ విషయంలో సుప్రీంకోర్టు చేసిన వ్యాఖ్యలను శిరసావహించి సంజీవరెడ్డి రాజీనామాచేయగా ఆపదవికి బ్రహ్మానందరెడ్డిని పార్టీ ఎంపికచేసింది. అక్కడినుండి బ్రహ్మానందరెడ్డి రాష్ట్రంలో తనదైన శైలిలో నాయకత్వాన్ని, ముఖ్యమంత్రిత్వాన్ని సుస్థిర పరుచుకున్నారు.

తెలంగాణా ఉద్యమం ప్రారంభమయ్యేవరకు ఆయన నాయకత్వానికి ఎదురులేకుండా సాగింది. తెలంగాణా ఉద్యమం సమయంలో ముఖ్యమంత్రిత్వానికి కొన్ని అవాంతరాలు ఏర్పడినా తనదైన శైలిలో రాజకీయ చాకచక్యంతో వాటిని అధికమించడంలో కృతార్థులయ్యారు. నరసరావుపేట తాలూకా తూబాడు గ్రామంలో 1909 జూలై 28న జన్మించిన బ్రహ్మానందరెడ్డి బి.ఎ., బి.ఎల్. వరకు చదివారు.

గుంభన స్వభావంగల లోతైన మనిషి. మనసులో ఏమున్నదో ఎదుటివారికి తెలియనివ్వరు. మితభాషి, సాదాసీదాగా కనిపించే సహజలక్షణాలుగల వ్యక్తి. కొంచెం బొంగురు గొంతుతో తాను చెప్పదలచుకున్నది కుండబద్దలు కొట్టినట్లు చెప్పడం ఆయనకు మొదటి నుండి అలవాటు. ఓపికకు సహనానికి మారుపేరు బ్రహ్మానందరెడ్డి అని చెప్పవచ్చు. చెప్పింది తప్పకచేసే దృఢమనస్కుడు. ఎదుటివారు విమర్శించినా తొణకకుండా విని చివరకు హాస్యోక్తులతో, చలోక్తులతో సమాధానమిస్తే ప్రతిపక్షసభ్యులుకూడా నవ్వుకునేవారు. పెండింగ్‌ఫైల్స్ అంటే మహాచిరాకు. ఎప్పటికప్పుడు పరిష్కరించడమే ఆయనలో ప్రత్యేకత. టెన్నిస్, బ్రిడ్జి క్రీడలంటే ఎంతో ఇష్టం.

సినిమాలు బాగా చూసే అలవాటు ఉన్న వ్యక్తి. 1936లో జిల్లాబోర్డు అధ్యక్షులయ్యారు. అప్పట్లో అంతచిన్న వయస్సులో పదవిని అలంకరించిన వారిలో బ్రహ్మానందరెడ్డి అరుదైన వ్యక్తిగా చెప్పుకోవచ్చు. ప్రత్యేక తెలంగాణా ఉద్యమంవల్ల 1971లో ఆయన ముఖ్యమంత్రి పదవిని త్యజించారు. రాజీనామా చేసినా లెజిస్లేటివ్ పార్టీలో ఆయనకు మంచిపట్టు ఉంది. ఇందిరాగాంధీ ఆదేశాలమేరకు రాజీనామా చేశారే కానీ ఆయన నాయకత్వలోపంవల్ల కాదు. ఆయన పరిపాలనలో రాష్ట్రం అభివృద్ధి చెందింది. 1972-73లో ఫైనాన్స్ కమీషన్ చైర్మన్ అయ్యారు. 1974లో కేంద్ర కమ్యూనికేషన్ మంత్రి, ఎమర్జెన్సీ కాలంలో కేంద్ర హోంమంత్రిగా పనిచేశారు.



ఇందిరాగాంధీతో బ్రహ్మానందరెడ్డి

ఎమర్జెన్సీ తరువాత ఇందిరాగాంధీ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేయగా ఆస్థానంలో బ్రహ్మానందరెడ్డిఎన్నికయ్యారు. ఇందిరాగాంధీతో తీవ్ర విభేదాలు ఏర్పడటంతో ఆమె కాంగ్రెస్‌నుండి చీలిపోయి ఇందిరా కాంగ్రెస్ స్థాపించగా బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలోని కాంగ్రెస్‌ను రెడ్డికాంగ్రెస్‌గా కూడా వ్యవహరించారు. కాంగ్రెస్ అధ్యక్షులుగా జాతీయ రాజకీయాల్లో ప్రముఖ భూమిక పోషించారు.

మహారాష్ట్ర గవర్నర్ పదవిని అధిష్టించి 1989లో జనతాదళ్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత ఆపదవికి రాజీనామాచేశారు. ఒకదశలో దేశానికి రాష్ట్రపతి అవుతారనుకున్నారు. రాష్ట్రంలో నేటి కాంగ్రెస్‌నాయకుల్లో ఎందరికో రాజకీయ జీవితాన్ని ప్రసాదించిన మహానేత స్వర్గీయ కాసు. దాదాపు ఆరుదశాబ్దాలపాటు రాష్ట్ర, జాతీయ రాజకీయ రంగాల్లో రాటుదేలిన రాజకీయ మేరునగధీరుడు బ్రహ్మానందరెడ్డి.

# రైతు సేవలో గుంటూరు మార్కెట్ యార్డు



డా॥ వైయస్ రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణాశాఖామంత్రివర్యులు



శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి



శ్రీ బొత్స సత్యనారాయణ
రాష్ట్ర మార్కెటింగ్ శాఖామంత్రి



శ్రీమతి జయలక్ష్మి I.A.S.
జిల్లా కలెక్టర్, గుంటూరు

★ ఆసియా ఖండములోనే పేరెన్నికగన్న గుంటూరు మార్కెట్ యార్డ్ రైతుల సంక్షేమానికి పెద్దపీట వేస్తుంది.

★ రైతుబంధు పథకం అమలు చేస్తున్నాము.

★ రైతులకు 5 నుంచి 10 శాతానికి తమ సరుకుకు రుణాలు ఇస్తున్నాము.

★ ఒక్కొక్క రైతుకు కనీసం రూ. 75000 లోపు ఋణాలు అందచేస్తాము.

★ ఆధునిక వ్యవసాయ పద్ధతులు తెలియజేయడం కోసం వ్యవసాయ శాస్త్రవేత్త ద్వారా రైతులకు శిక్షణా తరగతులు నిర్వహిస్తున్నాము.

★ ప్రోగ్రెసివ్ ఫార్మర్స్ ఫెడరేషన్ సంస్థ ఆధ్వర్యంలో పుల్లడిగుంట గ్రామాన్ని దత్తత తీసుకున్నాము.

★ కో-ఆర్డినేటర్ ద్వారా వ్యవసాయ రంగంలో రైతులకు మెళకువలు తెలియచేయుచున్నాము.

★ పుల్లడిగుంట గ్రామాన్ని మోడల్‌గా తీసికొని 150 మంది రైతులకు వారికి కావలసిన ఎరువులు, పురుగుమందులను లాభాపేక్షతో కాకుండా సరఫరా చేశాము.

★ తరువాత దశలలో ఈ కార్యక్రమాలు అన్ని గ్రామాలకు విస్తరిస్తాయి.

★ ప్రత్తిపాడు, వట్టిచెరుకూరు, గుంటూరు రూరల్, పెదకాకాని మండలాల రైతులకు కావలసిన ఎరువులు, పురుగు మందులను సరఫరా చేస్తాము.

★ రైతులు, రైతుబంధు పథకాన్ని ఉపయోగించుకోవడం కోనం అవగాహన కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తున్నాము.

★ మార్కెట్ యార్డ్ ఆదాయాన్ని 9.00 నుండి గతంలో సుమారు 13.50 కోట్లు ఉండేది. ఇప్పుడు అది 15 కోట్లకు పెరిగేందుకు చర్యలు తీసుకొనబడుచున్నవి.

★ రైతుల వద్ద వసూలు చేసే మార్కెట్ ఛార్జీలను నియంత్రించాము.

★ గతంలో టిక్కీకి రూ. 15 నుండి రూ. 17 వరకు ఉన్న ఛార్జీలను రూ. 7.50లకు తగ్గించాము.

★ దీనిని నియంత్రించడానికి 24 గంటలు నిఘాను ఏర్పాటు చేశాము.

★ దీని కోసం ఫిర్యాదు విభాగాన్ని కూడా ఏర్పాటు చేశాము.

★ స్పైసెస్ బోర్డు ద్వారా సబ్సిడీపైన రైతులకు టార్పాలిన్ పట్టాలను సరఫరా చేస్తున్నాము.

★ రైతుల సంక్షేమం కోసం వైద్య, ఆరోగ్య శిబిరాలను ఏర్పాటు చేస్తున్నాము.

★ పశువుల వైద్య శిబిరాలను నిర్వహించి పాడి పరిశ్రమను పెంపొందించడానికి రైతులకు కావలసిన సహాయ సహకారాలను అందచేస్తున్నాము.

★ కాటాలలో జరిగే మోసాలను నివారించడం కోసం ఈ సంవత్సరం యార్డు మొత్తంలో ఎలక్ట్రానిక్ కాటాలను ఏర్పాటు చేశాము.

★ యార్డ్‌కు తెచ్చిన సరుకునకు ఉద్యోగులు, వ్యాపారుల సమక్షంలోనే రైతుల అంగీకారంతో ధరను నిర్ణయిస్తున్నాము.

★ దిగుమతులు, ఎగుమతుల వివరాలను రైతులు తెలుసుకోవడం కోసం యార్డును కంప్యూటరైజేషన్ చేయబోవుచున్నాము.

★ రైతుల సమక్షంలోనే కాటాలు వేస్తున్నాము.

★ రైతు బంధు పథకాన్ని అమలు చేయడానికి నిధుల కొరత లేదు. రాబోయే సీజన్‌లో ఎక్కువ కోల్డ్ స్టోరేజ్‌లు అద్దెకు తీసుకుని రైతుల సరుకులు నిల్వ చేసుకొనే అవకాశాన్ని కల్పిస్తున్నాము.

★ ఉద్యానవన శాఖ ద్వారా చిల్లీ డ్రైయర్స్‌ను అందిస్తున్నాము.

★ రైతులు మిర్చిని ఆరబెట్టుకోవడం కోసం ఫ్లాట్‌ఫారాలు నిర్మించుకోవడానికి సబ్సిడీలు అందచేస్తున్నాము.

★ రైతులు పండించే మిర్చి ఎగుమతులకు తగిన విధంగా వుండటానికి సెమినార్లు నిర్వహిస్తున్నాము.

★ మిర్చి అమ్మకాలలో ఏదైనా ఇబ్బందులు వస్తే 24 గంటలలో సమస్యను పరిష్కరిస్తున్నాము,

★ యార్డ్ ఆవరణలో సిబ్బంది ఎవరైనా అవకతవకలకు పాల్పడినా, రైతులకు ఏ సమస్యలు వచ్చినా అధికారుల దృష్టికి తెస్తే వెంటనే పరిష్కరిస్తాము.

★ గుంటూరు మార్కెట్ యార్డ్‌లో మీకు ఏ సమాచారం కావాలన్నా 0863 - 2233699, 2232847 అనే ఫోన్ నంబర్లకు ఫోన్ చేసి సలహాలను పొందవచ్చును.

★ యార్డులో 2005-06లో 438 మంది రైతులకు ఒక కోటి 69 లక్షల, 53వేల రూపాయలు రైతు బంధు పథకం క్రింద తక్కువ వడ్డీకి రైతులుకు రుణాలు ఇచ్చాం.

★ రైతులకు తక్కువ రేటులో యూరియా 20 టన్నులు, డి.ఎ.పి. 10 టన్నులు యార్డు ద్వారా అంద చేశాం.

★ 2005 నుండి యార్డులో 45 లక్షల టిక్కీలు అమ్మకం చేశాం.



శివరామయ్య

# అభివృద్ధి పథంలో బోయపాలెం

(ప్రభాతవార్త-యడ్లపాడు)

అంతర్జాతీయ ఖ్యాతిని, విదేశీ మారక ద్రవ్యాన్ని ఆర్జించే దిశలో, రాష్ట్రానికే తల మానికంగా నిలచే క్రమంలో మండలంలోని బోయపాలెం గ్రామం పారిశ్రామికవాడగా అభివృద్ధి చెందుతుండడం జిల్లాకే గర్వకారణంగా నిలుస్తోంది. గ్రామాల చుట్టూ కొండలతో వ్యవసాయానికి అంతగా ముఖ్యం కాని భూములతో క్వారీ కార్మికులు క్రషర్ల మోతలతో నిన్నటి వరకు కనిపించే బోయపాలెం సరళీకృత పారిశ్రామిక విధానాలతో నేడు స్పిన్నింగ్ మిల్లులలో కేంద్రంగా మారటం స్థానిక ప్రజలు ఆర్థిక స్థితిగతులను మార్చి వేయనున్నట్లు పలువురు ఆశిస్తున్నారు.

ఈస్పిన్నింగ్ మిల్లుల ఆవిర్భావంతో స్థానికంగా ఉన్న స్థలాలకు పొలాలకు ధరలు నాలుగు రెట్లు పైగా పెరగడం స్థానిక ఆర్థిక పరిస్థితి మార్చివేసింది. ప్రస్తుతం 14 వేల స్పిండిల్స్ సామర్థ్యం కల నూలు మిలులు నాలుగు నిర్మాణాలు పూర్తి చేసికొనడం మరో 3 మిల్లుల నిర్మాణాలు ప్రారంభంలో ఉందగా, మరో రెండు మిల్లులు నూలు తయారీలో పరుగులు తీస్తున్నాయి. నూలు మిల్లులకే ముడి సరుకు అయిన ప్రత్తి ఉత్పత్తిలో మన రాష్ట్రం అగ్రస్థానంలో ఉన్నప్పటికి ఇప్పటి వరకు మన రాష్ట్రంలో పారిశ్రామిక రంగంలో 20 లక్షల స్పిండిల్సు మాత్రవే నెలకొల్పబడ్డాయి. అయితే ప్రత్తి దిగుమతికి మన రాష్ట్రాన్నే ప్రధాన వనరుగా ఎంచుకొన్న తమిళనాడులో కోటిన్నర స్పిండిల్సు పనిచేస్తుండటం గమనార్హం.

పారిశ్రామిక విధానాలతో కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాలు సరళీకృత నిబంధనలు, టెక్స్‌టైల్స్ అప్‌గ్రేడేషన్ బెనిపిట్ (టఫ్ బెనిఫిట్) ఒక వైపు, టెక్స్‌టైల్ టెక్నాలజీలో సాధించిన ప్రగతి మరో వైపు స్థానిక పారిశ్రామిక వేత్తలకు నూలు మిల్లుల నిర్మాణాలకు ప్రోత్స హించినట్లు పారిశ్రామిక వేత్తలు అభిప్రాయం వ్యక్తం చేస్తున్నారు. పైగా యూరప్ దేశాలలో మండగించిన నూలు ఉత్పత్తులు అంతర్జాతీయ మార్కెట్‌లో మన ఉత్పత్తులు గిరాకీ ఏర్పడడం ఇత్యాది కారాకాలు నూలు రంగానికి ప్రోత్సాహకరంగా మారింది. స్థానికంగా జాతీయ రహదారి భూగర్భ జలాలు, రోడ్లు, నేల, కార్మికుల ప్రధానంగా విద్యుత్ తదితర అంశాలు అనుకూలంగా ఉండటం చేత స్థానికంగా మిల్లుల నిర్మాణాలకు కారణంగా భావిస్తున్నారు.

కాగా స్థానిక అనంతలక్ష్మి స్పిన్నింగ్ మిల్లు యజమాని ఉన్నవ గ్రామానికి చెందిన నామినేని కోటేశ్వరరావు మాట్లాడుతూ మన ప్రాంతంలో ఈ మిల్లులు నిర్మాణాలు నిరుద్యోగ సమస్యతో కొంత వరకు తీరుస్తాయన్నారు. అయితే మన రాష్ట్రంలో మిల్లులు లేక గతంలో పింజె ప్రత్తిని ఇతర రాష్ట్రాలకు ఎగుమతి చేశామని ప్రసుత్తం టెక్స్ టైల్ రంగం స్థానికంగా పుంజుకొంటున్న ఈ తరుణంలో పొట్టి పింజె పత్తి బిటి రకాలు సాగులోకి రావడం వరిశ్రమలకు కొంత వరకు నిరాశాజనకంగా ఉందన్నారు. విద్యుత్ సరఫరాలో కూడా అప్పుడప్పుడే ఎదురవుతున్న స్వల్ప ఆటంకాలు కూడా త్వరలో తొలగిపోగలవని ఆశాభావం వ్యక్తం చేశారు. సంవత్సరం కాలం నుంచే ఉత్పత్తి ప్రారంభించి నూలు మిల్లుల స్థాపనలో ప్రథమ స్థానంలో నిలిచిన విశ్వ తేజ నూలు మిల్లు ఎం.డి. చంద్రశేఖర్ మాట్లాడుతూ మన జిల్లాలో ప్రత్తికి నూలుకు మంచి విస్తారమైన మార్కెట్ ఉండడంతో పాటు సడలించిన పారిశ్రామిక విధానాలు టెక్స్‌టైల్ రంగాన్ని స్థానికంగా అభివృద్ధి చేయడానికి దోహదపడుతుందని అన్నారు.





## కోస్తా కురియన్ బొల్లా బ్రహ్మనాయుడు

(నరసరావుపేట-ప్రభాతవార్త)



బొల్లా బ్రహ్మనాయుడు

భారతదేశంలో క్షీర విప్లవాన్ని తీసుకొచ్చిపెద్దపరిశ్రమగా తీర్చిదిద్దిన క్షీర సాగరుడు కురియన్ అయితే సామాన్యుడుగా జీవితాన్ని ప్రారంభించి వెనుకబడ్డ ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో పాల ఉత్పత్తులకేంద్రాన్ని స్థాపించి అనతికాలంలో రాష్ట్రంలోని డెయిరీలలో తిరుమల డెయిరీని అగ్రస్థానాల్లో ఉన్నవాటిలో ఒకటిగా తీర్చిదిద్దిన మనత బొల్లా బ్రహ్మనాయుడిదే. దశాబ్దకాలంలో వందలకోట్ల టర్నోవర్ స్థాయికి తిరుమల డెయిరీని తీసుకొచ్చారు. దీంతో బ్రహ్మనాయుడ్ని పలువురు కోస్తా కురియన్‌గా అభివర్ణిస్తున్నారు. బ్రహ్మనాయుడు వ్యాపార లక్ష్యం, కృషి తిరుమల డెయిరీ ప్రగతిని సమీక్షిస్తే అర్థమవుతుంది. కష్టపడితే సాధించలేనిది ఏదీలేదనే సిద్ధాంతానికి కట్టుబడ్డ వ్యక్తి బొల్లా బ్రహ్మనాయుడు. అతను స్థాపించినతిరుమలడైరీ ఇంతింతై వటుడింతై అన్నట్లుగా ఇప్పుడు రాష్ట్రంలోని ప్రముఖ ప్రైవేటు డెయిరీల్లో ఒకటిగా నిలిచింది. ఆసంస్థ ప్రస్తుతం ప్రత్యక్షంగా, పరోక్షంగా 8వేలమందికి ఉపాధి కల్పిస్తుంది. రైతు కుటుంబంలో పుట్టిన బొల్లా రైతుశ్రేయస్సే ధ్యేయంగా తమసంస్థలు పనిచేస్తాయంటారు. 1995లో వెనుకబడిన ప్రకాశం, గుంటూరు జిల్లాల సరిహద్దుల్లోఉన్న వెల్లలచెరువు వద్ద డెయిరీని ఏర్పాటుచేశారు. ప్రారంభ దినాల్లో రోజుకు 10వేల లీటర్ల పాలసేకరణ అవసరమని నిపుణులు చెప్పడంతో గ్రామాల్లో తనకున్న సత్సంబంధాలతో పాలసేకరణ చేసి సంస్థను నిలబెట్టేందుకు ఎంతో కృషిచేశారు. పాలసేకరణ స్థాయి పెరుగుతున్న కొద్దీ అనేక ప్లాంట్లు ఏర్పాటుచేశారు. రాష్ట్రంలో తిరుమల డెయిరీ ప్లాంట్లు వివిధ ప్రాంతాల్లో 18వరకు ఉన్నాయి. పాలసేకరణతో పాటు పాలఉత్పత్తులను తయారుచేస్తూ ప్రజల అభిమానం చూరగొంటున్నారు. శ్రీలంక, బంగ్లాదేశ్ మరికొన్ని దేశాలకు తిరుమల ఉత్పత్తులు ఎగుమతి అవుతున్నాయి. తమిళనాడు, కర్నాటక రాష్ట్రాల్లో కూడా తిరుమల ఉత్పత్తులకు ఆదరణ పెరిగింది. అదేవిధంగా నెల్లూరుజిల్లా గూడూరులో స్థాపించిన ప్లాంటుద్వారా తిరుమల పాలపదార్థాలు తయారుచేస్తున్నారు. వీటికి ఉత్తరభారతదేశంలో మంచి మార్కెట్ ఉంది. తిరుమల ఉత్పత్తులకు ఐఎస్ఒ 9001-2000 గుర్తింపు కూడా లభించింది.

### పాడిపంటలు బాగుంటే గ్రామసీమలు సుభిక్షం

బొల్లాపాడిపంటలు బాగున్నపుడేగ్రామసీమలు సుభిక్షంగా వర్థిల్లుతాయని తిరుమల ఎం.డి బొల్లా బ్రహ్మనాయుడు 'ప్రభాతవార్త'కు తెలిపారు. పాడిపరిశ్రమ వల్ల ఎన్నో కుటుంబాలకు ఆర్థిక వెసులుబాటు కల్గుతుందన్నారు. నాణ్యతాప్రమాణాలు, పాలసేకరణదారులకు సకాలంలో చెల్లింపులే తమ సంస్థ అభివృద్ధికి దోహదం చేస్తున్నాయన్నారు.




తిరుమల డెయిరీ వ్యూ

10 A Glorious Decade

# 'వార్త'కు వార్షికోత్సవ శుభాకాంక్షలు

తెలుగు ముంగిళ్ళల్లో 'వార్త' అడుగిడి 10 వసంతాలు పూర్తి చేసుకుని 11వ వసంతంలోకి అడుగుపెడుతున్న శుభసందర్భంగా 'వార్త' యాజమాన్యానికి మరియు సిబ్బందికి మా హృదయ పూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తూ...

ఈ నవ వసంతాలలో 'వార్త' దినపత్రిక నవ నవోన్మేషంగా ఎదిగి ప్రజల పత్రికగా నిలిచి సమాజహితమే ధ్యేయంగా నైతిక నిబద్ధతతో అలుపులేని అక్షరపోరాటం సాగిస్తూ సమాజంలోని ప్రజలందరి తరపున నిరంకుశ విధానాలను దునుమాడే అంకుశమై ప్రజల చేతిలో పాశుపతాస్త్రంగా నిలిచిన ఈ అక్షరయజ్ఞం నిరంతరం కొనసాగాలని ఆశిస్తూ...



**మధిర వెంకటేశ్వరరెడ్డి**
సీనియర్ కాంగ్రెస్ నాయకులు
సత్తెనపల్లి.

**కట్టా సాంబయ్య**
చైర్మన్: సత్తెనపల్లి వ్యవసాయ మార్కెట్ యార్డు కమిటీ, గుడిపూడి.

**వెలుగూరి శరత్‌బాబు**
అధ్యక్షులు : పట్టణ కాంగ్రెస్ కమిటీ, సత్తెనపల్లి.

**కొర్లకుంట వెంకటేశ్వర్లు**
అధ్యక్షులు : సత్తెనపల్లి మండల కాంగ్రెస్ కమిటీ, రెంటపాళ్ళ.

**పాములపాటి తిరుపతిరావు**
అధ్యక్షులు : మేడికొండూరు మండల కాంగ్రెస్ కమిటీ, మేడికొండూరు.

**షేక్ రహంతుల్లా**
అధ్యక్షులు : ముప్పాళ్ళ మండల కాంగ్రెస్ కమిటీ, ముప్పాళ్ళ.

**స్వర్ణ సూర్యప్రకాశరావు**
అధ్యక్షులు : ఫిరంగిపురం మండల కాంగ్రెస్ కమిటీ, గొల్లపాలెం.

**కె.థామస్‌రెడ్డి**
అధ్యక్షులు : ఫిరంగిపురం మండల ప్రజాపరిషత్, ఫిరంగిపురం.

**పాలపాటి వెంకాయమ్మ సత్యనారాయణ**
ఫిరంగిపురం జడ్.పి.టి.సి., 113 తాళ్ళూరు.

**పోతార్లంక శిరీషా**
మేడికొండూరు జడ్.పి.టి.సి.
పాలడుగు.

**శ్రీ యర్రం వెంకటేశ్వరరెడ్డిగారు**
ఎమ్మెల్యే సత్తెనపల్లి

# అభివృద్ధి దిశగా పెదకూరపాడు

(ప్రభాతవార్త-పెదకూరపాడు)

రాష్ట్రంలోనే అతి పెద్ద నియోజక వర్గంగా గుర్తింపు పొందిన పెదకూరపాడు నియోజకవర్గాన్ని ప్రణాళికాబద్ధంగా అభివృద్ధి చేయడానికి రాష్ట్ర సహకార, రవాణా శాఖ మంత్రి కన్నా లక్ష్మీనారాయణ చర్యలు తీసుకుంటున్నారు. తనను నాలుగు మార్లు అసెంబ్లీకి పంపిన పెదకూరపాడు నియోజకవర్గాన్ని అన్ని విధాలుగా అభివృద్ధి చేయడానికి ఆయన ఇతోధికంగా కృషి చేస్తున్నారు. మూడవసారి మంత్రి పదవి చేపట్టిన కన్నా లక్ష్మీనారాయణ ప్రస్తుతం కేబినేట్ మంత్రులలో బలీయమైన శక్తిగా ఎదిగారు. యువజన సర్వీసుల శాఖ నుంచి సహకార శాఖ, కీలకమైన రవాణా శాఖలను చేపట్టిన కన్నా ముఖ్యమంత్రికి అత్యంత సన్నిహిత మంత్రులలో ఒకరుగా ఎదిగారు. ఆర్టీసి సమ్మెను పరిష్కరించడంలో కన్నా చూపిన చొరవ, వ్యూహాత్మక వైఖరి తలలు పండిన నాయకులను సైతం ఆశ్చర్యానికి గురి చేసాయి. యువజన కాంగ్రెస్ నుంచి అసెంబ్లీలోకి అడుగిడిన కన్నా లక్ష్మీనారాయణ పెదకూరపాడు ప్రజలకు అందుబాటులో ఉండే నాయకుడుగా ప్రశంసలు పొందారు. నియోజకవర్గ పరిధిలో ఎవరికి ఏ చిన్న కష్టం వచ్చినా దానిని పరిష్కరించడంలో ప్రత్యేక శ్రద్ధ చూపే కన్నా లక్ష్మీనారాయణ పెదకూరపాడు ప్రజల హృదయాలలో నిలిచిపోయారు.

ముక్కుసూటి రాజకీయవేత్తగా పేరొందిన రాష్ట్ర సహకార, రవాణా శాఖ మంత్రి కన్నా లక్ష్మీనారాయణ పెదకూరపాడు నియోజకవర్గాన్ని అంచెలంచెలుగా అభివృద్ధి చేశారు. 1989 నుంచి అధికారం ఉన్నా లేకున్నా నియోజకవర్గంలోని ప్రతి ఇంటి వారు కన్నా తమ కుటుంబసభ్యుడని పేర్కొంటారు. ప్రజాసమస్యల పరిష్కారానికై తన అమ్యూల్యమైన కాలాన్ని వెచ్చిస్తారు మంత్రి కన్నా. రెండు శాఖల బాధ్యతలు నిర్వహిస్తున్నా కూడా తన స్వంత నియోజకవర్గంలో పర్యటించేందుకు అధిక ప్రాధాన్యత నిస్తారు. నియోజకవర్గంలోని 112 గ్రామాల్లో అభివృద్ధి నేటికి కన్నా మార్కుకు నిదర్శనంగా మారింది. విద్యార్థి దశలోనే రాజకీయ రంగ ప్రవేశం చేసి కాంగ్రెస్ పార్టీ అనుబంధ సంస్థ ఎన్.ఎస్.యు.ఐ. అధ్యక్షునిగా 1971 నుంచి 1979 వరకు పని



కన్నా లక్ష్మీనారాయణ,
సహకార, రవాణా శాఖమంత్రి

చేసారు. ఆ తర్వాత ఇన్సూరెన్స్ కంపెనీలో డెవలప్‌మెంట్ అధికారిగా 1979 నుంచి 1985 వరకు పని చేసారు. 1985లో గుంటూరు నగర యువజన కాంగ్రెస్ అధ్యక్షునిగా జిల్లాలోని పార్టీ యువతలో ఉత్తేజం కలిగించారు. రాష్ట్ర సేవాదళ్ ఆర్గనైజింగ్ సెక్రటరీగా, లేబర్‌సెల్ అధ్యక్షునిగా పదవులు నిర్వహించారు.

1989నుంచి పెదకూరపాడు నుంచి పోటీ చేసి వరుసగా నాలుగుసార్లు అఖండ మెజారిటీతో గెలుపొందారు. 1991 నుంచి 94 వరకు క్రీడలు, యువజన సర్వీసులు, సహకార శాఖ, కార్మిక శాఖ, ఉపాధిశాఖల మంత్రిగా పనిచేసారు. మరల నేడు సహకార శాఖ, రవాణా శాఖ మంత్రిగా పనిచేస్తూ రాష్ట్ర రైతాంగం అభివృద్ధే ధ్యేయంగా ఆయన పులిచింతల ప్రాజెక్టు నిర్మాణానికి ఎనలేని కృషి చేస్తున్నారు. దివంగత కోట్ల విజయభాస్కర్‌రెడ్డి, నేదురుమల్లి జనార్ధనరెడ్డి, నేటి ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డిల పాలనలో సహచర మంత్రులు పార్టీ నాయకులు అండదండలతో నియోజకవర్గాన్ని పూర్తిస్థాయిలో అభివృద్ధికి శ్రీకారం చుట్టి వివిధ దశల్లో నియోజకవర్గంలో గణనీయమైన పురోగతి సాధించి నియోజకవర్గ ప్రజానీకం హృదయాల్లో చిరస్మరణీయంగా నిలిచారు. నియోజకవర్గంలో దళిత విద్యార్ధులకు అనాడే కోటి రూపాయలకు పైగా నిధులతో ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ బాలుర గురుకుల పాఠశాలలను నిర్మింపజేసి ఆ పాఠశాల నేడు జూనియర్ కళాశాలగా రూపాంతరం చెందింది. నియోజకవర్గంలోని ప్రతి గ్రామంలోను, పంచాయితీ భవనం, పాఠశాల భవనాలుచ కార్యాలయ భవనాలు, అంగన్‌వాడీ భవనాలు, హాస్పిటల్ భవనాలు, కమ్యూనిటీ భవనాలు, అన్ని మండల కేంద్రాల్లో నూతన భవన సముదాయాలను వందల కోట్ల రూపాయల నిధులతో నిర్మించి రాష్ట్రంలోనే పెదకూరపాడు నియోజకవర్గానికి ఒక గుర్తింపు తెచ్చిన వ్యక్తిగా కన్నా లక్ష్మీనారాయణను చెప్పవచ్చు.

నియోజకవర్గంలో రైతాంగం పరిరక్షణే ధ్యేయంగా, వారికి సాగునీరు అందించిన ఘనత ఆయనకే దక్కింది. నియోజకవర్గంలో ఎన్నో త్రాగునీటి సొసైటీలు ఎన్నో ఎత్తిపోతల పథకాలు నిర్మాంచారు. గత సంవత్సరం కోట్లాది రూపాయలతో ముఖ్యమంత్రి వై.ఎస్. పెద్ద ఎత్తున నాగార్జునసాగర్ చివరి భూములు సాగుకు ఎత్తిపోతల పథకాలను నిర్మిస్తున్నారు. ఇవి చివరి దశకు చేరుకున్నాయి. ఒకనాడు అధికారం లేని నాడు నియోజకవర్గంలో దేశం పార్టీ రోడ్లను నిర్మించే నిధుల విషయంలో మొండి చేయి చూపితే రహదారులు అధ్యయనానికి నిదర్శనంగా కలెక్టరేట్ వద్ద ధర్నా నిర్వహించి నియోజకవర్గంలో పాదయాత్రలు జరిపి దేశం వైఫల్యాలను ఎండగట్టారు. ముచ్చటగా మూడోసారి మంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టగానే దశాబ్దాలుగా నిర్లక్ష్యానికి గురైన సత్తెనపల్లి-అమరావతి ఆర్ అండ్ బి రహదారి, క్రోసూరు-అమరావతి రహదారులను కోట్లాది రూపాయల నిధులతో జాతీయ రహదారి స్థాయిలో నిర్మింపజేసారు. నియోజకవర్గంలోని 112 గ్రామాల్లో ప్రజల అవసరాలు గుర్తించి పార్టీలకు అతీతంగా తనను అడిగించే తడవుగా పేద ప్రజలకు అండగా నిలుస్తూ అవకాశం ఉన్నప్పుడల్లా ఇంకా నియోజకవర్గానికే ఎక్కువ సమయం కేటాయిస్తున్నారు.

## 'కన్నా' బయోడేటా

పూర్తిపేరు: కన్నా లక్ష్మీనారాయణ
పుట్టినతేది : 13 ఆగస్టు 1955
జన్మస్థలం : గుంటూరు
భార్య పేరు : విజయలక్ష్మి
విద్యార్హత : ఎం.కాం.
కుటుంబం : ఇద్దరు కుమారులు
కన్నా నాగరాజు-గుంటూరు నగర మేయర్
కన్నా ఫణీంద్ర-ఇంజనీర్
ప్రధానవృతి : ప్రజాసేవ
దినచర్య : ప్రజాసేవ
అభిమాన నాయకులు : రాజీవ్‌గాంధీ, సోనియాగాంధీ
చిరునామా : గోల్డెన్ టవర్స్, పట్టాభిపురం, గుంటూరు
హైదరాబాద్ : సచివాలయం,
రాష్ట్ర సహకార, రవాణా శాఖ మంత్రి కార్యాలయం
ఫోన్స్: 040-23450813(ఆ),
0863 : 2202784(రె), 2355784.

# దక్షిణకాశీ చేజర్ల కపోతేశ్వరాలయం

(ప్రభాతవార్త-నరసరావుపేట) ప్రముఖ శైవక్షేత్రాల్లో ఒకటైన చేజర్ల కపోతేశ్వరాలయం దక్షిణకాశీగా విరాజిల్లుతోంది. గుంటూరుజిల్లా నకరికల్లు మండలం చేజర్ల గ్రామంలోని కపోతేశ్వరాలయం దేశ విదేశాల్లోన్ని భక్తులను ఆకర్షిస్తున్న ప్రముఖ శైవక్షేత్రం. శైవపుణ్యక్షేత్రాలైన కాశీ, ద్రాక్షారామం, శ్రీకాళహస్తి వంటి 22 శైవక్షేత్రాల్లో ఒకటైన కపోతేశ్వరాలయం శతాబ్దాల కిందట నిర్మితమైనది. ప్రతిఏడాది మహాశివరాత్రి మూడవ రోజున స్వామివారి కళ్యాణోత్సవం జరుగుతుంది. చారిత్రక ప్రాధాన్యంతో పాటు పౌరాణిక ప్రాశస్త్యం పొందిన ఈశైవక్షేత్రంలో సంక్రాంతి, దసరా, మహాశివరాత్రి వంటి పండుగలు వైభవంగా నిర్వహిస్తారు. ఈశైవక్షేత్రం నరసరావుపేట నుండి 32కిలోమీటర్లు మరియు అద్దంకి-నార్కెట్‌పల్లి హైవేకు 15కిలోమీటర్ల దూరంలో ఉంది.

## ఆలయ చరిత్ర

ఈఆలయ నిర్మాణం క్రీ.పూ.34వ శతాబ్దంలో జరిగిందనడానికి ఆధారాలు ఉన్నాయి. కుజ విష్ణువర్ధనుడు ఈ ప్రాంతాన్ని పాలించిన సమయంలో చేజర్ల ప్రసిద్ధ నగరంగా వర్ధిల్లింది. ఆలయంలో కన్పించే క్రీ.శ. 1140, 1160, 1247 శాసనాల ఆధారంగా చేజర్ల పేరు చేరుంజర్ల, చేంజర్ల, చేజర్ల అన్నపేర్లతో మార్పుచెందినట్లుగా చరిత్ర చెబుతోంది. ఈశాసనాలన్నీ పాళీ, సంస్కృత, తెలుగు భాషల్లో కన్పిస్తాయి. ఆలయం గుడిసె ఆకృతి విశిష్టమైనదిగా చెబుతారు. ప్రధానదేవాలయం హస్తిపృష్టి ఆకారంలో ఉండి ఇటుక, సున్నంతో నిర్మితమైంది. గర్భాలయ రూపం ఒక ప్రత్యేకతను చాటుతుంది. ముఖభాగాలమీద ఉన్న శిల్పాలు చాలా అరుదైనవి దేశంలో హస్తిపృష్టి ఆకారంలో నిర్మితమైన దేవాలయాల్లో ఒకటి. హస్తిపృష్టి విమానం శాస్త్ర నిర్వచనం



కపోతేశ్వరస్వామి మూలవిరాట్టు

ప్రకారం నిర్మితమైన ఆలయం ఇది ఒక్కటే కావటం విశేషం. కానీ షోలావూర్ నమీపంలోని టెక్కలి గ్రామంలోని త్రివిక్రమ ఆలయం ముమ్మూర్తులా చేజర్ల కపోతేశ్వరాలయాన్ని పోలి ఉంటుంది. దేవాలయానికి ఈశాన్య భాగానా వేదికపై ఆరడుగుల ఎత్తైన విశిష్టమైన దశనహస్ర లింగాకృతి ఉంది. నైరుతి భాగానా సప్తమాతృకల విగ్రహాలు, దక్షిణాన మల్లికాంబ పుష్కరిణి, పశ్చిమాన చెరువులు ఉన్నాయి. ఈపురాతన ఆలయంలో పూర్వకాలంలో ఏడు ప్రాకారాలు ఉండగా అవినేడు శిధిలమై రెండు ప్రాకారాలే ఉన్నాయి. అలాగే కోటి ఒక్కలింగాలు, పురాతన శాసనాలు, బౌద్ధ ఆరామ విశేషాలతో ఆలయం ప్రాధాన్యతను సంతరించుకొంది.

### కపోతేశ్వరస్వామి చరిత్ర

కాశ్మీర దేశాన్ని పరిపాలిస్తున్న శిబి చక్రవర్తి పెద్దతమ్ముడు మేఘాడంబరుడు, రెండో తమ్ముడు జీతమవాహనుడు తీర్థయాత్రచేస్తూ చేరుంజర్ల వచ్చి పర్వతగుహలలో తపస్సు చేస్తూ శివ సన్నిధానం పొంది లింగాకృతి పొంది దేహత్యాగం చేశారట. విషయం తెలుసుకొన్న శిబి చక్రవర్తి తల్లి అనుమతితో చేజర్లలో శతయజ్ఞదీక్ష ప్రారం



ఆలయ ప్రాంగణం

భించాడు. శిబికి సత్యలోక ప్రాప్తి కలిగించే ముందు ఆయన దానశీలతను త్రిమూర్తులు పరీక్షింప దలిచారు. త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు రూపెనగుంట్లలో రూపాలను మార్చుకున్నారు. విష్ణుమూర్తి కపోతంగా (పావురం) బ్రహ్మ డేగగా(గద్ద) ఈశ్వరుడు కిరాతకుని రూపంలోకి వచ్చారు. కిరాతక రూపంలో ఉన్న శివుడు బాణం పావురం పై వదిలాడు శివుడు వేసిన బాణంవల్ల గాయపడిన పావురం నడిచిన ప్రదేశాన్ని కుంకలగుంట అని, దేవతలు విడిది చేసిన ప్రదేశాన్ని విప్పర్ల అని పావురం చేరిన ప్రదేశాన్ని చేరినజర్ల అనగా చేజర్లగా ప్రసిద్ధి పొందాయి. కుంటుకుంటూ వెళ్ళిన పావురం శిబి చక్రవర్తి దగ్గరకు వెళ్ళి శరణుకోరింది. శిబి పావురానికి అభయం ఇచ్చాడు. పావురాన్ని వేటాడుతున్న కిరాతకుడు అక్కడకు చేరుకొని కపోతం తనదని తనకు ఇమ్మని రాజును కోరాడు. అందుకు శిబి అంగీకరించక పావురం ఎత్తు మాంసం తన శరీరం నుంచి కోసి ఇస్తానని, పావురాన్ని రక్షిస్తానని మాట ఇచ్చానని చెబుతాడు. కిరాతకుని రూపంలో ఉన్న శివుడు అందుకు అంగీకరిస్తాడు. అప్పుడు శిబి తన శరీరం నుండి మాంసం తీసి త్రాసులో వేస్తాడు రెండవవైపు పావురాన్ని ఉంచుతాడు. ఎంతమాంసం త్రాసులో వేసినమా సరితూగదు. శిబి చివరకు తన తలనరికి త్రాసులో పెట్టబోగా త్రిమూర్తులు మెచ్చి తమ అసలు రూపాల్లో ప్రత్యక్షమవుతారు. శిబి యొక్కదానశీలతకు మెచ్చి కరుణించి ఏదైనా వరం కోరుకోమని అడుగుతారు. శిబి శివునిలో ఐక్యం పొందాలని కోరాడు. అప్పటినుండి ఈక్షేత్రం కపోతేశ్వరస్వామి క్షేత్రంగా ప్రసిద్దిచెందింది. శిబి చక్రవర్తి లింగాకారాన్ని పొంది శివునిలో ఐక్యం పొంది తన పరివారాన్ని కూడా లింగాలుగా మార్చమని శివుడ్ని వేడుకుంటాడు. శివుడు వారిని కూడా అనుగ్రహించాడు. శిబిచక్రవర్తి పరివారం కోటిలింగాలుగా వెలిశాయి. ఈవిధంగా కపోతాన్ని రక్షించి శిబి లింగాకృతి దాల్చిన లింగానికి కపోతేశ్వర లింగం అని పేరువచ్చింది. దీనికి నిదర్శనంగా ఈ లింగాన్ని ఎవరూ ప్రతిష్ఠించినట్లు కనబడదు. లింగాకృతి చుట్టూ మాంసం తీసినట్లుగా గుంటలు కనబడుతాయి. భుజాలు నరికిన స్థానంలో గుంటలు ఉంటాయి. ఇందులో నీరుపోస్తే మరుసటి రోజుకు దుర్వాసన వస్తుంది. దీనికి కారణం లింగాకృతి ఎముక సంబంధమైనట్లుగా కనబడుతోంది. ప్రాచీన కాలంలో ఒకరు దీనిని పరీక్షించదలచి బ్రాహ్మణులచే వేలకొలది బుంగలతో నీరు పోయించగా మంటలు పొగలు వచ్చాయని ఇక్కడవారు చెబుతుంటారు. ఇక్కడ దొరికిన శాసనాలవల్ల 1163వ సం॥లో కేతురెడ్డి అనే భక్తుడు ఈదేవాలయానికి కొంత దానం ఇచ్చినట్లు తెలుస్తోంది. 1915లో ఈఆలయ ప్రాంగణంలో పేరులేని పెద్దమాను ఒకటి ఉండేదని 12ఏళ్ళకొకసారి కాసేదని కాలక్రమంలో ఒక్కసారిగా మాడిపోయిందని స్థలపురాణంలో ఉంది. ఈ మానుకు ఉన్న తొర్రనుండి గుత్తికొండ, రామేశ్వరం, శ్రీశైలం తదితర పుణ్యక్షేత్రాలకు దారి ఉందని భక్తుల నమ్మకం. గర్భగుడికి ఎదురుగా ఉన్న నందివిగ్రహానికి ప్రత్యేకతలున్నాయని భక్తులు భావిస్తారు. కుడికంటితో స్వామిని వీక్షించే ఈనందీశ్వరాన్ని ప్రత్యేకంగా చెబుతారు. కపోతేశ్వరాలయానికి తూర్పున 1200 అడుగుల దూరంలో క్షేత్రపాలకుడైన ఆంజనేయస్వామి వెనుక పంచలింగాల గుట్టలు ఉన్నాయి. ఆలయ ప్రాంగణంలో శ్రీభద్రకాళీ సహిత వీరభద్రస్వామి ఆలయం ఉంది. దశసహస్ర లింగానికి ఉత్తరంగా కపోతేశ్వరస్వామి కళ్యాణమండపం, ప్రక్కనే సుబ్రహ్మణేశ్వరస్వామి ఆలయం, ఆస్వామి 12 శిరస్సులు కల్గి రాత్రి 12గంటల నుండి తెల్లవారు జామున 3గంటలవరకు శ్రీకపోతేశ్వరస్వామికి గొడుగుపడుతున్నట్లు ప్రతీతి. ఈఆలయానికి శ్రీకృష్ణదేవరాయులు 263 ఎకరాల భూమిని కేటాయించారు. 1950 వరకు ఆలయం నరసరావుపేట జమిందారుల ఆధీనంలోఉంది. ప్రస్తుతం దేవాదాయ ధర్మాదాయ శాఖ అధీనంలో నడుస్తోంది. ఆలయంలోని పురాతన కట్టడాలను కాపాడేందుకు కేంద్ర పురావస్తుశాఖ దేవస్థానాన్ని తనపరిధిలోకి తీసుకొంది. శ్రీకపోతేశ్వరస్వామికి అభిషేకాలు, అర్చనలు తదితర పూజలు ఆలయంలో జరుగుతాయి.

# సుదీర్ఘ చరిత్ర తెనాలి ఘనత

(ప్రభాతవార్త, తెనాలి)

**వివిధ రంగాల్లో విశేష ప్రాచుర్యం పొందిన తెనాలికి 1500 సంవత్సరాల చరిత్ర ఉంది. గతంలో తెనాలికి పశ్చిమహద్దుగా నేటిరామ లింగేశ్వరాలయం ఉండేది. తూర్పున నేడున్న గ్రామకచేరి చావడీ ప్రాంతం. దక్షిణాన మెయిన్‌రోడ్డు, ఉత్తరాన అయి తానగర్ వెళ్లే దారిలోని రజక చెరువు. ఇవే గ్రామకంఠం హద్దులు కూడా. ఈ హద్దుల లోపలి ప్రాచీన గ్రామమే ఒక నాటి తెనాలి.**

ప్రాచీన తెనాలికి సంబంధించి నేడు మిగిలి వున్న దిబ్బమీదనే గోవర్ధనస్వామి, ఆంజనే యస్వామి ఆలయాలున్నాయి. గోవర్ధనస్వామి ఆలయ ప్రాంతమే అప్పట్లో గ్రామ నడిబొడ్డు. గత వైభవ చరిత్రకు దర్పణం. ఈ ఆలయా నికి వాయవ్యంగా గోపాలస్వామి ఆలయాన్ని 17వ శతాబ్దంలో నిర్మించారు. అక్కడున్న పో తురాజు గ్రామదేవత అయివుండొచ్చని చెబు తారు. అయితానగర్ నుండి గాంధీచౌక్‌కు వ చ్చే మార్గమధ్యంలో రామలింగేశ్వరాలయం ఉంది. మిగిలిన పట్టణమంతా 20వ శతాబ్దం లో అభివృద్ధి చెందినదే. 18వ శతాబ్ది చి వర్నుండి గుంటూరుజిల్లా కూడా బ్రిటిష్‌పాల న కిందకు చేరింది. 1774లో మచిలీపట్నం కౌన్సిలు కింద గుంటూరుజిల్లా ఏర్పాటయిం ది. 1850లో కృష్ణాజిల్లాను ఏర్పాటుచేసి గుంటూరు, మచిలీపట్నం జిల్లాలను అందు లో విలీనం చేశారు. 1901లో రేపల్లె నుండి తెనాలిని వేరుచేసి ప్రత్యేక తాలూకాగా ఏర్పా టుచేశారు. 1904లో గుంటూరుజిల్లా ప్ర త్యేకంగా ఏర్పాటయింది. 1909లో తెనాలి పంచాయతీ మునిసిపాలిటీగా ఆవిర్భవించిం ది. 1965లో స్పెషల్‌గ్రేడ్ హోదాను సంత రించుకొంది. గుంటూరుజిల్లాలోమరే మునిసి పాలిటీకి లేనన్ని ప్రత్యేకతలతో ఈ పట్టణం విరాజిల్లుతోంది.





తెనాలి మునిసిపల్ కార్యాలయం అమరవీరుల స్థూపాలు (ఎడమ)

### జాతీయోద్యమంతోనే గుర్తింపు

బ్రిటిష్ దాస్యశృంఖాలను తెంచుకొని స్వే చ్ఛ కోసం సాగించిన స్వరాజ్య ఉద్యమంతోనే తెనాలికి జాతీయస్థాయి గుర్తింపు లభించింది. 1920-47 మధ్యకాలంలో జాతీయోద్యమా నికి తెనాలిలో అపూర్వస్పందన లభించింది. దేశభక్తి ప్రేరణతో ఆస్తులను సైతం త్యాగం చేసి స్వారాజ్యసాధనే ధ్యేయంగా ఉద్యమించి అసువులు బాశారు. మరెంతోమంది జైలు జీ వితం గడిపారు. హోమ్ రూల్ ఉద్యమంలో భాగంగా ఇక్కడ 1920లోనే జాతీయ పారశా లను ఆరంభించారు. విదేశీవస్తు బహిష్కరణ, ఉప్పుసత్యాగ్రహంలో ఎందరో ఉప్పొంగిన ఉ త్సాహంతో పాల్గొన్నారు. జైలుపాలయ్యారు. 1931లో గాంధీ-ఇర్విన్ ఒడంబడిక సం దర్భంగా వీరందరిని జైలునుండి విడుదల చే శారు. దీనికి గుర్తుగా అ సంవత్సరమే తెనాలి లో గాంధీఇర్విన్ పార్కును ఏర్పాటుచేశారు. 1929 ప్రాంతంలోనే గాంధీ తెనాలిని సంద ర్శించారు. 1932 జూన్/జులైలో శాసనో ల్లంఘనల సభల సందర్భంగా ప్రభుత్వం ఇక్కడివారు 104 మందిని అరెస్టుచేసింది. 1940లో మరెంతోమంది స్వచ్ఛంధంగా అరెస్టయ్యారు. క్విట్‌ఇండియాఉద్యమంలో 1942 ఆగస్టు 12న ప్రజా ఆందోళన, పో లీసు బలగాలతో ముఖాముఖి పోరాటం, రై ల్వేస్టేషను దగ్ధం వంటి వరుస సంఘటనల తో తెనాలి అట్టుడుకిపోయింది. ఈ పోరాటం లో పోలీసు కాల్పులకు ఏడుగురు మృతిచెం దారు. ఎందరినో అరెస్టుచేసి ప్రత్యేక కోర్టులో విచారించి శిక్షలు విధించారు. ఇవి చాలవన్న ట్టు తెనాలి ప్రజలపై రెండులక్షల అపరాధ ప న్ను విధించారు. ఈ తెనాలి పోరాటం అప్ప టి జాతీయదృష్టిని ఆకర్షించటమే కాకుండా అప్పటి బ్రిటిష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్, సింగపూర్‌లో ఉన్న నేతాజీ ప్రత్యేకంగా అడిగి తెలుసుకొన్నారు. బెర్లిన్, టోక్యో రేడియోలు ఈ సంఘటనవివరాలను ప్రసారం చేశాయి. జాతీయోద్యమంలో అతివాద కార్యకలాపాలు పెరిగిన ప్రభావంతో తెనాలినుండి కూడా చుక్కపల్లి రామయ్య, బసవయ్య, బ్రహ్మయ్య అనేవారు కొబ్బరికాయ బాంబుతో రైల్వేలైను పేల్చివేసేందుకు ప్రయత్నించటంతో వారిపై కుట్రకేసు నమోదుచేసి అండమాన్‌జైలుకు పంపారు.

### జిల్లా కాంగ్రెస్‌కు కేంద్రంగా..

ఆంధ్రలో జరిగిన ఉద్యమాల్లో గుంటూరు జిల్లా అగ్రగామిగా ఉంటే అందులో తెనాలి అ గ్రస్థానంలో ఉండటంతో 1934 సెప్టెంబరు లో జిల్లా కాంగ్రెస్ కార్యాలయాన్ని తెనాలికి తరలించారు. రామలింగేశ్వరాలయం వెనుక బజారులోని వెర్రెయ్యగారి మేడలో జిల్లా కాం గ్రెస్ కార్యాలయాన్ని ఏర్పాటుచేశారు. ఉమ్మడి మద్రాసు ప్రభుత్వంలో మంత్రిగా చేసిన, ఈ ప్రాంత తిరుగులేని నాయకుడు కల్లూరి చంద్ర మౌళి తొలి అధ్యక్షుడిగా నియమితుల య్యారు. స్వాతంత్ర్యోద్యమ దీపికగా వె లుగొందిన 'జైహింద్' పత్రిక తెనాలి నుండి ప్రచురితమైంది. 1936 అక్టోబరు 19న క ల్లూరి చంద్రమౌళి అధ్యక్షతన తెనాలిలో జరిగి న బహిరంగసభలో జవహర్‌లాల్ నెహ్రూ పా ల్గొన్నారు. ఆ తర్వాత సంవత్సరం జరిగిన శాసనసభ ఎన్నికల్లో జిల్లాలోని అన్ని శాసనస భాస్థానాలను కాంగ్రెస్ గెలుచుకొంది. ఇందు కు. జిల్లా కాంగ్రెస్ కార్యాలయం కృషి ప్ర శంసకు నోచుకొంది. 1940లో కాంగ్రెస్ ఆ ధ్వర్యంలో వాలంటీర్ల శిక్షణ శిబిరం నేటి హి ందీ ప్రేమీమండలిలో జరిగింది. ఈ విద్యాల యానికి గాంధీజీ కూడా ఒకపర్యాయం వ చ్చారు. ఆయన పతాకావిష్కరణ చేసిన రంగూన్ టేకుస్తంభం ఇప్పటికీ అక్కడవుంది. 1945లో ఆంధ్ర అసెంబ్లీ కాంగ్రెస్ కల్లూరి

■ మిగతా 32లో

# 'ప్రగతి బాట'లో పొన్నూరు పురపాలక సంఘం



డాక్టర్ వై.ఎస్.రాజశేఖర రెడ్డి గారు, ముఖ్యమంత్రి



శ్రీ కోనేరు రంగారావు గారు, మున్సిపల్ శాఖా మంత్రి



శ్రీ ధర్మాన ప్రసాదరావు గారు రెవిన్యూశాఖామంత్రి



శ్రీ కన్నా లక్ష్మీ నారాయణ గారు, రాష్ట్ర సహకార శాఖా మంత్రి



శ్రీమతి డి.పురంధరేశ్వరి గారు, ఎం.పి, బాపట్ల



శ్రీ జె.డి.శీలం గారు, రాజ్యసభ సభ్యులు



శ్రీ గుడిబండి వెంకటరెడ్డి గారు, శాసన సభ్యులు



శ్రీ ధూళిపాళ్ల నరేంద్ర కుమార్ గారు, శాసన సభ్యుల, పొన్నూరు



శ్రీమతి ఎస్.మాతీ[illegible] గారు, ఛైర్‌పర్సన్, పొన్నూరు



శ్రీ కె.వెంకటేశ్వర రావు గారు, కమిషనర్, పొన్నూరు

### పొన్నూరు పురపాలక సంఘం గత 15నెలలో సాధించిన ప్రగతి

(1) రూ.200.00లక్షలు ప్రత్యేక నిధులతో 22పనులు అనగా రహదారులు మరియు కాలువల నిర్మాణం

(2) ఐ.డి.ఎస్.ఎం.టి.పథకము: రూ.352.00లక్షలలో రెండు వర్తక సముదాయములు, పది రహదారులు, రెండు పార్కులు,3 స్మశాన వాటికలు అభివృద్ధి పనులు మంజూరు

(3) జాతీయ మురికివాడల అభివృద్ధి పథకము(ఎన్.ఎస్.డి.పి): రూ.13.50లక్షలలో 8 రహదారుల నిర్మాణము

(4) సాధారణ నిధులు:రూ.64.10లక్షలలో రహదారులు, కాలువలు, వంతెనలు మొదలగు పనుల నిర్మాణము

(5) మంచినీటి సరఫరా పథకము:మిగులు నిధులలో రూ.11.00లక్షలతో ఎస్.ఎస్.ట్యాంకు చుట్టూ కంచె మరియు రూ.45.00లక్షలతో 800కె.ఎల్.సామర్థ్యంగల ఉపరితల రిజర్వాయర్ పనుల నిర్మాణము

(6) పేద ప్రజలకు రూ.1200కే 500 మంచినీటి కుళాయిల మంజూరు

(7) ఐ.ఎల్.సి.ఎస్.పథకం: (ఎ)ఫేస్..2 క్రింద 2436 యూనిట్ల నిర్మాణం. (బి)ఫేస్..3 క్రింద 2000యూనిట్ల లక్ష్యంగా రూ.99.00లక్షల ప్రాజెక్టు రిపోర్టు ప్రతిపాదన

(8) స్వర్ణజయంతి షహరి రోజ్‌గార్ యోజనే పథకం(స్వయం ఉపాధి పథకములు):

(ఎ) 31 పొదుపు సంఘాల సభ్యులకు ఒక్కొక్కరికి రూ.1,000 చొప్పున 6.02లక్షలు మంజూరు చేయడమైనది.

(బి) అర్హులైన మహిళా గ్రూపులకు పావలా వడ్డీకి రుణ సదుపాయం కలుగచేయుట.

(సి) పట్టణ ప్రాంత స్వయం ఉపాధి పథకం క్రింద 134 మందికి వివిధ యూనిట్లు స్థాపించుటకుగాను రూ.12.89లక్షలు సబ్సిడీతో రుణం మంజూరు చేయడమైనది.

(డి) శిక్షణా కార్యక్రమం క్రింద టైలరింగ్, ఎంబ్రాయిడరీ, కంప్యూటర్ కోర్సు మొదలుగువాని యందు శిక్షణకై 306మందికి గాను రూ.6.12లక్షలు మంజూరు కాబడినవి.

(ఇ) వితంతు పెన్షన్ పథకం ద్వారా నెలకు రూ.50 చొప్పున 73మందికి ప్రతి నెల మంజూరు చేయబడుచున్నవి.

(ఎఫ్)జాతీయ వృద్ధాప్య పెన్షన్ పథకం క్రింద ఒక్కొక్కరికి రూ.100 చొప్పున 822 మందికి ప్రతి నెల మంజూరు చేయబడుతున్నవి.

(జి) వికలాంగుల పెన్షన్ పథకం ద్వారా నెలకు రూ.75చొప్పున 122 మందికి ప్రతి నెలా మంజూరు చేయబడుచున్నవి.

(హెచ్)జాతీయ కుటుంబ ప్రయోజన పథకం క్రింద 108మంది లబ్ధి పొందారు.

(ఐ) 45 మహిళా పొదుపు సంఘాల క్రింద రివాల్వింగ్ ఫండ్ రూ.5,94,000 పంపిణీ చేయుట జరిగింది.

(జె) దీపం పథకం క్రింద డ్వాక్రా గ్రూపు సభ్యులకు 501మంది గ్యాస్ కనెక్షన్ కొరకు దరఖాస్తులు చేయగా ఇప్పటి వరకు 462 మందికి పంపిణీ చేయడం జరిగింది.

(9) పారిశుద్ధ్యం(డోర్..డోర్ సిస్టమ్):

(ఎ) పట్టణంలో ఇంటింటికీ జీరో గార్బేజి పథకం అమలు.

(బి) జీరో గార్బేజి పథకం క్రింద ఇంటింటికీ ప్లాస్టిక్ డస్ట్‌బిన్‌ల సరఫరా రిక్షాల ద్వారా గార్బేజి తొలగింపు.

(10) రాజీవ్ యువశక్తి పథకము:

రాజీవ్ యువశక్తి పథకం క్రింద మొదటి విడతగా బ్యాంకుల ద్వారా 36మంది లబ్ధిపొందారు.

(బి) రెండవ విడతగా 49మందికి ప్రభుత్వం నుంచి మంజూరు.

(11) గృహ నిర్మాణము:

(ఎ) రాజీవ్ గృహకల్ప పథకం క్రింద 500 గృహాల మంజూరు.

(బి) వాంబే పథకం క్రింద 564 గృహాలు మరియు శాశ్వత గృహ నిర్మాణం క్రింద 576 గృహాలు మంజూరు.

(సి) రేషన్ కార్డులు:2200.

(డి) అంత్యోదయ:462.

(ఇ) అన్నపూర్ణ:35.

(ఎఫ్) ఆగస్టు 15న 391 మంది లబ్ధిదారులకు రూ.26,75,000 విలువ కలిగిన ఉపకరణముల పంపిణీ

| | | |
|---|---|---|
| పత్తెళ్ళ లక్ష్మీకుమారి, కౌన్సిలర్, ఒకటవ వార్డు. | వేల్పూరి రాంప్రసాద్, , కౌన్సిలర్, 2వ వార్డు. | కనిగుంట్ల అప్పయ్య, కౌన్సిలర్, 3వ వార్డు. |
| షేక్ నూర్జహాన్, కౌన్సిలర్, 4వ వార్డు. | షేక్ జానీభాషా, కౌన్సిలర్, 5వ వార్డు. | ముద్దన నళినీ దేవి, వైస్ ఛైర్‌పర్సన్, 6వ వార్డు. |
| యర్రంశెట్టి పద్మ, కౌన్సిలర్,7వ వార్డు. | యేమినేని శివరామకృష్ణ, కౌన్సిలర్,8వ వార్డు. | మూకిరి శ్రీనివాసరావు, కౌన్సిలర్,9వ వార్డు. |
| యేమినేని దీన దయావళి, కౌన్సిలర్,10వ వార్డు. | మాచవరం కృష్ణవేణి, కౌన్సిలర్, 11వ వార్డు. | వల్లూరి రవీంద్రబాబు, కౌన్సిలర్,12వ వార్డు |
| ఎద్దు సోంబాబు, కౌన్సిలర్,13వ వార్డు. | పగడాల స్థానక బాబు, కౌన్సిలర్,14వ వార్డు. | తాడిశెట్టి శివకుమారి, కౌన్సిలర్,.15వ వార్డు. |
| మీనుగ సుబ్బారావు, కౌన్సిలర్,16వ వార్డు | పిన్నమనేని కోటేశ్వరరావు, కౌన్సిలర్,17వ వార్డు. | దేవరపాటి శ్రీనివాసరెడ్డి, కౌన్సిలర్,18వ వార్డు. |
| పొద్దుటూరి శాంతమ్మ, కౌన్సిలర్,19వ వార్డు. | సయ్యద్ రబ్బాని, కౌన్సిలర్,20వ వార్డు. | షేక్ షాహీదున్నీసా, కౌన్సిలర్,21వ వార్డు. |
| గుంపుల ప్రసన్న, కౌన్సిలర్,22వ వార్డు. | తాడికొండ అంకమ్మ, కౌన్సిలర్,24వ వార్డు. | షేక్ బాబావళి, కౌన్సిలర్,25వ వార్డు. |
| పడమటి ఈశ్వరమ్మ, కౌన్సిలర్,26వ వార్డు. | షేక్ జాకీర్ హుస్సేన్, కౌన్సిలర్, 27వ వార్డు. | నాగసూరి చినవెంకటేశ్వర్లు, కౌన్సిలర్,28వ వార్డు. |
| మహమ్మద్ మస్తాన్, కౌన్సిలర్,29వ వార్డు. | శెట్టి విజయలక్ష్మి, కౌన్సిలర్,30వ వార్డు. | యరసాని వెంకట్రావు, కౌన్సిలర్, 31వ వార్డు |

31

# వార్తకు 10వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

10 A Glorious Decade



శ్రీమతి సోనియాగాంధి
ఎఐసిసి అధ్యక్షురాలు

డా॥ వై.యస్.రాజశేఖర్ రెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు

శ్రీ కె.కేశవరావు
పిసిసి అధ్యక్షులు



దశాబ్దికాలంగా లక్షలాది
పాఠకుల మన్ననలు పొందిన
వార్త 10వ వార్షి కోత్సవం
సందర్భముగా
యాజమాన్యానికి, సిబ్బందికి
నా హృదయపూర్వక
శుభాకాంక్షలు

**మాదా రాధాకృష్ణమూర్తి**

■ 30వ పేజీ తరువాయి

చంద్రమౌళి అధ్యక్షుడిగా తెనాలిలోనే ఏర్పాటయింది. కార్యదర్శిగా నీలం సంజీవరెడ్డిని ఎన్నుకున్నారు.

కమ్యూనిస్టు ఉద్యమంలో సైతం..

కమ్యూనిస్టు ఉద్యమానికి సైతం తెనాలి కేంద్రబిందువుగా ఉండేది. జిల్లాలో మొదటగా ఏర్పాటయిన కమ్యూనిస్టు పార్టీ శాఖల్లో తెనాలి ఒకటి. చంద్ర రాజేశ్వరరావు, పలుపుల శివయ్య పార్టీకి పునాదులు వేస్తే మాకినేని బసవపున్నయ్య, వెనుటూరు హనుమంతరావు, లావు గంగాధరరావు, కొరటాల సత్యనారాయణ, పండితారాధ్యుల మల్లిఖార్జున శర్మ, ముత్తేవి మాధవాచార్య, రావి అమ్మయ్య ప్రభృతులు ఉద్యమ నిర్మాణంలో ప్రముఖపాత్ర వహించారు. జిల్లా పార్టీ కార్యాలయ ఉద్యమం తెనాలిలోనే సాగింది. తెలంగాణా సాయుధ పోరాటంలో తెనాలిలో తీవ్ర నిర్బంధం సాగింది. వీటిని తట్టుకొని 'మా భూమి' నాటకాన్ని ప్రదర్శించారు. ఉమ్మడి కమ్యూనిస్టు ఉద్యమం నుండి భారత కమ్యూనిస్టు పార్టీ మార్క్సిస్టు పేరు ప్రకటించింది తెనాలిలోనే. 1964లో పార్టీ ప్లీనరీ సమావేశాలు చెంచుపేటలోని రైస్‌మిల్లు ఆవరణలో జరిగాయి. ముజ్‌ఫర్ అహ్మద్, సూర్జిత్, జ్యోతిబసు, ఎ.కె.గోపాలన్, సుందరయ్య వంటి యోధులు పాల్గొన్నారు.

# సుదీర్ఘచరిత్ర తెనాలి ఘనత

**కాకలు తీరిన రాజకీయ యోధుల నిలయం**

తెనాలి పట్టణం ఎందరో రాజకీయ యోధులకు పుట్టినిల్లు. మునిసిపల్ రాజకీయాల్లో కాకలు తీరిన రాజకీయ నేతలు ఇక్కడ ఉద్భవించారు. తెనాలి మునిసిపల్ చైర్మన్‌గా రాజకీయ జీవితానికి నాందిపలికి నీలం సంజీవరెడ్డి మంత్రివర్గంలో రాష్ట్ర పురపాలక, దేవాదాయశాఖల మంత్రిగా పనిచేసిన ఆలపాటి వెంకట్రామయ్య పట్టణానికి చిరస్మరణీయ సేవలందించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రాణాలు కోల్పోయిన ఏడుగురు చనిపోయిన ప్రాంతంరణరంగచౌక్‌లో ఆ ఏడుగుర్ని స్మారకార్థం అమరవీరుల స్థూపాలను ఆయన హయాంలోనే నిర్మింపజేశారు. మునిసిపల్‌కార్యాలయ భవనం, ఓవర్‌బ్రిడ్జి నిర్మాణం, భూగర్భ మురుగునీటి పారుదల పథకానికి ఆమోదం, రక్షత మంచినీటి పథకానికి నిధుల విడుదల ఆయన హయాంలోనే జరిగాయి. ఆయనకు సమవుజ్జీగా తన ప్రత్యేకతను చాటుకుంటూ రాజకీయవేత్తగా గుర్తింపు పొందిన నన్నపనేని వెంకట్రావు మునిసిపల్‌చైర్మన్‌గా సిమెంటురోడ్లను నిర్మించారు. పేదల పూరిళ్లపై పన్ను రద్దుచేశారు. పట్టణ మాస్టర్‌ప్లానును రూపొందించారు. అంతకుపూర్వం కవిరాజుగా గణతికెక్కిన సంస్కరణోద్యమ సారధి త్రిపురనేని రామస్వామి చౌదరి మునిసిపల్‌చైర్మన్‌గా ఉన్నపుడు గాంధీ మునిసిపల్ కూరగాయల మార్కెట్ ఏర్పాటయింది. జాతర్లలో జంతుబలుల్ని ఆయన నిషేధించారు. హేతువాద భావాల ప్రచారం కోసం తెనాలిలో సూతాశ్రమం స్థాపించారు. 1987లో వీరి శతజయంతి సందర్భంగా ప్రభుత్వం తపాలాబిళ్లను విడుదల చేసింది. మునిసిపాలిటీకి తొలి చైర్మన్ రావు బహద్దూర్ చెమిటిగంటి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, పిల్లలమర్రి ఆంజనేయవంతులు, వేదాంతం లక్ష్మీనారాయణ, బలిజేపల్లి సీతారామశాస్త్రి, రావి సత్యనారాయణ, జనాబ్ షేక్ అబ్దుల్ వహాబ్ సాహెబ్ బహద్దూర్, ఆవుల గోపాలకృష్ణమూర్తి తెనాలి మునిసిపల్ చైర్మన్లుగా పనిచేసిన ప్రముఖులు. తెలుగుదేశం ఆవిర్భావంతో ఆ పార్టీ తరపున పోటీచేసిన అన్నాబత్తుని సత్యనారాయణ సాహసోపేత నిర్ణయాలతో ఆక్రమణల్ని తొలగించి వీధుల్ని విశాలం చేశారు. అనంతరం డాక్టర్ రావి రవీంద్రనాథ్ రెండు పర్యాయాలు మునిసిపల్‌చైర్మన్‌గా పనిచేసి

■ మిగతా 34లో

# పిలిస్తే పలికేదేవుడు బుగ్గమల్లేశ్వరుడు

(ప్రభాతవార్త, మాచవరం)

గత కొన్నేళ్ళుగా ఆలనా పాలనా లేక భక్తుల ఆలనకు నోచుకోక అధ్వాన్నస్థితిలో వున్న గుంటూరు జిల్లా మాచవరం మండలం మోర్జంపాడు గ్రామ సమీపాన అడవిలో వున్న శ్రీ బుగ్గమల్లేశ్వరస్వామి దేవాలయం గత నాలుగు సంవత్సరాలుగా భక్తుల రాకపోకలతో కళకళలాడుతోంది. ఎంతో ప్రసిద్ధి చెందిన ఐదువందల ఏళ్ళనాడు ఇక్కడ వెలసిన శ్రీ బుగ్గమల్లేశ్వరస్వామివారి ఆలయానికి వెళ్లాలంటే సరైన రహదారి మార్గంలేక భక్తులు నానా ఇబ్బందులు ఎదుర్కొంటూ అడవిలో కాలినడకన వెళ్ళి స్వామివారిని దర్శించుకుంటుండేవారు. పిడుగురాళ్ళ, మోర్జంపాడు గ్రామాలకు చెందిన కొందరు వ్యాపారులు స్వామివారి గుడికి వెళ్ళేందుకు మోర్జంపాడు నుంచి సుమారు 4 కిలోమీటర్ల దూరం వాహనాల రాకపోకలకు అనువుగా రహదారిని ఏర్పాటు చేశారు. దీంతో గత మూడు సంవత్సరాల నుంచి జిల్లాలోని పలుప్రాంతాలలోని భక్తులు కార్తీకపౌర్ణమి, తొలిఏకాదశి, మహాశివరాత్రి పర్వదినాలతో పాటు పవిత్ర దినాలలో భక్తులు పెద్దఎత్తున అభిషేకాలు, పూజలు జరుపుతూ మొక్కుబడులు తీర్చుకుంటున్నారు.



మోర్జంపాడు గ్రామానికి ఈశాన్య దిక్కున 4 కిలోమీటర్ల దూరంలో అడవి ప్రాంతంలో క్రీస్తు పూర్వం 500 ఏళ్ళ క్రితం స్వామివారు వెలిశారని ప్రతీతి. ఆలయ ప్రహరీగోడల లోపల సుమారు ఎకరం విస్తీర్ణం మధ్య శ్రీ బుగ్గమల్లేశ్వరస్వామివారి గర్భాలయం, అంత్రాలయం నిర్మించబడివుంది. ముందుభాగాన 16 స్తంభాలతో కట్టబడిన విశాల ముఖమండపం విరాజిల్లుతోంది. గర్భాలయంలో శివలింగాన్ని ఆనుకొని గజం కొలతగల ఒక నీటిబుగ్గ వుంది. అందువల్లనే ఈ పరిసర ప్రాంతప్రజలు స్వామివారిని బుగ్గమల్లేశ్వర స్వామి... బుగ్గమల్లయ్య...అని తదితర పేర్లతో పిలుస్తుంటారు. ఇక్కడ విశేషమేమిటంటే ఈ బుగ్గలోని నీరు అన్నికాలాల్లో వుండటమే. గర్భాలయంలోకి సూర్యరశ్మి సోకకపోయినా ఆ బుగ్గలోని నీరు చెడకుండా మధురంగా వుంటుంది. ఈ ప్రాంగణంలోని శ్రీ వీరభద్రస్వామి, భద్రకాళి అమ్మవార్ల దేవాలయాలు పడిపోగా అప్పట్లో ఆ విగ్రహాలను కూడా ఈ దేవాలయంలో చేర్చారు. బుగ్గమల్లేశ్వరస్వామి వారికి ఉత్తరంగా వృద్ధ మల్లేశ్వరస్వామి శ్రీశైలంలో వలె వాయువ్యాన ఎత్తైన ప్రదేశంలో శ్రీ భ్రమరాంబ అమ్మవారు వున్నారు. దక్షిణం వైపున శ్రీ సీతారామస్వామి ఆలయం, దానికి ఎదురుగా ప్రాకారం వెలుపల శ్రీ ఆంజనేయస్వామి ఆలయం వుంది. సీతారామస్వాముల ఆలయంలో విగ్రహాలు దేవాలయ ద్వారశాఖల యందు చిత్రించిన ద్వారసాలులను బట్టి పీఠం అడుగున గరుడు వుండటం వల్ల అది విష్ణు సంబంధమైన గుడి అని అవగతమవుతోంది. బ్రహ్మదూత శ్రీ రామానంద సరస్వతి, శ్రీ బెల్లంకొండ స్వామివారు ఈ దేవాలయాలను చూసి ఇవి రుషి ప్రతిష్ఠలనియు, తపస్సు చేసుకొనువారలకు అనుకూల ప్రదేశ మనియు, శివకేశవులు ఒకే ప్రాకారంలో వుండటం వల్ల గొప్ప పుణ్యక్షేత్రమని వారు భక్తులకు తెలియపరిచినట్లు తెలుస్తోంది.

రుషులు తపస్సు చేసుకున్న పర్ణశాల చిహ్నములు నేటికీ ఇక్కడ ఉన్నాయి. ఈ దేవాలయానికి రెండు కిలోమీటర్ల దూరంలో ఉత్తరం వైపున కృష్ణానది ప్రవహిస్తూ వుంటుంది. రుషులు ఇక్కడ స్నానమాచరించి తపస్సు చేసుకున్నారని ప్రతీతి.

# సుదీర్ఘ చరిత్ర తెనాలి ఘనత

■ 32వ పేజీ తరువాయి

మురికివాడల్లో అభివృద్ధి పనులు చేసిన ఘనతను నిలుపుకొన్నారు. ఇటీవలే పదవీకాలం ముగిసిన చైర్మన్ యడ్ల గంగాధరరావు మునిసిపాలిటీకి జవజీవాలు కల్పించటానికి పన్నులు పెంచటం ద్వారా ఆదాయాన్ని పెంచారు. ఆయన హయాంలో గతంలో ఎన్నడూ లేనివిధంగా కోట్ల రూపాయల నిధులు మునిసిపాలిటీకి వచ్చాయి. కోట్లాది రూపాయల అభివృద్ధి పనుల్ని చేపట్టారు. ఇకపోతే అంతకుముందు చైర్‌పర్సన్‌గా పనిచేసిన ఆలమూరి విజయలక్ష్మికుమారి తొలి మహిళా చైర్‌పర్సన్‌గా గుర్తింపు పొందారు. అంతేకాదు 96 ఏళ్ల మునిసిపల్ చరిత్రలో ఏకైక మహిళా చైర్‌పర్సన్ కూడా! వీరిలో ఆలపాటి వెంకట్రామయ్య, నన్నపనేని వెంకట్రావు(పొన్నూరు), అన్నాబత్తుని సత్యనారాయణ, డాక్టర్ రావి రవీంద్రనాధ్ మునిసిపల్‌చైర్మన్లుగా చేసి రాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యారు. వీరిలో ఆలపాటి వెంకట్రామయ్య, అన్నాబత్తుని సత్యనారాయణ మంత్రులుగా పనిచేశారు. రాష్ట్ర రాజకీయాల్లో తనదైన ప్రత్యేకత కలిగిన యోధుడు, మాజీ ముఖ్యమంత్రి నాదెండ్ల భాస్కరరావు, ప్రస్తుత రాష్ట్ర ఆర్థికమంత్రి కొణిజేటి రోశయ్య, సీనియర్ నాయకుడు, రాజ్యసభ మాజీ సభ్యుడు యడ్లపాటి వెంకట్రావు, కేంద్ర మాజీమంత్రి డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు, డిప్యూటీ స్పీకరు, హోంశాఖతో సహా పలు మంత్రిపదవుల్ని అధిష్టించిన దివంగత ఆలపాటి ధర్మారావు, మాజీ ఎం.పి ప్రముఖ సినీనటి టి.శారద, ప్రస్తుతం తెలుగుదేశం అధికారప్రతినిధి, మాజీమంత్రి నన్నపనేని రాజకుమారి, మాజీ ఎమ్మెల్యే డాక్టర్ గోగినేని ఉమ, ప్రస్తుత ఎం.పి వల్లభనేని బాలశౌరి, ఎమ్మెల్యే నాదెండ్ల మనోహర్ వంటి వారిలో ఎందరో ఇక్కడనుండి రాజకీయ నేతలుగా రాణించినవారున్నారు. వీరిలో కొందరికి తెనాలి రాజకీయ పాఠశాల అయింది.



డాక్టర్ తాడిబోయిన మస్తానమ్మ, చైర్‌పర్సన్

## వెయ్యేళ్లుగా సాహిత్య ప్రగతి

'రసభారతి వాగ్దేవి/ ప్రసన్నతం బడిసి రసిక పండిత సుకవి/ ప్రసుర ప్రశంసలందుచు/ నెసగుల యాచంద్ర పద్మహితము తెనాలిన్' – 'తెనుగులెంక' తుమ్మల సీతారామమూర్తి. తెనాలి సాహిత్య ప్రగతి వెయ్యేళ్లనుంచి సాగుతోంది. నాటి తెనాలి రామకృష్ణకవి నుండి ప్రసిద్ధ పండితులు, కథకులు, నవలా రచయితలయిన అబ్బూరి రామకృష్ణారావు, పండిత గోపదేవుడు, చలం, కొడవటిగంటి, గోపీచంద్, కొండూరు వీరరాఘవాచార్యులు, సంజీవదేవ్, ఖులుసు సూర్యప్రకాశశాస్త్రి, ఆలూరి బైరాగి, శారద, రావూరి భరధ్వాజ, తాళ్లూరి సత్యనారాయణ, బొల్లిముంత శివరామకృష్ణ, జి.వి.కృష్ణరావు, ధనికొండ గోఖలే, కె.శివారెడ్డి, నగ్నముని, అత్తోట రత్నకవి, మోదుకూరి జాన్సన్, నూతక్కి అబ్రహాం, వాణీ రంగారావు, వల్లూరి శివప్రసాద్, ఎం.డి.సౌజన్య తెనాలి నుండే సాహిత్య కృషిని సాగించారు. పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి, అభ్యుదయ రచయితల ప్రథమ, స్వర్ణోత్సవ సభలకు తెనాలి వేదికగా నిలిచింది. విరసంలో తెనాలికి బలమైన స్థానం ఉంది. సాహితీ సమితికి ప్రధాన కేంద్రం కూడా. అప్పట్లోనే జ్యోతి, నగారా, రేరాణి, అభిసారిక, సమీక్ష పత్రికలు తెనాలి నుండి వచ్చాయి. ఆలపాటి రవీంద్రనాధ్ గొప్ప ప్రచురణకర్తగా గుర్తింపుపొందారు. ఎందరో రచయితలను తయారుచేశారు.

కళలకు పుట్టినిల్లుతెనాలి

తెనాలి పట్టణం ఆంధ్రాప్యారిస్‌గా గుర్తింపు రావటానికి కళలుదోహదపడ్డాయని నానుడి ఉంది. కళలకు పుట్టినిల్లుగా తెనాలిని పిలుస్తారు. కళారంగం తెనాలి మొదలైన 1904 సంవత్సరం నుండి ఇప్పటి వరకు 1500 మంది రంగస్థల నటీనటులు వెలుగుచూశారు. వీరిలో 400 మంది ప్రముఖులుగా గుర్తింపుపొందారు. గోవిందరాజుల సుబ్బారావు, స్థానం నరసింహారావు, పులిపాటి సోదరులు, టి.రామకృష్ణశాస్త్రి, ఆకుల వెంకయ్య, వేమూరి రామయ్య, ముదిగొండ లింగమూర్తి, అబ్బూరి వరప్రసాదరావు, వల్లూరి వెంకట్రామయ్యచౌదరి, కళ్యాణి, దాసరి కోటిరత్నం, బుర్రా జయలక్ష్మి, లక్ష్మిరాజ్యం, తారాబాయి, విజయలక్ష్మి, సీనియర్ శ్రీరంజని, స్వరాజ్యలక్ష్మి, సభారంజని, శేషమాంబ వంటివారు ఎందరో. రాష్ట్రంలో తొలి స్త్రీ కళాకారిణి తెనాలికి చెందిన కాంచనమాల. కేవలం తెనాలి పట్టణంలోనే 130 నాటక సమాజాలు పనిచేశాయి. 1929లోనే ఇక్కడ ఆంధ్ర నాటక కళాపరిషత్ ఆవిర్భవించింది. సురభి నాటక సమాజం

## మున్సిపల్ చైర్మన్లు



1-చెమిటిగంటి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి 2-పిల్లలమర్రి అంజనేయులు, 3-త్రిపురనేని రామస్వామి 4-బలిజేపల్లి సీతారామశాస్త్రి 5-రావి సత్యనారాయణ 6-జనాబ్ షేక్ అబ్దుల్ వహాబ్‌సాహెబ్ బహదూర్ 7-వేదాంతం లక్ష్మీనారాయణ 8-నన్నపనేని వెంకట్రావు 9-ఆవుల గోపాలకృష్ణమూర్తి 10-ఆలపాటి వెంకట్రామయ్య 11-తవ్వా శ్రీరాములు 12-అన్నాబత్తుని సత్యనారాయణ 13-డాక్టర్ రావి రవీంద్రనాధ్ 14-ఆలమూరి విజయలక్ష్మీకుమారి 15-యడ్ల గంగాధరరావు

వారు 1966లో ఇక్కడే స్వంతంగా హాలు ఏర్పాటు చేసుకొని మూడునెలలపాటు ప్రదర్శనలు ఇచ్చారు. ప్రముఖ నృత్యకారిణి బిక్షావతి బర్మా, రంగూన్, శ్రీలంకలో నృత్యప్రదర్శనలు ఇచ్చారు. వీరి పేరిట తెనాలిలో ఒక వీధికి నామకరణం చేశారు. తెనాలి ప్రాంతం నుండి సినిమాల్లోకి ప్రవేశించిన నటీనటులు, రచయితలు, నేపధ్యగాయకులు, సాంకేతికశాఖల్లోనను 130 మందికి పైగా ఉన్నారని అంచనా. రాష్ట్రంలో సంచలనం కలిగించిన మాలపిల్ల ప్రధాన నటులు గోవిందరాజుల సుబ్బారావు, నటీమణి కాంచనమాల, కథ రాసిన గుడిపాటి వెంకటచలం, సంగీతం సమకూర్చిన బి.ఎన్.ఆర్ అంతా తెనాలి వారే. తెనాలి నుండి సినీపరిశ్రమకు వెళ్లిన ప్రముఖుల్లో సూపర్‌స్టార్ కృష్ణ, గుమ్మడి వెంకటేశ్వరరావు, బొల్లిముంత శివరామకృష్ణ, వంగర వెంకటసుబ్బారావు, తాడిపర్తి శారద, అన్నపూర్ణ, ప్రభ, శైలజ, రాజ్యలక్ష్మి, శివపార్వతి, పూర్ణిమ, దివ్యవాణి, ఏవీయస్, ఆరిశెట్టి వినోద్ ప్రభృతులున్నారు.

## 'తెనాలి' రామకృష్ణకవి

పట్టణంలోని శ్రీరామలింగేశ్వరస్వామి దేవాలయంలోని ఉత్సవ విగ్రహాల పాదాల దిగువన 'శ్రీ తెనాలి నగరేవ్య రాజియత్/ గార్లపాడు పుర రామపండిత: శుక్లమాఘ సిత పంచమగురౌ/ రామలింగము మయోత్సవాకృతిమ్'–

■ మిగతా 36లో

# సంగీతప్రియులను అలరిస్తున్న లాలూ సాహెబ్

(ప్రభాతవార్త-మాచర్ల)

మాచర్ల పట్టణానికి చెందిన షేక్ చిన లాలూ సాహెబ్ తన సంగీత, గాన మాధుర్యాలతో సంగీత ప్రియులను, విద్యార్థులు ఆనందడోలికలలో ఓలలాడిస్తున్నారు. చదివింది తక్కువ జీవనోపాధికి చిన్న వ్యాపారం ఆయన తండ్రి పెద లాలూ సాహేబ్ నాదస్వరం వాయించడంలో దిట్ట. సోదరుడు రంజాన్ సన్నాయి, నాద స్వరాలలో రాణించి రేడియో ఆర్టిస్టుగా గుర్తింపు పొందారు. ఇంట్లో తండ్రి, అన్నల నుంచి లాలూసాహేబ్ నాదస్వర, సన్నాయి నేర్చుకున్నాడు. తన అదృష్టమని చిన లాలూసాహేబ్ ఆనం దాన్ని వ్యక్తం చేస్తున్నారు. ఫిబ్రవరి 2న భద్రాచలంలో జరిగే భక్తరామదాసు జయంతి ఉత్సవాల కచేరికి, ఫిబ్రవరి 9న ఫిరోజ్ బాబా ఆరోధనోత్సవాలకు కచేరి చేసేందుకు



షేక్ చిన లాలూ సాహెబ్

అయినా సంగీతం పై ఉన్న ఆసక్తితో అకుంఠిత కార్యదీక్షబూని సంగీత, గాన సాధన చేసి తాను నేర్చుకున్న సంగీత విద్యను మరికొందరికి నేర్పుతున్నారు.

సంగీత పాఠశాల కొనసాగింపుకు స్థానిక లయన్స్ క్లబ్ ముందుకు రావడంతో పట్టణంలో సరళీ స్వరాలు, జంట స్వరాలు, అలంకారములు పిళ్ళారి గీతాలు మార్మో గుతున్నాయి. సంపాదన బ్రతకటానికి పనికి వస్తే సంగీత సాధన రామకృష్ణా అంటూ భగవంతుని నోరారా స్మరించుకుంటూ మోక్షమార్గం పొందేందుకు దోహదపడుతుందని లాలూసాహేబ్ అంటారు. మాచర్ల పట్టణానికి చెం దిన లాలూ సాహెబ్‌కు పూర్వీకులు ద్వారా సంగీత జ్ఞానం అబ్బింది. గానం పై మక్కువ. ఉన్న లాలూ సాహేబ్ విజయవాడకు చెందిన సంగీతం మాస్టార్ ఎస్‌సిహెచ్ బుచ్చయ్య చార్యులు వద్ద సంగీత గానం, రిటైర్డు టీచర్ ధూళిపాళ్ళ శివరామకృష్ణ శర్మ వద్ద హరి కథాభాగవతులను నేర్చుకున్నారు. సంగీతాభిలాషతో నేర్చుకున్న విద్యతో రోజూ సాధన చేసిన లాలూసాహేబ్ సంగీతంలో పొందిన పరిణితి ప్రావీణ్యం వైపు తీసుకెళ్ళింది. పట్టణంలోని నాగార్జున సాహితీ సమాఖ్య వారు ప్రతి ఏటా నిర్వహించే త్యాగరాజ ఆరాధ నోత్సవాలలో చిన లాలూ. సాహెబ్ కీర్తనలు సంగీతాభిమానులకు వీనుల విందు చేస్తున్నాయి.

పేరు మోసిన దేవాలయాలలో కచేరీలు చేసే అవకాశం లభించడం లాలూ సాహేబ్‌కు ఆహ్వానం వచ్చింది.

మూడు వందల మంది పాల్గొంటున్న ఘంటసాల వెంకటేశ్వరరావు సంగీత నృత్య కళాశాలలో జనవరి 20న కీర్తనలు ఆలపించిన లాలూసాహేబ్ సభికులను రంజింపచేశారు. వినయ సంపన్నుడిగా సంగీత సాధనే ప్రవృత్తిగా చేసుకొని పరవశించి పోయే చిన లాలూ సాహేబ్ లయన్స్ క్లబ్‌కు చెందిన డా॥ కమలాసనరావు, డా॥ వై.రామచంద్రారెడ్డి, పట్టణ క్లబ్ అధ్యక్షుడు ఆవుల జనార్ధనరెడ్డిలు భావించారు. ఆలోచన వచ్చిందే తడవుగా పట్టణంలోని గ్రంధాలయం వద్ద సంగీత పాఠశాల కోసం ఉచిత వసతి సౌకర్యాన్ని ఏర్పాటు చేశారు. ఈ పాఠశాలలో పట్టణ పరిసర గ్రామాలకు చెందిన 25 విద్యార్థులు సంగీత సాధన చేస్తున్నారు. తెల్లవారు ఝామున 4 గంటల నుంచి 9 గంటల వరకు సంగీత సాధన, బోధనకే సమయాన్ని వెచ్చిస్తున్నారు. ఈ సందర్భంగా చిన లాలూ సాహేబ్ ప్రభాతవార్తతో మాట్లాడుతూ ప్రతి గ్రామంలో పాఠశాల ఉండి వేలాది మంది విద్యార్థులు ఆయా పాఠశాలలలో చదువుతున్నా సంగీత విద్యార్థుల సంఖ్య వేళ్ళ మీద లెక్క బెట్టేంత గానే ఉంటుందన్నారు. శృతి జ్ఞానం, లయ జ్ఞానం, ఉచ్ఛరణ, మంచిగళం వంటి అన్ని అర్హతలున్న వారు గాయకులవుతున్నారు. అన్నీ ఉన్నవారు సంగీత సాధన చేసి మోక్షమార్గం పొందవచ్చునన్నారు. సంగీత జ్ఞానం భక్తివిన సన్మార్గము గలదే ఓ మనసా అన్న త్యాగరాజ మాటలకు అనుగుణంగా భగవత గీతాలాపానతో ఈ జీవితం ఇలాగే కొనసాగాలని కోరుకుంటున్నట్లు లాలూసాహేబ్ పేర్కొన్నారు.



## జిల్లా నీటి యాజమాన్య సంస్థ : గుంటూరు జిల్లా

జిల్లా నీటి యాజమాన్య సంస్థ, గుంటూరు వారి ఆధ్వర్యంలో ప్రధానంగా నాలుగు పథకములు అమలు చేయబడుచున్నవి. అవి (1) ఇందిర ప్రభ (2) వాటర్ షెడ్ పథకము (3) మైక్రో ఇరిగేషన్, (4) బయో వ్యూయల్ పథకము. ఈ పథకాల ద్వారా 2005 -06 సంవత్సరానికి ఇప్పటి వరకు సాధించిన ప్రగతి గురించి తెలుసుకుందాం:

**I. ఇందిర ప్రభ - సమగ్ర భూమి అభివృద్ధి పథకము :** ప్రభుత్వముచే పేదలకు మంజూరు చేయబడి, అభివృద్ధికి నోచుకొనక వ్యవసాయ యోగ్యముగా లేని భూములకు గుర్తించి, అట్టి భూములను సంబంధిత యజమానులచే భాగస్వాములూ చేసి సదరు భూములను వ్యవసాయ యోగ్యముగా మరియు సరియైన ఉత్పాదక ఆస్తులుగా మార్చి తద్వారా వారికి సరియైన ఆహార భద్రతను కల్పించి వారి జీవన భృతిని పెంపొందివ చేయుటయే ఇందిర ప్రభ - సమగ్ర భూమి అభివృద్ధి పథకము యొక్క ముఖ్య ఉద్దేశ్యము. ఈ పథకమునకు నాబార్డు మూడుదశలలో గ్రామీణ మౌలిక సదుపాయ అభివృద్ధి (RIDF_) - IX, X మరియు XI పథకముల ద్వారా ఋణసదుపాయము చేకూర్చబడినది.

**II. వాటర్ షెడ్ పథకము :** మన జిల్లాలో IWDP-I కింద 15 వాటర్ షెడ్యులు IWDP-II కింద 16 వాటర్ షెడ్డూలు మంజూరైనాయి. IWDP-I కింద మంజూరైన 15 వాటర్ షెడ్లు బొల్లాపల్లి మండలానికి చెందినవి. కాగా IWDP-II కింద మంజూరైన 16 వాటర్ షెడ్లులో 1- బొల్లావల్లి, 9-దుర్గి, 1-చిలకలూరిపేట, 5-నరసరావుపేట మండలాలకు చెందినవి. IWDP-I కింద ప్రభుత్వం ఇప్పటివరకు 154.66 లక్షల నిధులు మంజూరు చేయగా 108.39 లక్షల నిధులు వినియోగించి 159 పనులు చేపట్టడం జరిగినది. IWDP-II కింద ప్రభుత్వం ఇప్పటి వరకు 155.14 లక్షల నిధులు విడుదల చేయగా 113.01 లక్షల నిధులు వినియోగించి 621 పనులు చేపట్టడం జరిగినది.

**III. మైక్రో ఇరిగేషన్ పథకం :**

ఈ జిల్లాలో ప్రస్తుత సంవత్సరం 2005-06 సంవత్సరమునకు 120.00 హెక్టార్లకు బిందు సేద్యముత అమర్చుటకు మరియు 500.0 హెక్టార్లకు తుంపర్ల సేద్యము అమర్చుటకు లక్ష్య సాధనముగా నిర్దేశించటమైనది. ఇందులకు గాను ఇప్పటివరకు ప్రస్తుత సంవత్సరమునకు గానూ 58.90 లక్షల వ్యయముతో మొత్తము 778 మంది లబ్దిదారులు పొలములో వివిధ పంటలకు సంబంధించి 506.00 హెక్టార్లలో బిందు సేద్యము యూనిట్లు మరియు 259.00 హెక్టార్లలో తుంపర్ల యూనిట్లు అమర్చడమైనది. మిగిలి న హెక్టార్ల లక్ష్య సాధనను యీ డిశంబరు నెలాంతమునకు పూర్తి చేయుటకై కృషి జరుగుచున్నది.

**IV. బయో - వ్యూయల్ పథకం :**

మన రాష్ట్ర ప్రభుత్వం ఎంతో ముందు చూపుతో అమలు చేయుచున్న పథకం బయో-వ్యూయెల్ పథకం, 2006-07 సం.రానికి 50.000 ఎకరాలలో బయో-వ్యూయర్ (అడవి ఆముదం, కానుగ) మొక్కలను పెంచుటకు గుంటూరు జిల్లాకు టార్గెట్ కేటాయించడమైనది.

**Status Report Under Comprehensive Land Development Project In Guntur District - RIDF - IX, X**

| వ. పథకం పేరు | నాబార్డు వారు మంజూరుచేసిన | ఇప్పటివరకు పరిపాలన ఆమోదము | విడుదల చేసిన నిధులు | వినియోగించిన నిధులు | మొత్తం బ్లాకులు | విస్తీర్ణం (ఎకరములలో) | లబ్దిదారుల వివరములు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | షె కు | షె తె | వె త | ఇతరులు | మొత్తము |
| 1 RIDF IX Phase - I | 950 00 | 858 27 | 297 01 | 254 55 | 109 | 7017 40 | 2095 | 1307 | 246 | 136 | 3784 |
| 2 RIDF X Phase - II | 298 00 | 298 00 | 72 04 | 68 13 | 37 | 1763 23 | 898 | 296 | 239 | 127 | 1560 |
| Total | 1248 00 | 1156 27 | 369 05 | 322 68 | 146 | 8780 63 | 2993 | 1603 | 485 | 263 | 5344 |

**బి. రాజశేఖర్‌రెడ్డి**
ప్రాజెక్టు డైరెక్టర్, జిల్లా నీటి యాజమాన్య సంస్థ, గుంటూరు

**శ్రీమతి జి. జయలక్ష్మి**
కలెక్టర్ మరియు ఛైర్మన్ జిల్లా నీటి యాజమాన్య సంస్థ, గుంటూరు

# సుదీర్ఘ చరిత్ర గల తెనాలి

■ 34వ పేజీ తరువాయి

అని రాసిన సంస్కృత శ్లోకం ప్రకారం ఆ విగ్రహాలను రామలింగం ఇచ్చినవిగా తెలుస్తుంది. రామలింగకవి జన్మస్థలం సత్తెనపల్లి తాలూకా లక్కరాజు గార్లపాడు. ఆయన తల్లిదండ్రులు చిన్నతనంలోనే చనిపోవటంతో తెనాలిలోని మేనమామ వద్ద పెరిగాడు. ఇక్కడే కాళికాదేవి వరప్రసాదియై కవిగా మారి శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన కవుల్లో ఒకరయ్యారని అభిప్రాయం ఉంది. తనకు తెనాలి గ్రామం అగ్రహారంగా ఇచ్చినట్టుగా 'ఆంధ్రభూమి కుచాగ్రహారాభయైన/ శ్రీ తెనాల్యగ్రహార నిర్వేత వగ్ర/ శాఖికా కోకిలమవీవు సరసకవివి/ రమ్యగుణకృష్ణ రామయ రామకృష్ణ' పాండురంగ మహాత్మ్యం గ్రంథంలో తానే స్వయంగా రాసుకొన్నారు. అంటే రామలింగకవికి పూర్వమే తెనాలి ఉంది. తెనాలి వచ్చి తెనాలి రామలింగడు అయ్యాడు. కృష్ణదేవరాయలపై అభిమానంతో రామకృష్ణకవిగా పేరొందాడు.

## ఆంధ్రాప్యారిస్‌కు మూలం కాంచనమాల

1930 దశకం వరకు రాష్ట్రంలో నాటకాల్లో స్త్రీ పాత్రలను పురుషులే పోషించారు. కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు నాటక ప్రదర్శనలు నిర్వహిస్తున్న రోజుల్లో స్త్రీ పాత్రను స్త్రీచేతనే వేయించాలనే తలంపుతో 'స్త్రీ పాత్రలను పోషించగల స్త్రీలు ఉంటే తనను సంప్రదించాలి' అంటూ దినపత్రికల్లో ప్రకటన చేశారు. ఆ రోజుల్లో నాటకాల్లో హార్మోనిస్టుగా పనిచేస్తున్న దాసరి నారాయణదాసు, తన 15 ఏళ్ల కుమార్తె కాంచనమాలను తీసుకొని రాజమండ్రి వెళ్లి చిలకమర్తి వారిని కలిశారు. ఆయన ఎంతో ఆనందించి 'సారంగధర' నాటకంలో చిత్రాంగి పాత్రకు రిహార్సల్స్ వేయించారు. ఆంధ్రదేశంలో తొలిసారిగా స్త్రీ పాత్రను స్త్రీ నటిస్తోందంటూ మళ్లీ పత్రికల్లో ప్రకటించారు. ఆ నాటక ప్రదర్శనకు తండోపతండాలుగా జనం వచ్చారు. నాటకం మధ్యలో స్టేజిపైకి వచ్చిన చిలకమర్తి, 'తెనాలి నుండి వచ్చిన కాంచనమాల స్త్రీ పాత్రను పోషించింది. తెనాలిలో స్త్రీలకు బాగా స్వేచ్ఛ ఉంది. అందుచేత ఆంధ్రాప్యారిస్‌గా పిలవొచ్చు' అన్నారు.

## ప్రాతఃస్మరణీయుడు సర్ ఆర్థర్ కాటన్

18వ శతాబ్దంలో కరువు కాటకాలతో అలమటించిన గుంటూరు జిల్లాకు 1858లో కృష్ణానదిపై ఆనకట్ట నిర్మించటం ద్వారా నీటిని కృష్ణాపశ్చిమ డెల్టా ద్వారా తెనాలి తాలూకాకు మరలించి సస్యశ్యామలం చేశారు. ఇందుకు కారకుడు సర్ ఆర్థర్ కాటన్ మహాశయుడు. నీటిని ద్రవరూపంలో ప్రవహించే బంగారం అన్నారాయన. తెనాలి ప్రాంతీయులు నిద్ర లేవగానే స్మరించుకోవాల్సిన వ్యక్తి సర్ ఆర్థర్ కాటన్.



# కోర్కెలు తీర్చే బాలకోటేశ్వర స్వామి

(ప్రభాతవార్త-రేపల్లె)

రేపల్లె మండలంలోని అరవపల్లిలో గల శ్రీ బాలకోటేశ్వర స్వామి దేవాలయం భక్తుల కోర్కెలు తీర్చే పుణ్యక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. హర హరో చేదుకో కోటయ్య అంటూ తరలి వచ్చే భక్తుల కోసం దేవాలయం మహాశిరాత్రి వేడుకలకు సిద్ధమైంది. శతాబ్దాల చరిత్ర కలిగిన బాలకోటేశ్వరాలయానికి విశిష్టమైన చరిత్ర వుంది. ఒక రైతుకు చెందిన పొలం నాగలితోదున్నే సమయంలో లింగాకృతి కలిగిన రాయి లభ్యమైంది. అయితే రైతు మాత్రం శివలింగమని గుర్తించలేక పోయాడు. రోటిలో తిప్పే పత్రంగా భావించిన రైతు భార్య పచ్చడి రుబ్బింది. వెంటనే శరీరం మంటలకు గురైంది. ఇంతలో ఒక వృద్ధురాలికి పూనకం వచ్చింది. ఆ రాయిని దేవాలయంలో ప్రతిష్ఠించాలని అప్పుడే ఇబ్బందులు తొలగిపోతాయని స్వామి చెప్పారు. ఇది గ్రహించిన భక్తులు దేవాలయాన్ని నిర్మించి 150సంవత్సరాల కాలం గడిచిందని చెబుతున్నారు. గుంటూరు, కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి, ప్రకాశం జిల్లాలకు చెందిన భక్తులు అరవపల్లిలోని బాలకోటేశ్వరాలయాన్ని దర్శించుకోవటం అనాదిగా వస్తోంది.

## మహాశివరాత్రి అంటే..

మాఘ బహుళ చతుర్దశినాడు (అనగా అమావాస్యకు ముందు వచ్చే కృష్ణ చతుర్దశి)శివరాత్రిగా జరుపవలెనని 'ధర్మసింధు' శాస్త్రం నిర్ణయించింది. ప్రతి నెలలో బహుళ పక్షంలో వచ్చే చతుర్దశి రోజు మాసశివరాత్రి పేరుతో శివపూజలు చేస్తారు. ఇలా ప్రతినెలా వచ్చే పర్వదినం కాబట్టి దీనికి 'మాస శివ రాత్రి' అని పేరు. అలాంటి పన్నెండు నెలల్లో వచ్చే మసశివరాత్రులలోకి ప్రధానమైన పర్వదినమే మహాశివ రాత్రి. మహాశివరాత్రి మంగళవారం ఇటువంటి పర్వదినం వస్తే ఇక అది మహాప్రశస్తం. మహాశివరాత్రి పండుగ సంక్రాంతి తర్వాత వచ్చే పండుగలలో ముఖ్యమైంది. దీనిని దేశమంతా మహావేడు కగా జరుపుకుంటారు. ఈ మహాశివరాత్రి శివునకు ప్రీతికరమైన పర్వదినం కావటం విశేషం. ఈ శివరాత్రికి ఒక ప్రత్యేకత ఉంది. అన్ని పండుగలు పగటిపూట జరుపుకుంటే శివరాత్రి పండుగను ప్రధానంగా రాత్రిపూట జరుపుకుంటారు.

శివునికి పర్వదినమైన ఈ రోజురాత్రిపూట సాధన (పూజ)జరుపవలసిన ప్రధానమైన పండుగైనందున దీనికి 'శివ-రాత్రి'(శివుని యొక్కరాత్రి)అని పేరు వచ్చినది. పగలంతా ఉపవాసం ఉండి భక్తిశ్రద్ధలతో బిల్వదళాలతో శివుని పూజించి, రుద్రాభిషేకం చేయించి, ఆరోజు, 'నమఃశ్శివాయ'అనే పంచాక్షరీ మంత్రం జపిస్తూ జాగరణ చేస్తే ప్రతిఫలం లభిస్తుందని భక్తుల ప్రగాఢ విశ్వాసం. శివరాత్రి పర్వదినాన సూర్యోదయానికి ముందే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకుని తలస్నానం చేసి నూతన వస్త్రాలు ధరించి దగ్గరలోని శివాలయా నికి వెళ్ళి స్వామికి అభిషేకం చేయించటం అనాదిగా వస్తోంది. ఆనాడు భక్తిశ్రద్ధలతో ఉపవాస దీక్ష చేసి సాయంత్రం నల్ల నువ్వుల పిండితో నలుగు పెట్టుకొని స్నానం చేసి, విభూతి ధరించి శివాలయమునకు భక్తులు వెళ్తుంటారు. అక్కడ ఆనాడు శివపార్వతుల కల్యాణం, తిలకించి, లింగోద్భవ కాలంలో శివలింగానికి రుద్రాభిషేకం చేయించి, ఆ రాత్రి జాగరణ చేస్తారు.

## శివరాత్రి మహాత్యం

పూర్వం సృష్టికర్త అయిన బ్రహ్మ, స్థితికర్త అయిన విష్ణువు ఈ ఇద్దరిలో ఎవరు గొప్ప, ఎవరు ఆది పురుషుడు అని వాదులాడుకొన్నారని పురాణాలు వెల్లడిస్తున్నాయి. . ఒకరిపై ఒకరు పాశుపతాస్త్రమును, మహేశ్వ రాస్త్రమును ప్రయోగించుకొన్నారు. ఈ యిద్దరి అస్త్రముల ప్రయోగము వల్ల లోకాలలో పెద్ద ఉపద్రవం సంభవించింధి. భయభ్రాంతులైన దేవతలు, సమస్తజనులూ పరమశివుని శరణు కోరారు. అంతట శివుడు, హరి-విధాతలమధ్య ఒక అగ్ని స్తంభాన్ని శివలింగాన్ని సృష్టించి దాని ఆద్యంతాలను (మొదలు చివరలు)కనుగొనినవారే ఆది పురుషుడని తెలుపుతారు.

అంతట హరి వరాహమై ఆదిమూలమును కనుగొనుటకు భూమిని త్రవ్వుచూ కిందికి, అంత్యమును కనుగొనుటకు హంసవాహనుడై బ్రహ్మ ఉపరితలము నుండి కిందికి జారుతున్న ఒక కేతకీ (మొగలి)పుష్పాన్ని చూచి "ఓ కేతకీ, నీవు ఈ అగ్నిస్థంభలింగం శిరము నుండి వచ్చుచున్నాడని భావిస్తున్నాను. నేను ఈ అగ్నిస్తంభం యొక్క అంత్యమును చూచినానని నీవు సాక్ష్యము చెప్పవలె"నని ప్రార్ధించాడు. ఒక్క అబద్ధమాడిన దోషమెంతలే అని అంగీకరించినది. ఆదిని చూడలేకపోతినని హరి అంగీకరించినాడు. కాని బ్రహ్మఅంత్యమును చూచినాననీ, దానికి కేతకీ కుసుమం సాక్ష్యమని పలుకగా, అవునని కేతకీ కూడ సాక్ష్యము చెప్పినది. హరి ఆ మాటను నమ్మి విధాతను షోడశోపచారములతో పూజించినాడు. హరి ఉపచారాలనూ విధాత అపచారాన్నీ గ్రహించిన శంకరుడు దుష్టశిక్షణ అవశ్యమని తలచి ఆ జ్వాలాస్తంభమున ప్రత్యక్షమైనాడు. హరి, శివుని అనేక విధాల స్తోత్రం చేసి ప్రార్థించాడు. "శ్రీ హరీ, నీకు పదవి మీద కోరిక వున్ననూ అసత్యము పలుకలేదు. కనుక నీకు నేటి నుండి, దేవమానవ లోకములందు నాతో సరిసమానముగా ఆలయములు, పూజా పురస్కారములు జరుగగలవని వరమిచ్చారు. బ్రహ్మకు మాత్రం గర్వం పోగొట్టవలెనని భావించి భైరవుని సృష్టించాడు. అంతట ఆ భైరవుడు విధాత ఐదవతలను 'కొనగోట త్రుంచినాడు. నాటి నుండి బ్రహ్మ చతుర్ముఖుడు అయినాడు. చేసిన తప్పు ను గ్రహించిన బ్రహ్మ "పరమేశ్వరా, నా పంచమశిరమును త్రుంచి నా అజ్ఞానమును పోగొట్టినావా" అని శివుని అనేక విధములుగా ప్రార్థించినాడు." బ్రహ్మ నీవు కీర్తికాంక్షతో పొరపాటు చేశావు. కనుక నేటి నుంచి నీకు ఆలయ క్షేత్రములు, ఉత్సవ ఊరేగింపులు వుండవని చెప్పినాడు. కాని వత్సా బ్రహ్మ యజ్ఞ యాగాదులందు గురుపూజ మాత్రము నీకే చేయవలెను. లేకున్న ఆ యజ్ఞము సంపూర్ణము కాజాలదు.

నీవు యథావిధిని జగత్సృష్టిని కావింపుము అని పలికినాడు. కేతకీ నీవు అబద్ధపు సాక్ష్యము చెప్పిన నేరమునకు నీవు పూజార్హతకోల్పోవుదువుగాక. అయిననూ నాకు పైకప్పుగావుందు"వని పలికినాడు. దేవతలు, రుషులు అందరూ ఆ ఉగ్రస్తంభ రూపాన్ని ఉపసంహరింపుమని కరుణాంతరంగుడైన జగత్పతిని పరమేశ్వరుని వేడుకోగా, వారి ప్రార్ధనను మన్నించి పార్థివ లింగరూపమున పుడమిన వెలసినాడు శివుడు. జ్వాలాస్తంభము వెలసిన చోటు గనుక ఆ క్షేత్రము అరుణాచలము గా ప్రసిద్ధక్షేత్రమైంది.

నాటి నుంచి శివరాత్రి నాటి రాత్రి 12గంటలకు లింగోద్భవ కాలమని అధికంగా శివనామ జపాలు, భజనలు, సంకీర్తనగానాలు చేస్తుంటారు. "ఓం నమశ్శివాయ" అనే ప్రణవపంచాక్షరీ మంత్రం వ్యాప్తిచెందింది. పద్నాలుగు లోకాలలోని పుణ్యతీర్థాలూ ఆనాడు బిల్వమూలంలో వుంటాయని, శివరాత్రినాడు ఏకబిల్వమైనా శివార్పణం చేయవలెనని శాస్త్రం పేర్కొంటోంది.



95 శాతం నిర్మాణం పూర్తయిన పెనుమూడి-పులిగడ్డ వారధి

# ప్రారంభానికి సిద్ధమవుతున్న పెనుమూడి-పులిగడ్డ వారధి

**(ప్రభాతవార్త-రేపల్లె)**

కోస్తా తీరప్రాంత ప్రజల ఆందోళన ఫలితంగా సాధించుకొన్న పెనుమూడి-పులిగడ్డ వారధి నిర్మాణపనులు 95 శాతం పూర్తయ్యాయి. విజయవాడకు దిగువున 90 కి.మీ దూరంలో కృష్ణా నదిపై రూ.71 కోట్లతో వారధి నిర్మాణ పనులు పూర్తిచేయాలని అప్పటి తెలుగుదేశం ప్రభుత్వం నిర్ణయం తీసుకొంది. అయితే ప్రభుత్వం రూ.37 కోట్లు సబ్సిడీగా కేటాయించింది. నిర్మాణపనుల బాధ్యతను స్వీకరించిన నవయుగ ఇంజనీరింగ్ కంపెనీ రూ.34 కోట్లు ఖర్చుచేసి 30 సవంత్సరాల కాలపరిమితిలో టోల్‌గేట్ ద్వారా ఆ ఖర్చును రాబట్టుకొనేందుకు ప్రభుత్వం గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది. ఇదే తడవుగా 2003 సంవత్సరం సెప్టెంబరు 6వ తేదీ వారధి నిర్మాణానికి ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు పులిగడ్డ వద్ద శంకుస్థాపన చేశారు. 2004 అక్టోబరు నాటికల్లా పూర్తికావలసిన ఈ వారధి నిర్మాణంలో తీవ్రమైన జాప్యం ఏర్పడింది. కృష్ణానదికి వరదలు రావడం, భారీ వర్షాల కారణంగా పనులకు ఆటంకమేర్పడింది. కృష్ణానదిపై 2580 మీటర్ల దూరం వారధి నిర్మాణ పనులు పూర్తయ్యాయి. పులిగడ్డ అక్విడెక్టుపై 318 మీటర్ల దూరం వంతెననిర్మించారు. అటు పులిగడ్డ ఇటు పెనుమూడి వద్ద కాల్వలపై రెండు వంతెనల నిర్మాణ పనులు జరిగాయి. పులిగడ్డ వైపు అప్రోచ్ రోడ్డు పనులు 1925 మీటర్ల దూరం జరిగాయి. పెనుమూడి వైపు మాత్రం 1060 మీటర్ల దూరం చేపట్టాల్సిన అప్రోచ్ రోడ్ పనులు ఇంకా పూర్తికాలేదు. ప్రభుత్వ అధికారులు నిర్ణయించిన భూముల ధరప్రకారం అవసరమైన స్థలాన్ని స్వాధీనం చేసుకొనేందుకు నవయుగ ఇంజనీరింగ్ కంపెనీ సిద్ధంగా వుంది. ఇందుకోసం నిధులను కేటాయించింది. 15.85 ఎకరాల స్థలం ఇక్కడ అవసరం. నాలుగు నెలల వ్యవధిలో అప్రోచ్ రోడ్ నిర్మాణ పనులు పూర్తిచేసి ప్రారంభోత్సవ కార్యక్రమాలు నిర్వహించాలనే ఉద్దేశ్యంతో ఆ కంపెనీ వుంది. వారధి మీదుగా జాతీయ రహదారి నెంబరు 5కి ప్రత్యామ్నాయ రహదారి మార్గం ఏర్పడనుంది. ఈ మార్గం ప్రారంభోత్సవానికి నోచుకొంటే తూర్పు, పశ్చిమ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాల్లోని పట్టణాలు, గ్రామాల మధ్య వున్న ప్రయాణ దూరం తగ్గుతుంది.

ఇదిలా వుంటే, కృష్ణాజలాలు వృధాగా బంగాళాఖాతంలో కలుస్తున్నాయి. పెనుమూడి-పులిగడ్డ వారధికి అడుగుభాగంలో షట్టర్లు ఏర్పాటు చేసి ఆనీటిని రైతుల భూములకు మళ్ళించేలా చర్యలు తీసుకోవలనే ఆలోచనలో ప్రభుత్వం వుంది. ఇందుకోసం రూ.4కోట్లు వ్యయంకాగలదని అంచనా వేసారు. షట్టర్ల ఏర్పాటుకు కృషా చేస్తామని ప్రజాప్రతినిధులు వాగ్దానం చేసినందున నెరవేరాల్సి వుంది.

# సర్వపాప పరిహారం-త్రికోటేశ్వర సన్నిధానం

(ప్రభాతవార్త-నరసరావుపేట)

గుంటూరు జిల్లా నరసరావుపేట మండలంలోని ప్రముఖ శైవక్షేత్రంగా విరాజిల్లుతున్న కోటప్పకొండలోని త్రికోటేశ్వరుడు భక్తులకు కొంగు బంగారమై ప్రత్యక్షదైవంగా ఆరాధించ బడుతున్నారు. రాష్ట్రంలోని ప్రముఖ శైవక్షేత్రాల జాబితాలో కోటప్పకొండకు ప్రత్యేక స్థానం లభించింది. కోటప్పకొండ గురించి జనబాహుళ్యంలో ఎన్నో కథలు ప్రచారంలో ఉన్నాయి. క్రీస్తుశకం ఆరు, ఏడు శతాబ్దాలలో ఈ ప్రాంతాన్ని పాలించిన ఆనందగోత్రికులు, విష్ణుకుండినులు త్రికూటాధిపతులుగా బిరుదు వహించగా కోటప్పకొండ ఆలయ దానశాసనాలలో వెలనాటి గొంకరాజు, చోళభీముడు, కుళోత్తుంగ చోళుడు, వెలనాటి రాజేంద్రుడు తదితర పేర్లు కన్పిస్తాయి. మహాశైవ శాంభవీదీక్ష మంత్రోపాసకుడైన ఏలేశ్వర అయ్యవారు ఈ దేవాలయ ప్రశస్తికోసం జనాకర్షణ యంత్రాన్ని స్థాపించి అష్టదిగ్బంధనం చేసినట్లు చెబుతారు. నరసరావుపేట జమిందారుల పాలనలో ఉన్న కోటప్పకొండ 1936 నుంచి హిందూ దేవాదాయ, ధర్మాదాయశాఖ ఆధిపత్యంలోకి వచ్చింది. రాజా మల్రాజ్ వెంకట నరసింహరాయనింగారు వంశీకులు శాశ్వత ధర్మకర్తలుగా వ్యవహరిస్తున్నారు. నరసరావుపేట పట్టణానికి 11 కిలోమీటర్ల దూరంలో ఉన్న కోటప్పకొండకు చిలకలూరిపేట నుంచికూడా మార్గం ఉంది. కొండ ఎత్తు 1587 అడుగులు కాగా కొత్త కోటేశ్వరస్వామి దేవాలయం 600 అడుగుల ఎత్తులో ఉండగా, దీని పై భాగాన పాతకోటన్న గుడి ఉంది. ఎటునుంచి చూసినా కొండ మూడు శిఖరాలతో కన్పిస్తుంది. అందువల్ల బ్రహ్మ, విష్ణు, రుద్ర అనే నామాలతో త్రికూటపర్వతంగా పిలువబడుతుంది.

## రుద్ర,విష్ణు, బ్రహ్మ శిఖరాలు

బ్రహ్మచారియైన దక్షిణామూర్తి యోగనిష్టుడై బ్రహ్మ మొదలైన దేవతలకు బ్రహ్మోపదేశం చేసినట్లు పురాణాలు చెబుతున్నాయి. పాతకోటేశ్వరుడు అని, రుద్ర శిఖరం అని పేర్లు ఉన్నాయి. రుద్రశిఖరానికి పక్కగా ఉన్న విష్ణు శిఖరంపై విష్ణువు శివుణ్ణి గురించి తపస్సు చేసి ప్రసన్నం చేసుకున్నాడని, ఆ వెంటనే ఇంద్రాది దేవతలు వచ్చి తామందరం దక్షుడి యాగంలో హావిస్సు స్వీకరించినందువలన దోష ప్రారిత ులవుయ్యావుని, లింగరూపంలో దర్శనమిచ్చి దోషాన్ని పోగట్టమని ప్రార్థిస్తారు. అపుడు శివుడు తన చేతిలోని త్రిశూలంతో అక్కడి రాతిపై పొడవగా, ఆరాయి నుంచి నీరు పెల్లుబకగా ఆనీటితో శివుడు లింగరూపాన్ని ధరించి వెలిసాడు. దేవతలు ఆజలంలో స్నానం చేసి ఆ శివలింగాన్ని ఆరాధించి పాపవిముక్తుల య్యారు. నాటినుంచి శివలింగానికి పాపవినాశేశ్వరలింగం అని పేరు వచ్చింది. రుద్రశిఖరానికి కింద నైరుతి భాగంలో ఉన్న బ్రహ్మశిఖరంపై బ్రహ్మ నివశించాడని ప్రతీతి. జ్యోతిర్లింగం కోసం బ్రహ్మతపస్సు చేశాడని, శివుడు ప్రత్యక్షమైబ్రహ్మ కోర్కె తీర్చేందుకు జ్యోతిర్లింగంగా వెలిసాడు. ప్రస్తుతం కొలుస్తున్న కొత్త కోటేశ్వరలింగం, ఉత్తరదిశగా ఉన్న యల్లమందకు మునిమంద అని పేరు కూడా ఉండేది. కోటేశ్వర లింగానికి యల్లమంద కోటేశ్వరుడు అని పేరు కూడా ఉంది. బ్రహ్మచారి అయిన దక్షిణామూర్తి క్షేత్రం కావటంవల్ల ఇక్కడ కల్యాణోత్సవం, ధ్వజం ఉండవు. సాలంకయ్య, ఆనందవల్లి లేక గొల్లభామ కధలు కూడా ప్రాచుర్యంలో ఉన్నాయి.

## నిత్యసేవలు-ఉత్సవాలు

కొండపై నిరంతర అఖండ దీపారాధన, అభిషేకాలు, పూజలు జరుగుతుంటాయి. సంతానం లేనివారు, భూతపీడితులు, కళ్ళు తదితర అవయవాలు లోపించినవారు స్వామివారికి ప్రదక్షిణలు చేసి లబ్దిపొందారనడానికి ఎన్నో దృష్టాంతాలు ఉన్నాయి. మాఘమాసం అంతా భక్తులు పశువులతో గిరి ప్రదక్షిణంచేసి స్వామిని సేవిస్తుంటారు. రుద్ర, బ్రహ్మ, విష్ణు శిఖరాలను వరుసగా పెద్దబోడు,మధ్యబోడు, గద్దలబోడు అని సామాన్యజనం వ్యవహరిస్తుంటారు. ఇక్కడే నీలకంఠేశ్వరస్వామి దేవస్థానం, భువనేశ్వరి అమ్మవారి దేవస్థానం, ప్రసన్న కోటేశ్వరస్వామి దేవస్థానం, మహామాయి చండి అమ్మవారి దేవవస్థానాలు ఉన్నాయి.

## కొండపై ప్రత్యేక ఆకర్షణలు

ఘాట్ రోడ్డు మలుపుల్లో బ్రహ్మ, మహావిష్ణువు, లక్ష్మీదేవి, సరస్వతి, పార్వతి, వినాయకులు భారీ విగ్రహాలను ఏర్పాటు చేశారు. ఘాట్‌రోడ్డు మధ్య భాగంలో పర్యాటక, అటవీశాఖల సమన్వయంతో పర్యాటక ప్రాంతం రూపుదిద్దుకుంది. పిల్లల రాజ్యం, జింకలపార్కు, పూలతోటలు, పక్షులపార్కు, జూరాసిక్‌పార్కు, ఎలక్ట్రానిక్ రిమోట్ తలలు, తోకలు కదిలించే రాక్షస బల్లులను ఇక్కడ ఏర్పాటు చేశారు.

రంగురంగుల పక్షులు, కుందేళ్లు, నెమళ్లు, కొంగలు, దుప్పులు పార్కులో కనువిందు చేస్తాయి. కాళీయమర్ధనం సరస్సులో బోటు షికారు. టాయ్‌ట్రెన్, పర్యావరణ భవనాలను నిర్మించారు. అక్వేరియం, లైబ్రరీ, హౌసింగ్‌బోర్డు నిర్మించిన మోడల్ గృహాలు, పిల్లల రాజ్యంలో రకరకాల ఆటవస్తువులు భక్తజనులకు ఆకర్షణంగా నిలిచాయి.







# ఉత్తమ ఉత్తేజవంతుడు నాగధీరజ్

**(ప్రభాతవార్త-రేపల్లె)**

ప్రతిభా పాటవాలు పుణికిపుచ్చుకొన్న నాలుగేళ్ళ బాలుడు "ఉత్తమ ఉత్తేజవంతుడు" అవార్డును పొందాడు. రేపల్లె పట్టణానికి చెందిన పావులూరి కృష్ణమోహన్, పద్మావతి (ఉపాధ్యాయులు)లకు జన్మించిన పావులూరి వెంకట నాగధీరజ్(4) విభిన్న రంగాలకు చెందిన విశిష్ట వ్యక్తుల పేర్లు ఇట్టే చెప్పగల సామర్థ్యం సొంతం చేసుకొన్నాడు. దేశ, రాష్ట్ర రాజధానులు, ముఖ్యమంత్రులు, ప్రధానమంత్రి, ప్రెసిడెంట్‌ల పేర్లను అడిగిందే తడవుగాచకచకా చెప్పేస్తుండటం విశేషం. జిల్లాలో ఇప్పటికే పలు విజ్ఞానదాయకమైన ప్రదర్శనలు ఇచ్చి ప్రముఖుల ప్రశంసలు పొందాడు. బుల్లిబుల్లి మాటలు అలరిస్తున్నాయి.



బాలమేధావి నాగధీరజ్

రాష్ట్ర ముఖ్యమంత్రి వై.ఎస్.రాజశేఖరరెడ్డి అని, ప్రధానమంత్రి మన్‌మోహన్‌సింగ్, రాష్ట్రపతి కలామ్, స్పీకర్ సురేష్‌రెడ్డి, హోంమంత్రి జానారెడ్డి, ఆర్థిక మంత్రి రోశయ్య, సమాచార శాఖమంత్రి షబ్బీర్, వ్యవసాయశాఖ మంత్రి రఘువీరారెడ్డి, పంచాయితీశాఖ మంత్రి దివాకరరెడ్డి, పర్యాటకశాఖమంత్రి గీతారెడ్డి, కేంద్రరైల్వే మంత్రి లాలూప్రసాద్ యాదవ్, గుంటూరు జిల్లా మంత్రి కన్నా లక్ష్మీనారాయణ, పి.సి.సి అధ్యక్షుడు కేశవరావు, ఎ.ఐ.సి.సి అధ్యక్షురాలు సోనియాగాంధీ, టి.డి.పి అధ్యక్షుడు చంద్రబాబు నాయుడు, యు.ఎన్.ఓ అధ్యక్షుడు కోఫీ అన్నన్, అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్, రష్యా అధ్యక్షుడు పుతిన్, పాలస్తీనా అధ్యక్షుడు అబ్బాస్, ఇజ్రాయిల్ ప్రధాని షరాన్, పాకిస్తాన్ ప్రధాని అజీజ్, మలేషియా ప్రధాని బదాని, బ్రిటన్ ప్రధాని టోనిబ్లెయిర్, ఎ.టి.ఎం. అంటే ఆటోమేటిక్ టెల్లర్ మిషన్, అస్సాం ముఖ్యమంత్రి గగోయ్, తమిళనాడు సి.ఎం. జయలలిత అని చకచకా చెబుతాడు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని హైద్రాబాద్, దేశరాజధాని ఢిల్లీ, ఆగ్రాలో తాజ్ మహల్, హైద్రాబాద్‌లో చార్మినార్, తిరుమలలో వెంకన్న స్వామి, బీహార్ రాజధాని పాట్నా, యు.పి రాజధాని లక్నో, గుజరాత్ రాజధాని గాంధీనగర్, గోవా రాజధాని పానాజి, కర్నాటక రాజధాని బెంగుళూర్, జాతీయ జెండాకు 3రంగులంటాడు నాగధీరజ్. జాతీయ గీతం జనగణమన, జాతీయ పక్షి నెమలి, జాతీయ జంతువు పులి, జాతీయ పుష్పం కలువ, ఖండాలు7, సముద్రాలు 5, జిల్లాలు 23, రాష్ట్రాలు 28, కంట్రి ఇండియా, స్టేట్ ఆంధ్రప్రదేశ్, జిల్లా గుంటూరు, మున్సిపల్ ఆఫీస్‌లో ఎవరుంటారంటే ఛైర్మన్, కోర్టులో జడ్జి, న్యాయవాదులు, కరెంటు ఎవరు కనుగొన్నారంటే ఎడిసన్, రేడియో కనుగొన్నది మార్కోని, కంప్యూటర్ బాబ్బేజ్, సైకిల్ మాక్‌మిలన్, టెలిఫోన్ గ్రాహంబెల్, మైక్రోస్కోప్ లీవెన్ హక్, జపాన్ రాజధాని టోక్యో, జిల్లా కలెక్టర్ జయలక్ష్మిఅని నాగధీరజ్ చెప్పున్నాడు. ఈ బాలుని తండ్రి కృష్ణమోహన్ నగరం మండలంలోని అల్లపద్రు ఉన్నత పాఠశాలలో ఇంగ్లీషు ఉపాధ్యాయునిగా, తల్లి పద్మావతి పల్లపట్లలోని సాంఘీక సంక్షేమగురుకుల పాఠశాలలో మ్యాథ్స్ ఉపాద్యాయినిగా పనిచేస్తున్నారు. తండ్రితో ఒకసారి చెప్పించుకుంటే చాలు ఇట్టే గుర్తుపెట్టుకుని ఏ సమయంలో అడిగినా చెప్పగలిగే జ్ఞాపకశక్తి ధీరజ్‌దే. గుంటూరులో గణతంత్ర వేడుకల సందర్భంగా కేవలం మూడు నిమిషాల సమయంలో 150 జనరల్ నాలెడ్జ్ ప్రశ్నలకు జవాబులు చెప్పికలెక్టర్ జి. జయలక్ష్మి నుంచి ఉత్తమ ఉత్తేజవంతుడు అవార్డ్‌ను పొందడం విశేషం.

# మైమరపించే గుత్తికొండ బిలాలు



బిలం ముఖద్వారం.



కొండపై వున్న నాగేంద్రస్వామి విగ్రహం



బిలంలో కొలువుదీరిన బాలమల్లేశ్వరుడు



వరసిద్ధి వినాయకస్వామి విగ్రహం

**(ప్రభాతవార్త, పిడుగురాళ్ళ)**

గుంటూరు జిల్లా మాచర్ల-నరసరావుపేట హైవేమార్గంలో గుత్తికొండ గ్రామానికి సమీపంలో ఈ బిలాలు వున్నాయి. గుత్తికొండ వరకు బస్సు సౌకర్యం వుండగా, అక్కడి నుంచి నాగార్జునసాగర్ కుడికాలువ గట్టుమీదుగా 5 కిలోమీటర్ల దూరంలో రమ్య మనోహరమైన గుత్తికొండ బిలాలు ఏర్పడి వున్నాయి. నీటిలోకి రూపాయి నాణెం వడవేసి మరలా తీసుకోగలిగినంత స్వేచ్ఛగా ఇక్కడ నీళ్ళు వుంటాయి. ఈ కోనేటిలోని నీటిలో స్నానాలుచేసి దగ్గరలో వున్న శివలింగాలను దర్శిస్తారు. కాశీ నుంచి ఈ బిలం వరకు మార్గం వుందని చెబుతుంటారు. దీనిని దక్షిణ కాశీగా భక్తులు అభివర్ణిస్తారు. ఇక్కడ జలాన్ని సేవిస్తే సమస్త పాపాలు పోతాయని స్థానికుల నమ్మకం.

పూర్వం ఈ బిలంలోకి వెళ్ళాలంటే అనేక ఇబ్బందులు ఎదుర్కొనేవారు. కాని నేడు ఆ పరిస్థితి లేదు. పురాణకాలంలో మహర్షులు ఈ బిలంలో తపస్సు చేసుకునేవారని ప్రతీతి. ముచికుందుడు అనే మహర్షి ఇక్కడ తపస్సుచేసి శ్రీమన్నారాయణ వరం పొంది యోగ నిద్రలోకి వెళ్ళి కొన్ని సంవత్సరాల తరువాత కాలయముడు అనే రాక్షసుడి బారినుంచి తప్పించుకోవడానికి శ్రీకృష్ణుడు ఈ బిలంలోకి ప్రవేశించి యోగనిద్రలో వున్న మునీశ్వరునికి తన ఉత్తరీయాన్ని కప్పి తాను లోపలికి వెళ్ళి గొర్రెలచాటున దాక్కున్నాడని, ఇంతలో రాక్షసుడు గృహలోకి ప్రవేశించి ముసుగులో వుంది శ్రీకృష్ణుడు అని తలచి ముట్టుకోగా ఆ మునీశ్వరుని నేత్రాల నుంచి వెలువడిన అగ్ని ఆ రాక్షసుని దహింపజేసిందని స్థలపురాణం చెబుతోంది.

ఈ ముచికుంద మహర్షికి శ్రీకృష్ణుడు తన విశ్వరూప దర్శనంతో ప్రత్యక్షమయ్యాడని స్థానికులు చెబుతుంటారు. ఈ బిలంలో పల్నాటి వీరులు శ్రీ బ్రహ్మనాయుడు కూడా తపస్సు చేశాడనేది ప్రతీతి. ప్రకృతి రమణీయంగా వుండే ఈ కొండ బాలమల్లేశ్వరాలయం, కనకదుర్గ దేవాలయం, ఆంజనేయస్వామి దేవాలయాలు న్నాయి. నిత్య దీపారాధన, భజనలు ప్రస్తుతం జరుగుతున్నాయి. పల్నాటి వీరుడైన బాలచంద్రుడే బాలమల్లేశ్వరాలయంలోని ఈశ్వరుడని ఇక్కడ వారి నమ్మకం. తొలి ఏకాదశినాడు, దసరా పండుగ పర్వదినాల రోజున ఈ ఉత్సవాలను విశేషంగా నిర్వహిస్తారు.

ఈ ఉత్సవాలకు చుట్టుపక్కల గ్రామాలలో కూడా ఈ వేడుకలు, జాతర్లు జరుపుతారు. ఒకపక్క నాగార్జునసాగర్ కుడికాలువ ద్వారా కృష్ణవేణి ప్రవహిస్తూ ఆహ్లాదాన్ని కలిగిస్తూ వుంటుంది. గుంటూరు జిల్లాలో వున్న దర్శనీయ స్థలాల్లో ముఖ్యమైన ఈ గుత్తికొండబిలం ప్రతిఒక్కరూ ఒక్కసారైనా దర్శించగలిగితే వారికి మన సాంస్కృతిక విలువలు అర్థం కాగలుగుతాయి.

## భారతీయ సంస్కృతికి చిహ్నం

13వ శతాబ్దం నాటి భారతీయ సంస్కృతికి చిహ్నంగా మిగిలిన పుణ్యక్షేత్రం ఇది. రహస్యాలకు కేంద్ర బిందువు అయిన దేవాలయము దక్షిణ భారతకాశీగా ప్రసిద్ధిచెందిన దైవక్షేత్రము అదే గుత్తికొండ బిలం. ఈ బిలం శాలివాహనులు కాలంలో గృచ్ఛాది పట్టణముగా ప్రసిద్ధి చెందిన ఈ ప్రాంతం ఆ తరువాత కాలక్రమేణ గుత్తికొండ బిలంగా రూపాంతరము చెందినది. దట్టమూన అడవి ప్రాంతంలో గుత్తికొండ బిలం వున్నది. బిలం నుంచి 101 సొరంగ మార్గాలు వున్నట్లు స్థానిక పెద్దలు చెబుతున్నారు. ఈ సొరంగాలు చేజర్ల, కోటప్పకొండ, అమరావతి, ఎత్తిపోతల, అహోబిలం, శ్రీశైలం, తిరుమల కొండలలోనికే కాక అక్కడ నుంచి నేరుగా కాశీకి కూడా వెళ్ళే మార్గము వున్నది అని పేర్కొన్నారు. దీనికి అనేక శిలాశాసనాలు వున్నాయి. ఆ శాసనాలల ప్రకారము బిలంకు దక్షిణ కాశీ అని పేరు సార్ధకమైంది. బిలం లోపల ప్రధానంగా రేణుకాబిలం, అహోబిలం, కత్తుల బిలం, కృష్ణాబిలం వంటి ఎన్నో, ఎన్నెన్నో సొరలు వున్నట్లు శాసనాల ఆధారంగా తెలుస్తోంది. అంతేకాకుండా కృష్ణాబిలం దాటివెళ్తే అక్కడ కొన్ని వేల సంవత్సరాల నుంచి ఋషులు, సిద్ధులు, యోగులు తపస్సు చేసుకునే ప్రదేశం వుందని ప్రతీతి. ఇక్కడే 101 శిరస్సుల నాగేంద్రుడు, పుట్ట, అక్షయపాత్రతో గరళం సేవిస్తున్నట్లుగా అతిపెద్ద శివుని విగ్రహం, సాక్షాత్తు దైవతేజస్సు నుంచి ప్రసరించే స్వచ్ఛమైన వెలుతురు మరెన్నో నిగూఢమైన రహస్యాలు దాగివున్నాయని నమ్మకం.

## స్నానమాచరిస్తే పుణ్యం

ఇక్కడ పవిత్ర జలంతో ఒక్కసారి స్నానం చేస్తే లక్షమందికి అన్నదానం చేసిన పుణ్యం లభిస్తుందని పురాణకథనం. ఈ బిలంలో తపస్సు ఆచరించిన వారికి సకల సిద్ధులు లభిస్తాయని భక్తుల విశ్వాసం. సిద్ధులు పొందాలనుకునే భక్తులకు ఇదొక మోక్షస్థానమని నమ్మిక. ఇక్కడకు వచ్చే వారికి మార్గమధ్యంలో కాని, కారు చీకటిలో కాని ఎటువంటి హాని జరుగదని భక్తుల విశ్వాసం. ఈ బిలంలోని నీరు భగవంతుని హృదయమంత స్వచ్ఛంగా వుంటాయని ప్రతీతి.



కొండపైన ఉన్న అన్నదాన సత్రం

10
A Glorious Decade

# ప్రజల చేతుల్లో పాశుపతాస్త్రం

## 'వార్త'కు శుభాకాంక్షలు



అన్నివర్గాల ప్రజల, పాఠకుల
ఆదరాభిమానాలు పొందుతున్న
'వార్త' దినపత్రిక 10వసంతాలు
పూర్తిచేసుకున్న శుభతరుణంలో
యాజమాన్యానికి, సిబ్బందికి
నా హృదయపూర్వక శుభాకాంక్షలు...
పార్టీ కార్యకర్తలకు, శ్రేయోభిలాషులకు
ప్రజలకు, శివరాత్రి శుభాకాంక్షలు
తెలియజేస్తూ... త్రికోటేశ్వరుడు మీకు
సకల శుభాలు కలుగజేయాలని
కోరుకుంటూ....

**మేకపాటి రాజమోహనరెడ్డి**
పార్లమెంట్ సభ్యులు, నరసరావుపేట

"వీరుల దివ్యలింగములు, విష్ణువునాయుడు, కల్లిపోతరా, జారయభైరవుడు,
తుహినాద్రిజ యంలేమ నిర్మాలాంభువై కెరెడు గంగధార మడుగే మణికర్ణిక తున్నీ
భంగులం గారెమపూడి పట్టణము కాశీసుమే కనుగొన్న వారికిన్"
- కవిసార్వభౌముడు శ్రీనాధుడు

# 'దక్షిణ కాశీ' కారంపూడి

పరమ పవిత్రమైన కాశీపట్టణంలో వెలసిన విశ్వనాధుడు దివ్యలింగముల రూపంలో బ్రహ్మనాయుడు విష్ణుమూర్తిగా, అంకమ్మశక్తి అన్నపూర్ణగా, పోతురాజు కాలభౌరవుడిగా, గంగదార మడుగు మణికర్ణికగా, నాగులేరు పవిత్ర దర్శన మిచ్చుచుండగా శ్రీ చెన్నకేశవస్వామి భక్తులపాలిట వరదాభయ మూర్తియై శ్రీదేవి, భూదేవిలతో ఆలలాడుతూ వుండగా, కారంపూడి పట్టణము నిజంగా పల్నాటి వాసులకు కాశీతో సమానమైనది. ఉత్తరముగా ప్రవహిస్తున్న జీవనది నాగులేరు వీరాలయ క్షేత్రమహనీయతత్వమును ద్విగుణీకృతం చేసింది. అందుకే కాబోలు కవి సార్వభౌముడు శ్రీనాధుడు కారంపూడిని 'దక్షిణ కాశీ'గా అభివర్ణించారు.

పౌరుషానికి ప్రతీక పల్నాడు అంటారు. అదేవిధంగా ప్రపంచంలోనే సుమారు 800 సంవత్సరాలకు పూర్వమే దళితులకు ఆలయ ప్రవేశమును కల్పించి సర్వసమానత్వాన భావనతో చాపకూడు సిద్ధాంతమును అమలుచేసిన తొలి సాంఘిక సంకర్త బ్రహ్మనాయుడే. దళితుడైన మాల కన్నమదాసును మానసపుత్రునిగా స్వీకరించి సర్వసైన్యాధ్యక్షునిగా నియమించటం ఆనాడే ఓ గొప్ప సాంఘిక విప్లవాత్మక సంస్కరణలకు బ్రహ్మన్న పూనుకున్నారు. మరుభూమిలో మరణించిన కన్నమదాసును మహావీరునిగా గుర్తించి వీరాలయంలో దివ్య లింగములకు ఎదురుగా ఓ చిన్నగుడిని నిర్మించి ఆరాధించుకోవడం ఇక్కడ విశేషం.

ప్రపంచంలో వీరారాధన మహోత్సవాలు ఇటలీ దేశంలోని రోమ్ నగరంలో జరుగుతాయని పేర్కొంటున్నారు. ఇక భారతదేశంలో ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లా కారంపూడి పట్టణములో మాత్రమే వీరులను ఆరాదిస్తూ ఉత్సవాలు నిర్వహిస్తుంటారు. పల్నాటి సీమలో యుద్ధపటిమలుగల మేటి వీరులుగా పేరుగాంచిన అలరాజు, బాలచంద్రుడు, నారీలోకం గర్వించదగ్గ వీరవనితలు నాయకురాలు నాగమ్మ, మగువ మాంచాల, రతనాల పేరిందేవి, అపర చాణిక్యుడిగా పేరుగాంచిన బ్రహ్మనాయుడు, సర్వసైన్యాధిపతి, బ్రహ్మన్న మానసపుత్రుడుగా పెరిగిన మాల కన్నమదాసు....ఇలా ఎందరో మహనీయుల వీరత్వ త్యాగనిరతికి, ధర్మపరిరక్షణకు సర్వసమాజ నిర్మాణమునకు వీరత్వంతో అమరులైన నాయకుల స్మృతి చిహ్నామే ఈ ఆరాధనలు.

## 'పల్నాడు' కథ ఇదీ..

పల్నాడు అనే పేరుతో వ్యవహరించబడే ఈ ప్రదేశం పూర్వకాలం నుండే ప్రసిద్ధమైనది. రామాయణ కాలంలోని 'దండకారణ్యము'లోనిదే ఈ ప్రాంతం. ఖరుడు ఏలినది కారంపూడి అని, దూషణుడు ఏలినది దుర్గి, మారీచుడు ఏలినది మాచర్ల అని పేర్కొంటున్నారు. ఈ ప్రాంతంలో పాలరాయి ఎక్కువగా దొరుకుటచే పాలనాడు అని, పల్లు ప్రదేశము గావున పల్లునాడు అని అనేక గ్రామాలు వుండుట వల్ల (నాడు) పలునాడు అని, పల్లవులు పాలించుటచే పల్లవనాడు అని పేరు వచ్చిందంటారు. అయితే ఈ ప్రాంతంలో భౌద్ధమతం పరిడవిల్లిన చిహ్నాలు అనేకం వున్నాయి. బుద్ధుని నిర్యానంతరం ఆయన అవశేషాలు అనేక ప్రదేశాలలో నిక్షిప్తం చేసి, స్థూపాలు, చైత్యాలు నిర్మించినట్లు చరిత్రకారులు పేర్కొంటున్నారు. అదేకోవలో బుద్ధని దంతమును ఒకదానిని తీసుకొనివచ్చి ఈ ప్రాంతంలో నాటారని ఓ ఐతిహ్యము, దంతమును పల్లు అని వ్యవహరిస్తారు. పల్లు నాటిన ప్రదేశము కనుక పల్లునాట అని, అదేక్రమంలో వ్యవహరించుటతో పలునాడు, పల్నాడుగా రూపాంతరం చెందిందని పేర్కొంటున్నారు.

జైనమతం కూడా ఈ ప్రాంతంలో విస్తరించియున్నదనటానికి అక్కడక్కడ దర్శనమిచ్చే ఓటిగళ్ళు, ఓటిగళ్ళు ప్రమాణాలు, జైనులు నిర్విస్వరూపాసకులు, విగ్రహ రాధనకు వ్యతిరేఖలు అందువల్ల వారు నిర్మించిన గుళ్ళలో (దేవాలయాలలో) ఏ విగ్రహాలు ప్రతిష్టించారు. ఏ విగ్రహాలు లేనిగూళ్ళు కావుట వల్ల ఓటిగూళ్ళు, ఓటిగుళ్ళు అని పిలిచేవారు. అప్పుడు జైనులు సామూహికంగా నివశించే ప్రదేశమును 'పల్లి' అని పిలిచేవారు. పలుపల్లిలు వున్న ప్రదేశము కావున పల్లినాడు అని అది క్రమంగా 'పలినాడు', పల్నాడు అయినదని చారిత్రక అభిప్రాయం.

## పల్నాటి యుద్ధానికి దారితీసిన పరిస్థితులు

ఆనాటి సమాజంలో వైష్ణవులకు, శైవులకు మధ్యజరిగిన పోరాటమే 'పల్నాటి' యుద్ధమని ప్రతీతి. బ్రహ్మనాయుడు వైష్ణవ మతమునకు ప్రతీకకాగా, నాయకురాలు నాగమ్మ శైవ మతానికి ప్రాతినిద్యం వహించారు. వైష్ణవ పక్షపాతి అయిన బ్రహ్మనాయుడు సర్వమత సమానత్వమును కాంక్షించాడు. దళితులకు ఆలయ ప్రవేశాన్ని కల్పించి, చాపకూడు సిద్ధాంతమును ప్రవేశపెట్టాడు. సాంప్రదాయ వాదులైన శైవులకు, కొన్ని అగ్ర వర్ణాల వారికి ఇవి కరగింపుగా తయారయినవి. అప్పటికే రెండవ ఆరణగండ్ల యుద్ధములో ఉత్తరేశ్వరుడి తరుపున యుద్ధంలో పాల్గొన్న నాగమ్మ తండ్రి చౌదరి రామిరెడ్డి, మేనమామ మేకపోతుల జగ్గారెడ్డి, భర్త సింగారెడ్డిలు కన్నమదాసు చేతిలో హతులయ్యారు. ఇది బ్రహ్మనాయుని ఆదేశం మేరకు జరిగిందని నాగమ్మ కక్షపెంచుకుంది. అదేసమయంలో అనుగురాజు గామాలపాడు అడవులకు వేటకు రావడం, ఆయనను మెప్పించి ఏడు ఘడియలు మంత్రిత్వము నెరవుటకు అనుమతి వత్రమును పొందెను. క్రమేణ గురజాల రాజ్యమునకు వస్తూ పోతున్న బ్రహ్మన్నపై లేనిపోని కొండెములు (సాకులు) చెప్పి నలగామరాజు మనసును విరిచి పల్నాడును రెండుగా విభజింపజేసింది. బ్రహ్మనాయుని సారధ్యంలో మాచర్లను మలిదేవరాజు, పరిపాలించేటట్లు ఒడంబడిక చేసుకున్నారు. ఎలాగైనా మాచర్లను పొందాలనే తలంపు నాగమ్మకు కలిగింది. కోడిపందెములు పెట్టి మాయలతో, మంత్రాలతో బ్రహ్మనాయుడిని ఓడించి మాచర్లను కైవసం చేసుకుంది. ఏడేండ్లు అరణ్యవాసం పేరుతో మండాదిలో వుంటున్న మలిదేవాదులపైకి వారి ఆలమందలపై దాడిచేయించింది. బ్రహ్మన్న అక్కడ నుంచి వీరమేడపైకి వెళ్ళి తమగడువు కాలం పూర్తిచేసుకున్న మర్యాద పూర్వకంగా ఉభయులను బంధువైన అలరాజును రాయభారం పంపినారు. నాగమ్మ రాయభారం తిరస్కరించుటమేకాక వచ్చిన అలరాజు తిరుగు ప్రయాణంలో తంబళ్ళ కొమ్మ జీయర్ ద్వారా విషప్రయోగం చేసి చంపిస్తోంది. నలగామరాజు సోదరుడు నరసింగరాజును రాజ్యప్రలోభాలు పెట్టి దుష్టపన్నాగాలు ద్వారా తనకు దాసుడిగా చేసుకుంది. అలరాజు హత్యతో విజయమో...! వీరస్వర్గమో..! తేల్చుకుందామని కారంపూడిని రణక్షేత్రంగా ఎన్నుకొని వచ్చారు. ఇరుపక్షాలు వారు

.. మిగతా 43 లో



చెన్నకేశవస్వామి దేవాలయం



ఉత్తర వాహినిగా ప్రవహిస్తున్న పవిత్ర నాగులేరు

# దక్షిణ కాశీ కారంపూడి

(42వ పేజీ తరువాయి)

యుద్ధసన్నద్ధులయ్యారు. కొమటి అన్నమ్మ కాలిపై బొంగరం గుచ్చుకోవడంతో ఆమె మాట్లాడిన పౌరుషపు మాటలతో బాలచంద్రుడు వీర విహారంచేసి నరసింగరాజు తలను నరికి కొమ్మరాజుకు బహుమతిగా ఇస్తాడు. అలనాటి రణభూమిలో మరణించిన వీరులందరూ మరణిస్తారు. నాగమ్మ పశ్చాతాపంతో వెళ్ళిపోతుంది. వీరులకు ప్రాణప్రతిష్ట గావించి నలగామరాజుకే పల్నాడు అప్పగించి బ్రహ్మన్న గుత్తికొండ వెళ్ళిపోతారు. అక్కడ శేషజీవితం గడిపారని చరిత్రకారుల అభిప్రాయం.

### మహాభారతాన్ని పోలిన 'పల్నాటి యుద్ధం'

ఒక అద్భుతమైన విశ్లేషణ గల పల్నాటి చరిత్ర సాహితి ప్రపంచంలో ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. మహాభారత కథతో పోలిన ఘట్టాలు పల్నాటి యుద్ధంలో కనిపిస్తాయి.

దాయాదుల కలహం - ఇరువైపుల కోడిపందేశాలు, పాచికలాట - గోగ్రహణం, మందపోరు, కృష్ణరాయభారం - అలరాజు రాయభారం, అభిమన్యుని వీరోచిత పోరాటం - బాలచంద్రుని స్వైరవిహారం, ఇటు కృష్ణుడు - అటు బ్రహ్మనాయుడు, ఇటు కర్ణుడు - అటు నాగమ్మ, ఇటు ధర్మరాజు - అటు మలిదేవరాజు, ఇటు ధుర్యోదనుడు - అటు నలగామరాజు సంఘటనల పోలికతో పల్నాటి చరిత్రను వీరభారతమని చరిత్రకారులు కొనియాడారు.

(ప్రభాతవార్త, కారంపూడి)



బ్రహ్మనాయుడు ఊహాచిత్రం

# తీరంలో ప్రసిద్ధి చెందిన దేవాలయాలు

(ప్రభాతవార్త-రేపల్లె)

కృష్ణానదీ తీరాన వెలసిన దేవాలయాలు రేపల్లె ప్రాంతంలో ప్రసిద్ధిచెందాయి. తీర ప్రాంత ప్రజలలో భక్తిభావం చోటుచేసుకుంది. ఏ దేవాలయాన్ని పరిశీలించిన చారిత్రాత్మక అంశాలు ఆసక్తి కలిగిస్తున్నాయి. రేవల్లె మండలంలోని వెూర్తోట ముక్తేశ్వరస్వామి దేవాలయం కృష్ణానది ఒడ్డునే వుంది. కృతయుగంలో పార్వతీవరమేశ్వరులు కైలాసం నుంచి భూలోకానికి చేరి కృష్ణానది సుందర రూపానికి ముగ్ధులై ముక్తిక్షేత్రంగా ఈ ప్రాంతం విరాజిల్లుతుందని వరం ప్రసాదించడం విశేషం. దీంతో కృష్ణానది లోకపావనిగా ప్రజల మదిలో చెరగని ముద్ర వేసుకుంది. ఈ క్షేత్రంలో భరద్వాజ, ఆత్రి, కస్యప తదితర మునులు తపస్సు చేసుకున్నట్లు చరిత్ర వెల్లడిస్తోంది. ద్వాపర యుగంలో అర్జునుడు ఇంద్ర కీలాద్రిపై చేస్తున్న తపస్సును భంగం కలిగించిన వరాహ రూవంలోని రాక్షసుడిని ముక్తేశ్వరస్వామి దేవాలయం వద్ద వధించి ముక్తిప్రసాదించినట్లు చరిత్ర కథనం. కలియుగంలో కరువు ఏర్పడినప్పుడు వావి వరసలు తెలియక భార్యాభర్తలైన బ్రాహ్మణుని పిల్లలకు ఇక్కడే వారి దోషాలు తొలగిపోయాయి. 1056 నుంచి శాలివాహనం 1240 శకం వరకు గణపతి మహారాజు కాకతీయ రుద్రదేవ మహారాజు, వేమారెడ్డి తదితర రాజ్యాల పాలకులు ఈ దేవాలయం వద్ద ఉత్సవాలను భారీగా నిర్వహించారు. శాలీవాహనం 1500 శకం వరకు వడ్డెర కర్నాటక ప్రభుత్వ పాలకులు, 1712-1811 వరకు జమిందార్ల పాలన ఫలితంగా దేవాలయాల అభివృద్ధి జరిగింది. ముక్తేశ్వరస్వామి దేవాలయానికి 330 ఎకరాల భూమి వుండాల్సి వుండగా 91 ఎకరాల భూమి కృష్ణానది నీటిలో కలిసిపోయింది. మిగిలిన భూములు అన్యాక్రాంతమయ్యాయి.

ఈ దేవాలయం వద్ద 400 సంవత్సరాల నాటి వటవృక్షం వుంది. ప్రస్తుతం ముక్తేశ్వరస్వామి దేవాలయాన్ని అభివృద్ధి చేసేందుకు పునర్నిర్మాణ పనులు జరుగుతున్నాయి. రూ. 12 లక్షలు ప్రభుత్వం విడుదల చేసింది. ఇంకా రూ.10 లక్షలు అవసరమని దేవాదాయ శాఖ అధికారులు భావిస్తున్నారు. మండలంలోని రావిఅనంతవరంలో సుదీర్ఘ చరిత్ర కలిగిన శ్రీవేణుగోపాలస్వామి దేవస్థానం నది ఒడ్డునే వుంది. విష్ణు ధర్మోత్తరం ప్రకారం నదీ తీరాన, అడవులు, వనాలు, కొండలు, కొలను గట్ల ప్రాంతాలలో దేవాలయాలను నిర్మించడం జరిగింది. ఇలా నిర్మిస్తే ఆ ప్రాంతాలలో స్వర్ణలోకవాసులు సంచరిస్తారనేది ప్రతీతి.



ఓల్డ్‌టౌన్‌లోని వేణుగోపాల స్వామి దేవాలయం



అరవపల్లిలోభక్తుల కోర్కెలు తీర్చే బాలకోటేశ్వరస్వామి దేవాలయానికి ఆస్తులు లేనప్పటికి భక్తుల పరంగా పుణ్యక్షేత్రంగా వాసికెక్కింది. ఇక్కడ మహాశివరాత్రి ఉత్సవాలు అత్యంత వైభవంగా జరుగుతుంటాయి. 150 సంవత్సరాల క్రితం ఇక్కడ దేవాలయాన్ని నిర్మించారు. రైతు పొలం నాగలితో దున్నుతున్న సమయంలో శివలింగం బయటపడింది. ఆ శివలింగాన్ని ఇక్కడ ప్రతిష్ఠించారు. గుంటూరు, ప్రకాశం, కృష్ణా జిల్లాల భక్తులు ఇక్కడ జరిగే ఉత్సవాలలో పాల్గొనడం అనాదిగా వస్తోంది. బేతపూడిలోని శ్రీభ్రమరాంబ చెన్నమల్లేశ్వరస్వామి దేవాలయం 1258లో నిర్మించారు. పరిచ్ఛేది వంశీయుడైన బేతరాజు స్వయంభూ అనబడే శివలింగాన్ని ప్రతిష్ఠించారు. పరమశివునికి గోత్రనామాలతో మహాన్యాసపూర్వకంగా అభిషేకం చేస్తే శారీరక, మానసిక రుగ్మతలు తొలగిపోతాయని భక్తుల నమ్మకం.

నల్లూరులోని శ్రీలక్ష్మీనారాయణస్వామి దేవస్థానాన్ని 1811లో నిర్మించారు. ఇక్కడ 1500 సంవత్సరంలో శివాలయం, కాళికాలయాలను నిర్మించారు. కాలగమనంలో ఈ రెండు దేవాలయాలు శిథిలమయ్యాయి. రెడ్డిరాజుల ఆస్థానకవి శ్రీనాధుడు ఈ దేవాలయాన్ని సందర్శించారు. పట్టణంలోని ఓల్డ్‌టౌన్‌లో అతిపురాతన శివాలయం, వేణుగోపాలస్వామి దేవాలయాలు వున్నాయి.

వీటిని శ్రీకృష్ణదేవరాయలు, మహామంత్రి తిమ్మరుసు, మహర్షులు సందర్శించిన ఆధారాలు వున్నాయి. చోడాయిపాలెంలో చోళరాజులు నిర్మించిన చోడేశ్వర దేవాలయం వుంది. భట్టిప్రోలు, వెల్లటూరు, పెదపులివర్రులలో వందలేళ్ళనాటి శివాలయాలు వుండటం విశేషం. ఈ ప్రాంతంలో ఆంజనేయస్వామి దేవాలయాలు భక్తుల పూజలందుకుంటున్నాయి. పట్టణంలో శ్రీవెంకటేశ్వరస్వామి దేవస్థానం తోపాటు షిర్డీ సాయిబాబా, విఘ్నేశ్వరస్వామి దేవాలయాలు, గ్రామీణ ప్రాంతాలలో గ్రామదేవతల దేవాలయాలు వున్నాయి.

# భక్తుల కొంగుబంగారం భోళాలింగేశ్వరుడు

(ప్రభాతవార్త, పిడుగురాళ్ళ టౌన్)

కోరినవారి కోర్కెలు తీర్చే కొంగుబంగారంగా ప్రసిద్ధిచెందిన భోళాలింగేశ్వరుడు భక్తుల నీరాజనాలు అందుకుంటున్నాడు. స్థానిక పిల్లుట్ల రోడ్డులో వేంచేసియున్న భోళాలింగేశ్వరుడు దినదిన ప్రవర్ధమానం చెందుతూ పల్నాడు ప్రాంత ప్రజల సేవలతో విరాజిల్లుతున్నాడు. ప్రజలు కష్టాలలో వున్నప్పుడు ఈ దేవుణ్ణి పూజిస్తే వర్షాలు వస్తాయని, కష్టాలు తీరుతాయనేది వారి నమ్మకం. ఈ నమ్మకంతోనే భక్తులు తండోపతండాలుగా విచ్చేసి దేవుడిని పూజిస్తుంటారు.

**గత చరిత్ర :**

సుమారు 60 సంవత్సరాల క్రితం గ్రామంలోని పిల్లుట్ల రోడ్డులో వున్న సున్నంబట్టీల వద్ద పొన్నాల చంద్రమౌళి పొలంలో వ్యవసాయం చేయుటకొరకు నాగలితో పొలం దున్నుతుండగా, ఒక శివలింగం బయల్పడిందని చరిత్ర ప్రతీ



తి. వెంటనే పొన్నాల చంద్రమౌళి శ్రీరామతీర్థ సేవాశ్రమ కేశవతీర్థ స్వామివారివద్దకు వెళ్ళి ఈ సంగతి తెలియజేయగా, వెంటనే వారు మరికొంతమంది భక్తులతో గ్రామానికి విచ్చేసి శివలింగం బయల్పడిన చోట పూజలు, పునస్కారాలు నిర్వహించారు. ఆ శివలింగానికి శ్రీ కేశవతీర్థస్వామివారు భోళాలింగేశ్వరస్వామిగా నామకరణం చేశారు.

**భక్తుల నమ్మకం :**

కష్టకాలంలో ఈ దేవునికి పూజలు చేస్తే కష్టాలు తీరుతాయనే నమ్మకం భక్తుల ప్రగాఢ విశ్వాసం. గతంలో అనేక సందర్భాలలో వర్షాలు లేనప్పుడు ఈ స్వామివారికి పట్టాభిషేకం చేయగా, వర్షాలు పడ్డాయని...తద్వారా స్వామి తన మహిమలను చూపించి కష్టాలు తీరుస్తున్నాడని ప్రజలు నమ్ముతున్నారు.

**దేవాలయాన్ని సందర్శించిన పీఠాధిపతి :**

దేవాలయ మహిమను గొప్పతనాన్ని గమనించిన శృంగేరి పీఠాధిపతి జగద్గురు శ్రీ భారతీయ తీర్థస్వామివారు దేవాలయాన్ని సందర్శించి కొన్ని ఉపయుక్తాలను వివరించారు. అప్పటి నుంచి స్వామివారి సూచనల మేరకు నూతన దేవాలయ నిర్మాణానికి పనులు చేపట్టారు. పట్టణ ప్రజల నుంచి సుమారు 50 లక్షల రూపాయల విరాళాల సేకరణతో ఐదు ఎకరాల స్థలంలో దేవాలయ నిర్మాణ కార్యక్రమాలు చురుగ్గా జరుగుతున్నాయి. చుట్టూ ప్రాకారం, ముఖ మండపం, అద్దాల మండపంతోపాటు సుబ్రహ్మణ్యస్వామి దేవాలయం, వీరభద్రస్వామి దేవాలయం, విమాన గోపురం, నందీశ్వరుని మండపం, ధ్వజస్తంభం వంటి నిర్మాణాలు పూర్తికావచ్చాయి.

# సృజనాత్మక శక్తిని పెంచుతున్న బోధనా పరికరాలు

(ప్రభాతవార్త, పిడుగురాళ్ళ టౌన్)

సులభపద్ధతుల ద్వారా విద్యను విద్యార్థులకు అందించాలనేది మేధావుల అభిప్రాయం. దీనిని ఆచరణలో పెట్టి విద్యార్థులలో సృజనాత్మకతతోపాటు అవగాహన శక్తిని పెంచుతున్న ఉపాధ్యాయులు జ్ఞానరత్నం అందరికీ ఆదర్శనీయుడే. విద్యార్థులకు అర్థమయ్యే రీతిలో పలు వస్తువులతో విద్యను బోధించి వినూత్నమైన విధానాలను అనుసరిస్తూ ఆదర్శంగా నిలుస్తున్నారు. దాసరి జ్ఞానరత్నం స్థానిక ఎంపియుపి (తండాస్కూల్)లో విద్యార్థులకు ప్రాథమిక స్థాయిలోనే అర్థమయ్యే రీతిలో విద్యను బోధిస్తున్నారు. ఆయన స్వయంగా, విద్యార్థులచేత పలురకాల వస్తువులను (బోధన అభ్యసన పరికరాలు) తయారు చేయించి వాటిద్వారా విజ్ఞానాన్ని పెంపొందిస్తున్నారు.


జ్ఞానరత్నం రూపొందించిన వివిధ రకాల బోధనా పరికరాలు

## థర్మోకోల్‌తో డబ్ల్యుటిసి టవర్ల నిర్మాణం

2001 సెప్టెంబరు 13న అమెరికాలో కూలిపోయిన డబ్ల్యుటిసి టవర్లను థర్మోకోల్‌ను ఉపయోగించి నిర్మించి వాటిద్వారా విద్యార్థులకు అర్థమయ్యే రీతిలో బోదిస్తూ పలువురు ఉపాధ్యాయుల మన్ననలను పొందుతున్నారు. అంతేకాక వివిధ రకాల ఇళ్ళను కార్డుబోర్డుతో తయారుచేసి ప్రదర్శిస్తూ...దూదితో ఆర్కిటిక్ ప్రాంతంలో వుండే ఇగ్లూలను తయారుచేసి వాటి నమూనాలను సైతం విద్యార్థులచేత స్వయంగా రూపొందింపజేస్తున్నారు. రవాణా సౌకర్యాలైన బస్సు, విమానం, పడవ, ఓడ మరియు రాకెట్ నమూనాలను సైతం ఆయన ఈ విధంగానే తయారుచేశారు. కోడిగుడ్డు డొల్లతో పక్షులను, విమానం, హెలికాప్టర్, పెంగ్విన్‌లాంటి పక్షులను తయారుచేశారు.


డబ్ల్యుటిసి టవర్లు

## చరిత్రను తెలిపే స్టాంపులు, నాణేలు

అదేవిధంగా జ్ఞానరత్నం ఒకవైపు విద్యార్థుల సృజనాత్మకతను పెంపొందిస్తూనే మరోవైపు వినూత్న అభిరుచులకు దోహదం చేస్తున్నారు. నాణెముల సేకరణ, స్టాంపుల సేకరణ లాంటి కార్యక్రమాల వైపు విద్యార్థులను ఉత్సాహపరిచేందుకు కృషిచేస్తున్నారు. ఇందులో భాగంగా వివిధ దేశాలకు చెందిన స్టాంపులను, కరెన్సీలను సేకరించి వాటిద్వారా ఆయా దేశాల చరిత్రను విద్యార్థులకు బోధిస్తున్నారు.


జ్ఞానరత్నం సేకరించిన స్టాంపులు

ఎండుగడ్డితో గ్రీటింగ్స్ తయారుచేయుటకు వారిలో చైతన్యాన్ని తీసుకొస్తున్నారు. గతంలో ఇదే స్కూల్‌లో జరిగిన ఎన్నో ఎగ్జిబిషన్స్‌నందు విద్యార్థులతో తయారు చేయించిన, తాను తయారుచేసిన అనేక నమూనాలను ప్రదర్శించి పలువురి ఉపాధ్యాయులచే శభాష్ అనిపించుకున్నారు.



# ఆదర్శంగా నిలుస్తున్న తీరప్రాంత రైతులు



(పొన్నూరు, ప్రభాతవార్త)

గుంటూరు జిల్లాలో తీర ప్రాంతానికి చెందిన పలు మండలాల్లో రైతులు ఉద్యానవన పంటలు వేసి అధిక దిగుబడులు సాధిస్తూ మిగతా రైతులకు ఆదర్శంగా నిలుస్తున్నారు.

తీరప్రాంత మండలాలు: బాపట్ల,కర్లపాలెం, పి.వి పాలెం, నగరం, నిజాంపట్నం, రేపల్లె మొదలగు మండలాలు తీర ప్రాంతం క్రిందకు వస్తాయి.

నేలలు: ఇసుక నేలలు, నల్లరేగడి నేలలు, ఒండ్రు నేలలు.

సాగునీటి సౌకర్యం: దొరువులు, కాలువలు, లిఫ్ట్ ఇరిగేషన్, కొన్ని చోట్ల బోరులు.

పండించు ఉద్యాన పంటలు: పండ్ల తోటలైన మామిడి, నిమ్మ, సపోట, కొబ్బరి, జీడి మామిడి. కూరగాయలైన వంగ,బెండ,బీర,దోస, ఆకు కూరలు, కూర మిరప, గోరు చిక్కుడు, పూల తోటలైన మల్లె, కనకాంబరం, బంతి, గులాబి తదితర పంటలు పండిస్తారు.

విస్తీర్ణాలు: పండ్ల తోటలు సుమారు 500 హెక్టార్లలోను, 200ల నుంచి 300ల హెక్టార్ల వరకు కూరగాయలు, వంద నుంచి 150 హెక్టార్లలో పూల తోటలు సాగవతున్నాయి.

జీడి మామిడి: జీడి మామిడిని ఎక్కువగా బాపట్ల, కర్లపాలెం ప్రాంతాల్లో సుమారుగా 400 హెక్టార్లలో సాగు చేస్తున్నారు. బాపట్ల ప్రాంతంలో బాపట్ల రకాలైన బి.పి.పి..2,బి.పి.పి..5,బి.పి.పి..8 రకాలను పండిస్తారు.

మామిడి: మామిడిలో ఎక్కువగా బంగినపల్లి,నీలం,జలాలు,చిత్తూరు మామిడి, పునాస అను రకాలు ఎక్కువగా ఉన్నాయి.

సపోట: పాల సపోట, కాలపర్తి.

నిమ్మ: కాజిలైమ్.

కొబ్బరి: ఈస్ట్ కోస్ట్, టాల్, గంగా బోండం.

కూరగాయలు పండించే రకాలు: వంగ: వంగలో పూస పర్సుల్ రౌండ్, పూసా క్రాంతి, భాగ్యవతి మొదలైనవి పండిస్తారు.

బెండ: అరక అనామిక, పర్బనీ క్రాంతి, హైబ్రీడ్ రకాలైన మైకో..10, లీడ్ బెలర్..555 తదితరాలు.

బీర:జైపూర్ లాంగ్.

దోస: ఎల్లో రౌండ్.

ఆకు కూరలు: పాలకూర, మెంతికూర, కొత్తిమీర, గోంగూర, తోటకూర మొదలైనవి.

పూల తోటలు: బొడ్డుమల్లె, తీగ మల్లె.

గులాబి: హైబ్రీడ్ గులాబి, కాకినాడ గులాబి మొదలగునవి. పైన తెలిపిన పంటలన్నీ తీర ప్రాంతంలో ఆయా చోట్ల పండిస్తున్నారు.

ఉద్యాన శాఖ ద్వారా తీర ప్రాంత రైతులకు అందించు సహాయ సహకారాలు: (1) జీడి మామిడి తోటలను పెంచుకోదలచిన రైతులకు వంద శాతం రాయితీపై మేలురకాలైన జీడి మామిడి అంటులను ఇస్తున్నారు. (2) సపోటా అంటు మొక్కలు, నిమ్మ మొక్కలను 50శాతం రాయితీపై ఇస్తున్నారు. (3)కూరగాయలను పండించే రైతులకు రాయితీపై మేలు రకాలైన కూరగాయ విత్తనాలను ఇస్తున్నారు.



# సీతజాడ విన్న'కొండ' వినుకొండ



కొండపై వేంచేసి ఉన్న రామలింగేశ్వరస్వామి దేవాలయం

(ప్రభాతవార్త-వినుకొండ)

త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు అరణ్య వాసానికేగినవుడు లంకాధీశుడు రావణుడు మాయాభిక్షువు రూపంలో సీతాదేవిని అపహరించుకుని వెళ్ళే సమయంలో కొండపై నివిసిస్తున్న జరాయువుపక్షి రావణునితో పోరాడి నిస్సహాయురాలై, సీతాన్వేషణ కోసం వచ్చిన శ్రీరామచంద్రునికి సీతాపరహరణం గురించి విన్నవించి అసువులు బాసింది. సీతాపహరణాన్ని శ్రీరామచంద్రుడు జరాయువు ద్వారా వినటం వలన ఈగ్రామానికి 'విన్నకొండ'గా పేరువచ్చింది. కాలగమణంలో రానురాను వినుకొండగా మారింది.



చిన్నకొండపై ప్రతిష్ఠించిన విగ్రహాలు

తద్వారా విను కొండ చారిత్రాత్మక ప్రాధాన్యత సంతరించుకోవడంతో ప్రతి సంవత్సరం ఆషాడశుద్ధ ఏకాదశి నాడు(తొలి ఏకాదశి) తిరునాళ్ళ ఘనంగా జరుపుకుంటారు. వేలాది మంది కుల, మతాలకు అతీతంగా కొండపై వేంచేసి ఉన్న శ్రీరామలింగేశ్వరుడిని భక్తి శ్రద్ధలతో పూజిస్తారు. రావణ సంహారణ అనంతరం శ్రీరామచంద్రుడు సీతానవేతంగా ఈవినుకొండపై శ్రీరామలింగేశ్వరుని ప్రతిష్టించారని ప్రజలనానుడి.

అంతేకాకుండా ఈ కొండపై శ్రీరామచంద్రుడు సీతాస మేతంగా వనవాససమయంలో కొంతకాలం ఇక్కడ గడిపారని చెప్పేందుకు ఆనవాలుగా కొండపై సీతగుండం, రామగుండం అనే నీటికొలనులు ఉన్నాయి. అలాగే సీతాదేవి వామనగుంటలనే ఆటలు ఆడినట్లు సొరంగమార్గంలో జానకిబండ అనేపేరుతో గృహ కూడా కొండపై ఉంది. కొండపై రావణుడితో యుద్ధ సమయంలో మరణించిన జరాయువుపక్షి రెక్కలు ఉన్నట్లు చరిత్రకారులు చెపుతున్నారు.

కాగా ప్రతి ఏడాది తొలి ఏకాదశి పర్వదినం సందర్భంగా వినుకొండ పట్టణంలో తిరునాళ్ళను అత్యంత వైభవంగా నిర్వహిస్తుంటారు. ఈతిరునాళ్ళకు వినుకొండ నియోజకవర్గంతో పాటు జిల్లాలోని వివిధ ప్రాంతాల నుంచి కుల, మతాలకు అతీతంగా వచ్చి కొండపైకి ఎక్కి దర్శనం చేనుకుంటారు. భక్తుల సౌకర్యార్థం ముప్పై సంవత్సరాల క్రితం శిరస్ధాదారుగా ఉన్న స్వర్గీయ యద్దనపూడి జనార్ధనరావు కొండపైకి మెట్లు నిర్మించారు. పండుగ సందర్భంగా స్వామివారికి ప్రత్యేక పూజలు, అభిషేకాలు నిర్వహిస్తారు. నిత్యం పూజలు నిర్వహించేందుకు శాశ్వతంగా పూజారిని నియమించారు.

గతంలో తొలి ఏకాదశి పండుగనాడు కొండనెక్కే భక్తులు నేడు నిత్యం కొండను ఎక్కి స్వామివారిని దర్శించుకుంటున్నారు. వినుకొండ పట్టణంలో పలు సాంస్కృతిక కార్యక్రమాలు చేపడుతారు. ప్రతి సంవత్సరం ఈపర్వదినం సందర్భంగా హాజరైన భక్తులకు ఇబ్బంది కలుగకుండా వర్షాలు పడటం ఆనవాయితీగా మారింది. కొండపై విశేషాలతో పాటు వినుకొండ గ్రామానికి నాలుగువైపులా రక్షణగా ఆంజనేయస్వామి దేవాలయాలుండటం ప్రాధాన్యతను సంతరించుకుంది. కొండక్రింద వినాయక స్వామి దేవాలయం, నరసింహస్వామి దేవాలయంలున్నాయి. దీనిని చిన్న కొండ (చిన్నతిరుమల)గాచెవుకుంటుంటారు. చిన్నకొండ కింద ఉన్న నరసింహస్వామి గుడిని గజినీ మహమ్మద్ ధ్వంసం చేసి, నిధులు కొల్లగొట్టటమే కాకుండా విగ్రహం వికృతంగా పగులగొట్టి ఆలయ ప్రాంగణంలోనే మసీదును నిర్మించినట్లు కూడా చరిత్రకారులు చెపుతున్నారు. అదేవిధంగా కొండ పక్కన ఉన్న గుంటి ఆంజనేయస్వామి దేవాలయం కూడా ప్రసిద్ధి చెందింది. నిమ్మలబావి నీరు రుచి కొత్తవ్యక్తులకు నిమ్మరసం తాగిన భ్రాంతిని కలిగిస్తుంది. పౌరాణిక ప్రాశస్త్యంతో పాటు సాహితీరంగంలో కూడా వినుకొండ రచయితలు వాసికెక్కారు. గబ్బిలం రచయిత కవికోకిల గుర్రం జాషువా వినుకొండ ప్రాంతానికి చెందినవారు కావడం విశేషం.



తొలి ఏకాదశి తిరునాళ్ళ రోజు భక్తులతో కిటకిటలాడుతున్న దృశ్యం

# గుంటూరులో విస్తరిస్తున్న కోల్డ్‌స్టోరేజి పరిశ్రమ



(ప్రభాతవార్త-గుంటూరు)

జిల్లా కేంద్రంలో కోల్డ్ స్టోరేజీల నిర్మాణంరోజురోజుకు విస్తరిస్తున్నాయి. రమారమి నగర పరిసరాల్లో 20కు పైగా వీటి నిర్మాణం పూర్తయి ఇవ్వటికే రైతుల అవసరాలు తీరుస్తున్నాయి.

సరైన మార్కెటింగ్ వసతుల్లేక మిర్చిని తక్కువ రేటుకే అమ్ముకోవాల్సిన దుస్థితిలో వున్న గుంటూరు రైతును కోల్డ్‌స్టోరేజి పరిశ్రమ ఆదుకుంటోంది. డిమాండ్ తక్కువగా వుండి ఉత్పత్తి ఎక్కువ కావడంతో ఆ సంవత్సరంలో రైతాంగం నిల్వ చేసే సౌకర్యం క్వింటాలు 2 వందల రూపాయలకు తెగనమ్ముకునే దుస్థితి ఏర్పడింది. ఆస్థితి నుంచి ప్రస్తుతం మిర్చి రైతాంగం బయటపడింది. గుంటూరు మార్కెట్ యార్డుకుసమీపంలో కోల్డ్ స్టోరేజిలు రావడంతో రైతాంగం ధర లేని సమయంలో తమ సరుకును నిల్వ చేసుకుని ఆ తరువాత ధర వచ్చిన సమయంలో సరుకు అమ్ముకునే వీలు కలిగింది.దీంతోపాటు గతంలో ధరలేని సమయంలో రైతులు తమ సరుకును ప్రైవేటు గోడౌన్‌లలో నిల్వ చేయడం వలన సరుకు నిల్వ చేసుకునే సౌకర్యం ఏర్పడి రంగు తగ్గిపోయే పరిస్థితి పోయింది.

మనం ఏస్థాయిలో అయితే సరుకును వుంచుతామో అదే స్థాయిలో సరుకు నిల్వ వుంటుంది. రైతులకే కాకుండా ఎగుమతి దారులకు కోల్డ్ స్టోరేజిలు వరంగా మారాయి. సరుకునునిల్వచేసి ఎగుమతి మార్కెట్ ఆశాజనకంగా వున్నసమయంలో కోల్డ్ స్టోరేజిలో మంచి సరుకును తీసుకుని తరువాత దానిని అమ్ముకోవడం జరుగుతోంది. రాష్ట్రంలో మిర్చి మార్కెట్‌కు ప్రధానకేంద్రంగా విరాజిల్లు తున్న గుంటూరు కోల్డ్ స్టోరేజిలు అత్యధిక సంఖ్యలో వచ్చాయి. గుంటూరులో 1993 వ సంవత్సరంలో మూడు కోల్డ్ సోరేజిలు వుండేవి. ప్రస్తుతం గుంటూరు మార్కెట్ యార్డు పరిసర ప్రాంతాలలో మొత్తం70కోల్డ్ స్టోరేజిలు వచ్చాయి. మరో ఐదునిర్మాణంలో వున్నాయి. గుంటూరు నుంచి చిలకలూరి పేట వెళ్ళే జాతీయ రహదారికి ఇరువైపులా పొత్తూరుగ్రామం వరకు మాచర్లవెళ్ళేరహదారిలో నల్లపాడు రహదారివరకు వరుసగా కోల్డ్‌స్టోరేజిలున్నాయి.

ఒక్కో కోల్డ్‌స్టోరేజిలో 25 వేల బస్తాలు నుంచి లక్షా 60వేల టిక్కీల వరకు నిల్వచేసే సౌకర్యం వుంటుంది. గుంటూరులో ఎక్కువగా 80 వేల లక్ష టిక్కీల వరకు నిల్వ చేసే సామర్థ్యం వున్న కోల్డ్ స్టోరేజిలు అధికంగావున్నాయి.

1993 సంవత్సరానికి పూర్వం రైతాంగం యార్డుకు సరుకు తీసుకువచ్చిన సమయంలో ధరల లేని పక్షంలో రెండు రోజులు మాత్రం వేచి చూసి ఆ వెను వెంటనే అయిన కాడికి అమ్ముకునే పరిస్థితి నెలకొని వుంది. ప్రస్తుతం రైతాంగం 95 సంవత్సరం నుంచి సరుకు కోల్డ్ స్టోరేజిలో నిల్వ చేయడం రైతాంగం ప్రారంభించింది. కోల్డ్ స్టోరేజిలో సరుకు నిల్వ చేసిన రైతాంగంకు సరుకుపై 13.5 శాతం వడ్డీతో రుణం జాతీయ బ్యాంకులు ఇస్తున్నాయి.

మార్కెట రేటులో 50 శాతం వరకు జాతీయ బ్యాంకులు రుణంగా రైతులకు ఇస్తున్నాయి. సుమారు2 లక్షలరూపాయల వరకు రుణం ఇస్తున్నారు. గృహాల వద్ద సరుకు నిల్వ చేస్తే రంగు తూకం తగ్గిపోతుందని రైతాంగం గ్రహించింది. మార్కెట్‌లో సరకు ఒకేసారి వచ్చిన సమయంలో ధర తగ్గుతుండడంతో ప్రస్తుతం రైతాంగం ఈ సమయంలో సరుకును కోల్డ్ స్టోరేజిలలో నిల్వ చేయడం ప్రారంభించింది.

1997 వసంవత్సరంలో మార్కెట మిర్చి ధర క్వింటాలుకు రెండు వేల రూపాయలకు పడిపోఇంది. దీనితో రైతాంగం కోల్డ్ స్టోరేజిలలో అప్పటిలో సరుకు నిల్వ చేసింది. ఎగుమతి మార్కెటకు ఎక్కువగా రంగుకలిగిన మిర్చి అవసరం ఏర్పడుతుంది. కోల్డ్ స్టోరేజిలలో నిల్వ చేసిన మిర్చికి రంగుస్థిరంగావుంది. గుంటూరులోని కోల్డ్ స్టోరేజిలలో గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలకు చెందిన సరుకునునిల్వచేస్తారు. ప్రస్తుతం గుంటూరులో వున్న కోల్డ్ స్టోరేజిలలో 85 శాతం సరుకు నిండి వుంటుంది.

గుంటూరులో ప్రుత్తం వున్న కోల్డ్ స్టోరేజిలలో ఓక్క మిర్చి మాత్రమే నిల్వ చేసేందుకు వీలుంటుంది. అదే విధంగా అపరాలు నిల్వచేసేందుకు వీలుగా రైతాంగంను చైతన్యవంతం చేయాల్సిన అవసరం వుంది. అదే విధంగా పసుపు నిల్వ చేసేందుకు కూడా సౌకర్యంవుండి కూరగాయలను నిల్వ చేసేందుకు అవసరమైనకోల్డ స్టోరేజి లను నిర్మించేందుకు ప్రభుత్వం ప్రోత్సహించాలని వారు కోరారు.

కోల్డ్‌స్టోరేజిల సంఘం అధ్యక్షడు ప్రకాశరావు నేతృత్వంలో కోల్డ్‌స్టోరేజి యాజమాన్యాలు రైతుల అభివృద్ధికి కృషి చేస్తున్నాయి.

# తెల్లదొరలను వణికించిన కన్నెగంటి హనుమంతు

(ప్రభాతవార్త, మాచర్ల)

కన్నెగంటి హనుమంతు పేరు వింటేనే బ్రిటీష్ అధికారులకు వెన్నులో చలి పుట్టేది. నాటి బ్రిటీష్ పాలకులకు సింహా స్వప్నమైన హనుమంతు శ్వేత జాతి ప్రభుత్వానికి



వ్యతిరేకంగా పుల్లరి ఉద్యమం నడిపి వారి తుపాకీ గుండ్లకు బలయ్యారు.

దుర్గి మండలం మించాల పాడు గ్రామంలో 125 కుటుంబాలు ఉండగా ఉత్తరం దిక్కున దట్టమైన అడవి కలిగి ఉంది. 1922 ఫిబ్రవరి 22న మహాశివరాత్రి పర్వదినం వేడుకల్లో గ్రామ ప్రజలు ఆనందోత్సవాలతో నిమగ్నమై ఉన్న సమయాన తెల్లదొరలు వందమంది మిలటరీ దళంతో మించాలం పాడుకు బయలుదేరారు.

కోలగుట్ల కరణం నదాశివయ్య దుర్గి సబ్ ఇన్స్ పెక్టర్ రాఘవయ్య మిలటరీ దళాన్ని అనుసరిస్తున్నారు. అదే సమయంలో గ్రామానికి దక్షిణ వైపున కొండ లోయ వద్ద ఉన్న బావికి మంచి నీటి కోసం వచ్చిన మించాలపాడు పశువులను మిలటరీ దళం ముట్టడించింది. ఆ పశువులను బందె దొడ్డికి తోలుకెళ్తున్న మిలటరీ దళాన్ని హనుమంతు అల్లుడు పసుపులేటి చిన్నయ్య అడ్డగించి తమ పశువులను వదలమని కోరగా పోలీసులు అతనిని తుపాకి నడుమతో కొట్టి తీవ్రంగా హింసించారు.

దీంతో ఆగ్రహించిన పశువుల కాపలాకు వచ్చిన రైతులు పోలీసులపై రాళ్ళురువ్వారు. ఇందుకు ఆగ్రహించిన మిలటరీ దళం లారీచార్జ్ జరిపి రైతులను చెదరగొట్టారు.

విషయం తెలునుకున్న హనుమంతు నిరాయుధుడిగానే పోలీసులతో పోరు నల్పేందుకు బయలుదేరారు. ఆయనను గ్రామ ప్రజలు అనునరించారు. ఈవిషయాన్ని గమనించిన కరణం నదాశివయ్య హనుమంతు మన దగ్గరకు వస్తే బతకనివ్వడనీ, కాల్చండని అంటూ హెచ్చరించడంతో పోలీసులు హనుమంతుపై తుపాకి ఎక్కి పెట్టి కాల్చటంతో హనుమంతుతో పాటు పాలేరు ఎల్లంపల్లి శేషు, మరో 28 మంది మృతి చెందారు.

ఆ ప్రాంతం రక్తంతో ఏరులైపారించి, హనుమంతు మృతదేహాన్ని కోలగుట్ల సమీపంలో ఉన్న దంతె వాగు వద్దకు తరలించి శవ పరీక్షలు అనంతరం ఖననం చేశారు.

పల్నాడులో నమర్థవంతంగా జరుగుతున్న నహాయ నిరాకరణ ఉద్యమాన్ని నీరుగార్చటానికి బ్రిటీష్ ప్రభుత్వం రామాపురం, జెట్టిపాలెం, జంగమహేశ్వరపురం గ్రామాల పై పోలీసు మిలటరీ దాడులు జరిగాయి. మించాలపాడు గ్రామ ప్రజలంత హనుమంతుకు అండగా నిలిచారు. ఈనేపథ్యంలో అప్పటి జిల్లా కలెక్టర్ రూథర్‌ఫర్డ్ హనుమంతుకి దనాశ చూపి ఉద్యమాన్ని నీరుగార్చేందుకు చేసిన ప్రయత్నాలు విఫలమైయాయి. ఉద్యమం నా ఊపిరి... ప్రజలే నాసర్వశ్వం ఉద్యమాన్ని విరమించుకోనని ఆక్రోశంతో అన్న మాటలను చూస్తే హనుమంతులో దేశ భక్తి ఏ మేరకు ఉందో అర్థమవుతుంది. తుపాకి గుండ్లకు బలైన హనుమంతుపై కసితీరని రూథర్‌ఫర్డ్ సమాధిపై ఉన్న శిలాఫలకాన్ని నెలరోజుల తరువాత ముక్కలుముక్కలుగా పగల కొట్టి బావిలో పడేజి తన కసిని తీర్చుకున్నాడు. మించాలపాడు దంతె వాగులో ఉన్న హనుమంతు సమాధికి ఎటువంటి భద్రతలేకపోవడంతో 1946లో ఆచార్య ఎన్‌జి రంగా హనుమంతు సమాధిని సందర్శించి సమాధి మరమ్మతులకు కొంత మేర ధన సహాయం చేశారు.

తెలుగుదేశం పార్టీ అధ్వర్యంలో పల్నాటి వీరుల విగ్రహా ప్రతిష్ట కమిటీ ఏర్పడి హనుమంతు సమాధి పున: నిర్మాణానికి నడుం బిగించింది. రిటైర్డ్ రాష్ట్ర ఎక్సైజ్ జాయింట్ కమిషనర్ మిరియాల అనంత రామయ్య ఆధ్వర్యంలో 2004 ఫిబ్రవరి 23న మాచర్ల పట్టణ నడిబొడ్డున ఏర్పాటు చేసిన కాంస్య విగ్రహాన్ని అప్పటి రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖామంత్రి కోడెల శివప్రసాదరావు ఆవిష్కరించారు. విగ్రహా ప్రతిష్టతో పాటు 2 లక్షల వ్యయంతో కోలగుట్లలోని హనుమంతు సమాధిని పున: నిర్మించారు. మాతృదేశం కోసం అనువులు బాసిన హనుమంతు భావితరాలు గుర్తుంచుకునే విధంగా స్థిర స్థాయిగా నిలిచిపోయారు.









# ఆధునిక దేవాలయం నాగార్జున సాగర్

(ప్రభాతవార్త, విజయపురిసౌత్)

నేడు భారతదేశానికే తలమానికంగా, ఆంధ్రప్రదేశ్ అన్నపూర్ణగా పేరొంది, రైతుల పాలిటి బాగ్యదాయినిగా భాసిల్లుతున్నది ప్రపంచ ఖ్యాతి నార్జించిన నాగార్జునసాగర్ ప్రాజెక్టు. రైతులకు బంగారు పంటలు వండిన్నూ, ఆంధ్రదేశాన్ని నన్య శ్యామలం చేస్తున్న ఈ ప్రాజెక్టు 50 వసంతాలను పూర్తి చేసుకున్నది. మన తొలి ప్రధాని పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ 1955 డిసెంబర్ 10న డ్యాం నిర్మాణానికి శంకు స్థాపన చేసి దీనిని ఒక ఆధునిక దేవాలయంగా వర్ణిస్తూ అన్న మాటలివి... ఈనాగార్జున సాగారానికి నేనిచట జరిపే ఈ శంకు స్థాపన పవిత్ర కార్యంగా పరిగణిస్తున్నాను.. ఇది భారత సౌభాగ్య మందిరానికే శంకు స్థాపన. ఈనాడు మనం అసేతు హిమాచల పర్వతం నిర్మించుకుంటున్న నవ దేవాలయానికిది చిహ్నం.. అని నెహ్రూ కొనియాడారు. నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణానికి వి ఎస్ ఖోస్లా కమిటి ఎంపిక చేసిన స్థలం అఖండ గత వైభవాన్ని సంతరించుకొన్న సిరి సందపలతో తుల తూగిన శ్రీ పర్వత లోయ. జగద్విఖ్యాతి గాంచిన మహాయాన బౌద్ధ పండితుడు శ్రీ ఆచార్య నాగార్జునుని పేరు ఈ



నాగార్జునసాగర్ ప్రాజెక్టు శంకు స్థాపనకు విచ్చేసిన జవహర్‌లాల్ నెహ్రూ

ప్రాజెక్టుకు పెట్టారు. ఇక్ష్వాక రాజ వంశానికి రాజధానిగా చరిత్ర ప్రసిద్ధికెక్కిన విజయపురి పేరుతో ఈప్రాంతాన్ని దక్షిణ విజయపురి, ఉత్తర విజయపురిగా పిలుస్తున్నారు. ఎందరో జాతీయ, రాష్ట్ర నాయకుల, ఇంజనీర్ల, శ్రామికుల అకుంటిత 'దీక్షాఫలం' సాగరమనే ఈ అమృత ఫలం నేడు ఈ ప్రాజెక్టు నుంచి అందుకుంటున్న ఫలాలు ఎందరో నాయకుల త్యాగ ఫలితం. వారిలో సుప్రసిద్ధ ఇంజనీరైన కె యల్ రావు, ముక్త్యాల జమిందారు మహేశ్వం ప్రసాద్‌ల ఆలోచనలు నేటి ప్రాజెక్టు రూపానికి మూలములు. వారు కలలుగన్న సాగర్ ప్రాజెక్టు పూర్తయి ఎంతో మందికి జీవనాధారమైంది.

డ్యాం నిర్మాణంలో ఛీఫ్ ఇంజనీర్‌గా సేవలందించిన మీర్ జాఫర్ అలీ యొక్క నిబద్ధత నేటికి చిరస్మరణీయం. ఈప్రాజెక్టు నిర్మాణం లక్షలాది శ్రమ జీవుల శ్రమ శక్తితో జరిగింది. సుమారు నలభై అయిదు వేల మంది శ్రామికులు 12 సంవత్సరాలు వారి స్వేద జలాన్ని ధారపోసి ఈమహాసాగారాన్ని 1970 నాటికి పూర్తి చేశారు. డ్యాం నిర్మాణ సమయంలో ప్రమాదవశాత్తు మరణించిన ఎనిమిది మంది ఇంజనీర్లు, 154 మంది శ్రామికుల స్మృత్యర్థం వారి పేర్లతో పెద్ద స్థూపాన్ని స్వర్ణోత్సవాల సందర్భంగా సాగర్‌లో ప్రతిష్టించడం సాగర్ నిర్మాతలకు మనం అర్పించే నిజమైన నివాళి. కెఎల్ రావు, మీర్ జాఫర్ అలీ, ఆ సమయంలో ముఖ్యమంత్రిగా వున్న కాను బ్రహ్మానందరెడ్డి, ఆచార్య నాగార్జునుడు, గౌతమ బుద్ధుడు విగ్రహాలను డ్యాం దగ్గర నెలకొల్పడం శ్లాఘనీయం.

## ప్రాజెక్టు విశిష్టతలు

ప్రపంచంలో రాతితో నిర్మించిన ప్రాజెక్టుల్లోకెల్లా నాగార్జునసాగర్ డ్యాం పొడవులోనూ, ఎత్తులోనూ ప్రథమ స్థానంలో ఉన్నది. విదేశీ ఇంజనీర్ల ప్రమేయం లేకుండా పూర్తిగా భారతీయ ఇంజనీర్లచే నిర్మితమైన మొట్ట మొదటి ప్రాజెక్టు ఇదే కావడం మనకు గర్వకారణం. ఈడ్యాం అట్టడుగు పునాది స్థాయి నుంచి 409 అడుగులు, సాధారణ పునాది స్థాయి నుంచి 404 అడుగుల ఎత్తులో నిర్మించారు. సముద్ర మట్టానికి 590 అడుగుల జలాశయ నీటి మట్టమున్నది. ఈప్రాజెక్టు నిర్మాణంలో ఉపయో గించిన రాయి దాదాపుగా 7.37 మిలియన్ క్యూబిక్ గజాలకు సమా నం. అంటే ఈజిప్టులోని పిరమిడ్ల నిర్మాణానికి ఉపయోగించిన రాయికి 3 రెట్లు అధికం.



కళకళలాడుతున్న నాగార్జున సాగర్ డ్యాం

వరద నీరు ప్రవహించడానికి వీలుగా రాతి ఆనకట్టకు 1546 అడుగుల పొడవుతో జల ప్రవాహిత భాగం (స్పిల్‌వే) నిర్మించారు. దీనికి రెండు వైపుల ఉన్న జల ప్రవాహరహిత ప్రాజెక్టు పొడవు సుమారు 3211 అడుగులు. ప్రాజెక్టు నిర్మాణ దశలోనే 405 అడుగుల ఎత్తున ఎడమ వైపున 8 పెన్ స్టాక్ పైపులను, కుడి వైపున 479 అడుగుల ఎత్తున 3 పెన్ స్టాక్ పైపులను ఇక్కడి జల విద్యుత్ కేంద్రాలకు నీరు సరఫరా చేయుటకు అమర్చారు. డ్యాం నీటి ప్రవాహిత భాగంలో సముద్ర మట్టానికి 546 అడుగుల ఎత్తున 45 అడుగుల ఎత్తు, 44 అడుగుల వెడల్పు గల 26 రేడియల్ క్రస్టు గేట్లను డ్యాంకు అమర్చారు. రిజర్వాయర్‌లోకి వచ్చే వరద నీటిని ఈగేట్ల ద్వారా కృష్ణా నదిలోకి వదలవచ్చు. సాగర్ రిజర్వాయర్ ఆసియా, యూరప్ ఖండాలలోని మానవ నిర్మిత మొదటి స్థానాన్ని, ప్రపంచంలో తృతీయ స్థానాన్ని పొందింది. సాగర్ రిజర్వాయర్ పూర్తిగా నిండినప్పుడు నీటి వ్యాప్త ప్రాంతం 380 చదరపు కిలో మీటర్లు, గరిష్ఠ నీటి నిలువ పరిమాణము 408 శతకోటి ఘనపుటడుగులు ప్రధాన రాతి కట్టడము డ్యాంకు ఇరువైపులా దాదాపు 90 అడుగుల ఎత్తుకు మట్టికట్టలు నిర్మించారు. ఈ ఎర్త్ డ్యాం మొత్తం పొడవు 11200 అడుగుల ఈ పొడవుతో కలుపుకొని మొత్తం ఆనకట్ట పొడవు 15956 అడుగులు.



ప్రాజెక్టు ప్రారంభోత్సవానికి విచ్చేస్తున్న ఇందిరా గాంధి

## జవహర్, లాల్‌బహదూర్ కాల్వలు

జవహర్ కాల్వని మనం కుడి కాలువగా పిలుస్తాము. ఈకాల్వ పనులకు అప్పటి ఆంధ్ర రాష్ట్ర ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి 1956 అక్టోబర్ 10న ప్రారంభించారు. ఈకాలువ హెడ్ రెగ్యులేటర్‌కు తొమ్మిది గేట్లు వున్నాయి. ఈ కాలువ దక్షిణ విజయపురి వద్ద సొరంగ మార్గం ద్వారా ప్రారంభమై సుమారు 392 కిలో మిటర్లలో ప్రయాణిస్తూ, గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో 20 లక్షల 22వేల ఎకరాలకు నీరు అందించుకుంటూ ప్రవహిస్తుంటుంది. లాల్ బహుదూర్ కాల్వ కాల్వ పనులను అప్పటి గవర్నర్ భీమసేన్ సచార్ 1959లో ప్రారంభించారు. ఈ కాలువ పొట్టిచలము నుంచి చలకుర్తి వరకు సొరంగ మార్గం ద్వారా ప్రయాణిస్తూ సుమారు 14 లక్షల 30 వేల ఎకరాలకు నీరందిస్తుంటుంది. నల్గొండ జిల్లాకు ఈ కాల్వ మీద ఎత్తిపోతల పథకాలను అమలు పరుస్తున్నారు. 1976 ఆగస్టు 4న నాటి ప్రధాని ఇందిరాగాంధీ కుడి, ఎడమ కాల్వలను ప్రారంభించారు. ఈకాల్వల నిర్మాణానికి సుమారు రూ.675 కోట్లు వ్యయమైనట్లు అంచనా.

# బాయర్ క్రాప్ సైన్స్

ప్రభాతవార్త-గుంటూరు

1863 సంవత్సరంలో ఫ్రెడ్రిక్ బాయర్, ఫ్రెడ్రిక్ వస్కాట్‌లచే జర్మనీలో స్థాపించబడిన బాయర్ కంపెనీ ఇప్పటికి 140 సంవత్సరాలుగా ఎన్నో విశిష్ట ఉత్పాదనలను సుమారు 165 దేశాలకుపైగా ఉన్నకోట్లాది మంది రైతులకు అందిస్తూ గత సంవత్సరం ప్రపంచంలో అతి పెద్ద కంపెనీలలో ఒకటైన అవంటిస్ క్రాప్ సైన్స్ ను విలీనం చేసుకోవడంతో ప్రపంచంలో 400 కంపెనీల మొత్తం మార్కెట్ షేర్ 78 శాతం కాగా, బాయర్ ఒక్కటే 22 శాతం మార్కెట్ షేర్‌తో అగ్రస్తానంలో ప్రతి యేటా పరిశోధనలు మరియు అభివృద్ధి నిమిత్తం 13,300 కోట్లు రూపాయలు ఖర్చు పెడుతున్నట్లు కంపెనీ జనరల్ మేనేజరు ఎం. రామారావు తెలిపారు.

ఈ పరిశోధనల ఫలితంగా గత 14 సంవత్సరాలుగా ఎన్నో విశిష్ట ఉత్పాదనలు అయిన గౌచో, కాన్ఫిడార్, ఎంట్రాకాల్, లార్విన్, రిజెంట్, హోస్టాథియాన్, టాప్ స్టార్, హినోసాస్, స్పార్క్, స్పింటార్, డెసిస్, ప్రొటేగా, క్యాలిప్సో మొదలైన మందులను కంపెనీ రైతు సోదరులకు అందించి మన్ననలను పొందిందని అన్నారు.

ఈ ఉత్పత్తులను మార్కెట్ చేయడంతో పాటు రైతాంగానికి క్రొత్త పరిశోధన అంశాలను చేరవేయడం, రైతు సదస్సులను నిర్వహించి సాంకేతికంగా చైతన్య వంతులను చేయడం, క్షేత్ర ప్రదర్శనలు నిర్వహించడం, పురుగు మందుల వాడకంలో పాటించవలసిన జాగ్రత్తలను వివరిస్తూ, పురుగు మందుల విష ప్రభావమునకు లోను కాకుండా కాపాడే ప్రత్యేక పిచికారి దుస్తులు (ఎప్రాస్) సుమారు 2000 వరకు ఒక్క గుంటూరుజిల్లాలోనే రైతులకు అందించడం జరిగిందని రీజనల్ మేనేజర్ యం. మోహనరావు వివరించారు. అంతే గాక కంపెనీలో నిష్ణాతులైన వ్యవసాయ పట్ట భద్రులు మరియు శిక్షణ పొందిన ఫీల్డు స్టాఫ్ ద్వారా రైతులకు తగు సమయంలో, సరియైన సలహాలు ఇవ్వడం జరుగుతుందని కూడా చెప్పారు.

పైన చెప్పిన విషయాలు కాకుండా ప్రతి ఏరియాలో వ్యవసాయంలో నిష్ణాతులైన డాక్టరేట్స్ ఒక ప్రత్యేకమైన బయోలాజికల్ డిపార్టుమెంట్ లను స్థాపించడం జరిగింది. ఈ డిపార్టుమెంట్స్ ద్వారా ఎప్పటి కప్పుడు చీడపీడల ఉధృతిని పర్యవేక్షించడం మరియు వాటి నిరోధక శక్తి పెంపుదలను గమనించడంతో పాటు వాటిని నియంత్రించటానికి తగు సలహాలు, సూచనలు ఇవ్వడం జరుగుతుందని, రైతుల్లో ఎంతో ప్రాచుర్యం పొందిన ఈ బాయర్: కంపెనీ విత్తన శుద్ధి దగ్గర నుంచి పంట కోతకు వచ్చినంత వరకు అవసరమయ్యే కలుపు, మరియు తెగుళ్ళు నివారించే ప్రత్యేక తరహాలో పనిచేసే ఉత్పాదనలను రైతులకు అందించడం జరుగుతుందని, వరి పంటపై అగ్గితెగులు నివారణరకు ఇటీవల ప్రొటేగా అనే కొత్త ఉత్పత్తిని మార్కెట్‌లో ప్రవేశపెట్టడం జరిగిందని తెలిపారు. దీని ప్రభావం వరిపై ఎక్కువ కాలం ఉండడం వలన వరిని అధికంగా పండించే అభివృద్ధి చెందిన దేశాలైన జపాన్, కొరియా రైతులచే ఇప్పటికే విరివిగా వాడబడుతున్నదని, దీనిని భారతదేశంలో ప్రభుత్వ వ్యవసాయ విశ్వ విద్యాలయాలు మరియు వరి పరిశోధనా మండలి ( డిడిఆర్) వారి వివిధ ప్రాంతీయ పరిశోధనాశాలలో క్షుణ్ణంగా పరిశీలించబడి, మన దేశంలో వరిపై వచ్చే అగ్గి తెగులు నిర్మూలనకు లభ్యమౌతున్న వివిధ ఉత్పత్తుల లో అత్యున్నత శ్రేణికి చెందినదిగా సిఫారసు చేయబడిందని తెలిపారు. అంతేగాక క్యాలిప్సో అనేనూతన ఉత్పత్తి బిటి ప్రత్తిని ఆశించి నాశనం చేసే పచ్చదోమ, పేనుబంక మరియు ఆకుముడతను అతి ప్రభవవంతంగా అరికుతుందని, తద్వారా పూర్తి దిగుబడి సామర్థ్యాన్ని కలిగిస్తుందని తెలిపారు. కాబట్టి రైతులు పాత పద్దతుల లో కాక, ఇలాంటి సరికొత్త సాంకేతిక విలువలతో కూడిన మందులను వాడటం తప్పనిసరి అని పేర్కొన్నారు.

నాణ్యమైన ఉత్పాదనలు అందచేస్తున్న బాయర్ పురుగుమందులు వాడినట్లయితే అధిక దిగుబడులు పొందవచ్చని గుంటూరు 2 ఫీల్డ్ మార్కెటింగ్ మేనేజర్ పి. శ్రావణ్ కుమార్ సూచించారు. ఈ సంవత్సరం గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, జిల్లాలలోని ముఖ్యమైన గ్రామాలలో రైతు సలహా కేంద్రాలు ఏర్పాటు చేసి రైతులకు తగిన సలహాలు, సూచనలు అందచేస్తామని గుంటూరు 1 ఫీల్డ్ మార్కెటింగ్ మేనేజరు ఎన్. నాగేంద్రరావు తెలిపారు.

## యునైటెడ్ ఫాస్ఫరస్ ఒక విజయ పరంపర

2 దేశాలలో స్వంత సంస్థలను కలిగి 110 దేశాలకు 1000 కోట్ల రూపాయలకు పైగా పురుగు మందులను ఎగుమతి చేస్తున్న ఏకైక భారతీయ బహుళజాతి సంస్థ - యు.పి.ఎల్.

1969వ సంవత్సరంలో స్థాపించబడిన యు.పి.ఎల్. స్వంత రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్‌తో సాధించిన కృషి ఫలితంగా 200 పైగా విదేశీ రిజిస్ట్రేషన్‌లను కలిగి 2005-06 సంవత్సరానికి రెండు వేల కోట్లు రూపాయల వ్యాపార లక్ష్యంతో ముందుకు సాగుతున్న అగ్రగామి సంస్థ యు.పి.ఎల్.

ఐ.ఎస్.ఓ. 9001, ఐ.ఎస్.ఓ. 14001, ఓహెచ్‌ఎస్‌ఏఎస్ 18001 అంతర్జాతీయ నాణ్యతా ప్రమాణాలు సాధించిన సస్యరక్షణ ఉత్పాదనలు (మిగతా 70వ పేజీలో..)

# వాణిజ్య పంటలకు స్వర్గధామం గుంటూరు

(ప్రభాతవార్త–గుంటూరు)

వాణిజ్య పంటలకు అంతర్జాతీయ వ్యాప్తంగా గుంటూరు జిల్లా నిలయం. ఇక్కడి రైతులు ఏళ్ల తరబడి అత్యున్నతంగా దిగుబడులు సాధిస్తున్నారు. వర్జీనియా పొగాకు ఉత్పత్తిలో ప్రపంచంలోనే గుంటూరుకు పేరు ప్రఖ్యాతులు వున్నాయి. గుంటూరు మిర్చి ఆసియాలోనే అతి పెద్ద గుంటూరుమిర్చి యార్డు పెద్దదిగా ఉంది. రాష్ట్రంలో పత్తి,మిర్చి ఉత్పత్తిలో గుంటూరు అగ్రస్థానంలో కొనసాగుతోంది. ఏళ్ళ తరబడి వాణిజ్యపంటల ఉత్పత్తులకు గుంటూరు ప్రధానకేంద్రంగా ఉంది. దీనిని దృష్టిలో పెట్టుకొని గుంటూరులో వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతులకు సంబంధించిన అగ్రికల్చర్ ఎక్స్‌పోర్ట్స్ జోన్‌ను ఏర్పాటు చేశారు. వాణిజ్య పంటలకు కేంద్రం కావటంతో వ్యవసాయ ఆధారిత పరిశ్రమలు కూడా ఇక్కడ ఎక్కువగా ఉన్నాయి. పొగాకు పంటకు సంబంధించి దేశం మొత్తానికి ప్రాతినిధ్యం వహిస్తున్న పొగాకుబోర్డు గుంటూరు కేంద్రంగా ఉంది. ప్రత్తి,



మిర్చి పంటల ఆధారంగా ఏర్పాటు చేసిన వంద జిన్నింగ్ మిల్లులు, 70 కోల్డ్‌స్టోరేజ్‌లు ఉన్నాయి. ఇంకా ఈ పరిశ్రమ విస్తరిస్తోంది.

ఆసియాఖండంలోనే పేరెన్నిక గల గుంటూరు మిర్చియార్డులో సంవత్సరానికి 500 నుంచి700 కోట్ల రూపాయల లావాదేవీలు జరుగుతుంటాయి. గుంటూరు, నర్సరావుపేట డివిజన్‌లలో పత్తి, పొగాకు తదితర వాణిజ్య పంటలు పండిస్తున్నారు. మూడు సంవత్సరాల నుంచి వర్షాలు లేకపోవటం, సాగర్‌కాల్వలో నీరు లేకపోవటం వలన రైతులు ఇబ్బంది పడుతున్నా 2005లో కురిసిన భారీ వర్షాలతో సాగర్‌కు జలకళ వచ్చింది. దాదాపు నెల రోజులుగా సాగర్ గేట్లు ఎత్తి వరద ఉధృతిని తగ్గించుకోగలిగారు. అంతర్జాతీయ మార్కెట్‌లో పొగాకు ఎగుమతులకు గుంటూరు ప్రధాన కేంద్రంగా ఉంది. జిల్లాలో సుమారు 9 లక్షల హెక్టార్లు వ్యవసాయ భూమి ఉండగా ఐదులక్షల హెక్టార్లలో వాణిజ్య పంటలు పండిస్తున్నారు. వర్షాలు లేకపోవటం, కాలువలకు నీరు రాకపోవటం వలన మాగాణి భూముల్లో కూడా రెండుమూడు సంవత్సరాల నుంచి మిర్చి, పత్తి సాగు చేస్తున్నారు. వాణిజ్యపంటలు కేంద్రంగా ఉండటం వలన లాంఫారం, బాపట్ల వ్యవసాయ కళాశాల, కాపూరు కృషి విజ్ఞాన కేంద్రం తదితర కేంద్రాలలో వ్యవసాయ పరిశోధనలు నిత్యం జరుగుతున్నాయి.

రాష్ట్రంలోని రాయలసీమ, తెలంగాణా జిల్లాల నుంచి కూడా రైతులు గుంటూరు మిర్చి యార్డుకు వస్తుంటారు. ఆరువందల కమిషన్ షాపులు, వందమంది మిర్చి ఎగుమతి దారులు ఇక్కడ పనిచేస్తుంటారు. వాణిజ్య పంటలు విరివిగా పండటం వలన రైతులలో చైతన్యం కూడా బాగా పెరిగింది. ఇటీవల సరైన గిట్టుబాటా ధరలు లేక మిర్చి, పత్తిరైతులు నష్టపోతూ వచ్చారు. రానురాను వాణిజ్య పంటలు వ్యయం పెరిగి రైతులకు భారంగా మారాయి.

మొదట్లో పత్తిపంటలు వేసి బాగా లబ్ధిపొందిన రైతులు ఖరీదైన మందులు ఉపయోగించి అధిక లాభాలకోసం ఖర్చులు పెంచుకొంటున్నారు. రానురాను పొగాకు పంట విస్తీర్ణం పెరుగుతూ వచ్చింది. వాణిజ్యపంటకు కేంద్రంగా ఉన్న గుంటూరులో గానిపైన అధారపడిన ఎరువులు, పురుగుమందుల వ్యాపారం కూడా రాష్ట్రంలోనే అధికంగా ఉంది. ఆధునిక పంగడాలను ఉపయోగించటంలో గుంటూరు ప్రసిద్ధిచెందింది.

## పల్నాటిప్రాంగణంలో మొదటి మున్సిపాలిటీ నరసరావుపేట

(ప్రభాతవార్త–నరసరావుపేట)

వీరపల్నాటి ప్రాంగణంలో ఏర్పాటైన మొట్టమొదటి మున్సిపాల్టీ నరసరావుపేట. నరసరావుపేట పట్టణం 200సంవత్సరాలు పైబడిన చరిత్ర కల్గి 1997లో ద్విశతాబ్ది ఉత్సవాలు జరుపుకుంది. అట్లూరుగా ఆవిర్భవించి ఎన్నో హంగులు సంతరించుకున్న పట్టణ మున్సిపాల్టీకి ఎనిమిది దశాబ్దాలు పైబడిన చరిత్ర ఉంది. 1915లో కౌన్సిల్ ఏర్పడింది. అయితే తొలి 11సంవత్సరాల్లో చైర్మన్లుగా అప్పటి ఆర్‌డిఒలు, బ్రిటీష్‌పాలకులు నియమించిన కొందరువ్యక్తులు పనిచేశారు. చైర్మన్లు ఎక్కువమంది కొద్దినెలలుమాత్రమే పనిచేయడం విశేషం. 1927నుండి చైర్మన్ పదవికి ఎన్నికలు జరిగాయి. ఆపద్ధతి 37ఏళ్ళపాటు కొనసాగింది. ఆతరువాత 1965నుండి స్పెషల్ ఆఫీసర్లపాలన 16ఏళ్ళపాటు సాగింది. 1992నుండి మూడేళ్ళ స్పెషల్ ఆఫీసర్ల పాలన జరిగింది. కొత్తూరు వెంకటేశ్వర్లు, డాక్టర్ షేక్ ఫరీద్, షేక్ సుభాని, క్రోసూరి రంగారావు, వనమా సుబ్బారావు, గోనుగుంట్ల జోగేశ్వరమ్మ, ప్రస్తుతం కుంచాల రోశమ్మలు చైర్మన్లుగా పట్టణానికి అభివృద్ధిపథంలో నడిపించేందుకు తమవంతు కృషిచేశారు. పట్టణ ప్రజలకు అవసరమైన సౌకర్యాలన్నింటినీ కోట్లాదిరూపాయల నిధులతో సమకూర్చారు. సాహితీకార్యక్రమాలకు భువనచంద్ర టౌన్‌హాల్ క్రీడాకారులకు డాక్టర్ కోడెల శివప్రసాదరావు క్రీడాప్రాంగణం, ముస్లింలకు షాదీఖానాలను ఏర్పాటుచేశారు. పట్టణ ప్రజల దాహార్తిని తీర్చేందుకు కోట్లాదిరూపాయల వ్యయంతో రెండోమంచినీటి వధకాన్ని అందుబాటులోకి తెచ్చారు. దీనివల్ల మరో 50ఏళ్ళవరకు పట్టణ ప్రజలకు మంచినీటి ఎద్దడితలెత్తదు. పట్టణంలోని ప్రధానరహదారులను సువిశాలంగా విస్తరించారు. 60శాతం అంతర్గతరోడ్లు సిమెంట్‌రోడ్లుగా రూపుదిద్దుకున్నాయి. మున్సిపాల్టీ ఆదాయవనరుల సమీకరణలో భాగంగా పలు షాపింగ్‌కాంప్లెక్స్‌ల నిర్మాణానికి శ్రీకారం చుట్టింది. గతంలో డాక్టర్ కోడెల శివప్రసాదరావు, ప్రస్తుతం శాసనసభ్యులు కాసు వెంకట కృష్ణారెడ్డిలు పట్టణాన్ని అభివృద్ధి దిశగా పయనింపజేసేందుకు కృషిచేస్తున్నారు. సుదీర్ఘచరిత్ర కల్గిన నరసరావుపేట పట్టణం ఘనవారసత్వాన్ని, సంస్కృతి వైభవాన్ని కంటికిరెప్పలా కాపాడుకుంటూ మారుతున్న కాలమాన పరిస్థితులకనుగుణంగా పట్టణ ప్రజలకు మౌలిక అవసరాలు సంపూర్ణంగా కల్పించడంలో పురోగమిస్తుంది. పట్టణాన్ని అన్నివిధాల అభివృద్ధి చేయడంతోపాటు ప్రజలకుఅవసరమైన సౌకర్యాలు కల్పించడంలో కృషిచేస్తామని కమీషనర్ కె.రమేష్ తెలిపారు.



పురపాలక సంఘం పైలాన్





# 'వార్త' 10వ వార్షికోత్సవం సందర్భంగా

# శ్రీ గిరీష్ సంఘీ గారికి

## మరియు సిబ్బందికి

## మా హృదయపూర్వక

## శుభాకాంక్షలు

'అగ్రిగోల్డ్' బయోమాస్ ఆధారిత విద్యుదుత్పాదన కేంద్రాన్ని 'స్వయంప్రభ' పేరిట త్రిపురాంతకం, ప్రకాశం జిల్లా వద్ద స్థాపించింది. ఈ ప్లాంటును ఎనర్జీ ప్లాంటేషన్ నుండి ఉత్పత్తి చేసిన బయోమాస్‌ను ఉపయోగించుకుని నడుపుతోంది.

తమ ప్లాంటేషన్ నుండే కాక చుట్టు ప్రక్కల వున్న రైతుల చేలలో నుంచి కూడా విద్యుత్తు ప్లాంటుకు అవసరమైన చెట్లను పెంచటం ద్వారా ముడి పదార్థాలను సేకరిస్తోంది.

స్వయం ప్రభ పవర్ ప్రాజెక్టుకు రోజుకు 180 టన్నులు బయోమాస్ వుడ్ చిప్స్ అవసరమవుతాయి.

ఈ ఇంధనం 10 ఎకరాల ప్లాంటేషన్‌కు సమానం. ఒక్క సంవత్సరం అంటే 365 రోజులకు గాను 10 ఎకరాలు చొప్పున 3,650 ఎకరాల ప్లాంటేషన్ అవసరమవుతుంది.

ఆసక్తిగల రైతులు అందరూ అగ్రిగోల్డ్ ట్రైకాఫ్ ప్రాజెక్టులో భాగస్వాములు అయి కాంట్రాక్ట్ ఫార్మింగ్ ద్వారా ఎనర్జీ ప్లాంట్స్ సాగు చేసి లాభాలు పొందవచ్చు.

**'కాంట్రాక్టు ఫార్మింగ్ - రైతులకు ఒక లాభాన్ని తెచ్చి యిచ్చే అనువైన వ్యవస్థ'**

మరిన్ని వివరాలకు :

**అగ్రిగోల్డ్ హెడ్ ఆఫీసు - ప్రాజెక్ట్స్ డివిజన్**ను సంప్రదించండి.

40-1-21/21, అగ్రిగోల్డ్ - గ్రౌండ్‌ఫ్లోర్, క్యాథలిక్ కాంప్లెక్స్, ఎం.జి.రోడ్, విజయవాడ - 520 010.

ఫోన్ : +91 866 2473711, 2481754, ఫ్యాక్స్ : +91 866 2483711, 2486011

లేదా

అగ్రిగోల్డ్ పవర్ ప్రాజెక్ట్ - హస్నాపూర్, దూపాడు, త్రిపురాంతకం మండలం, ప్రకాశం జిల్లా :: ఫోన్ : 08596 220016



Agri Gold

DESIGN - GANESH

# ఆధునిక వంగడాల సృష్టిలో 'లాం' సేవలు

'లాం వ్యవసాయ పరిశోధనా స్థానం' దీని పేరు వినగానే రైతులు పులకించి పోతారు. ఆధునిక వంగడాల రూపకల్పనలో ప్రపంచ వ్యాప్తంగా దీనికి పేరు ప్రఖ్యాతులు వున్నాయి. ఏళ్ళ తరబడి రైతుల సేవలో పునీతమవుతున్న లాం వ్యవసాయ పరిశోధనా స్థానానికి మన రాష్ట్రంలో విశిష్ట స్థానం వుంది. తెల్లదోమతో పోరాడలేక చితికి పోయిన రైతును ఆదుకోవడానికి ఇక్కడి శాస్త్రవేత్తలు చెమటో డ్చారు. అహోరాత్రులు శ్రమించి తెల్లదోమను తట్టుకునే పత్తి వంగ డాలను రూపొందించి రైతులకు ఉపశమనం కలిగించారు.

(ప్రభాతవార్త-గుంటూరు)

'లాం వ్యవసాయ పరిశోధనా స్థానం' దీని పేరు వినగానే రైతులు పులకించి పోతారు. ఆధునిక వంగడాల రూపకల్పనలో ప్రపంచ వ్యాప్తంగా దీనికి పేరు ప్రఖ్యాతులు వున్నాయి. ఏళ్ళ తరబడి రైతుల సేవలో పునీతమవుతున్న లాం వ్యవసాయ పరిశోధనా స్థానానికి మన రాష్ట్రంల్లో విశిష్ట స్థానం వుంది. తెల్లదోమతో పోరాడలేక చితికి పోయిన రైతును ఆదుకోవడానికి ఇక్కడి శాస్త్రవేత్తలు చెమటోడ్చారు. అహోరాత్రులు శ్రమించి తెల్లదోమను తట్టుకునే పత్తి వంగడాలను రూపొందించి రైతులకు ఉపశమనం కలిగించారు. జాతీయంగా ఖ్యాతినార్జించిన 'లాం' లోని ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా స్థానంలోని ప్రగతి రైతాంగానికి అందుబాటులోకి వచ్చింది. దేశంలోనే కాకుండా విదేశాల్లో సైతం పేరెన్నికగన్న, తక్కువ కాలంలో అధిక దిగుబడి ఇచ్చే పత్తి, మిర్చి, అపరాలు వంటి పంటలలో అనేక రకాల వంగడాలను కనుగొన్న లాం ప్రాంతీయ పరిశోధనా స్థానానికి దేశంలో విశిష్టమైన స్థానం వుందని చెప్పవచ్చు. వ్యవసాయరంగంలో మారుతున్న పద్ధతుల కనుగుణంగా అనేక నూతన వంగడాలను రూపొందించిన ఘనత లాం పరిశోధనా స్థానం శాస్త్రజ్ఞులకే దక్కుతుంది. ప్రపంచంలో తొలిసారిగా శనగవచ్చ పురుగు, తెల్లదోమ వంటి చీడపీడలను తట్టుకుని అధిక దిగుబడినిచ్చే పత్తి వంగడాలైన ఎల్‌కె 861, ఎల్‌పిఎస్ 141 వంటి రకాలను కనుగొని లాం పరిశోధనా స్థానం శాస్త్రవేత్తలు ప్రగతి సాధించారు. తెల్లదోమను తట్టుకునే ఇతర వంగడాలను కూడా శాస్త్రవేత్తలు రూపొందించారు. వాటన్నింటికి మించి మరో ప్రధాన వాణిజ్య పంట అయిన మిర్చిలో దత 25 సవంత్సరాల నుంచి దేశంలోని వివిధ రాష్ట్ర రైతాంగం వాడుతున్న జి-4, ఎల్‌సిఎ-235 వంటి విత్తనాలను లాం శాస్త్రవేత్తలు కనుగొన్నారు. మిర్చిలో ఘాటుతోపాటు అధిక దిగుబడినిచ్చే వంగడాలుగా ఇవి దేశవ్యాప్తంగా ప్రసిద్ధికెక్కాయి. వీటిని గుంటూరు మిరప(గుంటూరు సన్నాలు) అని పిలుస్తారు. రాష్ట్రంలో అత్యంత సారవంతమైన నేలలు, అధిక దిగుబడినిచ్చే వంగడాలు, ఆధునిక పద్ధతిలో పండించే రైతాంగం వున్న ప్రాంతానికి ఈ వ్యవసాయ పరిశోధనా స్థానం అనేక రకాలైన సలహాలు, సూచనలు ఇవ్వడమే కాకుండా రైతాంగానికి అవసరమైన శాస్త్రీయ పరిజ్ఞానాన్ని నిరంతరం అందిస్తూ వచ్చింది. మొత్తం 103 ఎకరాల్లో విస్తరించి వున్న లాంఫారంలో పత్తి, మిర్చి, అపరాలు వంటి పంటలపై పరివోధన ఝరుగుతోంది. మాగాణి భూముల్లో పండించే మినుము, పెసర, కరిది వంటి అపరాల పంటల్లో లాం శాస్త్రవేత్తలు పరిశోధన చేసి నూతన వంగడాలను కనుగొవడంతో గతంలో రాష్ట్రంలో లక్షటన్నులు పండించే మినుము వంట ప్రస్తుతం నాలుగు టన్నులకు చేరుకుంది.

అదే విధంగా కంది వంటకు శనగపచ్చ పురుగు ఆశించి దిగుబడులు పడిపోయి తీవ్ర నష్టాలకు గురవుతున్న రైతాంగానికి లాంలోని ప్రాంతీయ వ్యవసాయ పరిశోదనా స్థానం శాస్త్రవేత్తలు కనుగొన్న ఎల్‌ఆర్‌జి-30 రకం కంది విత్తనం శగపచ్చ పురుగును తట్టుకొని రబీకి వేసే విధంగా అనువైన విత్తనాలు రూపొందించారు. దేశంలో తొలిసారిగా సోయాబిన్ విత్తనాలను అధిక దిగుబడి వచ్చే విధంగా రూపొందించి లాం శాస్త్రవేత్తలు నూతన ఒరవడి సృష్టించారు.

కేవలం 60 రోజుల్లో కాపుకు వచ్చే ఎల్‌ఎస్‌వి-1 అనే నూతన వంగడాన్ని కనుగొన్ని సోయాబీన్‌లో ఫలితాలను సాధించారు. ఖరీఫ్, రబీ సీటన్లలో ఉపయోగపడటంతోపాటు పత్తిలో అంతర్ పంటలుగా సోయాబీన్ వేసేందుకు శాస్త్రవేత్తలు చేసిన కృషి ఫలితాలను ఇచ్చింది.

ఈ ప్రాంతీయ పరిశోధనా స్థానం కృష్ణా - గోదావరి జోన్‌లోని రైతులకు రబీ, ఖరీఫ్ సీజన్‌లలో పలు సూచనలు ఇస్తూ వారి పురోభివృద్ధికి కృషి చేస్తోంది. రైతులకు ఏ చిన్ని కష్టం వచ్చినా శాస్త్రవేత్తలు స్పందించి తగు రీతిలో స్పందిస్తున్నారు. 2005లో ఎడతెరిపి లేకుండా కురిసిన వర్షాలకు రైతులు విలవిలాడిపోయారు.

ఈ దశలో లాంశాస్త్రవేత్తలు కష్టించి రైతులకు భారీ వర్షాలను అధిగమించే సలహాలను, సూచనలను విస్తృత స్థాయిలో ఇవ్వడంతో పరిస్థితులు మెరుగుపడ్డాయి. భారీగా నష్టపోతామని భావించిన రైతులకు లాం శాస్త్రవేత్తల సూచనలు, సలహాలు ఎంతగానో ఉపకరించాయి.

మిర్చిని విదేశాలకు ఎగుమతి చేసే విధంగా ఆ పంటపై పురుగుమందు అవశేషాలు లేకుండా చూసేందుకు సమగ్ర సస్యరక్షణ వంటి వినూత్న పద్ధతులపై లాంఫారం శాస్త్రవేత్తలు పరిశోధనలు జరుపుతున్నట్లు లాం ఎడిఆర్ డాక్టర్ తిరుపతిరెడ్డి ప్రభాత వార్తకు వివరించారు. తమ శాస్త్రవేత్తలు రూపొందించిన వంగడాలు పూర్తిస్థాయిలో ఫలితాలను ఇచ్చినట్లు చెప్పారు.

# 8 లక్షల మంది పేద మహిళలకు 'స్పందన' చేయూత!

## 'స్పందన'కు అంతర్జాతీయ గుర్తింపు

మైక్రోఫైనాన్స్ ఇపుడు రాజ్యం ఏలుతోంది. అన్ని స్థాయిల్లోనూ సూక్ష్మస్థాయి ఆర్థిక అవసరాలను తీర్చే అంశాలకు ప్రాధాన్యం ఎక్కువయింది. దీన్ని ప్రోత్సహించే దిశలో ప్రభుత్వాలు కూడా ప్రాధాన్యం

[illegible]

ఇస్తున్నాయి. మైక్రో ఫైనాన్స్ అంటే పేదరికాన్నితగ్గించడం, వడ్డీ వ్యాపారస్తుల బెడదను నివారించడం. మహిళా సాధికారిత కోసం, పేదలను సంఘటితం చేయడానికి, పెద్ద ఎత్తున స్వయం ఉపాధి కల్పించడం, పేదవారి ఆర్థిక అవసరాలు తీర్చడానికి మైక్రో క్రెడిట్ ఆసరా ఇస్తోంది. మైక్రో క్రెడిట్ రంగంలో అగ్రస్థానంలో నిలిచి, పేద మహిళలు స్వశక్తితో నిలబడి వారి అవసరాలను వారే తీర్చుకొనే విధంగా ఆర్థిక సహకారం అందించి చేయూత నిస్తోంది 'స్పందన' మైక్రో క్రెడిట్ సంస్థ. రాష్ట్రంలోని 13 జిల్లాల్లో, కర్నాటకలోని మూడు జిల్లాల్లో తన సేవలను విస్తరించి, 198 శాఖల ద్వారా సుమారు వెయ్యికోట్ల రూపాయల రుణాలను అందించింది.

### ఇది మైక్రోక్రెడిట్ సంవత్సరం

ప్రపంచంలో 100 కోట్ల పేద ప్రజలకు ఆర్థిక సేవలు అందుబాటులో లేకపోగా, అందులో 20కోట్ల మంది మన దేశంలోనే ఉన్నారు. ఈ వాస్తవాన్ని గమనించిన పేద ప్రజలకు ఆర్థిక సేవల్ని అందుబాటులోకి తీసుకు రావాలన్న సదుద్దేశ్యంతో మైక్రోక్రెడిట్‌కు పాచుర్యం పెంచే సంకల్పంతో- ప్రస్తుత ఆర్థిక సంవత్సరాన్ని 'ఇంటర్నేషనల్, ఇయర్ ఆఫ్ మైక్రోక్రెడిట్'గా యునైటెడ్ నేషన్స్ ప్రకటించింది. ప్రపంచ వ్యాప్తంగా అన్ని దేశాల ప్రభుత్వాలూ మైక్రోక్రెడిట్ వ్యాప్తికి ఇతోధికంగా కృషి చేస్తున్నాయి. దీనిలో భాగంగా మన ప్రభుత్వం ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో బడ్జెట్‌లో మైక్రో క్రెడిట్ అభివృద్ధికి అధిక ప్రాముఖ్యం ఇస్తూ, మైక్రో ఫైనాన్స్ ఆర్గనైజేషన్స్‌లో ఈక్విటీ ఇన్వెస్ట్‌మెంట్ కోసం 200 కోట్ల రూపాయలను కేటాయించింది కూడా. భారతదేశంలో ఉన్న దాదాపు 800 మైక్రోఫైనాన్స్ సంస్థల్లో అతి పెద్దదైన 'స్పందన' 8లక్షల మంది పేద మహిళలకు రుణాలను అందజేయడమే లక్ష్యంగా ఎంచుకొని పనిచేస్తోంది.

### చిన్న వ్యాపారాలు...చేతినిండా పని

ప్రభుత్వ పథకాలు వెళ్లని ప్రాంతాలకూ 'స్పందన' సభ్యులు వెళతారు. ఆయా ప్రాంతాల్లో ఉన్న పేద మహిళలను కూడగడతారు. వారికి ఏమికావాలో తెలుసుకుంటారు. దీనికి 'స్పందన'ఎలా సహాయపడుతుందో తెలియజేస్తారు. స్పందన ఇచ్చే సహాయ సహకారాలను వినియోగించుకోవడం, తిరిగి తీర్చడం వంటివాటిని తెలియజేస్తారు. స్వల్పంగా వారికి రుణాలు అందజేస్తారు. రోజువారి, వారం వారం తిరిగి చెల్లించే పద్ధతిలో రుణాలు ఇస్తారు. తీసుకున్న రుణాన్ని సద్వినియోగంచేసుకుంటున్నారా, లేదా అనే అంశాన్నికూడా ఈ సంస్థ సభ్యులే పర్యవేక్షిస్తారు. అవసరం ఉన్నవారు తీసుకోవడం, ఏదో ఒక చిరు వ్యాపారం చేసుకోవడం, అప్పు తీర్చడం వంటివి చేస్తున్నారు. దీనివల్ల 500 రూపాయల అప్పు తీసుకొని, స్వయం ఉపాధి చేపట్టి, ఇపుడు 50 మందికి ఉపాధి కల్పించే మహిళలు 'స్పందన'లో ఉన్నారంటే ఆశ్చర్య పోనవసరం లేదు. టీ బంకులు, తలవెంట్రుకల వ్యాపారం, కూరగాయలు ఇలాంటివి ఎన్నో చిరు వ్యాపారాలు నిర్వహించడానికి 'స్పందన' పేద మహిళలకు ఆర్థిక చేయూత నిస్తోంది. దీన్ని వారు సద్వినియోగం చేసుకుని, ఆర్థికంగా స్థిరపడుతున్నారు.



వరదబాధితుల కోసం ముఖ్యమంత్రి సహాయ నిధికి రూ.25 లక్షల చెక్‌ను అందిస్తున్న స్పందన అధినేత్రి పద్మజారెడ్డి

1998లో గుంటూరు కేంద్రంగా ప్రారంభమైన 'స్పందన' ఇప్పటికి 7.50 లక్షల మందికి సుమారు 1000 కోట్ల రూపాయల మేర రుణాన్ని అందించింది. ప్రస్తుతం రాష్ట్రంలో గుంటూరు, కృష్ణా,ప్రకాశం,తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, ఖమ్మం, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం, నెల్లూరు, నల్గొండ, వరంగల్, ఖమ్మం, చిత్తూరు, హైదరాబాద్ జిల్లాలతోపాటు, కర్నాటక రాష్ట్రంలో బళ్ళారి, చింతామణి, బెంగుళూరు సిటీల్లో స్పందన కార్యక్రమాలు సాగుతున్నాయి. పేద మహిళలకు అందిస్తోన్న రుణాలను వివిధ ప్రవేటు రంగ బ్యాంకులు రుణం రూపంలో 'స్పందన'కు ఇస్తున్నాయి. సిడ్బి, ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకు, యు.టి.ఐ., హెచ్.డి.ఎఫ్.సి.,ఐ.సి.ఐ.సి.ఐ., ఐ.ఎన్.జి.వైశ్యా వంటి బ్యాంకులు ముందువరుసలో వున్నాయి. ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో అవసరమైన సుమారు 750 కోట్ల రుణాలను ఇప్పటికే ఆయా బ్యాంకులు మంజూరు చేశాయి.



స్పందన చేయూతతో వికసిస్తోన్న పేదమహిళలు

### రుణాలే కాదు... సామాజిక సేవ కూడా

'స్పందన' సంస్థ కేవలం పేద మహిళల స్వయం ఉపాధికోసం రుణాలను మంజూరు చేయడమేకాదు, సామాజిక బాధ్యతనూ నెరవేరుస్తోంది. సంస్థ సభ్యురాళ్ల పిల్లల్లోని ప్రతిభా పాటవాలను వెలికితీసే కార్యక్రమంలో భాగంగా గత ఏడాది 30 లక్షల రూపాయల ఉపకార వేతనాలను అందించింది. ఈ ఏడాది దాదాపు 50 లక్షల రూపాయల ఉపకార వేతనాలు ఇవ్వడానికి సిద్ధ పడింది. దీనితో పాటు ఇటీవల సంభవించిన వరదల వల్ల నష్టపోయిన కుటుంబాలను ఆదుకోవడానికి ఈ సంస్థ రూ.25 లక్షలను ముఖ్యమంత్రి సహాయ నిధికి అందించి తన సామాజిక బాధ్యతను నిలుపు కున్నారు సంస్థ అధినేత్రి జి.పద్మజారెడ్డి. ముఖ్యమంత్రి కృష్ణాజిల్లా వచ్చినపుడు ఆయనను ప్రత్యక్షంగా కలిసి వరద బాధితుల కోసం తన వంతు-సహాయంగా ఈ మొత్తాన్ని ఇస్తున్నట్లు చెప్పి అందజేశారు. తర్వాత 60 లక్షల రూపాయల మొత్తాన్ని రెండో విడత వరద బాధితుల కోసంఖర్చుచేశారు. బాధిత కుటుంబాలకు కావాల్సిన నిత్యావసరాలు, కుటుంబానికి కావాల్సిన పాత్రలు వంటి వాటిని సమకూర్చే పనిలో భాగంగా ఈ మొత్తాన్ని ఖర్చుచేశారు. కృష్ణా,గుంటూరు, ఉభయగోదావరి జిల్లాల్లోని వరద బాధితులుగా ఉన్న సుమారు 30 వేల మందికి ఈ సహాయ సహకారాన్ని అందించారు.



స్పందన నిర్వహించే సూపర్ బజార్‌ను సందర్శించిన సన్‌మైక్రో సిస్టమ్స్ ఫౌండర్, ప్రపంచ నెం. 1 వెంచర్ కాప్టిలిస్టు వినోద్ ఖోస్లా.

స్పందన పేద మహిళలకు వారి వ్యాపారాభివృద్ధికి, గృహనిర్మాణానికి, పిల్లల చదువులకు అవసరమైన అన్ని రుణాలను సమకూరుస్తోంది. గత ఐదారు ఏళ్లలో ఎక్కువ మంది పేద మహిళలు సాంఘికంగా, ఆర్థికంగా అభివృద్ధి చెందారు. లక్షమంది నిరుద్యోగులు స్వయం ఉపాధి పొందడం ద్వారా పదికోట్ల మేర అదనపు ఆదాయం సమకూర్చుకొనిఉంటారని అంచనా.



సపోటా తోటలో స్పందన సభ్యురాలు

### అత్యున్నత పురస్కారం

స్పందన సంస్థ నిర్వహించే కార్యక్రమాలు పారదర్శకంగా ఉంటాయి. తెచ్చే నిధులు, ఖర్చు చేసే విధానం వంటివన్నీ కూడా జవాబుదారీతనంతో ఉంటాయి. క్రిసిల్, ఎమ్‌క్రిల్ వంటి సంస్థలు రేటింగ్‌లు జరిపిన తర్వాత సంస్థ కార్యకలాపాలు పరిశీలించి చేసిన సిఫారసుల మేరకు బ్యాంకులు రుణాలు మంజూరు చేస్తాయి. ఎమ్‌క్రిల్(మైక్రోఫైనాన్స్ స్పెషలైజ్డ్ ఏజెన్సీ) గత జూన్‌లో జరిపిన రేటింగ్ ఆల్ఫాప్లస్ గ్రేడ్‌నిచ్చింది. స్పందన రేటింగ్ రిపోర్ట్స్ వరల్డ్ బ్యాంక్ వెబ్‌సైట్‌లోనూ పొందుపరచడం గమనార్హం. అంతర్జాతీయంగా అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకున్నస్పందన బ్యాంకింగ్ రంగానికి చెందిన ప్రముఖులు సందర్శించి విశ్లేషించడం చెప్పుకోదగ్గ విషయం.

### కొత్త రంగాల్లోకి విస్తరణ

స్పందన ఇప్పటి వరకూ పేద మహిళలకు స్వల్ప రుణాలను అందిస్తూ ముందుకు వెళుతోంది. ఈ సేవలను విస్తరించి మరికొన్ని వర్గాలకు అందుబాటులో ఉండాలని నిర్ణయించింది. దీన్లో భాగంగానే కౌలు రైతులకు రుణాలు ఇవ్వడం, సెకెండ్ హ్యాండ్ ట్రాక్టర్లు, ఇతర వ్యవసాయ పనిముట్లు కొనుగోలు చేసుకోనేందుకు ఆర్థిక సహాయాన్ని అందించడం చేయాలని నిర్ణయించింది. దీనికోసం ఈ ఏడాది సుమారు 50 కోట్ల రూపాయలను అందించడానికి సిద్ధ పడింది. సహజంగా కౌలు రైతులకు బ్యాంకులు అప్పులివ్వవు. సెకెండ్ హేండ్ ట్రాక్టర్లకు కూడా రుణాలు దొరకవు. వీటిని రైతులకు అందించి చేయూత నివ్వాలని సంస్థ నిర్ణయించింది.



పండ్ల వ్యాపారంతో కళకళ



ఒకపక్క వ్యాపారం, మరో పక్క కుటుంబ బాధ్యత

### పేదలందరికీ చేయూత : పద్మజారెడ్డి

పేద మహిళలకు ఆర్థిక చేయూతనిచ్చి వారిని స్వశక్తితో నిలబడేలా చేయడానికి తమ వంతు కృషి చేస్తున్నామని 'స్పందన' అధినేత్రి పద్మజా రెడ్డి చెప్పారు. మరింతగా తమ సేవలను విస్తరించడానికి అన్ని ఏర్పాట్లు చేస్తున్నామన్నారు. ఇప్పటికి తాము చేసింది చాలా తక్కువని, చేయాల్సింది ఎంతో ఉందన్నారు. రాష్ట్రంలోని మరికొన్ని జిల్లాలకు తమ సంస్థ కార్యకలాపాలను విస్తరించడంతో పాటు, బెంగుళూరులో కూడా మరిన్ని జిల్లాల్లో విస్తరించనున్నామన్నారు. ఈ దిశగా తాము చేసే కృషికి ఆయా బ్యాంకులు కూడా సహకారం అందిస్తున్నాయని చెప్పారు.

# గురుకుల విద్యకు పుట్టినిల్లు గుంటూరు

(ప్రభాతవార్త-గుంటూరు)

గుంటూరు జల్లా విద్యకు ఖిల్లాగా గత ఎన్నోసంవత్సరాలనుంచి భాసిల్లుతుంది. స్వర్గీయ సివి ధన్‌లాంటి విద్యప్రముఖులు గుంటూరు నగరంలోనిబ్రాడీపేటలో తొలుతగా గురుకుల విద్యకు అంకురార్పణ చేశారు. ఆ తరువాత ఆయన బాటలోనే ఎందరో ప్రముఖ వ్యక్తులు గురుకుల విద్యాలయస్థాపనలో ముందుకు వచ్చారు. గురుకుల విద్యాలయం స్థావన ప్రచారం తదితర అంశాల్లో సంచలనం సృష్టించి ప్రతి మున్సిపల్ పట్టణంలో గురుకుల విద్యాలయాలను నెలకొల్పడంతో శ్రీ చైతన్య విద్యా సంస్థలను ప్రముఖంగా పేర్కొనవచ్చును. విజ్ఞాన్ విద్యాసంస్థలు వివిధవిద్యాలయాల ద్వారా విద్యార్థులకు విద్యార్జనతో పాటు, అన్ని రంగాలలోను పోటీ ప్రపంచంలో ఎదుర్కొనే వివిధ స్కిల్స్ పట్ల కూడా విద్యార్థులను తగురీతిలో విద్యాభ్యాస కాలంలోనే సమాంతరంగావీటిని బోదించడం విజ్ఞ సంస్థలకు ప్రతిష్టాత్మకమైనఅంశం.

**గుంటూరు జిల్లా విద్యకు ఖిల్లాగా గత ఎన్నోసంవత్సరాలుగా భాసిల్లుతోంది. స్వర్గీయ సి.వి.ఎన్.ధన్‌లాంటి ప్రముఖులు గుంటూరు నగరంలోని బ్రాడీపేటలో తొలుతగా గురుకుల విద్యకు అంకురార్పణ చేశారు. ఆ తరువాత ఆయన బాటలోనే ఎందరో ప్రముఖ వ్యక్తులు గురుకుల విద్యాలయస్థాపనలో ముందుకు వచ్చారు.**

హైస్కూల్ స్థాయి వరకు అత్యుత్తమ విద్యా ప్రమాణాలను అందించటంలో భాస్యం విద్యాసంస్థలకుఇటు విద్యార్థుల్లోను అటు విద్యార్థుల తల్లి దండ్రులలోను ఎనలేని విధంగా ఆధరణ ఉండడం గమనించదగ్గ విషయం. ఇంటర్‌మీడియెట్ స్థాయిలో సైన్స్ విద్యార్థులకు అత్యుత్తమ స్థాయిలో బోధనను అందిస్తూ సమాంతర దిశలో ఎంసెట్ తదితంశిక్షణను విద్యార్థులకు అందిస్తూ ఎందరో విద్యార్థుల ఉజ్వల భవిష్యత్‌కు పునాదులు వేసిన వికాస్ విద్యాసంస్థలు గుంటూరు నగరానికి ఆణిముత్యంగా నిలిచింది. ఆహ్లాదకరవాతావరణంలో గ్రామీణ ప్రాంతాన్ని నూరుశాతం తలపింపచేస్తూ ఆధునిక వసతులతో ఉత్తమ విద్యనుఅభ్యసిస్తూన్న విద్య సంస్థల్లో చలపతి విద్యా సంస్థలకు ప్రముఖ స్థానంవుంది. విద్యార్థుల మానసిక ఉల్లాసానికి వారిలోని సృజనాత్మకతను మరింతగా పెంపొందించటానికి చలపతి విద్యాసంస్థలు ఆపూర్వం అనిర్వచనీయమైనది. నలంద విద్యాసంస్థలు గుంటూరు జిల్లా విద్యార్థులకు సైతం మరింతగా ఉన్నత మైన అత్యుత్తమ విద్యను దగ్గర చేయడానికి నలంద విద్యా సంస్థలు చేస్తున్నకృషి ప్రతిఏటా సాధిస్తున్న ఇంటర్ మీడియెట్ ఎంసెట్ ఫలితాలే నిదర్శనంగా నిలుస్తున్నాయి.

## గురుకుల విద్యా సంస్థల ప్రగతి

గురుకుల విద్యా సంస్థలుగా జిల్లాలో భాసిల్లుతున్న విజ్ఞాన్ వికాస్ శ్రీ చైతన్య భాష్యం చలపతి, నలంద తదితర విద్యాసంస్థలు ప్రతి ఏటా ఎవరికివారు పోటీ పడుతూ ఆరోగ్యకరమైన వాతావరణంలో జిల్లాకు ఎంతో పేరు ప్రఖ్యాతలను ఇటు 10వ తరగతి, అటు ఇంటర్‌మీడియెట్ ఎంసెట్ తదతర ఎన్నో పరీక్షల్లో విద్యార్థుల ఉత్తమ స్థాయిలో ఉత్తీర్ణతకు దోహదపడుతున్నాయి. ఆయా విద్యా సంస్థలు వారివిద్యార్థులవిద్య ప్రగతికి తోడ్పడడంతోపాటు రాష్ట్ర స్థాయిలో గుంటూరు జిల్లా విద్యారంగం ప్రగతిని ఏ ఏడాదికి ఆఏడాది మరింత ఉన్నత స్థితికి తీసుకెళ్ళడంతో గురుకుల విద్యాలయాల అధినేతలు యాజమాన్యంలు విశేషంగాకృషి చేస్తున్నాయి.

## విద్యార్థుల్లో సామాజిక స్పృహ

నాలుగు గోడల మధ్య విద్యార్థులు విద్య నభ్యసించడమే కాకుండా సామాజిక అంశాల పట్ల అవగాహన సమాజం పట్ల నైతిక భాధ్యత అనే వివిధ అంశాలపై కూడా విద్యార్థులకు ఆయా విద్యసంస్థలు ప్రత్యేక తరగతుల ద్వారా శిక్షణ ఇవ్వడం గమనించదగిన విషయం.

ఎయిడ్స్‌ను పారద్రోలటానికి ర్యాలీ రక్తదానం ప్రతిఏడాది విద్యార్థులు స్వచ్చందంగా ఇచే ందుకు ప్రత్యేక శిబిరాలు ఆపదలోవున్న అభాగ్యులకు వివిధ శాస్త్ర చికిత్సలకు అవసరమైన అంశాల్లో గురుకుల విద్యాలయాల విద్యార్థులు ముందుకు వచ్చి సహాయపడడం లాంటి ఎన్నో కార్యక్రమాలను గురుకుల విద్యాలయాలు అందిస్తున్నాయి.

## అత్యున్నత స్థాయిలో అన్ని సౌకర్యాలు

విద్యార్థులు అత్యుత్తమ స్థాయిలో ఉత్తీర్ణత చెందడానికి కేవలం పుస్తకం చదవడం వలననే కుదరదు. చక్కటి వాతావరణం రుచి శుచి గల భోజనం తదితర వసతులు ఉత్తమరీతిలో ఆరోగ్య వరిస్థితులు, విద్యార్థుల అవగాహనకు అనుకూలంగా అధ్యాపకుల బోధన తదితర ఎన్నో అంశాలు విద్యార్థుల విద్యాభివృద్ధిపై ప్రభావాన్ని చూపుతాయి.

నగరంలోని అనిన్ని గురుకుల విద్యాసంస్థలు విద్యార్థులకు అత్యుత్తమ స్థాయిలో మౌళిక వనరులు కల్పించడానికి ఎవరికివారే పోటీ పడడం గమనించదగినవిషయం. వడ్లమూడి లోని విజ్ఞాన ఇంజనీర్ కళాశాలలో ఎవరైనా అడుగు పెడితే ఆ పచ్చటి వాతావరణం మధ్య మనస్సు ఉల్లాసం చెందడమే కాకుండా కళాశాల వసతులను మెచ్చుకోని వారు వుండరు అనే దానిలో అతిశయోక్తి లేదు.

## ర్యాంకులు పండిస్తున్న గురుకుల విద్యాలయం

టెన్త్ ఇంటర్, ఎంసెట్ తదితర పరీక్షల్లో ఉత్తీర్ణత చెందడం చాల మందికి మామూలు విషయం. రాష్ట్ర స్థాయిలో వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ లాంటి ప్రతిష్టాత్మకమైన ర్యాంకులను జిల్లాకు తీసుకువచ్చేందుకు ఆయా విద్యాసంస్థల విద్యా పరంగా ఆయా విద్యా సంస్థల విద్యాభివృద్ధి పరంగా విద్యార్థులకు ఇస్తున్న విద్యా బోధన అంశాలు అత్యుత్తమ అద్భుతంగా భావించవచ్చును.

విజ్ఞాన విద్యానంస్థల అధినేత లావురత్తయ్య వికాస్ విద్యా సంస్థల అధినేత శంకరరావు శ్రీ చైతన్య విద్యా సంస్థల జిల్లా అధినేత పిడికిడి తిలక్ భాష్యం విద్యా సంస్థల అధినేత రామకృష్ణ, చలవతి విద్యా సంస్థల అధినేత ఆంజనేయులు నలంద విద్యా సంస్థల అధినేత తదితర గురుకుల విద్యాలయాల అధినేతలు జిల్లాలో గురుకుల విద్య మరింతగా బలపడటానికి. కృషి చేయడం అభినందనీయం.

# ఐశ్వర్యప్రదాయకుడు ఈ మల్లికార్జునుడు

(ప్రభాతవార్త, గుంటూరు)

గుంటూరు నగరంలోని మల్లికార్జునపేటలో వేంచేసియున్న శ్రీభ్రమరాంబా సమేత మల్లికార్జునస్వామి ఐశ్వర్య ప్రదాతగా, మహామహిమాన్వితులై ఉన్నారు. మల్లికార్జున స్వామిని శ్రీశైల పీఠాధిపతులు ప్రతిష్టించి అదే నామకరణం చేయడంతో ఆయన శ్రీశైల మల్లికార్జుని పేరుతోనే పూజలందుకోవడం విశేషం. తూర్పు ముఖముగా ఉన్న శివాలయం మోక్షదాయకమని, పశ్చిమ ముఖముగా ఉన్న శివాలయం ఐశ్వర్యదాయమనీ మనకు ప్రతీతి. అంతేకాక సృష్టికే మహాశివుడు చక్కటి అందగాడు, ముగ్ధ మనోహరరూపుడు అనే పేరుకు తగ్గట్టుగా ఈ మల్లికార్జునపేటలో ఉన్న ఈ లింగాకారం చూడముచ్చటైన, అతి చక్కటి ,రూపంతో, అతిస్పష్టమైన శ్వేతవర్ణంతో తెల్లని తెలుపుతో, పశ్చిమ ముఖంగా ప్రతిష్టించబడి తనను కొలచిన భక్తుల కోరికలు తీర్చుతూ కోరిన వారికి కొంగుబంగారమై అత్యంత శోభాయమానంగా విరాజిల్లుతున్నారు.



స్వామి వారి ప్రతిష్టా సమయంలో జరిగిన గొప్ప విశిష్టత:ఈ లింగాన్ని కొంతమంది భక్తులు సత్తెనపల్లిలోని ఒక దేవాలయంలో ప్రతిష్టించేందుకు బదరీనాధ్ నుంచి తీసుకుని వచ్చారు. అయితే ఏవో కొన్ని అనివార్య కారణాల వల్ల సంకల్పించిన ప్రకారం ప్రతిష్టను చేయలేకపోయారు. లింగమును బయట ఉంచుటకు ఇష్టపడక జలాధివాసం రూపమున ఈలింగాన్ని గుంటూరు కొరిటెపాడులోని ఒక పవిత్రమైన బావిలో దాచి ఉంచారు.

ఒక ఏడాది తరువాత కొంత మంది భక్తులు ఈ లింగాన్ని మరొకచోట ప్రతిష్టించేందుకు సంకల్పించి బావిలో నుంచి బయటకు తీసేందుకు ప్రయత్నించారు. లింగము బావిలో అడుగుభాగంలో ఉండుట వల్ల నీరు బయటకు తీసేందుకు మోటార్లను ఉపయోగించారు. మోటార్లు ఉపయోగించినప్పటికి బావిలోని నీరు మాత్రం పూర్తవలేదు. స్వామి వారు బయటకు కనిపించడం లేదు. ఆ విధంగా రోజులకు నాలుగు మోటార్ల చొప్పున ఒక వారం రోజులు ప్రయత్నించినా నీరు పూర్తి కాలేదు.ఆ పరిస్థితికి అక్కడున్న భక్తులందరూ ఆశ్చర్యపోయారు. ఏమి చేయాలో లోచని స్థితితో అయోమయంలో పడిపోయారు.

అటువంటి సమయంలో స్వామి వారు తనకు తానుగా ఒక భక్తుని వంటి మీదికి వచ్చి మీరు ఈ విధంగా ఎంత ప్రయత్నించినా ఉపయోగం లేదు, ప్రస్తుతం మీరు అనుకుంటున్నది నా నివాసస్థానం కాదు, నాకు అత్యంత ప్రీతిపాత్రులు, నాస్వరూపులు అయిన జంగందేవర్లు అందరూ కలసి గుంటూరు శ్రీనగర్ ఒకటవ లైనులో వారి మధ్య శివాలయం నిర్మించి అక్కడ ప్రతిష్టించుటకు లింగాకారం కోసం ప్రయత్నిస్తున్నారు. నాకు అది

(మిగతా 59వ పేజీలో..)

## అభివృద్ధి దిశగా పరుగులు తీస్తోన్న గుంటూరు రైల్వే డివిజన్

(ప్రభాతవార్త, గుంటూరు)

రెండున్నర ఏళ్ల క్రితం ఏర్పాటయిన . గుంటూరు రైల్వే డివిజన్ శరవేగంతో అభివృద్ధి పథంలో పయనిస్తుంది. కోట్లాది రూపాయలవ్యయంతో డివిజన్ పరిధిలో పలు అభివృద్ధి కార్యక్రమాలు చురుకుగా సాగుతున్నాయి. కోస్తాలోనే అత్యంత కీలకమైన డివిజన్‌గా గుర్తింపు పొందింది. బదిలీ అయిన డిఆర్ఎం ప్రభు నారాయణ్ శుక్లా ఆధ్వర్యంలో అభివృద్ధి పనులు జోరుగా సాగాయి. గుంటూరు సమీపంలోని రెడ్డి పాలెం రైల్వే స్టేషన్ వద్ద గుంటూరు న్యూ రైల్వే స్టేషన్‌ను నిర్మించారు. దాదాపు కోటి రూపాయల వ్యయంతో ఈ రైల్వేస్టేషన్‌నునిర్మాణం జరిగింది. గుంటూరు నుంచి ఉత్తర భారత దేశానికి వెళ్ళే చెన్నై జమ్ముతావి ఎక్స్‌ప్రెస్, చెన్నై, లక్నో ఎక్స్‌ప్రెస్‌లు ఈ స్టేషన్ మీదుగా ప్రయాణం చేస్తున్నాయి. గుంటూరు రైల్వేస్టేషన్‌లో అదనంగా పది రిజర్వేషన్ల కౌంటర్లను ఏర్పాటు చేయడంజరిగింది. రైల్వే స్టేషన్‌లోని ఒకటవ ప్లాట్ ఫాం నుంచి 6వ ప్లాట ఫాం దాకా సబ్‌వేను పొడిగించారు. దాదాపు 60 లక్షల రూపాయల నిధులతో పొడిగించిన ఈ సబ్‌వే వలన ప్రయాణీకులకు చాలా ఉపయోగకరంగా వుంటోంది. గుంటూరు రైల్వేస్టేషన్‌లో ప్రయాణీకులకు మరిన్ని సౌకర్యాలు కల్పించేందుకు ఒక ఫుడ్ ప్లాజాను ఏర్పాటు చేస్తున్నారు. అతి త్వరలో ఇది ఏర్పాటయ్యే అవకాశాలున్నాయి. ప్లాట్‌ఫాంపై ప్రయాణీకులకు సౌలభ్యంగా ఉండేందుకు కోచ్ నెంబర్లను ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు. గతంలో దక్షిణ మధ్య రైల్వే జనరల్ మేనేజరు స్టాన్లీ బాబు గుంటూరు రైల్వే స్టేషన్ పర్యటించి చేసిన సూచనల మేరకు అభివృద్ధి పనులు జోరుగా సాగుతున్నాయి. స్టేషన్ రెండు వైపులా పచ్చ దనాన్ని పెంచేందుకు రైల్వే అధికారులు పలు చర్యలు చేపట్టారు. అరండల్ పేట వైపు వున్నప్రవేశ ద్వారం వద్ద పార్కులను తలపించే విధంగా మొక్కలనునాటారు. ఇదిలా వుండగా గుంటూరు - విజయవాడల మధ్య డబుల్ లైన్‌ను ఏర్పాటు చేస్తే గుంటూరు మీదుగా మరిన్ని రైళ్ళను తిప్పే అవకాశాలు వున్నాయి. ప్రయాణీకులు, ఇతర అవసరాల రీత్యా ఈ రెండు నగరాలమధ్య డబ్లింగ్ పనులను పూర్తి చేయాల్సి వుంది. ప్రయాణీకుల అవసరాల దృష్ట్యా పలువురు ప్రజా ప్రతినిధులు ఆదివారం రానున్న మంత్రిపై ఒత్తిడి తెచ్చి డబుల్ లైన్ పనులకు శ్రీకారం చుడితే గుంటూరు రైల్వే డివిజన్ అభివృద్ధి చెందుతుందని అభిప్రాయపడుతున్నారు.



గుంటూరులోని డిఆర్ఎం కార్యాలయం

## భూమిలేని పేదలకు లక్ష ఎకరాల ప్రభుత్వ భూమి పంపిణీ

(ప్రభాతవార్త-గుంటూరు)

సమాజంలోని అట్టడుగు వర్గాల వారి జీవన ప్రమాణాలను పెంచుటకు ప్రభుత్వం అనేకసంక్షేమ పథకాలను చేపట్టింది. వాటిలో ముఖ్యమైనది, భూమి లేని పేద రైతుకూలీలకు లక్ష ఎకరాలప్రభుత్వ భూమి పంపిణీ కార్యక్రమం.

ఈ పథకం తొలి దశలో గత ఏడాది జనవరి25న గుంటూరు జిల్లాలో ప్రారంభమయింది. 2553.13 ఎకరాల ప్రభుత్వ భూమిపంపిణీ చేశారు. భూమి పంపిణీతో పాటు భూమిపై హక్కును ప్రసాదించే పట్టాదారు పాసు పుస్తకములు, భూమిలేని కొలతల, వివరములకు సంబంధించిన పటాలను కూడా పంపిణీ చేయడం ఈ కార్యక్రమం విశిష్టత. జిల్లాలో రెండవ దశ భూ పంపిణీ కార్యక్రమంను రెవిన్యూ యంత్రాగం నిర్వహించింది. ఈ దశలో జిల్లాలో 3500 ఎకరముల భూమిని పేద వారికి పంపిణీ చేయుటకు జిల్లాలోని మండల రెవిన్యూ యంత్రాంగం పూర్తిగా నిమగ్నమయి వుంది. జిల్లాకు నిర్ణయించిన 3500 ఎకరాల లక్ష్యాన్ని అధిగమించి, మరింత ఎక్కువ విస్తీర్ణంలో భూ పంపిణీ చేయుటకు సన్నాహములు జరుగుచున్నవి.

ఇంత వరకు 3678.26 ఎకరాల భూమిని పంపిణీ చేయటకు గుర్తించి, అసైన్‌మెంట్ రివ్యూ కమిటీల వారిచే 3130 మంది లబ్ది దారులకు జాబితాలను ఆమోదించారు. కలెక్టర్ తీసుకున్న చొరవతో పేదలకు భూములు అందుతున్నాయి. ఈ 3130 మందిలో 1072 మంది షెడ్యూల్డ్ కులాలకు చెందిన వారు కాగా, 33 మంది మైనార్టీలకు చెందినవారు, 370 మంది ఇతరులు వున్నారు.

రెండవ దశలో భూమి పంపిణీతోపాటు భూమిని అభివృద్ధి చేయుటకు తగిన ఆర్థిక సహాయం అందించుటకు విస్తృతమైన ఏర్పాట్లు జరుగుచున్నవి. సమగ్ర భూమి అభివృద్ధి, ఇందిరా క్రాంతి పథకం తదతర పథకములతో పాటు షెడ్యూల్డు కులాల సహకార సంఘము, వెనుకబడిన తరగతుల సహకార సంఘం తదితర సహాయముతో లబ్దిదారుల ఆర్థిక పరిస్థితిని మెరుగు పరుచుటకు తగు చర్యలు తీసుకోవడం జరుగుతున్నది.

# ఐశ్వర్య ప్రదాయకుడు...

(57వ పేజీ తరువాయి)

నివాస స్థావరం కావున మీరు ఈ ప్రయత్నం విరమించి వారితో సంప్రదించి నన్ను అక్కడ ప్రతిష్టించేందుకు ఏర్పాట్లు చేయండి, మీకు శుభం కలుగుతుందని చెప్పాడు. అప్పుడు, అక్కడున్న భక్తులందరూ ఆనందంతో ఆ ఏర్పాట్లను పూర్తి చేసి శ్రీశైల దేవస్థానం పీఠాధిపతిల ద్వారా అప్పటి పెద్దలందరూ కలసి శ్రీస్వామి వారిని శ్రీగంగా భ్రమరాంబా మల్లికార్జున స్వామిపేరుతో 1979వ సంవత్సరంలో ఇక్కడ ప్రతిష్టించారు. తరువాత ఆ స్వామి వారి ప్రభావంతో ఆ ప్రాంతం మల్లికార్జునపేటగా పేరు గాంచింది.

## దేవాలయంలోని ప్రత్యేకతలు:

భూమిలో నుంచి 39 అడుగుల ఎత్తు కలిగిన, ఏకశిలగా ఉన్న ధ్వజస్తంభం కీర్తి స్తంభంగా ఉంది..ఆలయ ప్రాంగణంలో రాగి, వేపచెట్లు కలసి పెరగడం, ఆ వృక్షాల క్రింద గణపతి, నాగేంద్రుల ప్రతిష్ట చేయడం. దీని వల్ల ఈ వృక్షానికి దీక్షగా ప్రదక్షిణలు చేసిన వారికి అన్ని విధాలైన సర్వదోషాలు పోవడమే గాక సంతానం లేని వారికి సంతాన సౌఖ్యం కలుగుతుంది.



అమ్మవారి మూలవిరాట్

శ్రీస్వామి వారికి ఎదరుగా జీవ స్థంభం కింద కాల భైరవ స్థానంలో ఆంజనేయస్వామి ఉండడం. దీని వల్ల ఆలయంలో ప్రవేశించి శ్రీఆంజనేయ స్వామి వారికి ప్రదక్షిణాలు చేసిన వారికి అన్ని విధాలైన భూత బాధా నివారణ, శతృవిజయం కలుగుతుంది. ఆలయంలో ప్రతి మాస శివరాత్రి రోజున శ్రీస్వామి వారికి శాంతి కళ్యాణం జరుగుతుంది.

## కార్యసిద్ధి లభిస్తుంది

ఈ కార్యక్రమంలో విశేషత స్వామి వారికి అత్యంత ప్రీతిపాత్రులైన జంగమదేవర్లు, వీరభద్ర ఖడ్గాలతో ఆలయ ప్రదక్షిణాలు చేస్తారు. దీని వల్ల కళ్యాణం చేయించిన భక్తులకు కార్యసిద్ధి జరుగుతుందని ఆలయ శాశ్వత అర్చక స్వామి శంకరమంచి సుబ్రహ్మణ్య శాస్త్రి వివరించారు.

# జగ్గయ్యపేట క్షేత్రం నుంచి తరలిపోయిన అపూర్వ శిల్పాలు

ప్రభాతవార్త-జగ్గయ్యపేట

కృష్ణాజిల్లా జగ్గయ్యపేట బౌద్ధ క్షేత్రంలోని అపూర్వమైన శిల్పాలు స్మగ్లర్లు చేజిక్కించుకోగా, మరి కొన్నింటిని ప్రభుత్వం సేకరించి మ్యూజియంలకు తరలించింది. సరిగ్గా 15 ఏళ్ళ కితం ఈ బౌద్ధ స్తూపం వద్ద కన్పించిన శిల్పాలు నేడు ఆచూకీ లేకుండా పోయాయని పట్టణ వాసులు అంటున్నారు. శాసనంతో కూడిన గౌతమ బుద్ధుని విగ్రహాన్ని తమిళనాడు, ఆంధ్ర కలసివున్న సందర్భంలో ఉమ్మడి రాజధాని మద్రాస్ మ్యూజియంకు తరలించారు. ఇప్పటికీ చెన్నై మ్యూజియంలో జగ్గయ్యపేట బౌద్ధ క్షేత్రంకు సంబంధించిన గౌతమ బుద్ధుని విగ్రహం సందర్శకులను ఆకర్షిస్తూనే వుంది. 15 ఏళ్ళ కితం ఛాతి వరకు వున్న దాదాపు రెండు టన్నుల బరువైన బుద్ధుని విగ్రహాన్ని బౌద్ధ స్తూపంను కొందరు దుండగులు తరలించాలని ప్రయత్నించగా, కాపలాదారులు కనుగొని దానిని విజయవాడ పంపారు. జగ్గయ్యపేట బౌద్ధ స్తూపంలోని పలు విగ్రహాలు ఇప్పటికీ ముక్త్యాల కోటలోని ఒక శిధిలమైన గది బయట నిరాదరణకు గురై దర్శనమిస్తూనే వున్నాయి. జగ్గయ్యపేట ప్రాంతంలోని బౌద్ధ క్షేత్ర విశేషాలను జన జీవన స్రవంతికి తెలియజెప్పి, ఒక ఎగ్జిబిషన్‌ను నిర్మించాలని నాలుగు దశాబ్దాల కితమే ముక్త్యాల రాజా వాసిరెడ్డి రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాద్ సంకల్పించి అప్పటికే శిధిలావస్థలో వున్న పలు ప్రాచీన విగ్రహాలను సేకరించారు. వాటిని మ్యూజియంలో ఏర్పాటు చేయించాలనే ప్రయత్నం ఫలించకపోవటంతో ఇప్పటికీ అవి అలానే వుండిపోయాయి. పదేళ్ళ కితం తక్కెళ్ళపాడు ప్రాంతంలో పైపు లైన్ల నిర్మాణానికి తవ్వకాలు చేస్తుండగా శిశువుకుస్థన్యం ఇస్తున్న ఒక యక్షిణి విగ్రహం దాదాపు అడుగు పరిమాణంలో బయల్పడింది. బౌద్ధ మతం ఈ ప్రాంతంలో విలసిల్లిందని చెప్పటానికి ఇలాంటి పలు ఆధారాలు ఇందుగుపల్లి, రావిరాల ప్రాంతాల్లో సైతం లభ్యమయ్యాయి.

జగ్గయ్యపేట బౌద్ధ స్తూపం చుట్టూ తాపడం చేసిన నాపరాళ్ళపై అత్యద్భుతమైన రీతిలో మొసలిపై నిలుచుని నాట్యం చేసే యక్షిణి చిత్రాలు శిల్పాకృతుల్లో ఆకర్షణీయంగా వున్నాయి. వీటిని భద్రపరచటంలో ప్రభుత్వం విఫలం కావటంతో ప్రస్తుతం సగ భాగం విరిగిపోయిన యక్షుల చిత్రాలు మాత్రం దర్శనమిస్తున్నాయి. ఈ స్తూపానికి సంబంధించిన బుద్ధుని విగ్రహం ఒకటి లండన్ మ్యూజియంలో వున్నదని ప్రతీతి. క్రీ.శ 1886లో జాన్ బర్గెస్ ఇక్కడ పరిశోధనలు చేసిన కాలంలో దీన్ని తరలించి వుంటారని చరిత్రకారులు అభిప్రాయపడ్డారు. జగ్గయ్యపేట ప్రాంత బౌద్ధ వైశిష్ట్యాన్ని వెల్లడిచేసే శిల్పాలను సేకరించి ఇక్కడేఒక మ్యూజియం నిర్మిస్తే పర్యాటకులకు ఆకర్షణగా వుంటుందని స్థానికులు ప్రభుత్వాన్ని కోరుతున్నారు.



జగ్గయ్యపేట బౌద్ధ స్తూపం శిలలపై యక్షిణిలు నిలిచివున్న చిత్రాలు, పక్కన సప్తాలంకార సమన్వితుడగు చక్రవర్తి సేకరుల శిల్పం (ప్రస్తుతం ఈ శిల్పం ఆచూకీ తెలియదు)

# ఆధునిక వ్యవసాయ పరికరాల అడ్డా 'పంతులుగారు'

(ప్రభాతవార్త-గుడివాడ)

ఆంధ్రప్రదేశ్, సరిహద్దు రాష్ట్రాల్లో ఆధునిక వ్యవసాయ పరికరాలు ఎక్కడ దొరుకుతాయంటే వెంటనే 'పంతులుగారి షెడ్డు' అనే సమాధానం వినిపిస్తోంది. పంతులుగారి షెడ్డులో తయారైన వస్తువులు మన్నికతోపాటు రీసేల్ కూడా అధికంగా ఉంటుందనే నమ్మకం రైతుల్లో ఉంది. పంతులుగారి షెడ్డు స్వాతంత్ర్యానికి ముందు 1946 నుండి ఈరోజు వరకు నాణ్యమైన ట్రక్కులను రైతులకు అందిస్తోంది. అలాగే ట్రాక్టరు వెనుక వినియోగించే వ్యవసాయ వరికరాలైన కల్టివేటర్లు, చక్రాలు, పడ్లర్లు, డిస్కియారోలు, బ్లేడ్లు ఇతర సామాన్లను అత్యంత ప్రతిభావంతంగా నేల యొక్క అదుపాజ్ఞనలను తెలిసి, తయారు చేయడంతో ఈ షెడ్డు మార్కెట్లో మంచిపేరును కలిగిఉంది. 2003 ఆగస్టు 30న పంతులగారి షెడ్డు అనే 'మోడరన్ ఆర్కు వెల్డింగు వర్క్స్'కు కేంద్రప్రభుత్వం జాతీయ అవార్డు ప్రకటించడం విశేషం. ఇంతేకాక పలు అవార్డులు, ప్రశంసలు ఈ సంస్థ కైవసం చేసుకుంది. సంస్థ వ్యవస్థాపకుడు దివంగత కురుమద్దాలి వెంకటచలపతిరావు(పంతులుగారు) మరణానంతరం ఆయన ద్వితీయ కోడలు కె.భాగ్యలక్ష్మి, ఆమె భర్త కె.సుధాకర్, మరిది కె.రవికుమార్ల సహకారంతో సంస్థను దిగ్విజయంగా, నాణ్యతా ప్రమాణాలు తగ్గకుండా వ్యాపారాన్ని ద్విగుణీకృతం చేశారు. పలు జిల్లాల్లో ప్రభుత్వం ప్రకటించిన సబ్సిడీ విధానాన్ని అమలుచేసి, నాణ్యత తగ్గకుండా సగం ధరలకే వ్యవసాయ పరికరాలను రైతాంగానికి తయారు చేసి పంపిణీ చేయడంలో ఈ సంస్థ అగ్రగణ్యమైంది. సంస్థ ప్రస్తుత మేనేజింగు డైరెక్టర్ భాగ్యలక్ష్మి కృషిని గుర్తించి, రోటరీ, ఇన్నర్‌వీల్ క్లబ్, మహిళా మండలి సంస్థలు ఆమెను సత్కరించాయి. ఈ సంస్థను రాజకీయ ప్రముఖులు మర్రి చెన్నారెడ్డి, యర్రా నారాయణస్వామి, వడ్డే శోభనాద్రీశ్వరరావు, పిన్నమనేని కోటేశ్వరరావు, ఎం.వెంకయ్యనాయుడు, గవర్నరు యు.ఎస్.రామారావు, దగ్గుపాటి పురంధరేశ్వరి, దగ్గుపాటి వెంకటేశ్వరరావు, నడకుదిటి నరసింహారావు, సందర్శించి, రైతులకు చేస్తున్న సేవలను ప్రశంసించారు.

# 40 శాతం విదేశాల్లో
# స్థిరపడుతున్న విశ్వశాంతి విద్యార్థులు

(ప్రభాతవార్త, ఉయ్యూరు)

కృష్ణా జిల్లా ఉయ్యూరులోని విశ్వశాంతి ఇంగ్లీష్ మీడియం హైస్కూల్‌లో ఇప్పటివరకు పదవతరగతి చదివిన విద్యార్థుల్లో 40 శాతం మంది విదేశాల్లో స్థిరపడి విద్యాసంస్థ ఖ్యాతిని దేశదిశలా వ్యాపింపజేస్తున్నారు. 32 సంవత్సరాల క్రితం 60 మంది విద్యార్థులతో ప్రారంభమైన విశ్వశాంతి విద్యాలయం నేడు రెండువేల ఐదువందలమంది విద్యార్థులలో 80 ఎకరాల సువిశాల ప్రాంగణంలో విద్యాసేవలందిస్తుంది. ఇప్పటివరకు ఈ పారశాల నుంచి మూడువేల మంది విద్యార్థులు పదవ తరగతి చదివగా వీరిలో 12 వందల మంది విద్యార్థులు ఉన్నత చదువులు చదివి అమెరికా, యు.కె., ఇంగ్లాండ్, జపాన్, జర్మనీ, సౌదీ అరెబియా, న్యూజిలాండ్ తదితర దేశాల్లో స్థిరపడ్డారు. విశ్వశాంతి ఎడ్యుకేషన్ ఇన్‌స్టిట్యూట్ ప్రైవేట్ లిమిటెడ్ చైర్మన్ అండ్ ఎండి మాదాల సుబ్రమణ్యేశ్వరరావు తెలిపారు. గ్రామీణ ప్రాంతంలోని సాధారణ విద్యార్థులతో అసాధారణ ఫలితాలు సాధిస్తూ విద్యార్థుల బంగారు భవిష్యత్‌కు పునాదులు వేస్తూ గ్రామీణ విశ్వవిద్యాలయంగా ప్రశంసింపబడుతుంది. ప్రతి ఏడాది 65 మంది మెరిట్ విద్యార్థులకు 44 లక్షల 50వేల రూపాయలు స్కాలర్‌షిప్‌లను అందిస్తూ విశ్వశాంతి ఎడ్యుకేషన్ కొనసాగిస్తుంది. పదవతరగతి పరీక్షలకు హాజరైన విద్యార్థులు ఎక్కువశాతం ఆరువందలకు ఐదువందల మార్కులు తెచ్చుకోవటం గొప్ప విషయం.



# త్వరలో సింగపూర్ టౌన్‌షిప్

## డిమాండ్ సర్వే నోటిషికేషన్‌కు రంగం సిద్ధం

## విజిటిఎం ఉడా ఛైర్మన్ మల్లాది విష్ణు వెల్లడి

(ప్రభాతవార్త-గుంటూరు)

విజయవాడ-గుంటూరు నగరాల్లో ఇళ్ల కొరతను పరిష్కరించేందుకు విజిటిఎం ఉడా అతి త్వరలో అమరావతి టౌన్‌షిప్‌లోని సింగ్‌పూర్‌తరహాలో మెగాటౌన్‌షిప్‌ను నిర్మాణం ప్రారంభించనున్నది. ఇందుకు ఏర్పాట్లు చురుగ్గాసాగుతున్నాయి. ఈ టౌన్‌షిప్ నిర్మాణం కోసం సింగపూర్‌లోని ఖుర్బా ఇంటర్నేషనల్ సంస్థతో విజిటిఎం ఉడా ఒప్పందం కుదుర్చుకుంది.

అమరావతి టౌన్‌షిప్‌లోని 54ఎకరాల విస్తీర్ణంలో సుమారు 1400అపార్టుమెంట్‌లు నిర్మించాలని విజిటిఎం ఉడా నిర్ణయించింది. ఇందులో కొన్ని డూపెక్స్ హౌస్‌లు, నాలుగు అంతస్తుల అపార్టుమెంట్లు, ఎనిమిది అంతస్తుల అపార్టుమెంట్లు నిర్మించనున్నట్టు విజిటిఎం ఉడా ఛైర్మన్ మల్లాది విష్ణు తెలిపారు. ఈ అపార్టుమెంట్లకు ఉన్న డిమాండ్‌ను పరిగణనలోకి తీసుకుని ఉడా టౌన్‌షిప్‌లో అపార్టుమెంట్ల నిర్మాణం చేపట్టనున్నది.

ఇందుకు అతి త్వరలో డిమాండ్ సర్వే నిర్వహించనున్నది. ఈ డిమాండ్ సర్వేను ఉన్న స్పందన పరిగణలోకి తీసుకుని విజిటిఎం ఉడా ఈ అపార్టుమెంట్లు నిర్మాణం చేపడుతుంది. ఇందుకు త్వరలో బ్రోచర్లను కూడా మార్కెట్‌లోకి విడుదల చేయనున్నారు. ఈ బ్రోచర్‌లలోని వివరాలను ఇంటర్నెట్‌లో కూడా పెట్టనున్నట్టు విజిటిఎం ఉడా వైస్‌ఛైర్మన్ డాక్టర్ దుర్గాదాస్ తెలిపారు. సింగ్‌పూర్ తరహాల్లో ఎనిమిది అంతస్తుల అపార్టుమెంట్లు కూడా నిర్మించటం వల్ల ఎన్‌ఆర్‌ఐలు కూడా ఈ అపార్టుమెంట్లు కొనుగోలు చేసే అవకాశం ఉందని ఉడా అధికారులు భావిస్తున్నారు.

ఎన్ని అపార్టుమెంట్ల కోసం దరఖాస్తులు వస్తే అన్ని అపార్టుమెంట్లు నిర్మించాలని ఉడా అధికారులు నిర్ణయించారు. దశలవారీగా మిగిలిన అపార్టుమెంట్లు నిర్మిసారు. మార్కెట్‌లో బిల్డర్లు నిర్మించే అపార్టుమెంట్ల కంటే మెరుగైన విదంగా నాణ్యతా ప్రమాణాలు పాటించటంతో పాటు. వాటి ధరలు కూడా మధ్య తరగతి వారికి అందుబాటులో ఉండే విధంగా చర్యలు తీసుకోవాలని ఉడా నిర్ణయించింది.

అపార్టుమెంట్ల నిర్మాణానికి సంబంధించి సాంకేతిక పరమైన సలహాలు తీసుకునేందుకు కెఎల్‌సిఇ,విజయవాడ నగరపాలకసంస్థ సిటీప్లానర్, సివిల్ ఇంగజనీరింగ్ రంగానికి సంబంధించిన నిపుణులతో ఒక కమిటీని ఏర్పాటు చేశారు. ఈ టౌన్‌షిప్ నిర్మాణం వల్ల మంగళగిరి పట్టణం ఇంకా అభివృద్ధి చెందుతుందని ఉడా భావిస్తోంది.

ఈ టౌన్‌షిప్‌కుఇప్పటికే మంచినీటి సదుపాయం ఉంది. అప్రోచ్ రోడ్లు కూడా నిర్మించనున్నారు. హైదరాబాద్‌లోని పోచారంలో సింగ్‌పూర్‌కు చెందిన ఖుర్జాన ఇంటర్నేషనల్ సంస్థ టౌన్‌షిప్ నిర్మించింది. అదే తరహాలో మంగళగిరిలో కూడా టౌన్‌షిప్‌లో నిర్మించనున్నది. ఈ విధంగా చేయటం వల్ల విజయవాడ-గుంటూరు నగరాల్లో హౌసింగ్‌కు ఉన్న డిమాండ్ కూడా కొంత వరకు తగ్గుతుందని ఉడా భావిస్తోంది.

నాలెడ్జిపార్కు

విజయవాడ-గుంటూరు-తెనాలి మంగళగిరి పట్టణాలను అభివృద్ధి చేసే కార్యక్రమంలో భాగంగా 3వేల ఎకరాల విస్తీర్ణంలో ఉడా ఒక నాలెడ్జిపార్కును ఏర్పాటు చేయాలని నిర్ణయించింది. ఈ పార్కు ఏర్పాటు పై ఉడా అధికారుల రిమార్కులు కూడా ప్రభుత్వం కోరింది. ఈ పార్కు ఏర్పాటునకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వం త్వరలో ఉత్తర్వులు జారీ చేసే అవకాశం ఉందని విజిటిఎం ఉడా అధికారులు భావిస్తున్నారు.

# మన ఎంపీలు

**1980 లోక్‌సభ**

| | | |
|---|---|---|
| గుంటూరు | ఎన్.జి.రంగా | కాంగ్రెస్ |
| తెనాలి | ఎం.నాగేశ్వర రావు | కాంగ్రెస్ |
| బాపట్ల | అంకినీడు ప్రసాదరావు | కాంగ్రెస్ |
| నరసరావుపేట | కె.బ్రహ్మానందరెడ్డి | కాంగ్రెస్ |

**1984 లోక్‌సభ**

| | | |
|---|---|---|
| గుంటూరు | ఎన్‌జి రంగా | కాంగ్రెస్ |
| తెనాలి | ఎన్.వెంకటరత్నం | తెలుగుదేశం |
| బాపట్ల | చిమటా సాంబు | తెలుగుదేశం |
| నరసరావుపేట | కె.నారాయణ స్వామి | తెలుగుదేశం |

**1989 లోక్‌సభ**

| | | |
|---|---|---|
| గుంటూరు | ఎన్.జి.రంగా | కాంగ్రెస్ |
| తెనాలి | ఎస్.బసవపున్నయ్య | కాంగ్రెస్ |
| బాపట్ల | ఎస్.బెంజిమన్ | కాంగ్రెస్ |
| నరసరావుపేట | కె.వి.కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |

**1991 లోక్‌సభ**

| | | |
|---|---|---|
| గుంటూరు | లాల్ జాన్ బాషా | కాంగ్రెస్ |
| తెనాలి | యు.వెంకటేశ్వర్లు | తెలుగుదేశం |
| బాపట్ల | డి.వెంకటేశ్వరరావు | తెలుగుదేశం |
| నరసరావుపేట | కె.వి.కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |

**1996 లోక్‌సభ**

| | | |
|---|---|---|
| గుంటూరు | రాయపాటి సాంబశివరావు | కాంగ్రెస్ |
| తెనాలి | టి.శారద | తెలుగుదేశం |
| బాపట్ల | యు.వెంకటేశ్వర్లు | తెలుగుదేశం |
| నరసరావుపేట | కోట సైదయ్య | తెలుగుదేశం |

**1998 లోక్‌సభ**

| | | |
|---|---|---|
| గుంటూరు | రాయపాటి సాంబశివరావు | కాంగ్రెస్ |
| తెనాలి | పి.శివశంకర్ | కాంగ్రెస్ |
| బాపట్ల | నేదురుమల్లి జనార్దనరెడ్డి | కాంగ్రెస్ |
| నరసరావుపేట | కె.రోశయ్య | కాంగ్రెస్ |

**1999 లోక్‌సభ**

| | | |
|---|---|---|
| గుంటూరు | వై.వి.రావు | తెలుగుదేశం |
| తెనాలి | ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు | తెలుగుదేశం |
| బాపట్ల | డి.రామానాయుడు | తెలుగుదేశం |
| నరసరావుపేట | నేదురుమల్లి జనార్దనరెడ్డి | కాంగ్రెస్ |

**2004 లోక్‌సభ**

| | | |
|---|---|---|
| గుంటూరు | రాయపాటి సాంబశివరావు | కాంగ్రెస్ |
| తెనాలి | వల్లభనేని బాలశౌరి | కాంగ్రెస్ |
| బాపట్ల | దగ్గుబాటి పురందేశ్వరి | కాంగ్రెస్ |
| నరసరావుపేట | మేకపాటి రాజమోహన్‌రెడ్డి | కాంగ్రెస్ |

# విద్యారంగంలో అగ్రగామి

(ప్రభాతవార్త-నరసరావుపేట)

రాష్ట్రంలో గుంటూరుజిల్లా విద్యారంగంలో విశిష్టతను సంతరించుకోగా జిల్లాలో నరసరావుపేట పట్టణం అగ్రగామిగా వెలుగొందుతున్నది. నాలుగు దశాబ్దాలకు పూర్వమే నరసరావుపేట ప్రాంతం ప్రముఖ విద్యా కేంద్రంగా భాసిల్లింది. విద్యారంగంలో వస్తున్న మార్పులకనుగుణంగా విద్యార్థులకు అవసరమైన ఆధునిక కోర్సులను అందుబాటులోకి తీసుకురావడంలో నరసరావుపేట కళాశాలలు ముందంజలో ఉన్నాయి. రాష్ట్రంలోనే చరిత్రగల్గిన శ్రీసుబ్బరాయ అండ్ నారాయణ కళాశాల వేలాదిమంది విద్యార్థులను తీర్చిదిద్దింది. 1950లో స్థాపించిన ఈకళాశాల అంచెలంచెలుగా అభివృద్ధిచెంది నేడు అనేకరకాల కోర్సులను అందిస్తున్నది. కళాశాల అధ్యక్ష, కార్యదర్శులు కవలవాయి కాశీరామారావు, నాగసరవు రామారావు, కళాశాలను తీర్చిదిద్దడంలో తమ వంతు కృషి చేస్తున్నారు. ఈకళాశాలలో పనిచేసిన పలువురు అధ్యాపకులు దేశవిదేశాల్లో పేరుప్రతిష్టలు గడించారు.

నరసరావుపేట పట్టణానికి 4కి.మీ.ల దూరంలో కోటప్పకొండ రహదారిలో ఆహ్లాదకరమైన క్యాంపస్‌లో నిర్వహిస్తున్న నరసరావుపేట ఇంజనీరింగ్ కళాశాల అత్యుత్తమ విద్యాప్రమాణాలతో తనకంటూ ఒక ప్రత్యేకతను చాటుకుంది. ఎఐసిటిఇ గుర్తింపు పొందిన ఎన్ఇసి జెఎన్‌టియుకు అనుబంధంగా పనిచేస్తూ ఉత్తమ ఫలితాలు సాధించడంలో ప్రత్యేకత సంతరించుకుంది. ఎఐసిటిఇ దేశవ్యాప్తంగా ఇచ్చిన రేటింగ్‌లో మొదటి 32కళాశాలల్లో ఎన్ఇసికి స్థానం దక్కడం విశేషం. 2004లో ఈకళాశాలకు ఎక్సలెంట్ అవార్డు లభించింది. ప్రతిఏటా గేట్ పరీక్షల్లో ఈకళాశాల విద్యార్థులు అత్యుత్తమ ర్యాంకులు సాధిస్తున్నారు. అనుభవం కల్గిన అధ్యాపకవర్గం మంచి ఫలితాలు సాధించేందుకు కృషి చేస్తుంది.

1998లో గాయత్రి ఎడ్యుకేషనల్ సొసైటీ ఆధ్వర్యంలో ప్రారంభించిన ఎన్ఇసి ప్రస్తుతం బి.టెక్ ఆరుబ్రాంచ్‌లు, పి.జి.కోర్సులు, ఎంసిఎలను నిర్వహిస్తున్నది. గేట్, జిఆర్ఇ, టొఫెల్, క్యాట్ తదితర పోటీపరీక్షలకు ప్రత్యేక శిక్షణ ఇస్తున్నారు. 122జర్నల్స్‌తో 19వేల పుస్తకాలతో లైబ్రరీ విద్యార్థులకు అందుబాటులో ఉంది. క్యాంపస్ ఇంటర్వ్యూల నిర్వహణకోసం ప్రత్యేక సెల్ ఏర్పాటుచేసి ప్రముఖ సాఫ్ట్‌వేర్ కంపెనీల్లో విద్యార్థులు ఉద్యోగాలు సాధించేందుకు కృషి చేస్తున్నారు. పల్నాడుప్రాంతంలో ఇంజనీరింగ్ విద్యను అందుబాటులోకి తేవాలనే ఉద్దేశ్యంతో కళాశాలను స్థాపించామని విద్యార్థులకు అవసరమైన అన్ని సౌకర్యాలు కల్పించామని కళాశాల చైర్మన్ మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు తెలిపారు.

జిల్లాలోనే అత్యున్నత విద్యాబోధన అందిస్తున్న విద్యాసంస్థలుగా పట్టణంలోని పిఎన్‌సి అండ్ కెఆర్ కళాశాలలు ప్రత్యేక గుర్తింపు పొందాయి. ఈకళాశాలకు డిగ్రీ కళాశాలల జాతీయ అంచనాల గుర్తింపు మండలి ( నాక్) బి++ గ్రేడ్ లభించింది. శ్రీ వెంకటేశ్వరా పాలడుగు నాగయ్యచౌదరి, కొత్త రఘురామయ్య ఎడ్యుకేషన్ సొసైటీ ఆధ్వర్యంలో ఒకే క్యాంపస్‌లో ఎల్‌కెజినుండి పి.జి.వరకు విద్యాసంస్థలను నిర్వహిస్తున్నారు. విశ్వవిద్యాలయ పరిధిలో అరుదైన లైబ్రరీని ఈ కళాశాలలో నిర్వహిస్తున్నారు. తమ విద్యాసంస్థలను జిల్లాలోనే నెం.1గా తీర్చిదిద్దాలన్న లక్ష్యంతో పనిచేస్తున్న కళాశాల కరస్పాండెంట్ డాక్టర్ మేదరమెట్ల శివలింగప్రసాద్ పేర్కొన్నారు. వీటితోపాటు 1972లో స్థాపించిన శ్రీమతి కాసురాఘువమ్మ బ్రహ్మానందరెడ్డి జూనియర్, డిగ్రీ కళాశాలలు 1984లో స్థాపించిన నందమూరి బసవతారకం నల్లపాటి వెంకటేశ్వర్లు కళాశాల, 1987లో స్థాపించిన సెయింట్‌ఆన్స్ మహిళా జూనియర్ కళాశాల, 1991లో స్థాపించిన డాక్టర్ ఎస్.బెంజిమెన్ మెమోరియల్ మహిళా డిగ్రీకళాశాలలతోపాటు పలు ప్రైవేటు సంస్థలు, విద్యాభివృద్ధికి కృషి చేస్తున్నాయి.


ఎస్ఎస్ఎన్ కళాశాల


ఇంజనీరింగ్ కాలేజీ


పిఎన్‌సి అండ్ కెఆర్ కళాశాల

# భక్తులతో అలరారుతున్న కాకాని మల్లేశ్వరుడు

(ప్రభాతవార్త-పెదకాకాని)

గుంటూరు నగరానికి అతి సమీపంలో కేవలం ఏడు కిలోమీటర్ల దూరంలో ఉన్న పెదకాకాని గ్రామంలో శ్రీభమరాంబ సమేత మల్లేశ్వరస్వామి దేవస్థానం రాష్ట్రంలోనే సుప్రసిద్ధ శైవ పుణ్యక్షేత్రంగా వెలుగొందుతోంది. హిందువు లకు అత్యంత ప్రియమైన శివాలయం నిత్యం వేలాది మంది భక్తులతో కిక్కిరిసిపోతుంది. రాష్ట్రం నలుమూలల నుంచి భక్తులు విశేషంగా ఇక్కడ జరిగే కార్యక్రమాలకు హాజర వుతారు.

ప్రత్యేక పూజలు నిర్వహిస్తారు. దేవాలయంలో దసరా, శివరాత్రి, వినాయకచవితి ఉత్సవాలు అత్యంత వైభవంగా జరుపుతారు. ఈ ఉత్సవాలలో వేలాది మంది భక్తులు పాల్గొంటారు. ఈ దేవాలయంలో పుట్టు వెంట్రుకలు, అన్నప్రసన్న కార్యక్రమాలు ప్రతి నిత్యం వందల సంఖ్యలో జరుగుతూనే ఉంటాయి. దూర ప్రాంతాల నుంచి భక్తులు ప్రభలతో తమ మొక్కులు తీర్చుకోవడానికి వస్తుంటారు. (మిగతా 66 పేజీలో)



కాకానిలోని స్వామివార్ల మూలవిరాట్‌లు



# జిల్లా అధికారుల ఫోన్ నంబర్లు

| | అధికారి | ఆఫీస్ ఫోన్‌నెం. | ఇంటి ఫోన్‌నెం. |
|---|---|---|---|
| 1. | కలెక్టర్ | 2234200,2234458 2234301 2228800(అ) | 2234824,2234550 ఫ్యాక్స్ 2235139(ఇల్లు) |
| 2. | జాయింట్ కలెక్టర్, గుంటూరు | 2241475 | 2241797 |
| 3. | జిల్లా రెవిన్యూ ఆఫీసర్ | 2234990 | 2234194 |
| 4. | స్పెషల్ ఆఫీసర్, అర్బన్ లాండ్ సీలింగ్ | 2234276 | 2234549 |
| 5. | రెవిన్యూ డివిజనల్ అఫీసర్, గుంటూరు | 2240679 | 2355177 |
| 6. | సబ్ కలెక్టర్, తెనాలి | 223800 | |
| 7. | ఆర్.డి.ఓ నర్సరావుపేట | 222039 | 2228055 |
| 8. | జిల్లా మేనేజర్, సివిల్ సప్లైస్ | 2230421 | 2350213 |
| 9. | జిల్లా మేనేజర్, స్మాల్ సేవింగ్స్ | 2234353 | |
| 10. | జిల్లా సివిల్ సప్లైఆఫీసర్, గుంటూరు | 2235477 | |
| 11. | జిల్లా మేనేజర్, సివిల్ సప్లైస్ కార్పొరేషన్ | 2230421 | 2350213 |
| 12. | డి.ఐ.జి ఆఫ్ పోలీస్, గుంటూరు | 2320250 | 2230812,2230912 |
| 13. | ఎస్.పి, గుంటూరు | 2234000 | 2352300 |
| 14. | అడిషనల్ ఎస్.పి గుంటూరు | 2234000 | 2358950 |
| 15. | ఎ.ఎస్.పి, గుంటూరు అర్బన్ | 2241152 | |
| 16. | డి.ఎస్.పి, గుంటూరు రూరల్ | 2320136 | 2230136 |
| 17. | డి.ఎస్.పి, తెనాలి | 225829 | |
| 18. | డి.ఎస్.పి, సరసరావుపేట | 233030, 222333 | |
| 19. | డి.ఎస్.పి, సత్తెనపల్లి | 08641-232149 | |
| 20. | డి.ఎస్.పి, గురజాల | 08649-248288 | |
| 21. | డి.ఎస్.పి, బాపట్ల | 08643-224310 | |
| 22. | జాయింట్ డైరెక్టర్, వ్యవసాయం | 234308, 2234632 | 2350805 |
| 23. | అసిస్టెంట్ డైరెక్టర్, వ్యవసాయం, గుంటూరు | 2230426 | 2230494 |
| 24. | కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్, గుంటూరు | 2234958 | 2234721 |
| 25. | డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసర్.(ఎస్.ఎఫ్), గుంటూరు | 2234519 | 2232447 |
| 26. | రేంజర్ ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్, గుంటూరు | 2234256 | 2358052 |
| 27. | డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసర్ (రెగ్యులర్) టెర్రిటోరియల్, గుంటూరు | 2234256 | 2234238 |
| 28. | డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసర్ ఫ్లైయింగ్ స్క్వాడ్... గుంటూరు. | 2234468 | 2231893 |
| 29. | జిల్లా కో ఆపరేటివ్ ఆఫీసర్, గుంటూరు | 2234462 | 2326883 |
| 30. | డివిజనల్ కో ఆపరేటివ్ ఆఫీసర్, గుంటూరు | 2323246 | 2219499 |

# నాడు 'దొంగల గుంట'.. నేడు పుణ్యక్షేత్రం

(ప్రభాతవార్త-గుంటూరు)

కైలాసనాధుడు లింగరూపంలో దర్శనమిస్తూ, భక్తులను తరింపజేస్తున్న స్థానిక కొత్తపేటలోని ఉమామహేశ్వరస్వామి ఆలయం నూట ముప్పై సంవత్సరాల చరిత్రగలది. అప్పట్లో ఆ ప్రాంతం 'దొంగలగుంట'గా ప్రసిద్ధి. అసాంఘిక కార్యక్రమాలకు కేంద్రంగా వుండేది. ఒక తపస్వి కాశీనుండి 'శివ లింగం'ను తీసుకువచ్చి ఇక్కడ ప్రతిష్ఠించారు. నడిమిపల్లి రామన్న పంతులు ఆలయ నిర్మాణానికి పూనుకుని నిర్విఘ్నంగా కార్యసాధన చేశారు. పది ఎకరాల పొలాన్ని కూడా దేవాలయానికిచ్చారు.

ఆలయ పరిసర ప్రాంతాలలో జనసంచారం ఎక్కువగా లేకపోవడంతో ఆలయానికొచ్చే భక్తుల సంఖ్య అతి తక్కువగా వుండేది. ఇదిలా వుండగా, రామన్న పంతులు కుమారుడు నరసింహారావు విద్యనభ్యసించే నిమిత్తం విదేశాలకు వెళ్ళారు. చదువు ముగించుకుని మాతృదేశానికి వచ్చిన తర్వాత ఆలయ కార్యక్రమాలలో పాల్గొనదలిచారు. పూర్వం విదేశాలకు వెళ్ళడం సనాతన సంప్రదాయాలకు విరుద్ధంగా భావించేవారు. ఆ కారణంగా ఆలయ కార్యక్రమాలలో పాలుపంచుకోవడానికి స్థానికులు నిరసన వ్యక్తం చేయడంతో ఈ విషయమై ఆయన కోరుకెళ్ళటం, ఆలయాభివృద్ధికి ఇచ్చిన పది ఎకరాల పొలాన్ని వెనుకకుతీసుకోవడం వంటి సంఘటనలు జరిగాయి. స్థానిక భక్తుల సదవగాహనతో కొన్ని ఎకరాల భూమిని కొనుగోలు చేసి ఆలయానికిచ్చారు. కాలవాహినిలో జరిగిన అనేక మార్పులతో ఆలయానికి కావలసిన సదుపాయాలు క్రమంగా సమకూరాయి.

శివలంగం వెనుక భాగంలో కొంచెం సొట్ట వుంటుంది. చాలా శక్తివంతమైన లింగాలకు మాత్రమే అలా వుంటుందని ప్రతీతి. మహేశ్వరునితోపాటు తూర్పాభిముఖంగా ఉమాదేవి, పక్కగా బాలా త్రిపురసుందరి కొలువుదీరి వున్నారు. రమణీయమైన దేవతామూర్తుల వర్ణచిత్రాలు ఆలయకుడ్యాలపై శోభిల్లుతున్నాయి. పదునాలుగు దేవుళ్ళున్న ఉమామహేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలో ప్రతి నిత్యం భక్తులాండాల్సిందే. భక్తుల విఘ్నాలను తొలగించి, విజయాన్ని చేకూర్చే గణనాధుడు విఘ్నేశ్వరుడు దక్షిణభాగంలో, పక్కన వల్లీ దేవసేన సమేత శ్రీ సుబ్రహ్మణ్యస్వామి, రమాసహిత వీర వెంకట సత్యనారాయణస్వామి ప్రతిష్ఠితులై భక్తులకు కొంగుబంగారంగా వున్నారు.

ఉత్తరదిశలో వీరభద్రుడు, భద్రకాళీ అమ్మవార్లుండగా ఆలయ వెనుక



కొత్తపేట శివాలయం

భాగంలో కలియుగదైవం శ్రీవేంకటేశ్వరుడు, హనుమంతుడు భక్తుల అభీష్టాలను నెరవేరుస్తూ సర్వకార్యసిద్ధి జరగాలని వేడుకొనే భక్త పిపాసులను అనుగ్రహిస్తున్నారు. ఈశాన్యంలో నవగ్రహాలు నెలకొనివున్న ఈ ఆలయంలో షిర్డిసాయిబాబా, మంత్రాలయ రాఘవేంద్ర స్వామి భక్తుల సేవలందుకుంటూ విరాజిల్లుతున్నారు. దేవాలయంలోని మరో విశిష్టత సూర్యభగవానుని ఆలయ మండపం. ఆరోగ్యప్రదాతైన సూర్యదేవుడు సప్తాశ్వాల మీద పయనిస్తున్న విగ్రహ దృశ్యం బహురమణీయం.

ఉత్సవాల విషయానికొస్తే ప్రతియేటా మార్గశిరశుద్ధ ఏకాదశి నాడు రుద్ర యాగం, చండీయాగం, కార్తీక మాసంలో జరిగే అభిషేకాలు, ప్రత్యేక పూజలు, పర్వదినమైన శివరాత్రి నాడు రోజంతా నిర్వహించే పూజా కార్యక్రమాలు, మహాన్యాసపూరక ఏకాదశ రుద్రాభిషేకం విశిష్టమైన రీతిలో జరుపుతారు. ఆరుద్రోత్సవాలు, బ్రహ్మోత్సవాలు, ప్రత్యేక ఆకర్షణను సంతరించుకున్నాయి. ప్రతి శనివారం నవగ్రహాలకు అభిషేకాలు, పూజలు సర్వసాధారణం. గతంలో వైశాఖ మాసంలో అమ్మవారికి లక్ష మల్లెపూలపూజ నిర్వహిస్తుండేవారు.

ఆలయ ప్రారంభపు రోజుల్లో కొంతకాలం కేవలం ఒకటి, రెండు రూపాయలు, అదే కార్తీక మాసంలోనైతే రూ.400ల దాకా ఆలయ ఆదాయం వుండేది. 1970వ దశకంలో దేవాదాయశాఖ ఆధీనంలోకి వెళ్ళిన ఉమామహేశ్వరస్వామి ఆలయం 6బి విభాగంలోకి వస్తుంది.

(64వ పేజీ తరువాయి)

పిల్లలు కలగనివారు శివాలయం చుట్టూ ప్రదక్షణలు చేసి లోపల ఉన్న రావిచెట్టుకు ఉయ్యాల కడితే పిల్లలు కలుగుతారని ప్రజలలో నమ్మకం ఉంది. అలాగే దీర్ఘకాల రోగాలు సైతం శివాలయం చుట్టూ ప్రదక్షణలు చేస్తూ శివునికి అభిషేకం చేస్తే నయమవుతాయని ప్రతీతి. కోరిన వారికి కోరుకున్న వరాలిచ్చే దేవుడు కాకాని శివుడు అని భక్తుల నమ్మకం.

# భక్తులతో అలరారుతున్న...

## నవగ్రహ మండపం

ఆలయంలో ఉన్న నవగ్రహ మండపంలో గ్రహ శాంతి, శనిదోష పరిహారానికి ప్రత్యేక పూజలు నిర్వహిస్తుంటారు. దూర ప్రాంతాల నుంచి వచ్చిన భక్తుల సౌకర్యార్థం ప్రత్యేక కాటేజీలు నిర్మించారు. శివా లయం చుట్టూ యాత్రికులకు విశ్రాంతికి ప్రాకార మండవం నిర్మించారు. ప్రస్తుతం దేవాలయంలో రాష్ట్రంలోని ప్రసిద్ధ దేవాలయాల్లో ఉన్నట్టుగానే నిత్యాన్నదాన వధకం, నిత్యప్రసాద పధకం ప్రవేశపెట్టారు. దేవాలయంలో స్వామి వారికి అద్దాల మండవం నిర్మించారు.

## రాహు, కేతు గ్రహాలు

జాతకంలో నర్పదోషం, రాహు కేతువులు జన్మకుండీలలో ప్రతికూల స్థానాల్లో ఉన్నవారు రాహు, కేతు గ్రహాల అధినేతలకు విశేష అర్చనలు జరపాలని జ్యోతిష్యశాస్త్రం చెబుతుంది. ఈ విధమైన దోషాలు ఉన్నవారు రాహు, కేతు మండపంలో ప్రత్యేక పూజలు నిర్వహించాలి. ఇటువంటి రాహు, కేతు విగ్రహాలు రాష్ట్రంలో గతంలో ఒక్క శ్రీకాళహస్తిలో మాత్రమే ఉండేది. రాహు, కేతు ప్రత్యేక పూజలు నిర్వహించడానికి పెదకాకాని శివాలయంలో నూతనంగా రాహు, కేతు విగ్రహాలను ప్రతిష్ఠించారు.

## ద్వాదశ జ్యోతిర్లింగాలు

గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, కృష్ణ, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలో అత్యధిక వార్షిక ఆదాయం కలిగిన దేవాలయం. దేఆలయంలో నూతనంగా అభిషేక మండవం, ద్వాదశ జ్యోతి ర్లింగాలను ఒక శిలాఫలకంపై నెలకొల్పారు. ద్వాదశ జ్యోతి ర్లింగాలను దర్శించాలంటే ఎంతో వ్యయంతో కూడుకున్న వ్యవహారం. రాష్ట్రంలో నలుమూలల ఉన్నటువంటి శివలింగాల నమూనాను ఒకే శిలాఫలకంపై చిత్రీకరించి వాటికి ప్రత్యేక పూజలు నిర్వ హిస్తున్నారు. ఇక్కడ అభిషేకం చేయిస్తే ద్వాదశ జ్యోతిర్లింగాలను దర్శించినంత పుణ్యం కలుగుతుందని భక్తుల నమ్మకం.

ఈ వివాలయంలో కార్తీక మాసంలో మహిళలు అధిక నంఖ్యలో కార్తీక స్నామాచరించి దేవాలయంలో ప్రత్యేక దీపారాధనలు చేస్తారు.

దేవాలయం ముందున్న యజ్ఞాలతో స్నానం చేస్తే సర్వదోషాలు తొలిగిపోతాయని భక్తుల విశ్వాసం. ఆలయ అభివృద్ధికి ఎ.సి, అంకినీడు ప్రసాద్ విశేష కృషి చేశారు.

## గుంటూరు సిటీలో సినిమా హాళ్ల ఫోన్ నంబర్లు

| | |
|---|---|
| భాస్కర్ డీలక్స్ - 223058 | పల్లవి-2225777 |
| హరిహర మహల్ -2231822 | రాధాకృష్ణ -2220029 |
| గౌరీశంకర్ - 2220939 | సరస్వతి 2221999 |
| జ్యోతిమహల్ -2232044 | స్వామి -2230445 |
| కృష్ణమహల్ - 2221865 | వెంకటకృష్ణ -2220617 |
| కృష్ణపిక్చర్‌ప్యాలెస్- 2220221 | విజయలక్ష్మి - 2222404 |
| లక్ష్మీపిక్చర్‌ప్యాలెస్ - 2232668 | విజయటాకీస్ -2221265 |
| లిబర్టీ-2220561 | వెంకట్రామ -2220628 |
| లిటిల్‌కృష్ణ -2224515 | విష్ణుప్రియ - 2234410 |
| నాజ్‌డీలక్స్ -5545595 | |

# అదృష్టాన్ని తెచ్చే 'ఆరు'

(ప్రభాతవార్త - అచ్చంపేట)

భవిష్యత్తు జీవితం ఏవిధంగా ఉంటుందో తెలుసుకోవాలన్న ఆసక్తి ఉన్న వారికి జ్యోతిష్యంపై నమ్మకం సహజం. దీనికి సంబంధించి ప్రపంచంలో 50కి పైగా జ్యోతిష్య శాస్త్రాలున్నాయి. అందులో ముఖ్యమైనవి పంచాంగం, రేఖాశాస్త్రం, నాడీ జోస్యము, నుదుటి మీద గీతలను బట్టి చూసే జోస్యము, కాలజ్ఞానము, ఆస్ట్రాలజీ(చేతివ్రాతను బట్టి చూసే శాస్త్రము), సంఖ్యాశాస్త్రము. వీటిన్నింటిలో ప్రపంచంలో అతి ప్రాముఖ్యతను పొందిన శాస్త్రంగా సంఖ్యాశాస్త్రం గుర్తించబడింది.

సంఖ్యాశాస్త్రం గురించి ప్రపంచ ప్రముఖ సంఖ్యాశాస్త్ర నిపుణులు కాకి సీతారామయ్య. వీరు అచ్చంపేటలో సుమారు 10 సంవత్సరాలకు పైగా విద్యుత్తుశాఖలో పనిచేసి పదవీ విరమణ చేశారు. వీరు అచ్చంపేట వచ్చిన సందర్భంగా 'ప్రభాతవార్త'తో ముచ్చటిస్తూ సంఖ్యాశాస్త్ర ప్రాధాన్యత వివరించారు. ప్రస్తుత సంవత్సరం ఆరు సంఖ్యలో జన్మించిన వారు అత్యంత అదృష్టవంతులని పేర్కొన్నారు. ఈ సందర్భంగా '6' సంఖ్య ప్రాముఖ్యత వివరించారు. 6 లేదా మొత్తం సంఖ్యలను కూడితే అంటే 15, 24 తేదీలలో జన్మించిన వారి యొక్క అదృష్ట సంఖ్య '6'గా తెలిపారు. వీరు ఏ సంవత్సరం, ఏ నెలలో జన్మించిన వారైనా కావచ్చు. వారం మంగళ, శుక్రవార్గాలు, రంగు విషయానికొస్తే లేత నీలం వీరికి కలిసి వస్తుందన్నారు. ఈ సంఖ్యలో పుట్టిన వారు దాయాదుల ఇండ్లలోగాని లేక దత్తతగా గాని వెళ్ళే అవకాశం ఉంటుంది. అందమైన రూపం, శరీర సౌష్టవం వీరికి ఉంటుంది. చిత్రలేఖనం, నటన, సంగీతం, నృత్యం లాంటి కళలయందు ఆసక్తి ఉటుంది. న్యాయ, వైద్య, రాజకీయ, వ్యాపార శాస్త్రాలలో రాణిస్తారు. ప్రేమ వివాహాలు ఫలిస్తాయి. ఆరు సంఖ్య జాతకులు స్నేహంతో ఉంటారని, తనకు సాయం చేసిన వారిని ఆదరించి, అభిమానిస్తారు. ధన సంపాదన మొదలుకాగానే

సంఖ్యాశాస్త్ర నిపుణుడు కాకి సీతారామయ్య



తిరుగు లేకుండా ముందుకు వెళతారు. పేరు ప్రఖ్యాతలేకాకుండా అత్యున్నత స్థాయిలోకి వెళ్ళి ఒక్కసారిగా అధమ స్థాయిలో పడిపోయే అవకాశముందన్నారు. నిజాయితీ, పట్టుదల, ఏకాగ్రతతో తిరిగి అనతి కాలంలోని యథాస్థితికి చేరువ అవుతారని తెలిపారు. ఈ తేదీలలో జన్మించిన వారు దాంపత్య జీవితం బాగుంటుంది. ప్రకృతి సౌందర్య ఆరాధకులు. స్వతహాగా ఉన్న మేథాశక్తితో సమస్యలు పరిష్కరించు కుంటారు. వ్యాపారరంగంలో తేయాకు, పొగాకు, ఫైనాన్స్, వస్త్ర వ్యాపారాల్లో దేశ విదేశాలలో పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తారు. ఈ సంఖ్య జాతకులకు పట్టణ ప్రాంతం కలిసి వస్తుంది. ఉదర సంబంధమైన, రక్తనాళాలకు సంబంధమైన వ్యాధులు వస్తాయి. వీరికి 3,9,12, 21,30, 18 సంఖ్యలు కూడా కలిసి వస్తా యని తెలిపారు. సంఖ్యకు గ్రహాధి పతి శుక్రుడు. భాగస్వామ్య సంఖ్య 9,18,27, జాతిరత్నం, పసుపు రంగు గల డైమండు, లేత నీలం, కనక పుష్యరాగం కలవి ధరించాలి. వ్యతిరేక సంఖ్యలు 1,2, 10,11, 7,16,19, 20,25, 28,2, నవంబరు 22 నుండి అక్టోబరు 22 వరకు శుభదాయకముగా ఉంటుంది. మొత్తం మీద 6 సంఖ్యలో జన్మించిన వారు అదృష్ట వంతులు అని చెప్పవచ్చున్నారు. వీరు ఆస్థిపాస్తులను సమకూర్చుకుంటారు. భవనాలు, తోటల కొనుగోలులో ఆసక్తి చూపుతారు. వీరికి లోభితనం ఎక్కువగా ఉంటుంది. దీన్ని మార్చుకోడానికి ప్రయత్నం చేస్తే వీరి జీవితం ఆనందదాయకంగా ఉంటుందని సంఖ్యా శాస్త్ర పండితులు సీతారామయ్య తెలిపారు. ఈ తేదీలో జన్మించిన ప్రముఖ వ్యక్తుల్లో రాష్ట్రపతి అబ్దుల్‌కలామ్, బిజెపి నాయకులు మదన్‌లాల్ ఖురానా, ఒరిస్సా మాజీ ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్, తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత, ఉత్తర ప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి మాయవతి, సినీ సంగీత దర్శకుడు ఎ.ఆర్.రహమాన్, ప్రముఖ టెన్నిస్ క్రీడాకారిణి సానియామీర్జా.

గుంటూరు జిల్లా ప్రముఖులు చిలకలూరిపేట ఎమ్మెల్యే మర్రి రాజశేఖర్, తెనాలి ఎమ్మెల్యే నాదెండ్ల మనోహర్, పి.సి.సి. కార్యదర్శి రాయపాటి శ్రీనివాస్, రాయపాటి సాయిమోహన్‌కృష్ణ తదితరులు ఉన్నారు.

## జగ్గయ్యపేట - అచ్చంపేటల స్థాపకుడు

# రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు

(ప్రభాతవార్త - అచ్చంపేట)

అచ్చంపేట మండలంలోని రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు చేసిన సేవ అంత ఇంత కాదు. చింతపల్లిని రాజధానిగా చేసుకొని 17వ శతాబ్దంలో మండల పరిసర ప్రాంతాన్ని ఏలారు. అప్పుడు జమీందారి వ్యవస్థ ఉండేది. వీరి తండ్రి జగ్గన్న భూపాలుడు, తల్లి అచ్చమాంబ. బ్రిటిష్ వారికి ఎదురు తిరిగి నిలబడిన ధీమంతుడు వెంకటాద్రి నాయుడు. గుంటూరుజిల్లా ఏర్పడక ముందు బందరును కేంద్రంగా చేసుకొని బ్రిటిష్ వారు కృష్ణా, గుంటూరు ఏరియాలను పరిపాలించారు. వెంకటాద్రి నాయునికి 250 గుర్రాలు ఉండేవి. వాటిని తమ వెసం చేసుకోడానికి నాయుడిపై తీవ్ర వత్తిడి తెచ్చారు. అలాంటి పరిస్థితిలో అచ్చంపేట ఏరియాలోని ప్రజలను సమయాత్తపరిచి వారికి ఎదురు నిలవడంతో వీరి ధాటికి బ్రిటిష్ వారు వెనుతిరిగి పరారైనారు. సతీసహగమనాన్ని వ్యతిరేకించిన ఘనత కూడా నాయుడికే దక్కుతుంది. కాలక్రమేణా రాజా రామమోహన్‌రాయ్ వంటి మేధావులు ఈ చట్టాన్ని సమూలంగా రద్దు పరిచారు. తల్లిదండ్రులు మృతి చెందడంతో వారిపేర్లపై కృష్ణాజిల్లాలో జగ్గయ్యపేట, గుంటూరుజిల్లాలో అచ్చంపేట గ్రామాలను స్థాపించారు. వారి స్మృతి చిహ్నంగా ఆయా గ్రామాలలో సత్రాలను నిర్మించారు.

వెంకటాద్రినాయుడు దానశీలం కలవాడు. కృష్ణానది పరివాహక ప్రాంతాలలో ఏకముహుర్తన 101 దేవాలయాలలో 101 శివలింగాలను ప్రతిష్టించారు. వాటి ధూప,దీప నిర్వహణకు వేల ఎకరాల భూమిని దేవాలయాలకు ఉదారంగా రాసి ఇచ్చారు.

నాయుడు నిర్మించిన దేవాలయాలలో అమరావతి అతి ప్రాచుర్యాన్ని సంతరించుకుంది. దొంగతనమే వృత్తిగా భావించి చెంచులు ఈ ప్రాంతవాసులను అనేక విధాల దోచుకోవడమేకాకుండా మహిళల వట్ల అనభ్యకరంగా ప్రవర్తించి, వారి మాన, ప్రాణాలను హరింవ చేయడం నాయుడు సహించలేకపోయారు. అనేక విధాల వారికి నచ్చచెప్పడానికి ప్రయత్నం చేశారు. భూములు, మణులు ఇస్తామన్నారు. జనజీవన స్రవంతిలో కలసి జీవించేందుకు అన్ని విధాల తోడ్పడతానన్నారు.

వీటిన్నింటికి వారు ఒప్పుకోక పోవడంతో వారిని సమూలంగా నశింపచేసేందుకు పథకం వేసి వారిని తుదిముట్టించారు. కాని నాయుడు తాను పాపం చేశానన్న మనో వేదనకు గురైనారు. ఈ సమయంలో పరమ శివుడు కలలో కన్పించి చేసిన పాపాన్ని ప్రక్షాళన చేసుకోవాల్సినదిగా ఉపదేశం చేసినట్లు చరిత్ర పుస్తకాల ద్వారా తెలుస్తోంది.

ఇదే సమయంలో నాయుడు మనో వేదనకు గురై సామ్రాజ్యంపై పట్టుసడలిన కాలంలో బ్రిటిష్ వారు ఆయనపైపై ఒక్కసారిగా దండెత్తారు. గుర్రాలను స్వాధీనపరచుకున్నారు. ఆ సమయంలో వెంకటాద్రి నాయుడు కృష్ణా నది తీరాన కుటుంబ నమేతంగా పరారైనారు. తనకున్న బంగారు, వజ్ర వైఢూర్యాలను కృష్ణానది తీర ప్రాంతాలలో అక్కడక్కడ భూస్థాపితం చేసి అమరావతికి తరలినట్లు చరిత్ర చెబుతుంది.

కానీ ఆయన అక్కడికి వెళ్ళినా చెంచులువధ తన అంతరాత్మను వేధిస్తూనే ఉంది. దీని ప్రకారం నది తీర ప్రాంతాలలో 101 దేవాలయాలను నిర్మించి ఏక ముహూర్తన 101 శివ లింగాలను ప్రతిష్టించారు. ఎందరో నిర్భాగ్యులకు భూములు, భవనాలు, మణులు, మాణిక్యాలు దానం చేశారు.

నాయుడు పావ నివృత్తి కోసం గోయాగం చేశారు. బంగారంతో చేసిన గోవును గ్రామంలో ఊరేగించి, నోటి నుండి ఉదరంలో ప్రవేశించి మల విసర్జన కేంద్రం ద్వారా బయట పడితే పునర్జన్మ లభించినట్లని, చేసిన పావం మూర్తిగా నశిస్తుందని విద్వాంసులు చెప్పడంతో నాయుడు బంగారంతో పెద్ద గోవును చేయించారు, నోటి నుండి మల ద్వారం ద్వారా బయటకు వచ్చారు. పండితులు వేద మంత్రాలతో ఈ తంతు జరిపించారు.

అయితే ఈ యాగం అనంతరం యాగం చేయించిన బ్రాహ్మణులకు, గ్రామంలోని మాదిగలకు మధ్య పేచి వచ్చింది. యాగానికి ఉపయోగించిన ద్రవ్యాలు మొత్తం తమకు దక్కాలని బ్రాహ్మణులు, నాయుడుకు పునర్జన్మ వచ్చిన విధానాన్ని బట్టి చూస్తే నోటి నుండి మల ద్వారా గుండా రావడం అంటే గోవు చనిపోయిన దానితో సమానం కాబట్టి చనిపోయిన గోవు మాకు దక్కాలని మాదిగలు మధ్య పోరు జరిగింది.

నాయుడు ఇద్దరి వాదనతో ఏకీభవించారు. వారు చెప్పినది సక్రమమైనదేనన్న నిర్ణయానికి వచ్చి గోవును మాదిగలకు ఇచ్చారు. బ్రాహ్మణులు వాదన కూడా సక్రమమైనదే కావడంతో గోవును తయారు చేయడానికి అయిన ఖర్చు మొత్తం బ్రాహ్మణులకు ఇచ్చారు.

అమరావతిని అందమైన నగరంగా తీర్చిదిద్ది విశాలమైన రహదార్ల నిర్మాణాలను చేపట్టి అమరేశ్వరాలయానికి నూతన రూపురేఖలు దిద్దారు.

రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు 19వ శతాబ్ది (1761 నుండి 1816) వరకు అమరావతిని పరిపాలించిన జమిందారుగా నిలిచారు. ఈయన అమరేశ్వరునికి భక్తుడు, అమరేశ్వరస్వామికి . విమాన మండవ ప్రాకారగోపురాలను నిర్మింపచేసి తన రాజ్యమున అనేక దేవాలయాలలో స్వర్ణ ధ్వజ, శిఖర ప్రతిష్ట . చేశారు.

భక్త శిఖామణి హిరణ్య గర్భక్రతువులను జరిపి మూడుసార్లు స్వర్ణ,రజిత తులభారములను తూగి ఆ ధనమును అనేక అగ్రహారములకు దానం చేసిన దాత నాయుడు. వీరి వంశీయులు నేటికి అమరేశ్వరునికి ధర్మకర్తలుగా వ్యవహరిస్తున్నారు.


అచ్చంపేటలో ఉన్న రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు


వెంకటాద్రి నాయుడు నిర్మించిన చింతపల్లిలో శివాలయం


చింతపల్లిలో నేటికి ఉన్న ఆయుధాలు ఉంచే గృహం

## 'వార్త' పదవ వార్షికోత్సవ శుభాకాంక్షలు

# ప్రగతి పథంలో సత్తెనపల్లి పురపాలక సంఘం





శ్రీ కన్నా లక్ష్మీనారాయణగారు
రాష్ట్ర సహకార
రవాణాశాఖా మాత్యులు



శ్రీ ధర్మాన ప్రసాదరావుగారు
రాష్ట్ర రెవెన్యూ శాఖా మాత్యులు
జిల్లా ఇన్‌చార్జి మాత్యులు



శ్రీ రాయపాటి సాంబశివరావుగారు
పార్లమెంటు సభ్యులు
గుంటూరు



శ్రీమతి గంటా సరస్వతి రోశయ్య
చైర్‌పర్సన్ పురపాలక సంఘం,
సత్తెనపల్లి



షేక్ అబ్దుల్‌జానీ
వైస్ చైర్మన్ పురపాలక సంఘం,
సత్తెనపల్లి



ఆతుకూరి నాగేశ్వరరావు(బాబు)
ఫ్లోర్‌లీడర్ పురపాలక సంఘం, స
త్తెనపల్లి

### సత్తెనపల్లి పట్టణములో వివిధ పథకముల క్రింద పూర్తి చేసిన అభివృద్ధి పనులు, జరుగుచున్న అభివృద్ధి పనులు మరియు చేపట్టబోయే అభివృద్ధి పనుల వివరాలు :

1. రూ.15.33కోట్లతో సమగ్ర మంచినీటి పథకం కింద పట్టణం లో పూర్తిస్థాయి మంచినీటి సరఫరాకు ఏర్పాట్లు, దీనిలో భాగంగా రెండు రిజర్వాయర్లు నిర్మాణం, ఫిల్టరేషన్ ప్లాంటు మొదలగునవి పూర్తి కాబడినవి. మరియు 112.70 ఎకరములలో సమ్మర్ స్టోరేజి ట్యాంకు నిర్మాణ పనులు అతి త్వరలో చేపట్టబడును.
2. జాతీయ మురికివాడల అభివృద్ధి పథకం క్రింద పట్టణంలోని వివిధ మురికి వాడల్లో రూ.21.00 లక్షలతో సిమెంటు రోడ్లు మరియు సిమెంటు కాల్వలు నిర్మాణం చేపట్టబడినవి. మరియు రూ.31.00లక్షలతో మరికొన్ని మురికివాడలలో సిమెంటు రోడ్డు నిర్మాణానికి చర్యలు చేపట్టబడినవి.
3. ఐ.డి.ఎస్.ఎం.టి పథకం క్రింద రూ.39.00లక్షలతో కూరగాయల మార్కెట్ భవనము నిర్మాణం పూర్తి చేయబడినది. మరియు రూ.2.38కోట్లతో షాపింగ్ కాంప్లెక్స్ నిర్మాణము, కమ్యూనిటీ హాలు నిర్మాణం చేపట్టుటకు చర్యలు తీసుకొనబడినవి.
4. ఎ.పి.యు.ఆర్.ఎం.ఎస్.పి. పథకం క్రింద(ప్రపంచ బ్యాంక్) రూ.300.00లక్షలతో 6 మురికి వాడలలో పూర్తిస్థాయి అభివృద్ధి కార్యక్రమాలు మరియు పట్టణంలో ప్రధాన రోడ్లు, సిమెంటు కాల్వలు నిర్మాణం చేపట్టుటకు చర్యలు తీసుకొనబడినవి.
5. దీపం పథకం క్రింద 447 మంది లబ్దిదారులకు గ్యాస్ కనెక్షన్లు మంజూరు చేయబడినవి.
6. పురపాలక సంఘ సాధారణ నిధులతో రూ.115.00లక్షలతో సిమెంటు రోడ్లు, సిమెంటు కాల్వలు, మంచినీటి బోర్లు మొదలగునవి పట్టణంలో చేపట్టబడినవి.
7. రాజీవ్ గృహ కల్ప పథకం క్రింద 240 మంది ఇళ్ళ నిర్మాణమునకు చర్యలు తీసుకొనబడుచున్నవి.
8. యు.పి.హెచ్. పథకం క్రింద 500 మంది లబ్దిదారులు గృహనిర్మాణమునకు చర్యలు చేపట్టబడినవి.
9. దారిద్ర్యరేఖకు దిగువన ఉండి తెలుపురేషన్ కార్డు కలిగియుండి దరఖాస్తు చేసిన వెంటనే వారికి రూ.1200 లకు మంచినీటి కుళాయి కనెక్షన్లు మంజూరు.
10. ప్రతి సోమవారం ప్రజాహిత కౌంటర్ ద్వారా ప్రజా సమస్యలపై దరఖాస్తులు / అర్జీలు/ స్వీకరణ మరియు సత్వర పరిష్కార చర్యలు.



**శ్రీ వై.ఎస్.రాజశేఖరరెడ్డిగారు**
**ముఖ్యమంత్రి**

**శ్రీ యర్రం వెంకటేశ్వర రెడ్డిగారు**
**ఎమ్మెల్యే, సత్తెనపల్లి**



శిరసాల వాసుబాబు
1వ వార్డు కౌన్సిలర్



నరిశేటి గురవయ్య
2వ వార్డు కౌన్సిలర్



రమావత్ కోటేశ్వరరావునాయక్
3వ వార్డు కౌన్సిలర్



బచ్చు మనోహరరావు
4వ వార్డు కౌన్సిలర్



షేక్ మహబూబీ
6వ వార్డు కౌన్సిలర్



దర్శి జయమ్మ
7వ వార్డు కౌన్సిలర్



గుజ్జర్లపూడి నాగేశ్వరరావు
8వ వార్డు కౌన్సిలర్



పెద్దింటి గోవిందమ్మ
9వ వార్డు కౌన్సిలర్



మక్కపాటి వెంకట్రావు
10వ వార్డు కౌన్సిలర్



ఎద్దులదొడ్డి వెంకటేశ్వర్లు
11వ వార్డు కౌన్సిలర్



ఉల్లం ఝాన్సీలక్ష్మీబాయి
12వ వార్డు కౌన్సిలర్



ముద్దినేడి శ్రీనివాసరావు
13వ వార్డు కౌన్సిలర్



వెల్లటూరి ప్రకాశరావు
14వ వార్డు కౌన్సిలర్



సిగ్గం నాగేశ్వరరావు
16వ వార్డు కౌన్సిలర్



మారెళ్ళ మల్లేశ్వరరావు
17వ వార్డు కౌన్సిలర్



తమ్మల లక్ష్మీసుజాత
18వ వార్డు కౌన్సిలర్



అవ్వారు ఈశ్వరమ్మ
19వ వార్డు కౌన్సిలర్



షేక్ అబ్దుల్లా సాహెబ్
20వ వార్డు కౌన్సిలర్



గాత్రం కుముదినిదేవి
21వ వార్డు కౌన్సిలర్



ఆకుల వెంకటరమణమ్మ
23వ వార్డు కౌన్సిలర్



చౌట సుజాత
24వ వార్డు కౌన్సిలర్



షేక్ సైదు
25వ వార్డు కౌన్సిలర్



షేక్ మస్తాన్‌బీ
26వ వార్డు కౌన్సిలర్



బచ్చు వెంకట బాలాంజనేయులు
కో-ఆప్షన్‌మెంబరు



కాటుమాల డేవిడ్
కో-ఆప్షన్‌మెంబరు



జమక్కమూడి ఝాన్సీలక్ష్మి
కో-ఆప్షన్‌మెంబర్

## ఇట్లు : జి.సన్యాసిరావు, కమీషనర్, పురపాలక సంఘం, సత్తెనపల్లి.





# బాయర్ క్రాప్ సైన్స్

(69వ పేజీ తరువాయి)

అందచేయడమే కాకుండా పర్యావరణ పరిరక్షణకు, ఇంధన వినియోగంలోజాతీయ, అంతర్జాతీయ అవార్డుల ను సాధిస్తున్న సంస్థ యుపిఎల్ ప్రపంచ వ్యాప్తంగా ఆహార పరిరక్షణకు కావలసిన. సస్యరక్షణ మందులను టె క్నికల్ గ్రేడ్‌లతోసహా తయారు చేసి రైతుల అవసరాలకు తగిన విధంగా ఫార్ములేషన్‌లను అందచేసి ప్రముఖ బ్రాండ్‌గా రైతుల అభిమానాన్ని పొందిన సంస్థ యుపిఎ ల్ విత్తన శుద్ధి నుండి మొదలుకొని పంట కాలంలో అ వసరమైన కలుపు మందులు, పురుగు మందులు, తెగు ళ్ళ మందులు, దిగుబడులు పెంచడానికి అవరమైన ఎంజై ములతో సహా పంట దిగుబడి అనంతరం గోదాముల లో కూడా ధాన్యాన్ని రక్షించడానికి అవసరమైన ఎలుక ల మందులు ఫ్యూమిగెంట్‌లు తయారు చేస్తున్నారు. ప్రపంచ వ్యాప్తంగా అల్యూమినియం ఫాస్‌ఫైడ్ అతిపెద్ద తయారీ దారుగా గుర్తింపు లభించింది. 2700 మంది ఉద్యోగులతో భారతదదేశంలో 26 ఆఫీసులు కలిగి దేశ వ్యాప్తంగా 4000 పైగా డిస్టిబ్యూటర్‌లను డీలర్లను క లిగిన ప్రముఖ కంపెనీగా రైతులకు సేవలందిస్తుంది.

రు. 3500 కోట్ల మార్కెట్ క్యాపిటలైజేషన్‌తో 71 శా తం ఉత్పాదనలను ఎగుమతి చేస్తున్నది. భారతదేశంలో 9 ఫ్యాక్టరీలను యునైటెడ్ కింగ్ డమ్ ఒక ఫ్యాక్టరీ కలిగి వుంది. ప్ర పంచ వ్యాప్తంగా వ్యాపార విస్తరణకు అక్విజి షన్‌ల పరపరంను వ్యూహాత్మకంగా కొనసాగిస్తున్నది. 1994 నుండి 13 కంపెనీలను విలీనం చేసుకున్న కంపె నీ 2005 సం.లోనే 4 కంపెనీలను విలీనం చేసుకున్న దంటే ఏపాటి ప్రగతి సాధిస్తుందో విశదమవుతుంది. భారతదేశంలో ఒకప్పటి ప్రముఖ కంపెనీగా వెలుగొంది న షావాలెస్‌ను కొనుగోలు చేయడం ద్వారా ప్రగతి సాధిం చింది. యుపిఎల్ వారి బహుళ ప్రయోజకారియైన తెగుళ్ళ మందు సాఫ్‌కు భారతదేశపు మొట్టమొదటి ఇఎంఆర్ ల భించటం, సాఫ్ తయారీ పద్ధతికి పేటెంట్ లభించడం వీ రి రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంటు శక్తికి తార్కాణం.

యుపిఎల్‌కు అనుబంధ సంస్థ అయిన జయ్ రీసెర్చ్ ఫౌండేషన్ ద్వారా అంతర్జాతీయ స్థాయిలో రీసెర్చ్ సేవ లు అందచేస్తున్నది.

1600 మంది విద్యార్థులు కలిగిన శ్రీమతి శాంద్రాబెన్ ష్రాఫ్ ధ్యానధామ్ స్కూలును, 200 పడకల హలియ ఎ ల్‌జి రోటరీ హాస్పటల్‌ను నిర్వహించడం ద్వారా సామాజి క సేవా రంగంలో యుపిఎల్ తన వంతు పాత్ర పోషిస్తు న్నది. రైతుల పంట దిగుబడులు పెంచుకోవడానికి అ వసరమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని అందచేయడానికి గ్రా మాలలో రైతు అవగాహన సదస్సులు ఏర్పాటు చేస్తు న్నారు. డిప్యూటీ జనరల్ మేనేజరు శ్రీ సాయి వర్ధనరా వు మార్కెటింగ్ మేనేజర్ శ్రీనివాసరెడ్డి మరియు రీజనల్ మేనేజర్ శ్రీ అశోక్‌రెడ్డి గారి ఆధ్వర్యంలో 60 పైగా రైతు అవగాహన సదస్సులు ఏర్పాటు చేశారు.

## రైతు జన బాంధవి - ఇండోఫిల్

ప్రపంచ శ్రేణి పురుగుందుల కంపెనీలలో ఒకటైన ఇం డోఫిల్ కెమికల్స్ గత 45 సంవత్సరాలనుండి రైతు సేవ లో భాగంగా ఇండోఫిల్ ఎం-45, ఇండోఫిల్ జడ్ -78, ఇండోఫిల్ బాణ్ మరియు కంపానియన్ లాంటి అనేక తె గుళ్ళ మందులను రైతులకు అందించిన విషయం మ నందరికి విదితమే. మారుతున్న పరిస్థితులను, రైతు క్షే త్ర సమస్యలను సదా నిశిత పరిశీలించే ఇండోఫిల్ ఇటీవ ల ఒక్క ప్రపంచ శ్రేణి అద్భుత కీటకనాశిని రిమాన్ పేరుతో రైతుల చెంతకొచ్చిందని రీజనల్ మేనేజరు శివకుమార్ రె డ్డి తెలిపారు. ఈ మందు నేడు రైతులకు తీవ్ర సమస్యగా ఉన్న పచ్చపురుగు, లద్దె పురుగు రెండింటిని అతి సమర్థ వంతంగా నాశనం చేయగలగడమే కాకుండా పర్యావరణ పరంగా ప్రపంచంలోనే అతి సురక్షితమైన మందుగా గు ర్తించబడిందని వివరించారు.

దేశ నలుమూలలా విస్తరించిన ఇండోఫిల్ సేవ మరి యు మార్కెటింగ్ విభాగం శాస్త్రవేత్తల నిరంతర కృషి, తరగని ఆత్మ విశ్వాసం, మారుతున్న చీడలపై నైపుణ్యం తో వ్యవహరించగల డెవలప్‌మెంట్ విభాగం ... ఇవన్నీ ఒకవైపు ఇండోఫిల్ బలం కాగా నాణ్యతా ప్రమాణాలు నానాటికి రైతుల్లో కంపెనీ పట్ల పెరుగుతున్న విశ్వాసం మరొకవైపు ఇండోఫిల్‌ను భారతదేశంలోనే కాక ప్రపంచ శ్రేణిలో కూడా ఒక గుర్తింపు పొందిన కంపెనీగా నిలబెట్టా యని కృతజ్ఞతతో కూడిన గర్వంతో విన్నవించుకుంటున్న ట్లు అన్నారు.

కంపెనీ ఆవిర్భావం నుండి నేటి వరకు తెగుళ్ళు మం దుల వాడకం వివిధ పంటలలో వాటి ప్రాముఖ్యతను గూ ర్చి చెబుతున్న ఇండోఫిల్ రైతు సోదరులకు మరొకసారి గుర్తు చేస్తున్న విషయం ఇండోఫిల్ ఎం.-45 ఇండోఫిల్ జడ్ -78, ఇండోఫిల్ బాణ్ లాంటి తెగుళ్ళ మందులు తెగుళ్ళు రాకముందే వాడటం వలన జరగబోయే నష్టాన్ని ముందే నివారించడానికి అవకాశమున్నట్లు సూచించారు.

# తెల్ల బంగారు లోకం

(ప్రభాతవార్త-గుంటూరు)

అన్ని రంగాల్లో అభివృద్ధి చెందుతున్న గుంటూరు జిల్లా పలు పరిశ్రమలకు కేంద్రబిందువైంది. కేంద్ర రాష్ట్ర ప్రభు త్వాలు పరిశ్రమలకు ఇన్తున్న ప్రోత్సాహకాల వల్ల ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలు పత్తి మిల్లును ప్రారంభిం చడానికి ముందుకు వస్తున్నారు. మూతపడ్డ మిల్లులను తెరిపించేందుకు అన్ని విధాలుగా చర్యలు తీసుకుంటు న్నారు. జిల్లాలో వందకు పైగా మిల్లులు కొత్తగా ఏర్పాటు కానున్నాయి. మూతపడ్డ వాటిలో 25కుపైగా ప్రత్తి మిల్లు లను తెరిపించి తద్వారా వాటిని అభివృద్ధి చేస్తున్నారు. ప్రత్తి మిల్లులు స్థాపనకు యాజమానులు వారి వ్యాపారానికి అనుకూలంగా వుండే ప్రదేశాల ను ఎంచుకుంటున్నారు. ఆ ప్రదేశాలలో ముఖ్యమైనది గుంటూరు బైపాస్ రోడ్డుకు ఇరువైపుల ఎన్నో వందల ఎకరాలు పొ లాలు వున్నాయి. ఈ పొలాలను దూర దృష్టి వున్న వారు ముందుగానే కొని ఉంచుకున్నారు. కాలానుగుణంగా వ్యా పారం పెరగడంతో ఆ పొలాలకు మరింత డిమాండ్ పెరిగింది. డిమాండ్ ఎంత వున్నా సరే ఆ పొలాలను కొనుగోలు చేస్తున్నారు. ఈ పొలాలకు నంబంధించిన డాక్యుమెంట్స్ తదితర పత్రాలను బ్యాంకర్లుకు స్యూరిటీగా ఇచ్చి, వారి వద్ద లోన్ సదుపా యం పొందుతున్నారు. తద్వారా వారి కొన్న పొలాల్లో మిల్లులను నిర్మించటం జరుగుతుంది. ఈ విధంగా నిర్మిం చిన మిల్లులు సుమారు 400 వరకు వుండవచ్చు. పత్తి మిల్లుల పరిస్థితి ఇలా వుండగా గుటూరు కేంద్రంగా అతి త్వరలో అత్యాధునిక మిల్లులు ప్రారంభంకానున్నాయి. 200కోట్ల రూపాయలతో ఏర్పాటు కానున్న ఈ మిల్లులు టెక్స్‌టైల్ రంగంలో ఆధునిక ఒరవడిని సృష్టిస్తాయని చెప్పవచ్చు. దీంతో టెక్స్‌టైల్ సిటీగా పేరుపొందిన కోయ ంబత్తూరుకు ధీటుగా గుంటూరు జిల్లా కూడా అభివృద్ధి చెందగలదని చెప్పవచ్చు.

### కూలీలకు ఉపాధి

ఈ మిల్లుల్లో పని చేయుటకు కూలీలు ఎన్నో వందల మంది అవసరం వుంది. మన గుంటూరులో వున్న కూలీ లతో ఈ మిల్లులు నడిపించాలంటే వేలు కాదు, అందుక ని మిల్లు యాజమానులు వేరు వేరు జిల్లాల్లో వున్న కూలీలను పిలిపించటం జరిగింది. ఈ కూలీలకు ఒక మే స్త్రి వుంటారు. ఆ మేస్త్రి మిల్లు యాజమానులు ఇచ్చు అడ్వాన్స్‌లతో సీజన్ కు 1 నెల ముందు వారి వారి ఊళ్ళు వెళ్ళి, ఖర్చులు క్రింద అడ్వాన్సులు ఇచ్చి వస్తారు. సీజన్ మొదలు కాగానే వారిని దగ్గర వుండి వెం పెట్టుకు ని వస్తారు. వచ్చిన కూలీలకు మేస్త్రీయే అద్దె ఇ ల్లులను చూపించడం జరుగుతుంది. ఈ కూ లీలు ముఖ్యంగా ఆదోని, శ్రీకాకుళం, మంత్రాలయం, చుట్టు ప్రక్క గ్రామాల నుంచి వస్తుంటారు. వారితో పాటు వారు పిల్లలకు కూడా తెస్తారు. వేల పిల్లలు ఎక్కువగా నిరక్షరాస్యులు, ఎందువలన నంటే వీరు పని నిమిత్తం వేర్వేరు చోట్లకు ఈ పిల్లలు చదువుకు దూరం అవుతున్నారు. వీరి ఇళ్ళకు కాపలగా వృద్ధాప్యం వున్న వారిని అక్కడే వుంచి వస్తారు. ఇక్కడ వచ్చిన తరువాత ప్రత్తి మిల్లులలో రెండు షిప్ట ల వారీగా పని చేయాల్సి వుంటుంది. మొదటి షిప్టుగా ఉదయం 9 గంటల నుండి రెండు షిప్టు రాత్రి 9 గం టల నుండి ఉదయం 9 గంటల వరకు పని చేయాల్సి వుంటుంది. వీరికి రోజు వారి కూలిగా 50 రూపా యలు వరకు వుంటుంది. మగవారు ఎంత పని చేస్తే అంత సంపాదించుకునే అవకాశం వుంటుంది. వుంచ డం జరుగుతుంది. ఏది ఏమైనప్పటికి జిల్లాలో ప్రత్తి మిల్లుల వ్యాపార అభివృద్ధి రోజు రోజుకి పెరుగుతూనే వుంది. అనుకోకుండా కేంద్ర ప్రభుత్వం చేపట్టటం తో ఈ వ్యాపార అభివృద్ధి రానున్న కాలాల్లో ఎంతగా నో అభివృద్ధి చెందే అవకాశం వుంది.

# ఆపదలో ఆదుకునే దేవుడు గుంటి విఘ్నేశ్వరుడు

(ప్రభాతవార్త-గుంటూరు)

భగవంతుడు సత్య నిరూ పణకు సాక్షి భూతుడు కాగలడన్న విషయం నిరూ పించేది పాత గుంటూరు ప్రాం తంలోని గుంటి విఘ్నేశ్వర స్వామి ఆలయం. ప్రాచీన కాలం నాటి దేవాలయంగా పేర్గొన బడుతున్న శ్రీ విఘ్నేశ్వర స్వామి మహిమా శక్తి అనంతం. ఎటువంటి శుభ ప్రదమైన కార్యక్రమానికైనా తొలుత ఆది దేవుడైన శ్రీ విఘ్నేశ్వర స్వామిని పూ జించి ఆ కార్యక్రమం నిర్వ హించడం అత్యంత శ్రేయ స్కరమని మన వేదాలు, పురాణాలు చెబు తున్నాయి. తొలి పూజను అందుకునే గణనాథుడుగా శ్రీ విఘ్నే శ్వరునికి ప్రథమ తాం బూలం దక్కుతుంది. భక్తు లు భక్తిశ్రద్ధలతో గణ నాథు న్ని వేడుకున్నంతనే తన అభయ హస్తం ద్వారా ఆశీ స్సులను అందచేసి భక్తుల కోరికలను నెర వేర్చడం ఆయనకే చెల్లుతుంది. ప్రస్తు తం పాతగుంటూరులో నెలకొని ఉన్న శ్రీగుంటి విఘ్నేశ్వర స్వామి ఆలయం లో అతి ప్రాచీన కాలం నాటిదిగా చెప్పొచ్చు.



తొలుత పాత గుంటూరు ప్రాంత వాసులు శ్రీ స్వామివారిని సేవించి గానీ ఏ శుభ కార్యక్రమం మొదలు పెట్టేవారు కాదని చారిత్రాత్మక స్థితిగతులు చెబుతున్నాయి.

గుంటి విఘ్నేశ్వర స్వామి ఆలయానికి ఒక చారిత్రాత్మక ప్రాశస్త్యం ఉంది. అది ఏమిటంటే ఎనిమిదవ శతాబ్ద కాలంలో పాత గుంటూరు ప్రాంతం రాజులకు స్థానంగా ఉండేది. ఇక్కడ ఎర్ర చెరువు ఉంది. ఎర్ర చెవులో ఆనాడు మోహన రాజు, గోపాలరాజు అనే ఇరువు రాజపుత్రులు కుష్ఠువ్యాధితో బాధపడేవారు.

తీర్థయాత్రలు చేస్తూ ఈ ప్రాంతానికి వచ్చి ఎర్ర చెరువులోని నీటిని జల్లుకుని తుడుచుకోగా తమకు సంభవించిన వ్యాధి నాయమైంది. అప్పుడు ఇక్కడ నీటికి గొప్ప ప్రభావం కలదని గ్రహించి ఆరునెలలు ఇక్కడే ఉండి స్నానపానాదులు చేయగా పూర్తిగా ఆరోగ్యవంతులయ్యారు. గణపతిని ప్రతిష్ఠించి, వినాయకుని ఘట్ట మని పేరు పెట్టారు. తరు వాత జైనులు గుంటి విఘ్నే శ్వర స్వామి శిలా విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. దాని పక్కనే జైనబింబం (చంద్రుడు) ను ప్రతిష్ఠించి దీనికి పార్వతీ తీర్థమని పేరు పెట్టారు.

కనుక నర్వేశ్వరునికి పుత్రుడైన ఈ గుంటూరు గుంటి విఘ్నే శ్వరుని వినాయక చవితి పండుగ రోజున సేవించిన సకల పుణ్యాలు భక్తులకు లభిస్తాయని నమ్మిక. సర్వత్రా జయం పొందడమే కాకుండా నిందల పాలు కాకుండా ధన్యులయ్యేందుకు భక్తులకు చక్కని అవకాశం. ఇక్కడ విఘ్నేశ్వరుడు ఈశాన్యం వైపు చేస్తున్నట్లు ఉండడం విశేషం. అదీ కాక అన్ని వినాయకుల విగ్రహాల మాదిరిగా కాకుండా భిన్నంగా ఇక్కడ విఘ్నేశ్వరుని తొండం కుడివైపునకు తిరిగి ఉంటుంది.

అందువల్ల ఈ విఘ్నే శ్వరుడ్ని లక్ష్మీగణపతిగా చెబుతారు. స్వామి వారిని సేవించి అనేక మంది ఉన్నత పదవులు పొందిన వారు సైతం విదేశాల నుంచి స్వామి వారికి గరికపూజ చేయించేందుకు నేటికి విరాళాలు పంపుతుంటారు.

కార్తిక పౌర్ణమి నాడు పంచ సహస్ర జ్యోతి లింగార్చన గావిస్తూ అత్యంత వైభవంగా శ్రీస్వామివారికి భక్తులు విశేష పూజలు నిర్వహించి తమ కోరికలను నెరవేర్చుకుంటూ ఉంటారు.

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ గుంటూరు

1. పట్టణములలో నివసించు సం.నకు రూ.24000/- నుండి రూ.36000/- లోపు ఆదాయము ఉన్న అల్పాదాయ వర్గాలవారికి రాజీవ్‌గృహకల్ప అను నూతన పథకము క్రింద జి + 2 మరియు జి+3 పద్ధతిలో ఒక్కొక్క బ్లాకుకు 24 గృహముల చొప్పున నిర్మించి కేటాయించుటకు గుంటూరు జిల్లాలోని 10 మునిసిపాలిటీలలో(రేపల్లె మినహాయించి) మరియు గుంటూరు పట్టణములలో 9720 గృహములు ప్రభుత్వము ద్వారా మంజూరు కాబడినవి. గుంటూరు(4000) మరియు తెనాలి(1000) పట్టణములలో(5000) మంజూరు కాబడిన గృహములను ఆం.ప్ర.హౌసింగ్ బోర్డువారు, మిగిలిన(9) మున్సిపాలిటీలకు మంజూరైన 4720 గృహములను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ వారిచే నిర్మాణము గావింపబడును.

ఒక్కొక్క గృహము యొక్క విలువ రూ.82,500/-గా నిర్ధారించిరి. ఇందులో 10% అనగా రూ.8,250/- లబ్ధిదారుడు తన వాటాగా భరించవలెను. మిగిలిన మొత్తము రూ.74,250/- బ్యాంకు ద్వారా రుణము మంజూరు చేయబడును. ఈ కాలనీలలో అవసరమైన రోడ్లు, మురుగునీటి కాల్వలు, విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా మొదలైన మౌళిక సదుపాయముల ఏర్పాటు కొరకు ఒక్కొక్క ఇంటికి రూ.25,000/- చొ.న ఖర్చును ప్రభుత్వమే భరించి ఏర్పాటు చేయబడును.

ఇప్పటి వరకు (8) మున్సిపాలిటీలలో ప్రభుత్వ స్థలములు గుర్తించబడినవి. పొన్నూరు, వినుకొండ మరియు పిడుగురాళ్ళ మున్సిపాలిటీలలో స్థలములను గుర్తించవలసి ఉన్నది.

మొదటి విడత క్రింద జిల్లాలో(3128) గృహములకు టెండర్లు పిలవగా, 2624 గృహములకు టెండర్లు ఖరారు చేయబడినవి.

II. మిగిలిన గృహములను రెండవ విడత క్రింద చేపట్టబడును.

గుంటూరు జిల్లాలో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ చేపట్టబడిన వివిధ పథకముల క్రింద 2005-06 నిర్మాణము చేపట్టబడిన గృహముల వివరములను ఈ క్రింది విధముగా ఉన్నవి.

| వ. నెం | స్కీము | కేటాయింపు | మంజూరు కాబడినవి | పూర్తి కాబడినవి | నిర్మాణములో వున్నవి |
|---|---|---|---|---|---|
| 1. | ఆర్.పి.హెచ్. | 19903 | 17408 | 9121 | 8287 |
| 2. | ఐ.ఎ.వై. | 12397 | 12397 | 9097 | 3300 |
| 3. | వీవర్సు | 790 | 790 | 0 | 790 |
| 4. | సునామీ | 3209 | 3209 | 77 | 3132 |
| 5. | ఫిషర్‌మెన్ | 245 | 245 | 0 | 245 |
| 6. | అర్బన్ | 12870 | 11126 | 145 | 10981 |
| | మొత్తము | **49414** | **45175** | **18440** | **26735** |

**లబ్ధిదారుల నుండి ఋణ వసూళ్ళ కార్యక్రమము :**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ జిల్లాలోని వివిధ పథకముల క్రింద లబ్ధిదారుల నుండి ఋణ వసూళ్ళ కార్యక్రమమును చేపట్టినది. ఎవరైనా లబ్ధిదారుడు ఒకేసారి ఋణం మొత్తమును చెల్లించిన ఎడల వన్‌టైమ్ సెటిల్‌మెంటు క్రింద 2001-02 సం. వరకు నిర్మించుకొన్న శాశ్వత గృహముల తాలూకు ఇప్పటి వరకు అయ్యే వడ్డీ మాఫీ చేయబడును. అంతేకాక తనఖా పెట్టబడిన పట్టాను గాని/రిజిష్టర్డు డాక్యుమెంట్లను గాని అదే రోజు సదరు లబ్ధిదారుకు అందచేయబడునని తెలియజేయడమైనది. ఈ సదుపాయమును లబ్ధిదారులను వినియోగించుకోవలసినదిగా కోరడమైనది.

**వి.శరత్‌బాబు**
డిస్ట్రిక్ట్ మేనేజరు
ఎ.పి. స్టేట్ హౌసింగు కార్పొరేషన్, గుంటూరు.

**శ్రీమతి జి.జయలక్ష్మి**
జిల్లా కలెక్టర్ మరియు ఛైర్మన్
గుంటూరు.

# వైద్య రంగం

(ప్రభాతవార్త-గుంటూరు)

అంతర్జాతీయంగా గుంటూరు వైద్యకళాశాలలో చదివిన వైద్యులంటే ఎంతో పేరుప్రఖ్యాతులున్నాయి. మన వైద్యుడు నాడి చూశాడంటే ఆ రోగం మటుమాయం అయినట్లే. ఏళ్లతరబడి గుంటూరు మెడికల్ కళాశాల,గుంటూరు జనరల్ ఆసుపత్రి జిల్లా వైద్య రంగానికే కాకుండా రాష్ట్రవ్యాప్తంగా తలమానికంగా నిలుస్తున్నాయి. ఇక్కడ చదివిన విద్యార్థులు అమెరికా అధ్యక్షులకు కూడా వైద్యం చేశారంటేమన వారికున్న ఖ్యాతి ఏపాటిదో ఓమారు ఊహించుకోవచ్చు. ఒక్క గుంటూరుజిల్లా ప్రజలకే గాకుండా కోస్తా జిల్లాల ప్రజలకు చక్కటి వైద్యసేవలందిస్తున్న గుంటూరు ప్రభుత్వ సమగ్ర ఆస్పత్రి రోగుల సేవలో తరిస్తోంది. ప్రభుత్వ పరంగా గుంటూరు వైద్య బోధనా ఆస్పత్రితో పాటు వైద్య, ఆరోగ్యశాఖ పరిధిలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, నగర ఆరోగ్య కేంద్రాలు, ఎపి వైద్య విధాన పరిషత్ జిల్లా ఆస్పత్రులు, ఏరియా ఆస్పత్రులు పేద ప్రజలకు ఉచితంగా వైద్య సేవలు అందిస్తున్నాయి. వీటికి చేదోడువాదోడుగా ఆయుర్వేదం, హోమియో, యునాని ఆస్పత్రులు ప్రజానీకానికి తమ వంతు వైద్య సేవలు అందిస్తున్నాయి. ప్రైవేట్ రంగంలో కూడా ఇక్కడి వైద్యులు అందిస్తున్న సేవలు అన్నీ ఇన్నీ కావు. కష్టతరమైన చికిత్సను సైతం చిటికెలో చేయడం ఇక్కడి వైద్యుల ఘనత . ప్రభుత్వ వైద్య రంగానికి ధీటుగా ప్రైవేటు వైద్యరంగం జిల్లాలో విస్తరించింది. జిల్లా కేంద్రం గుంటూరులో ఉన్నత ప్రమాణాలు పాటిస్తూ పలు కార్పోరేట్ ఆస్పత్రులు, వైద్యశాలలు ప్రజలకు చక్కటి వైద్య సేవలను అందిస్తూ జిల్లను హెల్త్ క్యాపిటల్‌గా మార్చాయి. నిష్ణాతులైన అనేకమంది సూపర్ స్పెషాలిటీ వైద్యులు అత్యంత నైపుణ్యంతో వైద్యసేవలందిస్తూ ప్రజల ఆదరాభిమానాలను చూరుగొంటున్నారు. వందేళ్ల క్రితమే గుంటూరునగరంలో కుగ్లర్ ఆసుపత్రి చేసిన సేవలు అన్నీ ఇన్నీ కావు. క్రిస్టియన్ నన్స్ఆధ్వర్యంలో ఏర్పాటయిన సెయింట్ జోసఫ్స్ జనరల్ ఆస్పత్రిసేవలు వెలకట్టలేనివి. సెయింట్ జోసఫ్స్ ఆస్పత్రి మాత్రం అవిశ్రాంతంగా ప్రజలకు వైద్య సేవలు చేస్తూనే వుంది.

50ఏళ్ల క్రితం గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రి, వైద్య కళాశాలలు జిల్లాకే తలమానికంగా నిలుస్తున్నాయి. గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రి కోస్తాఆంధ్ర జిల్లాల ప్రజలకు పెద్ద దిక్కుగా ఆదుకొంటోంది. 1177 పడకలుగల ఈ ఆస్పత్రి ప్రతినిత్యం వేలాదిమంది రోగులకు వైద్య సేవలు అందిస్తూ పేద ప్రజల కార్పోరేట్ ఆస్పత్రిగా పేరుగాంచింది. ఎందరో నిష్ణాతులైన వైద్యులు ఈ ఆస్పత్రిలో పనిచేసి ప్రజల ఆదరాభిమానాలను పొందారు. యూరాలజీ, కార్డియాలజీ, ప్లాస్టిక్ సర్జరీ, న్యూరాలజీ, కార్డియో థొరాసిక్ సర్జరీ, న్యూరో సర్జరీ, పీడియాట్రిక్ సర్జరీ వంటి సూపర్ స్పెషాలిటీ వైద్య సేవలతోపాటు అన్ని రకాల సాధారణ వైద్య సేవలు గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రిలో అందుబాటులో వున్నాయి. కోస్తా ఆంధ్రాల్లో ఐదారు జిల్లాల నుంచి ప్రతినిత్యం హృద్రోగ రోగులు గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రికి రావడం సాధారణమై పోయింది. ఇక్కడి వైద్యులు వారికి తగిన చికిత్స అందించి మెరుగైన వైద్య సేవలకు నిమ్స్‌కు రిఫర్ చేస్తున్నారు. పెద్దగా ప్రచారానికి నోచుకోకపోయినా రోగులకు అత్యంత నైపుణ్యంతో వైద్య సేవలు అందిస్తూ వారి ప్రాణాలను రక్షిస్తున్న ఘనత ఆస్పత్రి న్యూరో సర్జరీ విభాగం వైద్యులకే దక్కుతుంది. కొట్లాటల్లో, ప్రమాదల్లో తలకు తీవ్రగాయాలై ప్రాణాపాయస్థితిలో ఇక్కడికి వచ్చేరోగులకు న్యూరోసర్జన్లు శ్రమించి చక్కటి శస్త్ర చికిత్సలు చేసి రోగుల ప్రాణాలను కాపాడుతున్నారు. అదేవిధంగా యూరాలజీ, ప్లాస్టిక్‌సర్జరీ, కార్డియో థొరాసిక్ సర్జరీ వంటి సూపర్ స్పెషాలిటీ వైద్య సేవలు కూడా ఇక్కడ అందుబాటులో వున్నాయి.

1960వ దశకంలో కోస్తా జిల్లాల లోనే ఆర్థోపెడిక్ రంగంలో అగ్రగామిగా పేరు పొందిన డాక్టర్ యతిరాజులు గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రి ఆర్థోపెడిక్ విభాగాధిపతిగా పనిచేసి గుంటూరు జిల్లాకే ప్రత్యేకతను సంతరించిపెట్టారు. సాంకేతిక పరిజ్ఞానం అంతగా అందుబాటులోలేని రోజుల్లోనే డాక్టర్ యతిరాజులు ఎన్నో క్లిష్టమైన ఆర్థోపెడిక్ శస్త్రచికిత్సలను విజయవంతంగా చేసి ప్రసిద్ధులయ్యారు. అనంతరం కార్డియాలజీ విభాగాన్ని మొట్టమొదటి సారిగా గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రి ప్రవేశపెట్టినఘనత మాజీ సూరింటెండెంట్ డాక్టర్ కె.లక్ష్మణరావుకు దక్కుతుంది. అప్పట్లో ఆయన ప్రత్యేకంగా ఇంగ్లాండులో కార్డియాలజీ విభాగంలో ప్రత్యేక శిక్షణ పొంది ఇక్కడ కార్డియాలజీ విభాగాన్ని ప్రారంభించేందుకు ఆద్యులయ్యారు. జాతీయస్థాయిలో పేరు ప్రఖ్యాతులు పొందిన డాక్టర్ నాయుడమ్మ పీడియాట్రిక్ సర్జరీ విభాగానికి నేతృత్వం వహిస్తూ, ఎందరో శిశువులకు ప్రాణదానం చేస్తున్నారు. రాష్ట్రంలోనే శిశుశస్త్ర చికిత్సా విభాగంలో గుంటూరు ప్రభుత్వాస్పత్రి పీడియాట్రిక్ సర్జరీ విభాగం పేరు ప్రతిష్టలు పొందింది.

వైద్య విద్య అభ్యసించే అభ్యర్థులు గుంటూరు మెడికల్ కళాశాలలో చదవడం అదృష్టంగా భావిస్తారు. రాష్ట్రంలోనేగాక జాతీయ స్థాయిలో ఈ కళాశాలకు అద్భుత పేరు ప్రతిష్టలు వున్నాయి. ఎందరో నిష్ణాతులైన వైద్యులను తీర్చిదిద్దిన ఘనత ఈ కళాశాలకు దక్కుతుంది. ఈ కళాశాలలో వైద్య విద్యనభ్యసించి డాక్టర్లుగా స్థిరపడి అనంతరం రాజకీయ రంగంలో రాణించిన వారెందరో వున్నారు. ముగ్గురు అవిభక్త కవలలను శస్త్రచికిత్స ద్వారా విజయవంతంగా వేరుచేసి జాతీయస్థాయిలో తెలుగువారి కీర్తి ప్రతిష్టలను ఇనుమడింపజేసిన డాక్టర్ నాయుడమ్మ, పద్మశ్రీ అవార్డు గ్రహీత, ప్రముఖ వైద్యులు డాక్టర్ ప్రసాదరావులు ఈ కళాశాల విద్యార్థులే. ఆర్థోపెడిక్ రంగంలో అత్యంత అరుదైన, ప్రతిష్టాత్మకమైన డాక్టర్ వ్యాఘ్రేశ్వరరావు గోల్డ్‌మెడల్‌ను ఏకంగా ఐదుసార్లు కైవశం చేసుకున్న డాక్టర్ ఎస్ అమర్‌నాథ్ గుంటూరు మెడికల్ కళాశాలలోనే వైద్య విద్యనభ్యసించారు. హైదరాబాద్‌లోని పలుకార్పోరేట్ ఆస్పత్రులలో నిపుణులైన వైద్యులుగాపని చేస్తున్న పలువురు డాక్టర్లు గుంటూరు మెడికల్ కళాశాలకు చెందిన వారు కావడం విశేషం. గుంటూరు వైద్య కళాశాలలో వైద్య విద్యనభ్యసించి ఉత్తర అమెరికాలో సుమారు రెండువేల మంది వైద్యులు ఎన్ ఆర్ ఐ లుగా స్థిరపడ్డారు.వీరు తమ మాతృ సంస్థకు సహాయ సహకారాలు అందజేస్తూ జన్మభూమి రుణం తీర్చుకుంటున్నారు. ప్రభుత్వ వైద్య రంగానికి ధీటుగా గుంటూరు నగరంలో ప్రైవేటు వైద్య సేవలు విస్తరించాయి. జిల్లా నుంచిగాక ఇతర జిల్లాల నుంచి కూడా రోగులు గుంటూరు నగరానికి రావడం ఇక్కడి వైద్యులు నైపుణ్యాన్ని తెలియజేస్తుంది. కార్డియాలజీ, న్యూరాలజీ, న్యూరోసర్జరీ తదితర సూపర్ స్పెషాలిటీ వైద్య సేవలకు గుంటూరు నగరంలో పలు ప్రైవేటు వైద్య శాలలు పేరుగడించాయి. ఇటీవల జాతీయరహదారిపై జరుగుతున్న ప్రమాదాలను దృష్టిలో వుంచుకుని నగరంలో పలు ప్రైవేటు కార్పోరేట్ ఆస్పత్రులు 24 గంటలూ పనిచేసే ఎమర్జెన్సీ ట్రామా కేర్‌సెంటర్లను ప్రారంభించాయి. వీటిలో పాలి ట్రామా కేసులతో పాటు హ్యాంగింగ్‌కేసులు, పురుగుమందులు సేవించి ఆత్మహత్యాయత్నానికి పాల్పడేకేసులకు మెరుగైన వైద్యసేవలు అందిస్తూ రోగుల ప్రాణాలను రక్షిస్తున్నారు.

# సంతాన ప్రదాత సత్రశాల మల్లన్న

(ప్రభాతవార్త రెంటచింతల)

సత్రశాల మల్లికార్జునస్వామిని దర్శించుకుంటే అన్నీ శుభాలే జరుగుతాయని ఈప్రాంత వాసుల ప్రగాఢ విశ్వాసం. ప్రతి ఏటా మహాశివరాత్రి రోజున వేలాది మంది భక్తులు తరలి వచ్చి స్వామిని దర్శించి తరిస్తుంటారు. వందల సంవత్సరాల కితం నిర్మించిన సత్రశాల మల్లికార్జునస్వామి, భ్రమరాంబస్వామి వార్ల ఆలయం ప్రాచీన కళా వైభవానికి నిదర్శనం. ఇక్కడ శివలింగానికి, పుట్టకు పూజలు నిర్వహిస్తే సంతానం కలుగుతుందని భక్తుల నమ్మకం. మహాశివరాత్రి పర్వదినం అత్యంత వైభంగా జరుపుతారు. ఉత్తరవాహినిగా ప్రవహించే కృష్ణానది గలగలలు, పక్షుల కిలకిలలు, మనుస్సు పలక రించే విధంగా ఉండే ఆలయ పరిసరాలు ఎల్లప్పుడూ మనోహరంగా భాసిల్లుతుంటాయి. ఆలయ పరిసరాలను బాగా అభివృద్ధి చేస్తే భక్తులు సంఖ్య పెరిగి టూరిస్టు ప్రదేశంగా వర్ధిల్లే అవకాశం ఉంది. ఆలయ ధర్మకర్తగా శ్యామల పార్వ తిరెడ్డి పుష్కరాల ముందు బాధ్యతలు చేపట్టారు. ఆయన తనకు చేతనైన రీతిలో భక్తుల సహకారాలతో ఆలయ అభివృద్ధికి కృషి చేస్తానన్నారు. వేముల పిచ్చయ్య హయాంలో వేల రూపాయలతో వెచ్చించి శివుని విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. ఇప్పుడు ఆ విగ్రహానికి నగీషీలు దిద్దే ప్రయ త్నంలో భక్తులు రేయింబవళ్ళు నిమగ్నమయ్యారు. ఇక్కడి విగ్రహాలు కింద వజ్ర వైఢూర్యాలున్నాయని దొంగలు 1965లో విగ్రహాలను తొలగించారు. తరువాత 1969లో కంచి కామకోటి పీఠాధిపతులు దగ్గరుండి శివలింగాన్ని పునఃప్రతిష్ఠింప చేశారు. ఇక్కడ అతి పెద్ద నంది విగ్రహం కూడా ఉంది.



అమ్మవారి మూలవిరాట్

## కాకులు వాలని శైవ క్షేత్రం...

తాను బ్రహ్మర్షి కావాలనే తలంపుతో విశ్వామిత్రుడు తపస్సు చేస్తున్న సమయంలో కాకి రూపంలో ఉన్న రాక్షసుడు విశ్వామిత్రుని తపస్సును భగ్నం చేయసాగెను. అంతట కోపాద్రిక్తుడైన విశ్వామిత్రుడు కాకులను శపించడంతో ఈప్రాంతంలో అని ఎక్కడా కనిపించవు. ఎన్నికలకు ముందు సత్రశాల మల్లన్నను మొక్కుకున్న వారందరూ ఎమ్మెల్యేలుగా గెలుపొందటం విశేషం. అటువంటి వారిలో 1967లో గురజాల నుంచి గెలిచిన కొత్త వెంకటేశ్వర్లు, 1994లో యరపతినేని శ్రీనివాసరావు, 2004లో మాచర్ల నుంచి గెలిచిన పిన్నెల్లి లక్ష్మా రెడ్డిలున్నారు. అయితే గెలిచిన వారు ఈ ప్రాంత అభివృద్ధి పట్ల పూర్తిగా దృష్టి కేంద్రీ కరించడం లేదనే విమర్శలు భక్తుల నుంచి వినవస్తున్నాయి. కృష్ణానది ఒడ్డున ఉన్న సత్రశాలను కోట ప్పకొండ కన్నా ఎక్కువగా అభివృద్ధి చేయటానికి అవకా శాలున్నప్పటికి దృష్టి కేంద్రీకరించే వారు కరువయ్యారు. తిరునాళ్ళ సంద ర్భంగా వివిధ వర్గాల ఆధ్వర్యంలో ఉచిత అన్నదానం ఏర్పా టు చేశారు. భక్తుల కోసం పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేస్తున్నట్లు ఆలయ ఇవో నరేష్‌రెడ్డి 'ప్రభాతవార్త'కు తెలిపారు.

# శతవసంతాల సోమసుందరేశ్వరుడు

(ప్రభాతవార్త, గుంటూరు)

నగరంలోని అతి ప్రాచీన దేవాలయాలలో అరండల్‌పేట నాల్గవ లైనులోని శ్రీగంగామీనాక్షి సమేత శ్రీసోమసుందర స్వామి వారి దేవస్థానం ఒకటి. నిత్యం భక్తజనసందోహంతో నూరు వసంతాలు పూర్తి చేసుకుంది. ప్లవసామ సంవత్సరం మాఘ శుద్ధ తదియ అనగా 1901 ఫిబ్రవరి 14వ తేదీన ఆలయ నిర్మాణం జరిగింది. ఆలయంలో ప్రతిష్టించిన శ్రీసోమసుందరస్వామి వారిని కాశీ నుంచి తీసుకువచ్చి ప్రతిష్టించడంతో కాశీ లింగంగా పూర్వీకులు పిలిచేవారు. అదే సమయంలో శ్రీమీనాక్షి అమ్మవారు, శ్రీవిఘ్నేశ్వరస్వామి, శ్రీజగద్గురు ఆది శంకరాచార్యులు, శ్రీసుబ్రహ్మణ్యస్వామి(లింగరూపం) వార్లను దివంగత న్యాయవాది ఏకా రామయ్యగారు ఆధ్వర్యంలో ప్రతిష్టించారు. ఆయన ఒసగిన 200 చదరపు గజాల స్థలంలో ఆలయ నిర్మాణం జరిగింది. ఆలయ నిర్వహణ, నిత్య ధూప, దీప, నైవేద్యాలకు ఆయన బాపట్ల మండలం ఈతేరు గ్రామంలో 4.75 ఎకరాల భూమిని దానంగా ఇచ్చారు.



అనంతరం 1931లో ఏకా రామయ్య సోదరుడు ఏకా దండయ్య పంతులు శ్రీభద్రకాళీసమేత వీరభద్రస్వామి వార్ల ప్రతిష్టను, 1965 ఫిబ్రవరి 11న ఏకా రామయ్య మనుమడు, ప్రస్తుత ధర్మకర్త ఏకా రామయ్యపంతులు శ్రీమృత్యుంజయ సహిత నవగ్రహ దేవతల(నర్మదా బాణం)ను ప్రతిష్టించారు. 1925లో వినుకొండలో పొలంలో ఒక రైతు తనకు దొరికిన శ్రీప్రపత్తి ఆంజనేయస్వామివారి రాతి విగ్రహాన్ని 1960లో న్యాయవాది ఏకా లక్ష్మి నరసింహానికి ఇచ్చారు. ఆయన ఈ విగ్రహాన్ని 1965 ఫిబ్రవరి 11న నవగ్రహాలతో పాటు నైరుతి దిశలో శ్రీసుబ్రహ్మణ్యస్వామి వారి ప్రక్కన ప్రతిష్టించారు. ఈ విగ్రహ ప్రతిష్ట చేబ్రోలు మండలం కొత్తరెడ్డిపాలెం గ్రామానికి చెందిన శ్రీలక్ష్మీకాంతయోగివర్యులు పర్యవేక్షణలో జరిగింది. కాగా నర్మదా బాణాలు నాల్గింటిని మండల కేంద్రమైన బెల్లంకొండలోని శ్రీబెల్లంకొండ స్వామి వారి ప్రతిష్టల నిమిత్తం తెప్పించారు. వీటిలో రెండింటిని దేవాలయంలో ప్రతిష్టించి, మరొకటి స్వామి వారి సమాధిపై ఉంచారు. కాగా మరొకటి ఈ ఆలయంలో ప్రతిష్టించడం జరిగింది. 1970 మే ఏడవ తేదీన శ్రీగురుదత్తత్రేయ ప్రతిష్టనిర్వహించారు. 1988 అక్టోబరు 13వ తేదీన శ్రీషిర్డిసాయిబాబా విగ్రహ ప్రతిష్ట జరిగింది. 1998 జూన్ 18న బాలసుబ్రహ్మణ్యం విగ్రహం, అయ్యప్పస్వామి, విఘ్నేశ్వరుడు విగ్రహ ప్రతిష్టలు జరిగాయి.

ఇదిలావుండగా 1931వ సంవత్సరంలో వీరభద్రస్వామి వారి ప్రతిష్ట సందర్భంగా దేవాలయం నిర్మాణానికి తీసిన మట్టిని ప్రాంగణ దక్షిణం వైపు పోయగా నాగరాజు అక్కడకు చేరడంతో పుట్టగా సహజంగా ఏర్పాటైంది. దేవాలయంలో ఏడాది పొడవునా నిర్వహించే వివిధ ఉత్సవాల వివరాలు ఇలా ఉన్నాయి. చైత్రమాసంలో ఉగాది పంచాగం, శ్రీరామనవమి, వైశాఖమాసంలో శ్రీశంకరాచార్య జయంతి, శ్రీహనుమాన్ జయంతి, జ్యేష్టమాసంలో శ్రీసోమసుందరస్వామి మీనాక్షిదేవి కళ్యాణం, పరశురామసేవలు 16 రోజుల పాటు, ఆషాడమాసంలో గురుపౌర్ణిమ, శ్రావణమాసంలో శ్రీవరలక్ష్మి వ్రతం, భాద్రపదమాసంలో శ్రీగణపతి నవరాత్రులు, ఆశ్వీయుజ మాసంలో దేవీ నవరాత్రులు, విజయదశిమి, శమీపూజ, కార్తీక మాసంలో నిత్య ఆకాశ దీపం, జ్యోతి, కార్తీకదీపం, పౌర్ణిమి, జ్వాలా తోరణ మహోత్సవం, కృత్తికా దీపోత్సవం, మార్గశిర మాసంలో పౌర్ణమి, దత్త జయంతి, ఆరుద్ర ద్వారా దర్శనం, పుష్యమాసంలో సంక్రాంతి, మాఘ మాసం శివరాత్రిని వైభవంగా నిర్వహిస్తారు.





(ప్రభాతవార్త/గుంటూరు)

పిన్నవయసునుంచే రాజకీయాల్లో ప్రవేశించి విద్యార్థి దశనుంచి రాజకీయాల్లో అంచలంచెలుగా ఎదుగుతూ వస్తున్న గుంటూరు-2వ నియోజకవర్గ ఎమ్మెల్యే తాడిశెట్టి వెంకటరావు 20 నెలల్లోనే అద్వితీయ ప్రగతిని సాధించి ప్రజల హృదయాల్లో చెరగని ముద్ర వేసు కున్నారు. ఎన్ ఎన్ యు ఐ స్థాయినుంచి రాష్ట్ర యువజన కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎదిగిన వెంకటరావు ఎమ్మెల్యేగా గెలిచి ఇతర ఎమ్మెల్యేలకు భిన్నమైన రీతిలో తన శైలిని ప్రదర్శిస్తూ అభివృద్ధి కార్యక్రమాల్లో ముం దుకు పోతున్నారు. ఎప్పటికప్పుడు నగరపరిధిలోని అధి కారులతోను, మండల అధికారులను సమన్వయ పరు చుకుంటూ నియోజకవర్గంలో రూ.200 కోట్ల రూ పాయల అభివృద్ధి పనులకు ప్రతిపాదనలు రూపొం దించి మొదటి విడతగా గుంటూరు ఛానల్ లైనింగ్‌కోసం రూ.30 కోట్ల రూపాయల నిధులను రాబట్టగలిగారు.

నగరపరిధిలో ఉన్న 18 డివిజన్ల లోను ప్రతి డివిజన్‌కు సిమెంటు రోడ్లు, డ్రైనేజి వ్యవస్థను మెరుగుపరచాలన్న లక్ష్యంతో కృషిచేసి సాధించారు. ప్రభుత్వ అధికారుల్లో ఉన్న మందగమనంపై కన్నేసిన వెంకటరావు తనదైన శైలిలో వారిని సంప్రదించి తనకు కావలసింది సాధించుకోవడంలో దిట్ట. మున్సిపల్ ఎన్నికల్లోను, పార్టీపరమైన కార్యక్రమాల్లోను తన పట్టు, ప్రాబల్యం నిరూపించుకున్న వెంకటరావు గుంటూరు-2వ నియోజకవర్గాన్ని మోడల్ నియోజకవర్గంగా తీర్చి దిద్దాలన్నదే తన ఆకాంక్ష అని అంటున్నారు. మెగా ఫ్లై ఓవర్ నిర్మాణం, 30 కోట్ల రూపాయల ఖర్చుకాగల రెండవ బైపాస్ నిర్మాణం, నియోజకవర్గంలో మంచినీటి సమస్యను శాశ్వత ప్రాతిపదికన నిర్మూలించేందుకు ఆరు రిజర్వాయర్ల నిర్మాణం, వీధిబాలలకోసం ఆశ్రయ కేంద్రం, స్తంభాలగరువువద్ద పార్కు నిర్మాణం, కృష్ణ నగర్‌లో మెగా షాపింగ్ కాంప్లెక్స్, శతాబ్ది ఉత్సవాల చిహ్నంగా లక్ష్మీపురం సెంటర్‌లో క్లాక్‌టవర్ నిర్మాణం వంటివి మచ్చుతునకలు. స్వాతంత్ర్య సమర యోధులపై అపార గౌరవాభి మానాలున్న వెంకట రావు దేశభక్త కొండా వెంకటప్పయ్య సమాధులను ఆధునీకరించి తపోవనంగా నిర్మించేందుకు పనులు చేపట్టారు. రాష్ట్ర పురపరిపాలన శాఖ మంత్రి కోనేరురంగారావు, స్పీకర్ కె.ఆర్.సురేష్‌రెడ్డి, రెవెన్యూ, హోం శాఖల మంత్రులు ధర్మాన ప్రసాదరావు, కె.జానారెడ్డి, ఎం సత్యనారాయణరావు, ఇలా ఏ మంత్రి వచ్చినా వెంకటరావు ఇంట ఆతిథ్యం స్వీకరించకుండా వెళ్లినవారు లేరు. ముఖ్యమంత్రి వై ఎస్, రాష్ట్రప్రభుత్వ సలహాదారు కె.వి.పి.రామచంద్రరావుల ఆశీస్సులు స్నంతకాలం ప్రజానాయకునిగా తాను మరింత ఎదుగుతానన్న విశ్వాసం ఆయనలో ఏర్పడింది. పార్టీలోఉన్న ప్రత్య ర్థులను చాకచక్యంగా అధిగమిస్తూ ప్రజాజీవితంలో తనకు చేదోడు వాదోడుగా ఉండేవిధంగా తన సోదరుడు మురళిని డిప్యూటీ మేయర్ చేసేందుకు రాష్ట్ర కమిటీ సమక్షంలోకూడా జరిగిన పంచా యితీలో తన పంతం నెగ్గించు కున్నారు. కృషి పట్టుదలతో తాను అనుకున్న పనిని ఎంత కష్టం అయినా సాధించాలన్న లక్ష్యం ఉన్న ఎమ్మెల్యే కృషితో నాస్తి దుర్భిక్షం అదే తనకు స్ఫూర్తి అని చెవుతుంటారు. నియోజకవర్గ పర్యటనలో కూడా తన శైలిని ప్రదర్శిస్తూ ప్రజాహిత కార్యక్రమాన్ని నిర్వహించి రాష్ట్ర వ్యాప్తంగా నేతల దృష్టిని ఆకర్షించారు. నియోజకవర్గ పరిధిలో ఉన్న అధికారులందరినీ ఒకే వేదకపైకి తెచ్చి ప్రజలను నేరుగా టెలిఫోన్ ద్వారా తమ సమస్యలను అక్కడికక్కడే పరిష్కరించుకునే విధానం ప్రవేశపెట్టి అందరికీ ఆదర్శంగా నిలిచారు. మున్సిపల ఎన్నికల్లో ప్రణాళికాబద్ధంగా ప్రచారం నిర్వహించి అభ్యర్థుల విజయానికి తన శాయశక్తులా కృషిచేశారు. రాజధానిలో ఉన్నప్పటికీ నియోజకవర్గ సమాచారాన్ని ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ అధికారులతో నేరుగా సంప్రదించడం వెంకటరావుకు చిన్నప్పటినుంచీ వచ్చిన అలవాటును అదే విధంగా కొనసాగిస్తున్నారు. నియోజకవర్గంలో తాగునీటి సమస్య, విద్యుత్, రోడ్ల సమస్యను శాశ్వతప్రాతిపదికన పరిష్కరించాలన్నదే తన అభిమ తమని చెవుతున్న ఎమ్మెల్యే నియోజకవర్గ పరిధిలోని లబ్దిదారులకు రాజీవ్‌గృహకల్ప కింద జి ప్లస్ టు ప్రాతిపదికన పక్కా గృహనిర్మాణ పథకాలకు శ్రీకారం చుట్టారు.

సాధించిన ప్రగతిని బేరీజు వేసు కుంటూ సాధించాల్సిన ప్రగతిపై ప్రణాళికలు రూపొం దిస్తూ ముందుకు పోతున్న ఎమ్మెల్యే తాడిశెట్టి ప్రజాభిమానమే తనకు కొండంత అండ అని ప్రజలకోసం ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రభుత్వంలో ప్రజాప్రతినిధిగా సమస్యలు పరిష్కరించడం తన ప్రథమ కర్తవ్యమని ఆయన అంటున్నారు. 20 నెలల ప్రభుత్వ హయాంలో కీలక సమస్యలపై దృష్టిసారించిన తాడిశెట్టి

■ మిగతా 76లో









# 'మోడల్' నియోజకవర్గం ఆయన లక్ష్యం

75వ పేజీ తరువాయి

ఉడా, నీటిపారుదల, గృహ నిర్మాణం, రోడ్లు భవనాలు, పంచాయితీ శాఖల పరంగా ఉన్న సమస్యలను పరిష్కరించడంలో దిట్ట. పోలీసు శాఖాపరంగా కూడా శాంతభద్రతలు, నగర పరిధిలోని ట్రాఫిక్ సమస్యను పరిష్కరించుకోవడంలో ఎప్పటికప్పుడు అధికారులతో చర్చలు జరుపుతా రు.ప్రత్యేకించి నగర పరిధిలోని నియోజకవర్గాన్ని మెట్రో నగరాల 'స్థాయిలో సుందరీ కరించాలన్న లక్ష్యంతో ముందుకు పోతున్నారు మెగా ఫ్లై ఓవర్ నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వం, భూగర్భ డ్రైనేజి నిర్మాణాలకు పట్టణాభివృద్ధి శాఖ పరిధిలోనుంచి రూ.45 కోట్ల నిధులను సాధించే దిశగా ఆయన పావులు కదిపారు. వై ఎస్ కు అనుంగుశిష్యునిగా మెలుగుతూ ఇటీవల నిర్వహించిన ప్లీనరీలో కూడా కీలక బాధ్యతలు నిర్వహించారు. వివిధ రాష్ట్రాలనుంచి వచ్చే యూత్‌కాంగ్రెస్ నాయకులకు ఆతిధ్యం ఇవ్వడంతోపాటు, ముఖ్య అతిథులను పరిచయం చేసుకుని వారికి ఏర్పాట్లు వంటివి చేపట్టి అధినేతల వద్ద శెహబాష్ అనిపించుకున్నారు.

సంస్థాగతంగా పార్టీ నియామకాల్లో కూడా తన అనుచరులు, ముఖ్యులకు పదవులను రప్పించుకోవడంలో వెంకటరావు తన చాతుర్యం ప్రదర్శించారు. నగర కాంగ్రెస్ అధ్యక్షునిగా మాదా రాధా నియామకంలో ఆయన పాత్ర కీలకం అన్నది నిర్వివాదాంశం. జిల్లా కాంగ్రెస్, పిసిసికార్యవర్గంలో కీలక పదవుల భర్తీలో కూడా తాడిశెట్టి క్రియాశీలక పాత్ర పోషిస్తూ జిల్లా కాంగ్రెస్‌రాజకీయాల్లో తనదైన శైలిని ముద్రవేశారు. తన ఐదేళ్ల కాలంలోనే నియోజకవర్గాన్ని ఊహించని రీతిలో అభివృద్ధి చేయాలన్న లక్ష్యంతో ఆయన రచించేప్రణాళికలకు అధి ష్టానం కూడా ఆమోదముద్ర వేస్తుండటంతో వెనుకడుగులేని ప్రజా ప్రతినిధిగా ఆయన పయనం కొన సాగుతున్న దనడంలో అతిశ యోక్తిలేదు.



రెవెన్యూమంత్రి ధర్మాన ప్రసాదరావుకు వినతిపత్రం అందచేసి వివరిస్తున్న వెంకటరావు.



పార్టీ కార్యాలయంలో నగరభేరి పోస్టర్ విడుదల



భారత్‌పేట జీరోలైను సిమెంటు రోడ్డు ప్రారంభిస్తున్న పిసిసి అధ్యక్షుడుకేశవరావు. చిత్రంలో వెంకటరావు ఇతర నాయకులు

పక్కన హనుమయ్యనగర్‌లో మున్సిపల్ వాటర్ ట్యాప్‌ను ప్రారంభిస్తున్న మంత్రికోనేరురంగారావు



నగరలోని ఎ.సి.కళాశాలలోని గ్రౌండ్‌ను క్రీడలశాఖ మంత్రి వం... చేతులమీదుగా ప్రారంభోత్సవం చేయిస్తున్న డిప్యూటీమేయర్ ముర... ఫైల్‌ఫోటో





# వార్తకు 10వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

10 A Glorious Decade





కాసు వెంకటకృష్ణారెడ్డి
శాసనసభ్యులు, నరసరావుపేట



మేకపాటి రాజమోహనరెడ్డిగారు
పార్లమెంట్‌సభ్యులు, నరసరావుపేట



కపలవాయి శివప్రసాద్
వైస్‌చైర్మన్: నరసరావుపేట మున్సిపాల్టీ



కుంచాల రోశమ్మ చైర్‌పర్సన్:
నరసరావుపేట మున్సిపాల్టీ

## అభివృద్ధిపథంలో నరసరావుపేట పురపాలకసంఘం

నరసరావుపేట పురపాలకసంఘం అభివృద్ధిపథంలో పయనిస్తుంది. కోట్లాదిరూపాయల అభివృద్ధిపనులు వేగవంతంగా జరుగుతున్నాయి. ప్రజలకు అవసరమైన మౌలికసదుపాయాల కల్పనలో ముందంజలో ఉంది.

1. ఐడిఎస్ఎంటి పథకంక్రింద మంజూరైన రూ.7.5కోట్లతో అభివృద్ధిపనులు
2. సుమారు కోటిరూపాయలతో వినుకొండ పల్నాడురోడ్డు, 8వవార్డులో వరదడ్రైన్ల నిర్మాణం
3. రూ.86లక్షలతో శాంతినగర్‌లో ఫిల్టరేషన్‌ప్లాంట్ ఏర్పాటు
4. రూ.94.28లక్షలతో మున్సిపల్ బాయ్స్‌హైస్కూల్ భవననిర్మాణం
5. ఓవర్‌హెడ్‌ట్యాంకుల నిర్మాణం, సిసిరోడ్లు, డ్రైన్ల నిర్మాణం వేగవంతంగా జరుగుతన్నాయి.

చల్లా శివపార్వతి — 1వవార్డు కౌన్సిలర్
బొమ్మిశెట్టి శ్రీనివాసరావు — 2వవార్డు కౌన్సిలర్
షేక్ మహబూబ్ సుభాని — 3వవార్డు కౌన్సిలర్
షేక్ మహ్మద్ — 4వవార్డు కౌన్సిలర్
మన్నవ ఎలీసమ్మ — 5వవార్డు కౌన్సిలర్
అల్లూరి వెంకటేశ్వర్లు — 6వవార్డు కౌన్సిలర్
షేక్ జీనతున్ — 7వవార్డు కౌన్సిలర్
షేక్ మస్తాన్ — 8వవార్డు కౌన్సిలర్
రాఘవరపు శ్రీనివాసరావు — 9వవార్డు కౌన్సిలర్
పూదోట తోమసమ్మ — 10వవార్డు కౌన్సిలర్
ఏలూరి సుబ్బారెడ్డి — 11వవార్డు కౌన్సిలర్
నేలటూరి మురళి — 12వవార్డు కౌన్సిలర్
ఎస్‌జిఎస్‌పి నాగేశ్వరరావు — 13వవార్డు కౌన్సిలర్
గట్టిపోగు ఏసుదాసు — 14వవార్డు కౌన్సిలర్
షేక్ జానీహోరావి(సిటీకేబుల్‌బాబు) — 15వవార్డు కౌన్సిలర్
పత్తితి రామకోటేశ్వరరావు — 16వవార్డు కౌన్సిలర్
చల్లా శ్రీనివాసరావు — 17వవార్డు కౌన్సిలర్
చేకూరి పుష్పలత — 18వవార్డు కౌన్సిలర్
శివరాత్రి మస్తాన్‌రావు — 19వవార్డు కౌన్సిలర్
చినపేరిరెడ్డి కాకుమాను — 21వవార్డు కౌన్సిలర్
మొహమాటం శ్రీనివాసరావు — 22వవార్డు కౌన్సిలర్
మార్కాపురం పేరయ్య — 23వవార్డు కౌన్సిలర్
శివరాత్రి ధనలక్ష్మి — 24వవార్డు కౌన్సిలర్
మల్లెబోయిన వెంకటేశ్వర్లు(సిపిఐ) — 25వవార్డు కౌన్సిలర్
ఇన్నీపల్లి కోటేశ్వరరావు — 26వవార్డు కౌన్సిలర్
మద్ది నాగేశ్వరి — 27వవార్డు కౌన్సిలర్
మంచాల వెంకాయమ్మ — 28వవార్డు కౌన్సిలర్
షేక్ మహబూబ్‌బి — 30వవార్డు కౌన్సిలర్
షేక్ సుల్తానమ్మ — 31వవార్డు కౌన్సిలర్
పుల్లంశెట్టి లక్ష్మీచాముండేశ్వరి — 32వవార్డు కౌన్సిలర్
గంజం అమరలింగం(సిపిఐ) — 33వవార్డు కౌన్సిలర్
పాదిలి వెంకటేశ్వర్లు — 34వవార్డు కౌన్సిలర్

కో ఆప్షన్ సభ్యులు

భాగవతుల లక్ష్మీనారాయణ(బాబు)
ఎస్.కె.సైదా
జడ వసంతకుమారి



కె రమేష్
మున్సిపల్ కమీషనర్
నరసరావుపేట

# నగర కాంగ్రెస్‌లో మాదా రాధా అధ్యాయం

(ప్రభాతవార్త/గుంటూరు)
పార్టీలో పదవులు రావడం, అనుకోని విధంగా త్యజించడం లేదా తొలగిపోవడం వంటివి రాజకీయాల్లో అనునిత్యం జరిగే పరిణామాలే. అయితే ప్రాథమిక స్థాయినుంచి సీనియర్‌నాయకుని వరకూ ఒకే పార్టీలో ఎదుగుతూ క్రియాశీలక పదవిని చేపట్టగలిగే నాయకులు బహు అరుదుగా ఉంటారు. విద్యార్థి దశనుంచి రాజకీయాలపట్ల ఆసక్తిని పెంచుకున్న వ్యక్తిగా మాదా రాధాకృష్ణమూర్తి అందరికీ చిరపరిచితుడు. హిందూ కళాశాల విద్యార్థి సంఘం అధ్యక్షునిగా ఎన్నికైన రాధా యువజన కాంగ్రెస్, సిటీ కాంగ్రెస్, జిల్లా కాంగ్రెస్



రాజీవ్, ఇందిర, గాంధీ వర్ధంతి, జయంతి కార్యక్రమాలతోనే సరిపెట్టకుండా పార్టీ కార్యాలయంలో సమావేశం నిర్వహించి డివిజన్ స్థాయిలో పార్టీని బలోపేతం చేసేందుకు ప్రణాళికలు అమలుచేశారు. గతంలోఉన్న జంబోజెట్ కార్యవర్గం స్థానే అన్ని వర్గాలకు ఆమోదయోగ్యమైన కార్యవర్గాన్ని చిన్న కమిటీని ఏర్పాటుచేసేందుకు పిసిసి అనుమతినికూడా సాధించారు. అలాగే పార్టీ అభ్యర్థులుగా టికెట్లు రాక రెబెల్ అభ్యర్థులుగా పోటీచేసిన వారిని తిరిగి పార్టీలో చేర్చుకునే విషయమై పిసిసితో కూడా చర్చలు జరిపారు. రాష్ట్రకమిటీ, ముఖ్యమంత్రి ప్రతిష్ఠాత్మకంగా తీసుకుని

## ఎన్నికల్లో కృషి కీలకం పార్టీ బలోపేతం ఆయన ధ్యేయం

కార్యవర్గంలో కీలకపదవులను పోషించారు. ఆరోజుల్లోనే అంబికాసోనిని గుంటూరుకు రప్పించిన తరుణంలో క్రాంతి యాత్ర పేరిట సదస్సులనునిర్వహించారు. ఎం ఎ చదువుతూ నాగార్జునయూనివర్సిటీ విద్యార్థి నాయ కునిగా కూడా పేరుప్రతిష్టలను పెంచుకున్నారు. జిల్లా యువజన కాంగ్రెస్ కార్యదర్శిగాను, తాలూకా యూనిట్ అధ్యక్షునిగానే కాకుండా నగర కాంగ్రెస్‌కార్యదర్శిగాను, లేబర్‌సెల్‌కు రాష్ట్రకార్యదర్శిగా కూడా పనిచేసారు. గత అసెంబ్లీ ఎన్నికల్లో ప్రత్తిపాడునియోజకవర్గానికి ఇన్‌ఛార్జిగా కూడా పనిచేసి అభ్యర్థులు, పార్టీ గెలుపుకోసం అవిశ్రాంత కృషిచేశారు. వివిధ పదవులను సమర్థవంతంగానిర్వహించి పిసిసి అధ్యక్షుడు కె కెకు అనుంగు శిష్యునిగా మెలిగిన రాధాను ఎట్టకేలకు నగర కాంగ్రెస్ అధ్యక్ష పదవి వరించింది. తనకు పదవిని రప్పించడంలో కీలక కృషిచేసిన గుంటూరు-2 ఎమ్మెల్యే తాడిశెట్టి వెంకటరావుఅంటే అత్యంత ఆప్తునిగా పరిగణిస్తారు. రాధా తీవ్ర సమస్యల వలయం లోఉన్న పుడు కూడా వెంకటరావు తోడ్పాటుతోనే ఆయన అధిగ మించారు. అటు రాయపాటి సోదరులు, ఇటు తాడిశెట్టి సోదరులు, ఎమ్మెల్యే సుభాని, మాజీ మంత్రి మహ్మద్‌జానీలతో సన్నిహిత సంబంధాలున్నరాధా మున్సిపల్ ఎన్నికల్లో అభ్యర్థుల ఎంపిక ప్రక్రియలో కీలక పాత్ర పోషించారు.



అభ్యర్థుల ఎంపిక ప్రక్రియకొలిక్కి రాక తీవ్ర వాగ్యుద్ధాలు, నేతల మధ్య రాజకీయ పోరాటాలు సాగుతున్నతరుణంలో పరిస్థితిని ఎప్పటికప్పుడు పిసిసికి నివేదించి సమస్యలను పరిష్కరించుకోవడంలో రాధా తన రాజకీయ కుశలతను ప్రదర్శించారు. చివరకు పిసిసి పంపించిన పరిశీలకుల సమక్షంలో అభ్యర్థుల నిర్ణయం వంటివాటిని కూడా సమర్థవంతంగా నిర్వహించగలిగారు. పార్టీలో నెలకొన్న గ్రూపులు, నాయకులను ఒకే వేదికపైకి తెచ్చి ఎన్నికల్లో అభ్యర్థులనునిర్ణయించడంలో రాధా తనదైన శైలిని ప్రదర్శించారు.

మున్సిపల్ ఎన్నికల్లోనేకాకుండా పార్టీ పరమైన కార్యక్రమాల్లో కూడా రాధా ముందంజలో ఉన్నారు.

నిర్వహించిన ఎ ఐ సి సి ప్లీనరీ కమిటీలో పిసిసినేత కెకె సారథ్యం వహిస్తున్న రిసెప్షన్ కమిటీలో సభ్యునిగా పనిచేసి కీలక బాధ్యతలు నిర్వర్తించారు. నాలుగు పదులు వయసుదాటిన నాయకునిగా రెట్టించిన ఉత్సాహంతో పార్టీకార్యక్రమాలను విజయవంతం చేయడంలో తన సమర్థత చూపించినమాదా రాధా నగర కమిటీని మరింత పటిష్టం చేయాలని యోచిస్తున్నారు. ఇందుకోసం అందరునాయకులనుంచి అభిప్రాయాలను సేకరించి ఎవరినీ నొప్పించకుండా చిన్న కమిటీని నియమించాలన్న రాధా ప్రయత్నాలకు అధిష్టానం గ్రీన్ సిగ్నల్ ఇవ్వడంతో ఆయన కమిటీ ఏర్పాటుకు కసరత్తులుచేస్తున్నారు. నగర పరిధిలోని 52 డివిజన్లలో ఆదినుంచి తనను వెన్నంటి ఉన్న నాయకు లకు. కార్పొరేటర్ పదవులను రప్పించు కోగలిగారు. పైగా ఎన్నికల్లో ప్రతి డివిజన్‌లోను పర్యటించి పార్టీ విజయం కోసం మంత్రులు, ఇతర ముఖ్యుల ప్రచార ప్రణాళికలను అమలుచేయడంలో రాధా ప్రచార వ్యూహం సత్ఫలితాలచ్చింది.

పిసిసి అధ్యక్షుడు డాక్టర్ కే.కేశవరావుకు విధేయునిగా కొనసాగుతున్న రాధా ఏ చిన్న కార్యక్రమం చేపట్టాలన్నా ముందుగా ఆయన ఆశీస్సులు తీసుకుంటారు. జిల్లాలో తనకుముందునుంచీ పరిచయం ఉన్న మహ్మద్‌జానీ సలహాలు, ఎమ్మెల్యేల సూచనలను తీసుకుంటూ ఎంపిని కూడా సంప్రదించి నిర్ణయాలను అమలుచేస్తుండటంతో నగరకాంగ్రెస్‌లో మాదా రాధా ప్రతిష్ట మరింత పెరిగింది. ఎన్నికల సమయంలోను, వ్యక్తిగతంగా తాను క్లిష్టపరిస్థితుల్లో ఉన్న తరుణంలోను మొక్కవోని ధైర్యంతోముందుకు సాగి ఎటువంటి కేసులయినా అధికారులకు సహకరిస్తానని, తన నిర్దోషి త్వం నిరూపించుకుంటానని ఘంటాపథంగా చెప్పి సమస్యలను న్యాయపరంగా అధిగమించారు. తనపై అభిమానంతో పదవినిచ్చిన వారికి మచ్చతేకుండా, అధినేతలకు తనపైఉన్న నమ్మకాన్ని వమ్ముచేయకుండా నగరకమిటీని ఏకాభిప్రాయ సాధనతో ముందుకు నడిపించడంలో రాధా తన సమర్థతను చాటుకుంటున్నారు.

# విదేశీ ఇళ్ళకు స్వదేశీ నాపరాళ్ళు

(ప్రభాతవార్త-మరంపల్లి)

నల్లగొండ జిల్లాలోని నాపరాళ్ళు పాలిష్ షోకుతో విదేశీ ఇళ్ళకు టెయిల్స్‌గా ఉపయోగపడడంతో పుట్టకొక్కుల పుట్టుకొచ్చిన నాపరాళ్ళ పాలిష్ మిల్లులు విపరీతంగా ఖనిజ సంపదను విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. నావరాళ్ళ గనులు విపరీతంగా కిష్ట పట్టె ప్రాంతంలో విస్తరించి ఉండడంతో ఆయా పరిశ్రమల యజమానులకు వరాలుగా మారడంతో పాటు ప్రతి ఏటా ఈ ఖనిజ సంపద ద్వారా కోట్లాది రూపాయలు ప్రభుత్వానికి ఆదాయం లభిస్తోంది. దీంతో పాటు విదేశీ మారకద్రవ్యం కూడా లభిస్తుంది. కార్మికుల జీవన పరిస్థితులు మెరుపర్చేందుకు కూడా దోహదపడుతుంది. జిల్లాలో ఇప్పటికే 150 నుండి 175 వరకు నాపరాయి ముడి సరుకును పాలిష్ రాళ్ళుగా మార్చే మిల్లులు ఉండగా నేరుగా



టెయిల్స్‌ను చేసే మిల్లులు మరో 50 ఉన్నాయి. జిల్లాలోని మిర్యాలగూడ డివిజన్‌లోని దామరచర్ల, మరంపల్లి, నేరేడుచర్ల, అడవిదేవులపల్లి, ముదిమాణిక్యం, బొల్లేపల్లి, వీర్లపాలెం, చిట్యాల, రఘునాథపాలెం, వాడపల్లి, గణేష్‌పాడు, శాంతినగర్ తదితర ప్రాంతాలలో నావరాయి నంవద వివరీతంగా నిక్షిప్తమై ఉంది. సుమారు 10వేల మంది కూలీలకు ఈ మిల్లుల ద్వారా ఉపాధి లభిస్తుంది. ఈ పరిశ్రమలు నిత్యం అభివృద్ధి మార్గంలో పయనిస్తున్నాయి. ఇక్కడ రూపు దిద్దుకునే పాలిష్ రాళ్ళలో ప్రధానంగా వైట్ లైవేట్, లైవేట్‌జాన్, లైట్‌గ్రీన్, మిల్క్‌టు వైట్, పింక్ బ్లాక్, గ్రీన్ లాంటి పాలిష్ రాళ్ళు విపరీతంగా ఉత్పత్తి అవుతున్నాయి. కొనుగోలుదారులు ఏ సైజులో కావాలంటే అదే సైదులో అందిస్తూ పాలిష్ మిల్లులు లాభాలు ఆర్జిస్తున్నాయి. ఈ విధంగా తయారైన అందమైన రాళ్ళు మన రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకే కాకుండా విదేశాలకు ఎక్కువగా ఆర్డర్లపై తరలి వెళుతుంటాయి. రాళ్ళ ద్వారా విదేశీ ధనం సంపాదించడంలో జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో నల్లగొండ పేరును సంపాదించుకుంటుంది. పాలిష్ పూర్తి చేసుకుని అందంగా రూపు దిద్దుకున్న రాళ్ళు జపాన్, జర్మనీ, నేపాల్, సింగపూర్, బంగ్లాదేశ్, అమెరికా లాంటి దేశాలకు ఆర్డర్లపై క్రమక్రమంగా తరలి వెళుతుంటాయి. దీంతోపాలిష్ రాళ్ళను జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో రవాణా చేసేందుకు ప్రత్యేక (మిగతా 82లో..)



## వార్త పదో వార్షికోత్సవ సెమినార్ దృశ్యాలు


వార్త గుంటూరు యూనిట్ కార్యాలయంలో ఏర్పాటు చేసిన ఫొటో ఎగ్జిబిషన్‌ను తిలకిస్తున్న విద్యార్థినులు


ఫొటో ఎగ్జిబిషన్


ఎయిడ్స్ చైతన్య గీతాలు ఆలపిస్తున్న విద్యార్థినులు

# రియల్ ఎస్టేట్ రంగానికి స్ఫూర్తి జనచైతన్య హౌసింగ్

దక్షిణ భారత దేశ రియల్ ఎస్టేట్ రంగంలోనే దేదీప్యమానంగా వెలుగొందుతున్న సంస్థ జనచైతన్య హౌసింగ్ లిమిటెడ్. రాష్ట్రంలోని అన్ని ముఖ్యనగరాలలో శాఖలు కలిగి గత రెండు దశాబ్దాలుగా రియల్ ఎస్టేట్ రంగంలో ఉన్న విలువలతో చిత్తశుద్ధితో వ్యాపారం నిర్వహిస్తున్నట్లు సంస్థ డైరెక్టర్ శ్రీమతి మాదాల శకుంతలమ్మ తెలియజేశారు. వేలాది మందికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఉపాధి కల్పిస్తున్న సంస్థ కూడా జనచైతన్య హౌసింగ్ లిమిటెడ్ అని చెప్పవచ్చు. సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ మాదల సుధాకర్ మార్కెటింగ్ సిబ్బందికి ప్రత్యేక తరహాలో శిక్షణ ఇచ్చి ఎంతో మందికి జీవనోపాధి కల్పించారు. నేడు రాష్ట్రంలోని వివిధ రియల్ ఎస్టేట్ సంస్థలలో పనిచేస్తున్నవారు కాని, వివిధ రియల్ ఎస్టేట్ సంస్థలను నెలకొల్పినవారు కాని, చాల మందివరకూ జనచైతన్య హౌసింగ్‌లో పనిచేసినవారే. డైరెక్టర్ శ్రీమతి శకుంతలమ్మ స్వతహాగా రైతు బిడ్డ. గ్రామీణ విలువలు, సత్‌సాంప్రదాయాలతో ఆమె ఎంతో మెళుకువతో ముందుచూపుతో సంస్థ పురోగతిన నడవడానికి తనదైన పద్ధతిలో ప్రణాళికాబద్ధంగా ముందుకు సాగుతున్నారు. కష్టమర్లకు లాభదాయకంగా ఉండేవిధంగా జనచైతన్య హౌసింగ్ వెంచర్లు అభివృద్ధి చేస్తున్నామని ఎండి మాదల సుధాకర్ తెలిపారు. కృషి పట్టుదల, సేవాభావం, జన్మతహా నిండివున్న శ్రీ మాదల సుధాకర్ సంస్థ ఛైర్మన్‌గా. ఆదర్శవంతమైన పరిపాలనా పద్ధతులను అమలుపరుస్తున్నారు.

అతనేక మంది యువకులు జనచైతన్య సంస్థలో పనిచేసి శిక్షణ పొంది నేడు రియల్ ఎస్టేట్స్ సంస్థలు స్థాపిస్తున్న అంశం అందరికీ తెలిసిందే. జనచైతన్య హౌసింగ్ రియల్ ఎస్టేట్ రంగానికే మాతృక అని చెప్పడంలో అతిశయోక్తిలేదు. ఇళ్ల స్థలాల కొనుగోలుకు నమ్మకమైన సంస్థగా జనచైతన్య హౌసింగ్ సంస్థను ఎంతో మంది ప్రజల హృదయాల్లో చోటుచేసుకుని దక్షిణ భారత దేశంలోనే అగ్రగామిగా నిలిచింది. సంస్థ ఆదాయంలో కొంత శాతాన్ని ప్రజా సంక్షేమం, సామాజిక అవసరాలు, ఆధ్యాత్మిక సాంస్కృతిక, ప్రజోపయోగ కార్యక్రమాలకు వినియోగించమే కాకుండా గుంటూరుకు సమీపంలోని పెదకాకాని, విజయవాడ జాతీయరహదారిపక్కన కోట్లాది రూపాయలు విలువచేసే ఐదెకరాల స్థలాన్ని కంచికామకోరి పీఠం వారి ఆధ్వర్యంలో శంకర కంటి ఆసుపత్రి నిర్మాణానికి విరాళంగా ఇవ్వడం మాదల వంశం వారి సేవానిరతికి నిదర్శనం. రాష్ట్రంలోను, తమిళనాడు, కర్నాటక, ఒరిస్సా తదితర రాష్ట్రాల్లోను వివిధ ఆధ్యాత్మిక సామాజిక అవసరాలకు ఎంతో దానధర్మాలు చేసిన ఘనత జనచైతన్య హౌసింగ్ ఛైర్మన్ మాదల సుధాకర్ సోదరులు మాదల రత్నగిరిబాబులకు దక్కుతుంది.

**షిరిడిసాయిబాబా మందిరం:** గుంటూరు ఆటోనగర్ పక్కన రాష్ట్రంలోనే విశాలంగా అధునాతన సౌకర్యాలతో విశ్వశాంతిని, లోకకళ్యాణాన్ని ఆకాంక్షిస్తూ వెయ్యి ఎకరాల సువిశాల విస్తీర్ణంతో అభివృద్ధి చేస్తున్న సుధాకర్ శాటిలైట్ మెగా టౌన్‌షిప్స్‌నందు జనచైతన్య హౌసింగ్ నిర్మించిన దేవాలయం ఎంతో ప్రాచుర్యం పొందింది. ఇది నిత్యపూజలతో ప్రముఖ పండుగ పర్వదినాలలో ప్రత్యేక పూజలు అన్నదాన కార్యక్రమాలతో వేలాది మంది భక్తులు ఆలయాన్ని ధర్శించుకుని షిరిడి సాయినాథుని ఆశీస్సులను పొంది తరించుచున్నారు. ఈ మందిర నిర్వహణ బాధ్యతలను మాదల శంకుతలమ్మ స్వయంగా పర్యవేక్షిస్తున్నారు.

మానవసేవయే మాధవసేవగా తలంచిన జనచైతన్య హౌసింగ్ గ్రూపు సంస్థలు గుంటూరు అరండల్‌పేటలో అధునాతన పద్ధతిలో శ్రీసాయిభాస్కర్ మల్టీ స్పెషాలిటీ ఆసుపత్రిని నిర్మించారు. ఈ ఆసుపత్రిని మాదల సుధాకర్ తండ్రి శ్రీ మాదల భాస్కరరావు బాల్యస్నేహితులైన రాష్ట్ర ఆర్థిక వైద్య ఆరోగ్యశాఖల మంత్రి కొణిజేటి రోశయ్యప్రారంభించారు.

ఆధునిక సౌకర్యాలతో సులభ వాయిదాల పద్ధతిపై గుంటూరు-విజయవాడ నగరాలలో అత్యంత త్వరితంగా అభివృద్ధి చెందుతున్న ప్రాంతంలో ఉడా ప్రభుత్వ అప్రూవల్స్‌తో అభివృద్ధి చేయబడుతున్న జనచైతన్య వారి నూతన వెంచర్లలో ఇండ్లస్థలాలు అందుబాటైన ధరల్లో లభిస్తున్నాయి.

**గుంటూరులో:-** అమరావతిరోడ్డులో గోరంట్ల గ్రామాన్ని అనుకుని సాయిపురం వెంచర్‌లో అభివృద్ధి చేయబడిన ప్లాట్లు అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయి. రెడ్డిపాలెం సమీపంలో గుంటూరు-2 రైల్వే స్టేషన్‌గా అభివృద్ధి చెందుతున్న ఏరియాలో అగతవరప్పాడు మరియు రెడ్డిపాలెం గ్రామ కూడలిలో సాయి వెంకట్ వెంచర్‌లో అభివృద్ధి చేయబడిన ప్లాట్లు అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయి. గుంటూరు-తెనాలి బైపాస్ రోడ్డు జంక్షన్ వద్ద శ్రీభగవాన్ సత్యసాయి స్కూలుకు ఎదురుగా అభివృద్ధి చేయబడుతున్నప్రాంతంలో ప్లాట్ల అమ్మకానికి త్వరలో సిద్ధం అవుతున్నాయి. గుంటూరులో అభివృద్ధి చెందిన కాలనీలకు ఆనుకుని తురకపాలెం రోడ్డు నల్లపాడు

మిగతా 81వ పేజీలో

ఆసుపత్రి భవనం





డాక్టర్లు కిరణ్ చౌదరి, లత, సహనా, అరుణ్ కుమార్

# రియల్ ఎస్టేట్ రంగానికి స్ఫూర్తి 'జనచైతన్య హౌసింగ్'

మొదటిపేజీ తరువాయి

రైల్వే స్టేషన్ల మధ్య అభివృద్ధి చేయబడిన మెగా వెంచర్ సాయిదత్తా-2లో కూడా ప్లాట్లు అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయి.

వెనువెంటనే రిజిస్ట్రేషన్‌కూడా చేస్తున్నామని మాదల శకుంతలమ్మ తెలియజేశారు.

**విజయవాడలో:-** విజయవాడ మున్సిపల్ కార్పొరేషన్ నిర్మించిన డిస్నీలాండ్ పార్క్‌కు అతి సమీపంలో స్కూళ్లు, కాలేజిలు లాంటి విద్యాసంస్థలకు సమీపంలో గుణదల నుంచి రెండు కిలోమీటర్ల దూరంలో ఉడా మరియు ప్రభుత్వం అప్రూవల్ పొందిన నూతన వెంచర్లలో ప్లాట్లు అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయని గన్నవరం విమానాశ్రయానికి ఐదు కిలోమీటర్ల దూరంలో కంకిపాడు నుంచి గన్నవరం వెళ్లే రహదారిలో ఉప్పులూరు గ్రామం నూతన' వెంచర్‌లోని ప్లాట్లు త్వరలో అమ్మకానికి సిద్ధంగా ఉంచామన్నారు.

నివాసయోగ్యమైన స్థలాల్లో భూసేకరణ చేసి సైటు అభివృద్ధి పరిచి వెనువెంటనే గృహనిర్మాణానికి చేయడానికి వీలుగా జనచైతన్య హౌసింగ్ వెంచర్లు అభివృద్ధి చేస్తున్నామని, సులభ వాయిదాల పద్ధతిన ఔట్‌రేటుగాను కూడా ప్లాటు విక్రయించడం జరుగుతుందని శ్రీమతి మాదల శకుంతలమ్మ తెలియజేశారు.

# త్యాగాల స్ఫూర్తి...తెనాలి



తెనాలిలోని రణరంగచౌక్‌లో అమరవీరుల స్థూపాలు

(ప్రభాతవార్త, తెనాలి)

వివిధ రంగాల్లో తనదైన ప్రత్యేకత కలిగిన తెనాలి పట్టణం దేశభక్తి, స్వాతంత్ర్యం పిపాసకులకు పట్టుగొమ్మ. స్వరాజ్యం కోసం సాగిన పోరులో తెనాలి ప్రాంతప్రజలు వవిధ ఉద్యమాల్లో అగ్రభాగాన నిలిచారు. ఎందరికో మార్గదర్శకులయ్యారు. హోంరూల్ ఉద్యమం, శాసనోల్లంఘన, ఉప్పు సత్యాగ్రహం, సైమన్ మిషన్ వ్యతిరేక ప్రదర్శనలు, సహాయ నిరాకరణ, వ్యక్తి సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాల్లో తెనాలి నిర్వహించిన పాత్ర జాతీయదృష్టిని ఆకర్షించాయి. మహాత్మాగాంధీ, జవహార్‌లాల్ నెహ్రూ, డాక్టర్ రాజేంద్రప్రసాద్, 'లోక్ నారాయణ్' జయప్రకాష్ నారాయణ్ వంటి జాతీయ నాయకులు తెనాలి సందర్శించారు. ఉద్యమకారులకు ఉత్తేజాన్ని కలిగించారు. 'వీరగంధం తెచ్చినారము, వీరులెవ్వరో తెలుపుడీ' అనే ప్రబోధగేయంతో 'కవిరాజు' త్రిపురనేని రామస్వామి ఉప్పు సత్యాగ్రహ స్ఫూర్తిని వాడవాడలా రగిలించారు. మహిళలు సైతం ఈ ఉద్యమాల్లో పాల్గొన్నారు. జైలుశిక్షలు అనుభవించారు.

1947లో గాంధీజీ ఇచ్చిన 'క్విట్ ఇండియా' 'డూ ఆర్ డై' పిలుపుకు స్పందించిన తెనాలి ప్రజలు ఆగస్టు 12న తెనాలి రైల్వేస్టేషన్‌ను ధ్వంసం చేశారు. పాసింజర్ రైలుకు నిప్పంటించారు. పోలీసు తూటాలకు ఏడుగురు బలయ్యారు. వీరు బలిదానం చేసిన స్థలానికి రణరంగచౌక్ అని నామకరణ చేశారు. అప్పటి మునిసిపల్ చైర్మన్ ఆలపాటి వెంకట్రామయ్య అదే ప్రాంతంలో అమరవీరుల స్థూపాలను నిర్మించారు.

1959 డిసెంబరు 20న కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు కామరాజ్‌నాడార్ ఈ స్థూపాలను ఆవిష్కరించారు. ఆనాటి ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి సభకు అధ్యక్షత వహించారు. ఈ స్థూపాలు నేటికీ పట్టణ చిహ్నంగా ఈ ప్రాంతీయులు గుర్తిస్తారు. ఎందుకంటే తెనాలిలో ఆగస్టు 12న క్విట్‌ఇండియా ఉద్యమంలో భాగంగా ప్రజలు చేసిన పోరాట వివరాలను అప్పటి బ్రిటీష్ ప్రధాని చర్చిల్ స్వయంగా అడిగి తెలుసుకొన్నారు. ప్రపంచమ్యాప్‌లో తెనాలి పట్టణాన్ని చూపాల్సిందిగా అధికారులను కోరారు. ఈ త్యాగాలే స్ఫూర్తిగా.. జాతీయోద్యమకారులు, మరెందరో అమరవీరుల త్యాగాల ఫలంగా స్వాతంత్ర్యం సిద్ధించాక, ఆనాటి స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తిని భవిష్యత్ తరాలకు మార్గదర్శకంగా ఉండేందుకు తెనాలి పాలకులు నడుకట్టారు. ఉద్యమనాయకుల సేవానిరతి, త్యాగాలను స్మరించుకొనే రీతిలో పట్టణంలోని అనేక రోడ్లకు, సంస్థలకు, ప్రాంతాలకు త్యాగధనుల పేరిట నామకరణం చేశారు. పాతవంతెన-గాంధీచౌక్ మధ్య రోడ్డును మహాత్మాగాంధీ రోడ్డుగా నామకరణం చేశారు.

## గాంధీ మాట్లాడిన ప్రదేశమే నేటి గాంధీచౌక్

స్వాతంత్ర్య ఉద్యమంలో భాగంగా తెనాలి వచ్చిన గాంధీ ఇక్కడ మాట్లాడిన ప్రదేశాన్ని గాంధీచౌక్‌గా పిలుస్తున్నారు. గాంధీచౌక్ నుండి అయితానగర్ వరకు గల రోడ్డుకు పండిత

మిగతా 82వ పేజీలో

# త్యాగాల స్ఫూర్తి...తెనాలి

81వ పేజీ తరువాయి

జవహర్‌లాల్ నెహ్రూ పట్ల గౌరవసూచకంగా నెహ్రూరోడ్డుగా, గాంధీ చౌక్-చినరావూరు వైపుకు గల రోడ్డుకు నేతాజీ సుభాష్‌చంద్రబోస్ త్యాగాలకు గుర్తింపుగా బోస్‌రోడ్డుగా పేరుపెట్టారు. అయితానగర్ నుండి వి.ఎస్.ఆర్ అండ్ ఎన్.వి.ఆర్ కాలేజీ పక్కన తెనాలి-విజయవాడ రోడ్డులో కలిసే రోడ్డును విప్లవవీరుడు, త్యాగధనుడు సర్దార్ భగత్‌సింగ్ స్మారకార్థం భగత్‌సింగ్ రోడ్డుగా నామకరణం చేశారు. ఓవర్‌బ్రిడ్జి నుంచి చెంచుపేటమీదుగా అంగలకురుదు వైపుకు గల రోడ్డుకు 'లోకమాన్య' తిలక్ సంస్మరణార్థం తిలక్‌రోడ్డుగా నామకరణం చేశారు. పడమర కాల్వ పక్కన బాలాజీరావుపేటక్కు గల రోడ్డుకు వి.వి.గిరి పేరిగ 'గిరిరోడ్డు' గా, రైల్వేస్టేషన్ ఎదురుగా రామస్వామి పేటకు వెళ్లే రోడ్డును ఆచార్య ఎన్.జిరంగా గౌరవార్థం 'రైతురంగా రోడ్డు'గా నన్నపనేని వంతెనలు-నెహ్రూ రోడ్డు మధ్యగల రోడ్డుకు ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు జ్ఞాపకార్థం 'ప్రకాశం రోడ్డుగా, పాలాద్రికాల్వ పక్కన గల రోడ్డును కమ్యూనిస్టు నాయకుడు ఎస్.ఏ.డాంగే పేరిట 'డాంగే రోడ్డుగా' మెయిన్‌చర్చి పక్క రోడ్డుకు 'దేశభక్త' కొండా వెంకటప్పయ్య పంతులు జ్ఞాపకార్థం 'దేశభక్త' వీధిగా రవీంద్ర బాబు హాస్పిటల్ రోడ్డుకు 'దేశోద్ధారక' కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు స్మారకార్థం 'దేశోద్ధారక రోడ్డు'గా ఈ రోడ్డుకు సమీపాన గల మరో రోడ్డుకు 'భారతకోకిల' సరోజినీనాయుడు రోడ్డుగా పేర్లు పెట్టారు. నరేంద్రదేవ్ కాలనీ దగ్గర్లో రోడ్డుకు భారత స్వాతంత్రోద్యమానికి సానుభూతి తెలిపిన కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత లెనిన్‌కు ఇక్కడ ప్రాధాన్యతనిచ్చారు.

ఆ రోడ్డుకు 'లెనిన్' రోడ్డుగా నామకరణం చేశారు. మాజీ ముఖ్యమంత్రి సాహితీవేత్త డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గౌవరార్థం గంగానమ్మపేటలోని ప్రధానవీధిని 'గోపాలరెడ్డి రోడ్డు'గా వ్యవహరిస్తున్నారు. రెండో వార్డులో ప్యాడిసన్‌పేటలో గల రోడ్డుకు భారత రాజ్యాంగ నిర్మాత డాక్టర్ బి.ఆర్ అంబేద్కర్ జ్ఞాపకార్థం 'అంబేద్కర్'రోడ్డుగా పేరుపెట్టారు. కొత్త వంతెన నుండి మొండిగోడలు వైపుకు గల రోడ్డును జాతీయవాది, ముస్లిం నాయకుడు డాక్టర్ అన్సారీ పేరిట 'అన్సారి రోడ్డు'గా పిలుస్తున్నారు.

ప్రకాశం రోడ్డుకు దగ్గర్లోని ఒక రోడ్డుకు 'శివాజీరోడ్డు'గా పేరుపెట్టారు. ప్రధాన మునిసిపల్ కూరగాయల మార్కెట్‌ను 'గాంధీ' మునిసిపల్ మార్కెట్'గా నామకరణం చేశారు. నందులపేటకు గాంధీనగర్‌గా, 'ఉడా' కాలనీకి ఇందిరానగర్‌గా, అయితానగర్ ముందుభాగాన్ని నెహ్రూనగర్‌గా, ఆర్టీసీబస్‌స్టేసన్, వి.ఎస్.ఆర్ కాలేజి మధ్యగల కాలనీకి 'జయప్రకాస్ సెంటర్‌గా' పేరుపెట్టారు. ప్యాడిసన్ పేటలోని మునిసివల్ పార్కుకు 'కవిరాజు' పేరు పెట్టారు. ఇంకా ప్రాంతాలు, వీధులు పూర్వపు మునిసిపల్ చైర్మన్ల స్మృతి చిహ్నాలుగా ఉన్నాయి. తెనాలి కళావైభవాన్ని దేశవ్యాప్తంగానే కాదు. బర్మా, రంగూన్, శ్రీలంకలో కూడా చాటిన నృత్యకారిణి భిక్షావతి పేరిట సైతం ఇక్కడ ఒక వీధికి నామకరణం చేయటం విశేషం! వీటన్నింటిని గమనిస్తే ఉద్యమ నాయకుల స్ఫూర్తితో తెనాలి పట్టణం పెనవేసుకుందని చెప్పొచ్చు.

## విదేశీ ఇళ్ళకు..

(79వ పేజీ తరువాయి)

ఎక్స్‌పోర్ట్ కంపెనీలు సైతం ఉద్భవించడంతో పాలిష్ రాళ్ళు ఉత్పత్తిదారులకు ఎలాంటి కష్టం లేకుండా వ్యాపారం సజావుగా సాగుతోంది. జిల్లాకు కోట్లాది రూపాయల ఆదాయం లభిస్తున్నప్పటికి ప్రభుత్వం సరైన నిఘా పెంచితే ఇంకా గనుల ద్వారా ఆదాయాన్ని గణనీయంగా పెంచుకునే అవకాశాలు ఉన్నాయి. జిల్లాలో పన్నెండు ఎడిఇ కార్యాలయాలను ప్రత్యేకంగా అవసరం ఉన్న ప్రాంతాలలో స్థాపించి నిఘా విభాగాలను తీవ్రం చేసినట్లు సంబంధిత అధికారులు తెలుపుతున్నారు. అందుకు తగ్గట్టుగా కనీస సంపద దళారుల చేతుల్లోకి వెళ్ళకుండా జాగ్రత్తలు వహిస్తే జిల్లాకు భారీగా ఆదాయం అందే అవకాశాలు ఉన్నాయి. జిల్లాలో ఖనిజ సంపద రెండువేల ఎకరాలలో 290 మిలియన్ టన్నుల వరకు ఉండవచ్చని ప్రభుత్వ సర్వే పేర్కొంటుంది. పులిచింతల నిర్మాణంతో వందలాది ఎకరాల నాపరాయి గనులు మునిగిపోయే ప్రమాదం ఉన్నట్లు సర్వే ద్వారా వెల్లడైంది. విదేశీ మారక ద్రవ్యాన్ని పెద్ద ఎత్తున మనదేశానికి అందించే నాపరాతి గనులు ఒక్క మన రాష్ట్రంలోనే 725 కోట్ల రూపాయల లాభాన్ని అందించడం పట్ల ప్రభుత్వం నాపరాళ్ళను దళారులకు అందకుండా జాగ్రత్త చర్యలు పాటిస్తే మరింత ఆదాయం వచ్చే అవకాశాలు ఉన్నాయి.

# వనరులు అపారం..ఏదీ నేతల సహకారం!



జంపనిలో సహకారరంగంలోని చెరకు ఫ్యాక్టరీ

(ప్రభాతవార్త, తెనాలి)

కృష్ణాపశ్చిమ డివిజనుకు నీటిపారుదల వ్యవస్థ శతాబ్దం క్రితమే అందుబాటులోకి వచ్చిన విషయం తెలిసిందే. జిల్లాలో ఎక్కడా వరిసాగు లేనికాలంలో తెనాలి ప్రాంతం ధాన్యం పండించి జిల్లా ధాన్యాగారంగా, జిల్లా అంతటికి వరి అన్నం పెట్టగలిగిన అన్నపూర్ణగా కీర్తిగడించింది. వాణిజ్యపంటలు, ఉద్యానవన పంటలు, కూరగాయలను పండిస్తూ ఇక్కడి రైతులు మార్గదర్శకంగా నిలిచారు. పాడిపండలకు కొదవలేని ఈ ప్రాంతంలో వ్యవసాయ అనుబంధ పరిశ్రమలకు పాలకుల చేయూత కొరవడింది. ఫలితంగా ఎన్నో అవకాశాలు, వనరులు ఉన్నప్పటికీ ఉపాధి సౌకర్యం లేకుండాపోయింది.



మాగాణి భూముల కళకళ

కృష్ణాపశ్చిమ డివిజనులో 6.25 లక్షల ఆయకట్టు ఉంటే ఇందులో 4 లక్షల ఎకరాలు తెనాలి డివిజన్‌లోనే ఉంది. మాగాణి భూముల్లో మొదటి పంటగా వరి, రెండోపంటగా మినుము పండించటం ఆనవాయితీ. ఇక్కడి అవసరాలకు పోను మిగిలిన బియ్యంలో ఏటా లక్ష లన్నుల వరకు ఇతర రాష్ట్రాలకు ఎగుమతి చేస్తుంటారు. దాదాపు 40వేల ఎకరాల్లోని మొట్టభూమిలో పసుపు, అరటి, నిమ్మ, సపోటా, మొక్కజొన్న, తమలపాకు, కంద, కరివేపాకు సాగుచేస్తుంటారు. వీటిలో చాలాపంటలను ఇతర జిల్లాలకు, రాష్ట్రాలకు ఎగుమతి చేస్తుంటారు. కంద పంటకు దుబాయ్‌లో మంచి గిరాకీ ఉంది. ఇన్నిరకాల పంటలు సాగుచేస్తున్నప్పటికి రైతాంగం, వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్న కార్మికులు, ఇతర వర్గాల ఆర్థికపరిస్థితిలో మార్పులేదు. వర్షాభావం, ఇతర ప్రకృతివైపరీత్యాలకు ఒక్కోసారి ఆయా వర్గాల జాతకాలు తారుమారవుతున్న సందర్భాలు మాత్రం ఉన్నాయి. పాడిపంటలు లేని జిల్లాలు, ప్రాంతాల్లోను పారిశ్రామిక అభివృద్ది జరిగినప్పటికి, వ్యవసాయం ప్రధానమైన తెనాలి డివిజనులో అనుబంధ పరిశ్రమల స్థాపనకు అవకాశం ఉన్నప్పటికి ఆ దిశగా అడుగులు పడలేదు. సుమారు రెండున్నర దశాబ్ధాల క్రితం ఏర్పాటయిన సంగండెయిరీ, ఇరవైరెండేళ్ల క్రితం నిర్మించన జంపనిలోని చెక్కెర ఫ్యాక్టరీ మినహా డివిజనులో పరిశ్రమలంటూ ఎక్కడా కానరావు. ఎప్పటినుండో

మిగతా 84వ పేజీలో

















# పంటకాల్వల క్రీడాస్థలి తెనాలి డివిజను

(ప్రభాతవార్త, తెనాలి)

నూరువసంతాల గుంటూరు జిల్లా కంఠాభరణం తెనాలి డివిజను. సర్ ఆర్థర్ కాటన్, కెప్టెన్ ఓర్ మహాశయుల కృషి ఫలితంగా ఈ ప్రాంతం పంటకాల్వల క్రీడాస్థలిగా రూపుదాల్చింది. భూములన్నీ సుక్షేత్రాలై పాడి పంటలకు నెలవై వెలనాడుగా వర్ధిల్లుతోంది. ఉద్యమాల పురిటిగడ్డగా ప్రసిద్ధికెక్కిన పోతుగడ్డ ఇది. బ్రిటిష్ పాలకుల బానిస సంకెళ్లకు వ్యతిరేకంగా రాష్ట్రంలోనే తొలి కేక వినిపించింది తెనాలి నుండే. బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం. కమ్యూనిస్టు ఉద్యమం, రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమం, హేతువాద ఉద్యమం, హిందీ ఉద్యమం వంటి అనేక చారిత్రక మలుపులకు కేంద్రంగా విలసిల్లింది. సాహిత్య, కళారంగాల్లోనూ తనదైన ప్రత్యేకతను సొంతం చేసుకుంది.

అతి పురాతనం తెనాలి చరిత్ర

చరిత్రపరంగా చూస్తే తెనాలి ప్రాంతం అతిపురాతనమైంది. క్రీస్తుశకం 2వ శతబ్ధంలో ఈ ప్రాంతాన్ని భట్టిప్రోలు రాజధానిగా కుబీరుడు అనే రాజు పాలించాడని చారిత్రక ఆధారాలుంటే, ఇక్కడకు సమీపంలోని మల్లెపాడులో లభించిన చారిత్రక అవశేషాల ప్రకారం క్రీ.పూ.3వ శతాబ్ధి నుండి అంటే సుమేరియన్ కాలం నుండి తెనాలి చరిత్ర ఉందని పురావస్తుశాఖ అభిప్రాయం. క్రీ.శ.400-436లో తాంబ్రావు(నేటి చేబ్రోలు) రాజధానిగా పల్లవులు పాలించారు. దావులూరు దానశాసనంలో తొలుత 1034లో తెనాలి గ్రామ ప్రసక్తి వెలుగుచూసింది. 1175లో తెనాలి సమీపంలో ఈమని గ్రామం కేంద్రంగా దూర్జయాశ్వయుడైన కంవరాజు. పాలించారు. 1578లో కొండవీటి రెడ్డిరాజుల కాలంలో తెనాలి కూచిపూడి సముతులో ఉంది. 1687లో మొగలాయిలు, 1765లో అసప్‌జాహిలు, 1797-1804 మధ్య రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు ఈ ప్రాంతాన్ని వరిపాలించారు. 1774లో మచిలీపట్నం కౌన్సిల్ కింద గుంటూరుజిల్లా ఏర్పాటైంది. 1859లో గుంటూరు, కృష్ణా నీటి వరీవాహక ప్రాంతాలతో మచిలీపట్నం కేంద్రంగా కృష్ణాజిల్లా ఏర్పాటయింది.

అప్పట్లో గుంటూరుజిల్లాకు సబ్‌కలెక్టర్, డి.ఎస్.పి(పోలీసు) మాత్రమే ఉండేవారు. 1904లో కృష్ణాజిల్లా నుండి గుంటూరు ప్రాంతాన్ని వేరుచేసి ప్రత్యేక గుంటూరు జిల్లాగా ఏర్పాటయింది. 1911లో తెనాలి, బాపట్ల, రేపల్లె తాలూకాలు కలిపి తెనాలి రెవిన్యూ డివిజన్ ఆవిర్భవించింది. 1954లో సమితుల విభజన జరిగింది. 1985లో మండల వ్యవస్థ ఏర్పాటుతో తెనాలి డివిజనులో 18 మండలాలు ఏర్పాటయ్యాయి.

## సాగునీటి వ్యవస్థతో వెలనాడుగా కీర్తి

అపర భగీరథుడు సర్ ఆర్థర్ కాటన్ పుణ్యమా అని 1858లో కృష్ణానదిపై ఆనకట్ట నిర్మాణం జరగ్గా దీనివల్ల గుంటూరుజిల్లాలో లాభించింది తెనాలి డివిజను మాత్రమే. 1890లో కెప్టెన్ అలెగ్జాండ్ ఓర్ ఇంజనీరు పంటకాల్వలు తవ్వించి, లాకులు, సైఫన్లు ఏర్పాటుచేసి తెనాలి డివిజనును పంటకాల్వల క్రీడాస్థలిగా మార్చివేశారు. ఫలితంగా ఇక్కడ మాగాణి భూముల్లో వరి పంటకు ఆస్కారం ఏర్పడింది. ఫలితంగా గుంటూరుజిల్లా ధాన్యాగారంగా తెనాలి డివిజనుకు కీర్తి దక్కింది.

## ఉద్యమాలకు ఊపిరులూదిన పోతుగడ్డ

బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా రాష్ట్రంలో తిరుగుబాటు కేక ఆరంభమైంది తొలుత తెనాలిలోనే. 1909లో బ్రిటిష్ వైస్రాయి ప్రయాణించే రైలును పడగొట్టేందుకు కంచర్లపాలెంకు చెందిన చుక్కపల్లి రామయ్య, కఠెవరం గ్రామస్తులు లక్కరాజు బసవయ్య, గోళ్లమూడి బ్రహ్మయ్య అనే స్నేహితులు ప్రయత్నం చేశారు. ఏప్రిల్ 3న వైస్రాయి వెళుతున్న రైలును బాంబులతో పేల్చివేయాలని నిర్ణయించారు. ఒక బాంబును ముందుగా పరీక్షించే నిమిత్తం కాల్వగట్టుపై ఉంచగా, పశువుల కాపరి దానిని గమనించి పగుటగొట్టబోగా, పేలిపోయింది. బాంబుపేలుడుతో పశువుల కాపరి తునాతునకలయ్యాడు. పోలీసులు రంగప్రవేశం చేసి కుట్రకేసు పెట్టారు. అప్పటి మద్రాసు కోర్టులో విచారణ జరగ్గా బసవయ్య, బ్రహ్మయ్య తరపు టంగుటూరి ప్రకాశం పంతులు, పి.వి.శ్రీనివాసరావు, పి.లక్ష్మీనరసింహం వాదించారు. రామయ్య మాత్రం న్యాయవాది అవసరం లేదన్నారు. న్యాయస్థానం రామయ్యకు దీపాంతర వాస జీవితఖైదు, మిగిలిన ఇద్దరికి పదేళ్ల జైలు విధించగా, అండమాన్ జైలులో వీరు శిక్ష అనుభవించారు. ఇదే

■ మిగతా 85లో

# వనరులు అపారం.. ఏదీ నేతల సహకారం!

83వ పేజీ తరువాయి

కొనసాగుతున్న రైస్‌మిల్లులు మాత్రం ఈతిబాధలతో నెట్టుకొస్తున్నాయి. డివిజనులో సాగుచేస్తున్న పంటలకు అనుబంధంగా పరిశ్రమల ఏర్పాటుకు ఎంతో అవకాశం ఉంది. వరిగడ్డి నుండి కాగితం, కార్డుబోర్డు తయారుచేసి చిన్న తరహా పరిశ్రమాలు ఏర్పాటు చేయొచ్చు. చెరకుపిప్పి నుండి అట్టలు, కాగితం తయారు చేసే యూనిట్లను నెలకొల్పవచ్చు. పసుపు ముడిపదార్థంగా వినియోగించే రసాయన పరిశ్రమలు, కాస్మటిక్ యూనిట్ల స్థాపనకు అవకాశం ఉంది. నిమ్మరసం నుండి సిట్రిక్ యాసడ్(నిమ్మఉప్పు) స్క్యాష్, జ్యూస్ తయారీ యూనిట్లు, అరటిపీచుతో కార్పెట్లు, సంచులు, తాళ్లు తయారీని చేపట్టవచ్చు. సపోటా పండ్ల నుండి జ్యూస్ తీసే ఫుడ్‌ప్రాసెసింగ్, క్యానింగ్ పరిశ్రమల ఏర్పాటుకు గల అవసరం. మల్లె, గులాబి, కనకాంబరం పూలతోటల సాగు పెరిగింది. వీటి నుండి ఎసెన్స్ తయారుచేసే యూనిట్ ఏర్పాటయితే ఏడాదిపొడవునా పూలు అందుబాటులో ఉంటాయి. ఇక లంకగ్రామాల్లో విస్తారంగా సాగయే తమలపాకు రసం ఎన్నో ఔషధాల తయారీకి అవసరం. కూరగాయలు, కోడిగుడ్లకు సరైన ధర లేనపుడు వాటిని నిల్వ ఉంచుకునేందుకు కోల్ట్‌స్టోరేజ్‌లు లేకపోవటం దురదృష్టకరం. ఈ విధంగా డివిజనులో ఎన్నో వనరులు, వాటి వినియోగానికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానం ఉన్నప్పటికి సంకల్ప లోపం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. పాలకులు ఇప్పటికైనా చర్యలు తీసుకోవాలని ప్రజలు కోరుతున్నారు.

# పంటకాల్వల క్రీడాస్థలి తెనాలి డివిజను







■ 84వ పేజీ తరువాయి

సంవత్సరంలో చేబ్రోలు దగ్గర్లోని కొత్తరెడ్డిపాలెంకు చెందిన గాదె చిన్నపరెడ్డి కోటప్పకొండ తిరునాళ్లలో ప్రభుత్వంపై తిరగబడినందుకు ఉరి తీశారు. ఈ విషాధ సంఘటనపై అప్పట్లో ఎన్నో గేయాలు, బుర్రకథలు వచ్చాయి. 'సైరా చిన్నపరెడ్డి- నీపేరే బంగరు కడ్డీ' ఈ కోవలో వచ్చిన గేయమే.

1920లోనే తెనాలిలో జాతీయ పాఠశాల స్థాపన జరిగింది. దీనితో గాంధీజీ 1928, 1929, 1931లో తెనాలి డివిజనులో పర్యటించారు. గాంధీజీ పిలుపునందుకుని సహాయ నిరాకరణోద్యమం, ఉప్పునత్యాగ్రహం, శాసనోల్లంఘన ఉద్యమంలో వందలాదిమంది పాల్గొని జైళ్లకు వెళ్లారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పోలీసు తూటాలకు ఏడుగురు అమ రులైన సంఘటన బ్రిటిష్ పార్లమెంటును కుదిపింది. ఉద్యమస్ఫూర్తి కలిగినతెనాలికి 1934లో జిల్లా కాంగ్రెస్ కార్యాలయాన్ని తరలించారు. 1945లో కల్లూరి చంద్రమౌళి ప్రోత్సాహంతో ఆంధ్ర అసెంబ్లీ కాంగ్రెస్ కార్యాలయం ప్రారంభించారు.

### గుబాళించిన విద్యాసౌరభం

కాల్వల వ్యవస్థతో పెరిగిన నాగరికతతో తెనాలి ప్రాంతం విద్యారంగంలోను గుబాలించింది. 1890లో పెద రావూరులో వేద పాఠశాల. 1894లో కొల్లూరులో తొలి సంస్కృత పాఠశాలను నిర్మించారు. 1903లో తెనాలిలో తాలూకా హైస్కూలు, 1939లో వండిత గోవదేవ్ కూచిపూడిలో ఆర్యసమాజం స్థాపించారు. యలవర్తి నాయుడమ్మ వంటి శాస్త్రవేత్తలు, ఏడుగురు యూనివర్శిటీ వైస్ చాన్సలర్లు ఇక్కడినుండే వచ్చారు. ప్రబంధ కవుల్లో ఒకరైన రామకృష్ణకవి తెనాలివారే.

సాహితీ మాసపత్రిక 1922లో తెనాలి నుండే ప్రారంభమైంది. ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధులైన చలం, కొడవటిగంటి, త్రిపురనేని, మాధవపెద్ది, కొండూరి వీరరాఘవాచార్యులు, శారద, రావూరి భరద్వాజ, జి.వి.కృష్ణారావు, గోపీచంద్, బొల్లిముంత, ధనికొండ, చక్రపాణి, బైరాగి, హితశ్రీ, మాగేఖలే, మునివల్లె రాజు, వాసిరెడ్డి సీతాదేవి, కె.శివారెడ్డి, మోదుకూరి జాన్సన్ ప్రభృతులు తెనాలివారే. తొలి అభ్యుదయ రచయితల మహాసభ 1942లో తెనాలిలోనే నిర్వహించారు. ఒకప్పుడు ఆంధ్రదేశ ంలో ప్రసిద్ధ ప్రచురణకర్తలైన ఓరియ ంట్, జాకోబిన్, శ్రీరామా, కవి రాజ ప్రచురణలు తెనాలి వారివే.

### కళలకు కాణాచి తెనాలి

అన్నిరంగాల్లో తనదైన ముద్ర వేసుకున్న తెనాలికి కళలతో కూడా ఎంతో అనుబంధముంది. మహానటులైన మాధవపెద్ది, అద్దంకి, పులిపాటి, గుమ్మడి, జగ్గయ్య, అబ్బూరి, గగ్గయ్య, గోవిందరాజులు, స్థానం, కాంచనమాల, జమున, శ్రీరంజని, కృష్ణ వంటి శతాధిక నటులు తెనాలి ప్రాంతం నుండే వచ్చారు. 1812లో పెదరావూరుకు చెందిన నారుమంచి జానకిరామయ్య తిరువాయూరు వెళ్లి త్యాగరాజస్వామి వద్ద నరళీన్వరాలు నేర్చుకున్నారు.

1912వ సంవత్సరంలో తొలి నాటక సమాజాన్ని మోరంపూడిలో కొంగర సీతారామయ్య(కొంగర జగ్గయ్య తండ్రి) ఏర్పాటు చేశారు. 1929లో ఆంధ్రనాటక కళాపరిషత్ ఆవిర్భావం తెనాలిలోనే జరిగింది. అంతెందుకు తెనాలికి ఆంధ్రాప్యారిస్ అనే పేరు కాంచనమాలతోనే స్థిరపడింది.



విడుబ్రోలు(పొన్నూరు) మంచి విజయవాడ, గూడూరు వైపులకు వెళ్ళు బండి వివరములు

| ట్రైన్ నెం | ట్రైన్ పేరు | టైము |
|---|---|---|
| 6043 | చెన్నై-కాకినాడ (సర్కార్) | 00.03 |
| 7487 | తిరుపతి-విశాఖపట్నం (తిరుమల) | 01.03 |
| 3352 | అలెప్పీ-ధన్‌బాద్-టాటానగర్ | 05.17 |
| 7229 | కోచువెలి-హైదరాబాద్ (శబరి) | 06.20 |
| 441 | ఒంగోలు-విజయవాడ | 07.27 |
| 273 | తిరుపతి-కాకినాడ (కోచి) | 09.23 |
| 477 | గూడూరు-విజయవాడ | 11.11 |
| 7405 | తిరుపతి-నిజామాబాద్ (కృష్ణ) | 11.23 |
| 6093 | చెన్నై-లక్నో (మంగళ,శుక్ర,శని) | 11.36 |

# అన్నకు తోడుగా సిటీకి డిప్యూటీ మేయర్‌గా మురళీమోహన్

(ప్రభాతవార్త/గుంటూరు)

రాజకీయాల్లో రాణించడం ఒక ఎత్తు...ప్రజాప్రతినిధిగా తన ప్రతిష్టనుఇనుమడింపచేసుకోవడం ఒక ఎత్తు. ప్రస్తుత రాజకీయాల్లో ఈ రెండింటినీ సమపాళ్లలో జీర్ణించుకున్న వారే రాజకీయాల్లో రాణించగలుగుతారన్నది నిర్వివాదాంశం. నగర డిప్యూటీ మేయర్ తాడిశెట్టి మురళీ మోహన్‌ను పరిగణనలోనికి తీసుకుంటే తన సోదరుడు తాడిశెట్టి వెంకటరావు ప్రత్యక్ష ఎన్నికల్లో ప్రవేశించినప్పటి నుంచి గుంటూరు రాజకీయా లను ఔపోసన పట్టారు. సివిల్ ఇంజనీరింగ్ పట్టభద్రు డయిన మురళి అన్నకు చేదోడు వాదోడుగా అన్న అడుగు జాడల్లోనే నడుస్తూ రాష్ట్రంలోనే మొట్టమొదట ఏకగ్రీవంగా ఎన్నికైన కార్పొరేటర్‌గా రికార్డు సృష్టించారు. ప్రత్యక్షంగా ఎన్నికల్లో పోటీ చేసేందుకు నామినేషన్ దాఖలు చేసినా ప్రత్యర్థులుగా బరిలోనిలిచిన వారు ఒక్కొక్కరుగా ఉపసంహరించుకోవడంతో మురళి ఎన్నిక అనివార్యం అయింది. కార్పొరేటర్‌గా ఎన్నికైన నాటినుంచి నగర మేయర్ పదవి అనూహ్యరీతిన చేజారిన మురళికి డిప్యూటీ మేయర్‌పదవి వరించింది.

కార్పొరేషన్ ఎన్నికలురాష్ట్ర స్థాయిలో సంచలనం సృష్టిస్తే మురళి డిప్యూటీ మేయర్‌గా ఎన్నిక కూడా అంతే సంచలనం సృష్టించింది. మెజారిటీకార్పొరేటర్ల మద్దతుతో డిప్యూటీ మేయర్‌గా పదవిని పొందిన మురళి అంతకు ముందే తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల సలహామండలి సభ్యునిగా నియమితులయ్యారు. బహుళ జాతి సంస్థల పారిశ్రామిక వేత్తలు సభ్యులుగా ఉన్న ఈ కమిటీలో మురళి నియామకం కూడా ప్రతిష్టాత్మకమే. గుంటూరు-2వ



నియోజకవర్గం కాంగ్రెస్ అభ్యర్థిగా తాడిశెట్టి వెంకటరావు ఎన్నికల బరిలోనికి దిగినప్పటినుంచి చాపకిందనీరులా మురళి తన ఎన్నికల వ్యూహం అమలుచేశారు. ఓ వక్క అన్న ప్రచారంలోనిమగ్నం అయితే గ్రామాల వారీగా సామాజిక వర్గాలను సమీకరించి సోదరుని విజయానికి బాటలువేశారు. 15వేల ఓట్లమెజార్టీలోవెంకటరావు సాధించిన విజయంలో మురళి అమలు చేసిన ఎన్నికల వ్యూహమే ప్రధానం అని చెప్పకతప్పదు.

అత్యంత ఆప్త మిత్రులుగా కొనసాగే ఈ అన్నదమ్ములిద్దరిలో ఇప్పటికీ ఎటువంటి చిన్న విబేధాలు లేవు. తన సోదరుణ్ణి డిప్యూటీమేయర్‌గా ఎంపిక చేయించేందుకు చివరకురాష్ట్ర ముఖ్యమంత్రి వై ఎస్, పిసిసి అధినేత కె.కేశవరావుల సమక్షంలో జరిగిన పంచాయితీలో కూడా తాడిశెట్టి ఏకాకిగా నిలిచి తన వాదననువినిపించారు. తనకు మద్దతునిస్తున్న కార్పొరేటర్లనుపేరేడ్ చేయించి చివరకు తన తమ్ముని స్థానం పదిలంచేశారు.

ఏకగ్రీవంగా ఎన్నికైనప్పటికీ కేవలండివిజన్‌కే పరిమితం కాకుండా నగర పరిధిలో తన కార్యక్రమాలనుమురళి విస్తృతపరిచారు. క్రీడలు, సాహిత్యం, సామాజికసేవా కార్యక్రమాలపై మక్కువ కలిగిన డిప్యూటీమేయర్ నగరపరిధిలోఏచిన్న కార్యక్రమానికి అయినా క్రమం తప్పక హాజరవడం ఆయనకు అలవాటుగా మారింది. డివిజన్‌లో ఉన్నరోడ్లన్నీ సిమెంటురోడ్లుగా ఆధునీకరించడం, ప్రతివీధికీ విద్యుత్ సరఫరా, వీధిలైట్లు, హైమాస్ట్ లైట్లుఏర్పాటు చేయించడం తక్షణ కర్తవ్యంగా భావించి పూర్తిచేశారు. డివిజన్ పరిధిలో భూగర్భ డ్రైనేజిని సమర్థవంతంగా అమలుచేయడంలో మురళీ మోహన్ కృతకృత్యుల య్యారు. డివిజన్‌ను ఆదర్శవంతంగా తీర్చిదిద్దడంతో పాటు నగర పరిధిలో ఎంపికయినా ఇందిరమ్మ ఆదర్శ వార్డుల్లో మౌలిక వసతుల ఏర్పాటుకుకూడా డిప్యూటీ మేయర్ శక్తి వంచన లేకుండా కృషిచేస్తున్నారు. సోదరులిద్దరిపై అవాస్తవాల ప్రచారం విస్తృత స్థాయిలో జరుగుతున్నా వాస్తవికత కొరవడిన ప్రచారాలకు భయపడాల్సిన పనిలేదని

■ మిగతా 87లో

# సిటీకి డిప్యూటీ మేయర్‌గా మురళీమోహన్



86వ పేజీ తరువాయి

కార్యకర్తలను సముదాయిస్తూ డివిజన్‌కార్పొరేటర్లతో ప్రతిరోజు పర్యటనలుచేసి ప్రజలనుంచి అర్జీలను స్వీకరించడం, సమస్యల పరిష్కారానికి అధికారులతోచర్చలు జరపడం ఆయన దినచర్యగా పెట్టుకున్నారు. నగరపరిధిలో కార్యక్రమాలను పరిశీలించుకుంటూ గుంటూరు-2 వ నియోజకవర్గంలోని గ్రామీణ ప్రాంతాల్లో కూడా సమస్యలను పరిష్కరించడంలో మురళి తన సోదరుని ఆదేశాలను ఎప్పటికప్పుడు అమలు చేస్తున్నారు. ఎన్నికల సమయంలో గ్రామీణ ప్రాంతాల్లో ఎగిసి పడిన వైషమ్యాలను సర్దుబాటు చేయడంలో మురళి తన చాతుర్యం ప్రదర్శించారు. ఇరువర్గాలతో సహపంక్తి భోజనాలు ఏర్పాటుచేసి తానుస్వయంగా పాల్గొని శాంతి యుత సహజీవనానికి మార్గం సుగమం చేశారు.

గుంటూరు మం డలపరిధిలోని 22 గ్రామాలతో పాటు వట్టిచెరుకూరు మండల పరిధిలోని గ్రామాలు కూడా గుంటూరు-2 వనియోజకవర్గంలో ఉండటంతో తర చూ ఆ గ్రామాలను సందర్శించడం పార్టీపరమైన కార్య క్రమాల్లో పాల్గొని కార్యకర్తలను ఉత్తేజపరచడంలోమురళి తనశైలిని ప్రదర్శించారు. నగర పరిధి లో కీలక సమస్యలైన తాగునీరు, రోడ్ల నిర్మాణం, నగర సుందరీకరణ కార్యక్రమాలకు ప్రాధాన్యతనిచ్చే మురళి నియోజకవర్గ పరిధిలో పార్టీ కార్య క్రమాలను విస్తృతంగా అమలు చేయడంలో అన్నకు మరింత పేరు తెచ్చిపెట్టారు. కీలక అభివృద్ధి అంశాలకు సంబంధించిన సమా వేశాల్లో నగర ప్రజల ప్రయోజనాలకే మురళి ప్రాధాన్యతనిచ్చారు. నగరంలో సోదరుడు ఎమ్మెల్యే వెంకటరావు ప్రతిపాదించిన మెగా ప్రాజెక్టుల సాధనలో అన్నకు చేదోడు వాదోడుగా ఉంటూ ఆయన అడుగుజాడల్లో అన్నకుతగ్గ తమ్ముడన్న పేరును సాధించారు. ముందుగా తన డివిజన్‌కు 24 గంటల నీటి సరఫరాను సాధిం చారు. 1200 రూపా యలకే కుళాయి పథకంలోతన డివిజన్‌లో అత్యధికంగా నిరుపేదల కుళాయిల పథకాన్ని అమలుచేశారు. రాజీవ్ గృహకల్పతో పాటు నియోజకవర్గ అసైన్‌మెంట్ కమిటీ సమావేశాల్లో నియోజకవర్గ పరిధిలోని అర్హులైన లబ్ధిదారులకు ఇళ్లపట్టాలను మంజూరు చేయించడంలో కూడా మురళి అధికారులతోజరిపిన చర్చలు సత్ఫలితా లిచ్చాయి. రాజధాని స్థాయిలో సాధించాల్సిన పథకాలు, ప్రణాళికలను ఎమ్మెల్యే మంత్రులు, ఉన్నత స్థాయి అధికారులతో చర్చలు జరిపి సాధిస్తుంటే, క్షేత్ర స్థాయిలో అమలుకు సోదరుడు డిప్యూటీ మేయర్ మురళి ఎమ్మెల్యే బాధ్యతలు స్వీక రించారు. ఏడాది కాలంలోనే ఎమ్మెల్యే సాధించిన అద్వితీయ ప్రగతిలో ఆయన సోదరునికీ సమభాగం ఉందనడంలో అతి శయోక్తిలేదు.

అనునిత్యం సమస్యలు స్వాగతిస్తున్నా ఇటు నగర పరిధిలోని సమస్యలతో పాటు నియోజకవర్గ సమస్యలపై దృష్టిసారించి అధికారులను సమన్వయం చేసుకుంటూ సత్ఫలితాల దిశగా కొనసాగుతున్న మురళి పేరు తెచ్చుకున్నారు. సాధించింది స్వల్పమే. సాధించాల్సింది ఎంతో ఉంది సోదరుడు ఎమ్మెల్యే, జిల్లా అధికారుల తోడ్పాటుతో తన హయాంలో నగర అభివృద్ధికి శక్తివంచన లేకుండా కృషిచేస్తానని చెప్పుతున్నారు. డివిజన్ కార్పొరేటర్‌గాను, టిటిడి సలహా కమిటీ సభ్యునిగాను, నగర డిప్యూటీ మేయర్‌గానేకాకుండా కార్మికలోకం శ్రేయస్సుకోసం ఐ ఎన్ టి యు సి అనుబంధ సంఘం అయిన మెడికల్ అండ్ హెల్త్, ఆర్టీసీ ఉద్యోగుల రీజినల్ సంఘాలకు గౌరవాధ్యక్షునిగా కూడా వ్యవ హరిస్తున్నారు. కాంగ్రెస్ పార్టీలోనే పుట్టి పెరిగిన తాడిశెట్టి కుటుంబంలో పార్టీ పరమైన పదవులనుకూడా తమ అనుయా యులకు దక్కించు కోవడంలో తాడిశెట్టి సోదరులు తమకు తామే సాటి నిరూపించుకున్నారు.



రేషన్‌కార్డుల వ్యవస్థపై కార్డుల కేంద్రాన్ని సందర్శించి జాయింట్‌కలెక్టర్ రాహుల్‌తో చర్చలు జరుపుతున్నడిప్యూటీ మేయర్ తాడిశెట్టిమురళి.

### విద్యాకుసుమాలను విరబూయిస్తున్న

# మాజేటి గురవయ్య డిగ్రీ కళాశాల



అత్యున్నతమైన కంప్యూటర్ లాబ్

(ప్రభాతవార్త-గుంటూరు)

అత్యున్నత స్థాయి విద్యను అందించే ఉద్దేశ్యంతో 1994లో నగరంనడిబొడ్డున శ్రీ మాజేటి గురవయ్య డిగ్రీ కళాశాలను స్థాపించారు. ఈ ప్రాంత విద్యావసరాన్ని దృష్టిలో పెట్టుకుని 1945లోనే శ్రీమాజేటి గురవయ్య హైస్కూల్‌ను ప్రారంభించి నిరంతరం విద్యాసేవలను విస్తరిస్తూవస్తోంది. కళాశాల సెక్రటరీ అండ్ కరస్పాండెంట్ ఎం.వి.ఆర్.కె.ముత్యాలు, అధ్యక్షులు గొడవర్తి నత్యనారాయణ, పాలక వర్గం కళాశాల అభివృద్ధికి నిరంతరం పాటువడుతోంది. ఆనాడు మూడు కోర్సులతో ప్రారంభమైన డిగ్రీ కళాశాల నేడు ఆరు కోర్సులను అందిస్తూ వందలాది మంది విద్యార్ధులకు విద్యాబుద్దులు నేర్పుతోంది. 130 సంవత్సరాల చరిత్ర కలిగిన హిందూ కళాశాల, హైస్కూల్ కౌన్సిల్ చరిత్రలో మాజేటి గురవయ్య కళాశాల స్థాపన చాలా ప్రముఖమైనది. కంఠంరాజు కొండూరు గ్రామానికి చెందిన మాజేటి గురవయ్య అనే ధార్మికుని పేరుపై ఈ కళాశాల స్థావన జరిగింది. నగరంలోనే కాక చుట్టూ ప్రక్కల ఉన్న గ్రామాల విద్యార్ధులకు. సేవలు అందించేందుకు జూనియర్ కళాశాల, డిగ్రీ కళాశాలలుగా ఆవిర్భావం చెందాయి. బి.కాం(జనరల్), బి.ఎస్.సి.(ఎం.పి.సి.), ఎం.పి.సి.ఎస్., ఎం.ఎస్.సి.ఎస్., ఎం.ఇ.సి.ఎస్., ఎం.పి.ఇ., కోర్సులను ఇంగ్లీషు మీడియంలో నిర్వహిస్తోంది. విశాలమైన స్థలంలో కళాశాల స్థాపన జరిగింది. రెండు ఫిజిక్స్ లాబ్‌లు, రెండు కెమిస్ట్రీ లాబ్‌లు, ఎలక్ట్రానిక్స్ లాబ్, అత్యున్నతమైన గ్రంధాలతో కూడిన పెద్ద గ్రంథాలయం, రెండు కంప్యూటర్ లాబ్‌లతో కళాశాలను ఆధునిక వసతులతో అన్ని సౌకర్యాలతో ఏర్పాటు చేసారు. నిష్ణాతులైన అధ్యాపకులు అత్యుత్తమ శిక్షణ ఇస్తూ యూనివర్సిటీ స్థాయిలో విద్యార్ధులు ర్యాంకులు తెచ్చుకునేలా కృషి చేస్తున్నారు. కళాశాల ఎన్.ఎస్.ఎస్. విభాగం సేవా కార్యక్రమాల నిర్వహణలో ముందంజలో ఉంది. కళాశాల విద్యార్ధులు, అధ్యాపకులు పలు జాతీయ స్థాయి సదస్సులో పాల్గొని నగరానికి పేరు తెస్తున్నారు. కళాశాల అభివృద్ధికి సహకరించేందుకు 1997లో పూర్వ విద్యార్ధుల సంఘం ఏర్పడింది. ఇటీవల యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ కళాశాల అందిస్తున్న సౌకర్యాలు, కోర్సులు, నిర్వహణ తదితర అంశాలను పరిశీలించి యాడ్ ఆన్ కోర్సుల ప్రారంభానికి అనుమతి ఇచ్చింది. ఈ ఏడాది ఆచార్యనాగార్జునవిశ్వవిద్యాలయం పర్మినెంట్ ఆఫిలియేషన్‌ను ఇచ్చింది. పేద విద్యార్ధులకు ప్రత్యేక ఉపకార వేతనాలు అందిస్తూ వారి విద్యాభివృద్ధికి తోడ్పాటును అందిస్తోంది. క్రీడారంగంలో సైతం కళాశాల విద్యార్ధులు గ్వాలియర్‌లో జరిగిన ఆలిండియా ఇంటర్ యూనివర్సిటీ స్పోర్ట్స్ మీట్, ఆల్ ఇండియా క్రాస్ కంట్రీ ఛాంపియన్ షిప్, ఆల్ ఇండియా ఎన్.సి.సి.మీట్, ఆలిండియా ఇంటర్ యూనివర్సిటీ అథ్లెటిక్ మీట్, సౌత్ జోన్ నేషనల్ ఛాంపియన్, ఆలిండియా ఉమెన్ నేషనల్, వర్సిటీ స్థాయిలో జరిగిన పలు పోటీల్లో పాల్గొని క్రీడారంగానికే వన్నె తెచ్చారు.



శ్రీమాజేటి గురవయ్య కళాశాల భవనం

ఈ కళాశాలలో విద్యనభ్యసించిన వారిలో పలువురు ఉన్నత స్థాయి పదవులలో కొనసాగుతున్నారు. ప్రిన్సిపాల్ డి.కృష్ణమూర్తి, వైస్‌ప్రిన్సిపాల్ కె.వి.శ్రీనివాసరావు, అత్యుత్తమ నైపుణ్యత ఉపాధ్యాయ బృందం నేతృత్వంలో కళాశాల దినదినాభివృద్ది చెందుతూ వస్తోంది.

### పారిశ్రామిక రంగంలో

# ప్రగతిపథాన 'కుమార్ పంప్స్'



ఉత్తము పారిశ్రామికవేత్తగా అవార్డు అందుకుంటున్న 'కుమార్' సుబ్రమణ్యం (ఫైల్‌ఫోటో)

(ప్రభాతవార్త, తెనాలి)

సహజ వనరులకు కొదవలేని తెనాలికి పారిశ్రామికంగా తగిన గుర్తింపు లేదనే లోటును 'కుమార్'సంస్థ తీరుస్తోంది. జాతీయ వాణిజ్యపటంలో తెనాలికి ఒక విశిష్టతను కలిగిస్తోంది. 'మినీ జపాన్'గా పేరొందిన కోయంబత్తూరుతో సహా అనేక రాష్ట్రాల్లోని నీటి పంపుల మార్కెట్‌ను 'కుమార్' ఉత్పత్తులు క్రమంగా ఆక్రమిస్తున్నాయి. 1973లో ఒక సాధారణ సంస్థగా ఆవిర్భవించిన కుమార్‌పంప్స్ ఏ ఏటికా ఏడాది ఆధునిక పరిజ్ఞానంతో విస్తరిస్తూ ప్రస్తుతం 33వ సంవత్సరంలోక అడుగిడింది. స్వయంకృషితో, పట్టుదలతో ప్రయత్నిస్తే ఎలాంటి విజయాలైనా అలవోకగా సాధించవచ్చని. చెప్పేందుకు సుబ్రమణ్యం ప్రత్యక్ష ఉదాహరణ. ఎలాంటి సాంకేతిక విద్య, పూర్వానుభవం లేకుండా విద్యుత్‌తో నీటి పంప్‌సెట్ల తయారీకి పూనుకోవటమే విశేషమైతే ఆ రంగంలో జాతీయస్థాయిలో తిరుగులేని శక్తిగా ఎదగటం వెనుక సుబ్రమణ్యం అవిశ్రాంతమైన పరిశ్రమ, పట్టుదల ఉన్నాయి.

ఇక్కడికి సమీపంలోని చుండూరు మండల గ్రామం యడ్లపల్లికి చెందిన కొత్త సుబ్రమణ్యం అందరిలానే గ్రాడ్యుయేషన్ పూర్తిచేశారు. ఎంతోమందికన్నా భిన్నంగా ప్రభుత్వ ఉద్యోగం కోసం ఆశించకుండా *(మిగతా 96వ పేజీలో..)*

# మాతృభూమిపై మమకారానికి దర్పణం ఎన్నారై అకాడమీ ఆఫ్ సైన్సెస్



భవిష్యత్ వైద్యులుకు పాఠాలు చెబుతున్న ప్రొఫెసర్

టూరిస్ట్‌గా అమెరికాలాంటి దేశాలకు వెళ్లొచ్చిన కొందరు మనచుట్టూ ఉన్న పరిస్థితులను చూసి 'వెధవ ఇండియా... ఇదే అమెరికాలో అయితే ఇలా ఉండదు' అంటూ దాబునరిని ప్రదర్శిస్తూ మాతృభూమిని కించవరచేవారు నిత్యం మనకు తటస్థపడుతూనే ఉంటారు.

కానీ, గుంటూరు, కృష్ణాజిల్లాలకు చెందిన కొందరు ప్రవాస భారతీయులు అమెరికాలో స్థిరపడినా జన్మభూమిపై మమకారంతో, సేవాదృక్పథంతో విజయవాడ, గుంటూరు నగరాల నడుమ మంగళగిరి వద్ద కోట్లాది రూపాయలతో ఎన్నారై అకాడమీ ఆఫ్ సైన్సెస్ అనే సంస్థను స్థాపించారు. పేదలకు ఉచితంగానూ, నామమాత్రంగానూ ఫీజులు తీసుకుంటూ, సూపర్‌స్పెషాలిటీ వసతులతో నిష్ణాతులైన వైద్య సిబ్బందిచే సేవలందించే ఎన్నారై జనరల్ ఆసుపత్రిని స్థాపించారు. ఇదే ప్రాంగణంలో వైద్యకళాశాలను ఏర్పాటు చేశారు. ప్రపంచ వ్యాప్తంగా స్థిరపడిన ప్రవాస భారతీయులకు ఆదర్శంగా ఇక్కడ ఏర్పాటైన ఈ 'ఆధునిక దేవాలయం' గురించి మరిన్ని వివరాలు ఇలావున్నాయి..

ఎన్నారై జనరల్ ఆస్పత్రి : వాయు, ధ్వని కాలుష్యాలకు దూరంగా, ప్రశాంత వాతావరణంలో ప్రవాస భారతీయులు గుంటూరుజిల్లా, మంగళగిరి మండలం, చినకాకాని గ్రామంలో ఎన్నారై జనరల్ ఆసుపత్రి పేరిట నిర్మించిన ఆసుపత్రి పేద, మధ్యతరగతి ప్రజలకు అత్యంత తక్కువ ఖర్చుతో, అత్యున్నత ప్రమాణాలతో వైద్యసేవలందిస్తోంది. గుంటూరు జిల్లా వాసులకే కాక చుట్టువక్కల జిల్లా ప్రజలకు కూడా ఈ ఆసుపత్రి అన్ని వైద్యవిభాగాల్లో సేవలందించడం అభినందనీయం.

వైద్య విద్యలో వివిధ విభాగాల్లో నైపుణ్యం సాధించి విదేశాల్లో స్థిరపడిన గుంటూరు, కృష్ణా జిల్లాలకు చెందిన కొందరు ప్రవాస భారతీయులు మాతృదేశానికి, పుట్టి పెరిగిన ప్రాంతానికి తమవంతు కర్తవ్యంగా వైద్య సేవలతోపాటు వైద్యవిద్యను కూడ అందించాలని సంకల్పించారు. నిరుపేదలు సహా అన్ని వర్గాల వారికి ఉన్నత ప్రమాణాలతో కూడిన వైద్య చికిత్సలు అందుబాటులోకి తేవాలని భావించారు. అనుకున్నదే తడవుగా ఆ ప్రవాస భారతీయులు ఎన్నారై అకాడమీ ఆఫ్ సైన్సెస్ అనే పేరుతో సంస్థను ఏర్పాటు చేసి ఎగ్జిక్యూటివ్ కమిటీని నియమించారు. ఆ కమిటీలో అధ్యక్షులుగా డాక్టర్ సుదర్శన్ అక్కినేని, ఉపాధ్యక్షులుగా డాక్టర్ ప్రసాద్ బిఆర్ నీరుకొండలకు సారధ్య బాధ్యతలు అప్పగించారు. అలాగే కార్యదర్శిగా డాక్టర్ నరసరాజు మంతెన, సహాయ కార్యదర్శిగా డాక్టర్ అప్పారావు ముక్కామల, కోశాధికారిగా డాక్టర్ ఉపేంద్రనాథ్ నిమ్మగడ్డలకు ఆయా బాధ్యతలు అప్పగించారు. అలాగే డాక్టర్ శ్రీనివాస్ కొత్తవల్లి, డాక్టర్ హనుమయ్య బండ్ల, డాక్టర్ రామకృష్ణ పిన్నమనేని, డాక్టర్ సాయి రమేష్ బిక్కిన, డాక్టర్ రాఘవరావు పోలవరపులకు కార్యవర్గ సభ్యులుగా బాధ్యతలు అప్పగించారు. ఇప్పటికీ వారే ఆయా బాధ్యతలలో కొనసాగుతున్నారు. అలాగే బోర్డు సభ్యులుగా డాక్టర్ మణి అక్కినేని, డాక్టర్ రవీంద్రనాద్ ఆలపాటి, డాక్టర్ సురేశ్ అన్నే, డాక్టర్ ప్రతాప్ అరవపల్లి, డాక్టర్ సుజాత నీరుకొండ, డాక్టర్ రమేశ్ వీరగంధం తదితరులు వ్యవహరిస్తున్నారు.

వైద్యకళాశాలల్లోని వివిధ కోర్సులు:

ఇక్కడి వైద్యశాలలో ఎంబిబిఎస్‌తోపాటు ఎమ్మెస్సీ (బయోకెమిస్ట్రీ), ఎమ్మెస్సీ (మైక్రోబయాలజీ), బిఎస్సీ (నర్సింగ్), బిఎస్సీ (లాబ్ టెక్నీషియన్), తదితర కోర్సులు ఉన్నాయి. అంతేకాక పారామెడికల్ కోర్సులు డిఎంఎల్‌టి, రేడియోలజీ, ఆప్తాల్మిక్ అసిస్టెంట్, బ్లడ్ బ్యాంకు టెక్నీషియన్, ఇసిజి టెక్నీషియన్ వంటి డిప్లొమా కోర్సులు కూడా ఇక్కడ నిర్వహిస్తున్నారు. కాగా, ఈ మెడికల్ కాలేజి కోర్సులకు డీన్‌గా డాక్టర్ కె.అంజిరెడ్డి వ్యవహరిస్తున్నారు.

ఆస్పత్రిలో వైద్య సేవలు: ఇక 250 పడకలున్న ఈ ఆస్పత్రిలో అటు ధనికులకేకాక ఇటు నిరుపేదలకు కూడా ప్రామాణికమైన వైద్య సేవలందిస్తున్నారు. ఇన్ పేషెంట్లకు, ఔట్ పేషెంట్లకు 24 గంటలూ వైద్య చికిత్సలు అందించేందుకు ఇక్కడి సిబ్బంది సిద్ధంగా ఉండటం విశేషం.

తమ సేవలు మారుమూల ప్రాంతాలకు సైతం అందాలనే ఉద్దేశ్యంతో మూడు ప్రాంతాల్లో హెల్త్ సెంటర్లు ప్రారంభించారు. రూరల్ హెల్త్ సెంటర్ పేరిట తుళ్లూరు మండలం పెదవరిమి గ్రామంలోనూ, దుగ్గిరాల, వెనిగళ్ళ, నంబూరులలోనూ, అర్బన్ హెల్త్ సెంటర్ పేరుతో విజయవాడ కృష్ణలంకలోని రాణిగారితోటలో ఆరు పడకలున్న ఓ హెల్త్ సెంటర్‌ను కూడా నిర్వహిస్తూ వైద్యసేవలలో పాల్గొంటూ తమ నైపుణ్యం పెంచుకుంటున్నారు. ఈ కారణంగా వైద్యవిద్యార్థులకు గ్రామీణ, పట్టణప్రాంతాల రోగులతో ప్రత్యక్షసంబంధం ఏర్పడుతోంది. ఇది భవిష్యత్తులోవారి వైద్యవృత్తికి ఎంతో మేలు చేస్తుంది. ఈ కేంద్రాల్లో రోగులకు తక్షణ అత్యవసర కేసులను అవసరమైతే ప్రధాన ఆస్పత్రికి తరలించేందుకు అంబులెన్స్ సౌకర్యంకూడా ఉంది.

ఇక ప్రధాన ఆస్పత్రిలో అన్ని వర్గాల వారికి సాధారణ వైద్యంతోపాటు సాధారణ శస్త్ర చికిత్స, స్త్రీల వ్యాధులు, ఎముకలు, చర్మ, మూత్రకోశ, పంటి వ్యాధులకు చికిత్సలే కాక. చెవి, ముక్కు, గొంతు వ్యాధులు, చిన్నపిల్లల వ్యాధులు, మధుమేహం, రక్తపోటు, ప్రత్యేకించి ఉబ్బసం, రోగులకు చక్కని చికిత్స అందిస్తున్నారు. కంటి జబ్బులకు చికిత్స, శుక్లాలకు శస్త్రచికిత్సలు నిర్వహిస్తున్నారు. అతిత్వరలో ఇక్కడ కార్డియాలజీ విభాగం కూడా ప్రారంభించనున్నారు. అత్యవసర కేసులు అన్నివేళలా చూడడం, ఉచిత బెడ్ సౌకర్యం, అతి తక్కువ ధరలకు మందులు, అధునాతన పరికరాలు ఉపయోగించడం, రకరకాల వ్యాధి నిర్ధారణ పరీక్షలు తక్కువ ధరలకే చేయడం ఈ ఆస్పత్రి ప్రత్యేకతలుగా చెప్పవచ్చు. మాతా శిశు సంక్షేమం కోసం ఇక్కడి వైద్యులు ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నారు. కాన్పు కేసులు అతితక్కువ ఖర్చుతోనిర్వహించటం ప్రశంసనీయం. ఇతర కార్పొరేట్ ఆస్పత్రులతో పోల్చుకుంటే ఈ ఆస్పత్రిలో ఖర్చులు అతితక్కువ. కాగా, డాక్టర్లు, ఇతర సిబ్బంది కలిసి దాదావు 550 మంది ఇక్కడ సేవలందిస్తున్నారు. ఈ ఆనువత్రి ద్వారా వైద్య సేవలకు సబంధించి వివిధ పథకాలు కూడా అమలుచేస్తున్నారు.



ఆసుపత్రిలో రోగులను పరామర్శిస్తున్న ప్రముఖులతో 'ఎన్నారై' సారధులు

రికార్డుస్థాయిలో కంటి వైద్యం

నేత్ర రోగులకు ఉత్తమ వైద్యం అందించటంలో ఈ ఆస్పత్రికి మంచి పేరు తెచ్చిపెట్టింది. డిస్ట్రిక్ట్ బ్లయిండ్ కంట్రోల్ సొసైటీ (డిబిసిఎస్)ద్వారా వచ్చే కంటి రోగులకు ఇప్పటికే సుమారు 40 మందికి శస్త్ర చికిత్స చేశారు. అలాగే నిత్యం ఇక్కడ రకరకాల కంటి వ్యాధులకు చికిత్సలు చేస్తున్నారు

బ్లడ్ బ్యాంకు: కోస్తా ప్రాంతంలోనే ప్రత్యేకమైన బ్లడ్ బ్యాంకు ఉందిక్కడ. ఈ బ్లడ్ బ్యాంక్‌లో అన్ని గ్రూపుల రక్తం భద్రపరచటంతోపాటు ప్లాస్మా బ్లడ్ సెల్స్ విడివిడిగా నిల్వచేయడం ఒక ప్రత్యేకత. అవసరైన రోగులకు వాటిని ఉపయోగిస్తారు.

ఈ ఆస్పత్రి నగర పరిధికి చాలా దూరంగా ఉన్నందున రోగులు ఎలాంటి అసౌకర్యానికి గురికాకూడదని, వైద్య విద్యార్థులకు తరగతులకు అంతరాయం ఏర్పడకూడదనే ఉద్దేశ్యంతో వైద్యులు, విద్యార్థుల రాకపోకలకుగానూ మేనేజ్‌మెంట్ వారు విజయవాడ నుండి మూడు బస్సులు, గుంటూరు నుంచి మూడు బస్సులు నడుపుతున్నారు.

ఇలా అన్నివర్గాలవారికి అనుకూలమైన వైద్యసేవలందిస్తున్న ఎన్నారై జనరల్ హాస్పిటల్ యాజమాన్యం బహుదా ప్రశంసనీయులని చెప్పవచ్చు

తాజాగా కార్డియాలజీ విభాగాన్ని, న్యూరో విభాగాన్ని కూడ ప్రారంభించిన అకాడమీవారికి ప్రజలు అభినందనలు తెలియజేస్తున్నారు.

వ్యవసాయ రంగంలో

# పెరిగిన పంపు సెట్ల ప్రాధాన్యత



పంపుసెట్లతో సాగవుతున్న వరిపొలం

(ప్రభాతవార్త-మరంపల్లి)

రాను రాను మండలంలో మట్టపల్లి, గుండ్లపల్లి మేజర్ల క్రింద 28 వేల ఎకరాలు ఉండగా కేవలం 18 వేల ఎకరాలకే సాగు నీటి సౌకర్యం ఉంది. మిగతాదంతా వరుణుడి కరుణా కటాక్షంపై ఆధారపడి ఉంది. అందులో కాల్వలు, చెరువుల ద్వారా సాగయ్యేది. 8వేల ఎకరాలు మాత్రమే కాగా మరో 10 వేల ఎకరాల భూమిని రైతులు సొంత పెట్టుబడులతో బోర్లు, లేదా బావులను ఏర్పాటు చేసుకొని పంపు సెట్ల ద్వారా సాగు చేస్తున్నారు. 60 శాతం భూగర్భ జలాలతో సాగు అవుతుంది. మెట్ట ప్రాంతాలలో వ్యవసాయ అభివృద్ధికి వంపుసెట్లు మూలాధారం అవుతున్నాయి. ఆకాశ గంగను భగీరథుడు నేలమీదికి తెచ్చాడని పురాణాలలో చెప్పింది నిజమో కాదో కాని భూగర్భ జలాన్ని పైకి తెస్తున్నది మాత్రం విద్యుత్ శక్తి మోటార్లు అని చెప్పవచ్చు. మరంపల్లి మండలంలో 5.500 పైగా విద్యుత్ మోటర్లు ఉన్నాయని అంచనా. వ్యవసాయానికి 9 గంటల విద్యుత్ సరఫరా ఖచ్చితంగా అమలు చేయాలని రైతులు డిమాండ్ చేస్తున్నారు. రైతు అమాయకత్వం, తగినంత విద్య లేకపోవటంతో కొన్ని నిర్వహణ లోపాలు జరుగుతున్నాయి. మండలంలో అధిక శాతం గిరిజన రైతులు ఉండటం మూలంగా వ్యాపారులు కంపెనీ *(మిగతా 92వ పేజీలో..)*

# గెలాక్సీ గ్రానైట్ గడ్డ.. చీమకుర్తి

(ప్రభాతవార్త- చీమకుర్తి)

బ్లాక్ గెలాక్సీ గ్రానైట్. ప్రపంచంలో మరెక్కడా దొరకని అపురూపమైన ఖనిజం. అది లభించడం చీమకుర్తికి వరం. డబ్బు వరదలా వస్తోంది. అల్పాదాయ వర్గాల ప్రజల జీవనస్థితులు అనతికాలంలో చకచకా మెట్లెక్కాయి. చీమకుర్తి ఆర్థిక చిత్రపటం కేవలం 15 ఏళ్ళలో ఊహించనిరీతిలో పైకి ఎగబాకింది. ప్రస్తుతం చీమకుర్తి మండలంలో చీమకుర్తి, ఆర్.ఎల్.పురం, బూదవాడ పంచాయతీల పరిధిలో 50 గ్రానైట్ క్వారీలు గెలాక్సీని వెలికితీసే ప్రయత్నాలలో నిమగ్నమయ్యాయి. 1985లో చీమకుర్తిలో గ్రానైట్ తవ్వకాలు ఆరంభమై, నష్టాలతో 1988 వరకూ ఆగిపోయాయి. 1989 నుంచి పునఃప్రారంభమైన ఈ మార్కెట్ నేటివరకూ వెనుదిరగలేదు. 'గెలాక్సీ' అంటే 'పాలపుంత'. నల్లని నునుపైన రాతిపై బంగారు రంగు చుక్కలు కనిపిస్తుంటాయి. ఎన్నిరకాల గ్రానైట్ నిక్షేపాలు వెలుగు చూసినా, దీని మార్కెట్‌కు మరేది సాటి రాదు. ఇది ఫ్యాన్సీ కలర్ కావడంతో అంతర్జాతీయ మార్కెట్‌లో గిరాకీ పెరుగుతూ ఉంది. చీమకుర్తి మండలంలో 400 హెక్టార్ల పరిధిలో ఈ నిక్షేపాలు భూమిలో దాగి ఉన్నాయి. భారీ యంత్రాలను వినియోగించడం ద్వారా భూమి నుంచి గ్రానైట్‌ను వెలికితీస్తున్నారు. ముడి టు బై వన్ రాయి వెల వేయి నుంచి 2 వేల రూపాయల వరకూ, టు బై టు రాయి మూడువేల రూపాయల వరకూ మార్కెట్ ఉంది. కట్టర్ సైజు ముడిరాయి మీటర్ 20 వేల రూపాయల నుంచి 30 వేల రూపాయల వరకూ, గ్యాంగ్ సైజు ఒక మీటర్ వెల 75 వేల రూపాయల వరకూ ఉంది. చీమకుర్తి ప్రాంతంలో ఉత్పత్తి అవుతున్న గెలా క్సీని చైనా, జపాన్, ఇటలీ, తైవాన్ వంటి దేశాలు ప్రధానంగా మార్కెట్ చేస్తున్నాయి. కేవలం చైనా దేశం 70 శాతం మార్కెట్‌ను ఆక్రమించగా, యూరప్ దేశాలు 20శాతం, స్థానికంగా 10 శాతం మార్కెట్ లభ్యమవుతోంది. ఈ పరిశ్రమపై ఆధారపడి 15 వేల కుటుంబాలు ఆధారపడ్డాయి. కార్మికులు 7వేలమంది వరకూ, ఉద్యోగులు 2 వేలమంది వరకూ ఉన్నారు. కిరాణా దుకాణాలు, హోటళ్ళు, వైన్‌షాప్‌లు, బంగారం, ఫ్యాన్సీ, గ్రానైట్ అనుబంధ వ్యాపారాలు బాగా పుంజుకున్నాయి. పొలాలు, స్థలాలు, వడ్డీ వ్యాపారాలకు బాగా ఊతం లభించింది. దశాబ్దం క్రితం సాదాసీదాగా ఉన్న అనేకులు లక్ష్మీపుత్రులయ్యారు. కార్లు, అంతస్తుల మేడలు, విలాస జీవితాలకు అలవాటుపడ్డారు. దిగువ, మధ్యతరగతి వర్గాల ప్రజలలో కూడా ఆదాయాలు పెరిగాయి. ఉపాధికి ఢోకా లేకుండా పోయింది. 'ఈజీ మనీ'కి అలవాటుపడి పెద్దసంఖ్యలో యువత ఎయిడ్స్, జూదం, దొంగతనాల బారిన విలువైన జీవితాలను కోల్పోతున్నారు.



**ఖజానాకు భారీగా ఆదాయం**

గ్రానైట్‌వెలికితీత కారణంగా ప్రభుత్వ ఖజానాకు భారీగా రాబడి తెచ్చిపెడుతోంది. . దీనిద్వారా చీమకుర్తి మండల పరిషత్, చీమకుర్తి, ఆర్.ఎల్.పురం, బూదవాడ పంచాయతీలకు ఏటా కోట్లాది రూపాయల ఆదాయం వస్తోంది.

1996-97లలో 23,209 క్యూబిక్ మీటర్‌లు, 1997-98లలో 41,988 క్యూబిక్ మీటర్‌లు, 1998-99లలో 36,419 క్యూబిక్ మీటర్‌లు, 1999-2000లలో 50,202 క్యూబిక్ మీటర్‌లు, 2001-2002లలో 80,552 క్యూబిక్ మీటర్‌లు, 2002-2003లలో 1,23,194 క్యూబిక్ మీటర్‌లు, 2003-2004లలో 1,77,340 క్యూబిక్ మీటర్‌ల రాయి ఎగుమతి అయింది. 2001-02లలో 25.40 కోట్ల రూపాయల ఆదాయం రాగా, 2004-05లలో 54.51 కోట్ల రూపాయలకు చేరింది.



**కంకర మిల్లులు.. పాలిషింగ్ యూనిట్లు**

గ్రానైట్ పరిశ్రమకు అనుబంధంగా చీమకుర్తి ప్రాంతంలో కంకరమిల్లులు, పాలిషింగ్ యూనిట్‌లు పెరిగిపోయాయి. తొలుత కేవలం రెండే రెండు కంకర మిల్లులు బూదవాడ యల్లయ్య నగర్ వద్ద ఉండగా, ఆ సంఖ్య ప్రస్తుతం 50కి చేరింది. గతంలో కొండ క్వారీ నుంచి క్రషర్ మెటల్ తీసుకురావడంలో అధిక శ్రమ ఉండేది. డంప్ యార్డుల పైన ఉన్న వేస్టు నుంచి కూలీల ద్వారా క్రషర్ మెటల్ తీసి తరలించడం తేలికయింది. జిల్లా మొత్తం ఇక్కడి నుంచే భవన, రహదారి నిర్మాణాలకు కంకరతరలివెళ్తోంది. గ్రానైట్ ముడిరాయి వెలికితీత విస్తారంగా ఏర్పడ్డ మరో పరిశ్రమ గ్రానైట్ కటింగ్, పాలిషింగ్‌యూనిట్‌లు. బూదవాడ, చీమకుర్తి, సంతనూతలపాడు, పేర్నమిట్ట, ఒంగోలు, మేదరమెట్ల, మార్టూరులలో ఇవి 300కు పైగా ఉన్నాయి.



# పరిఢవిల్లుతున్న పర్యాటక రంగం

(ప్రభాతవార్త-గుంటూరు)

వివిధ రంగాల్లో ఆకాశమే హద్దుగా అభివృద్ధి సాధించిన శతవసంతాల గుంటూరు జిల్లాతాజాగా పర్యాటకరంగంలో పరిఢవిల్లుతోంది. జిల్లాలోని పలు ప్రాంతాల్లో పర్యాటకులను ఇట్టే ఆకట్టుకునే అంశాలు కోకొల్లలు. అమరావతినుంచి సాగర్ దాకా అడుగడుగునా ప్రకృతి అందాలు మదిని దోచేస్తాయి. ఆనాటి చరిత్రకు సాక్ష్యంగా నిలిచిన పల్నాడు,కృష్ణమ్మ సోయగాలకు నిలయమైన డెల్టా,బౌద్ధ చరిత్రకు సాక్షీభూతంగా వున్న అమరావతి, స్వతంత్రానికి పూర్వమే కళకళలాడిన నిజాంపట్టణం ఓడ రేవు, చరిత్ర ఉట్టిపడే ఉండవల్లి గుహలు,బాపట్ల బీచ్ గుంటూరు జిల్లా సొంతం.

మంగళగిరి నరసింహుడు,కాకాని భ్రమరాంబమల్లేశ్వరుడు,కోటి వరాలిచ్చే కోటప్ప స్వామి, చేజర్ల కపోతేశ్వరుడు,పంచారామాల్లో ప్రముఖమైన అమర లింగేశ్వరుడు,తెనాలి రామకృష్ణునికి దర్శనమిచ్చిన కాళికామాత దేవాలయం, కాశీశాసనంలో ప్రముఖంగా లిఖించిన నందివెలుగు శంకరుడు,ప్రాచీన చర్చిలు, భక్తుల కొంగు బంగారమైన దర్గాలు గుంటూరు జిల్లా ఆధ్యాత్మికతను ఇనుమడింపచేస్తున్నాయి. మతసామరస్యానికి నిలయమైన గుంటూరు జిల్లా ప్రతి ప్రాంతం పర్యాటకమే. ఇక్కడి ప్రజల ఆదరాభిమానాలు,ఆతిథ్యం పర్యాటకులను ఇట్టే కట్టిపడేస్తాయి.

అమరావతి అందాన్ని మరింతగా ఇనుమండింపజేసేందుకు, ప్రపంచ దేశదేశాల్లో సైతం దీని ఖ్యాతిని పెంచేందుకు సహకరించిన అమూల్య శిల్పకళా సంపద అమరావతిలో వుండటం అదృష్టదాయకంగా చెప్పవచ్చు. అనాటి ధ్యానకటకంలో రాజకీయ రక్షణగా వుండగా, మతం తనకు ఆలంబనగా ఒప్పుచుండగా శిల్పకళాలలబౌద్ధ భావనలో మనోమందిరాన్ని అలంకరించికొని నిరంతర సవ్యరోచిస్సులతో దిగంతములు నిండిన రోజులవి. కళామతల్లి కళ్యాణ కింకిణులు భావనా ప్రపంచమును ప్రభావితమొనర్చిన స్వర్ణయుగమది. ఆనాడే బౌద్ధాంధ్ర శిల్పి తన కళాతపస్సు ప్రభావంతో గండశిలలను మైనపు ముద్దగా మార్చుకుని ఆ మూసలలో తన మధుర భావనలను, దివ్యాకృతులను కల్పించారు. ఆంధ్రుల యశస్సుకు మేలి జలతారు మైపూత పూసినారు.

## అమరావతికి అంతర్జాతీయ ఖ్యాతి

పౌరాణిక ప్రశస్తి, చారిత్రక ప్రసిద్ధి కలిగి మహాశిల్పి సంపదలకు పుట్టినిల్లుగా వెలసి, ఆంధ్రరాజులకు రాజధానియై ప్రాచ్య సంస్కృతికి పట్టుకొమ్మయై లలిత కళామృత కలశంబై అలరారిన అమరావతి నిజంగా (మిగతా 92వ పేజీలో..)



# వ్యవసాయ రంగంలో...

(89వ పేజీ తరువాయి)

మోటార్ల స్థానంలో అసెంబుల్డ్ మోటర్లు అంటగట్టి మోసగిస్తున్నారు. అది రైతులకు విద్యుత్ సంస్థకు నష్టం తెచ్చి పెడుతుంది. రోజు వారి వ్యవసాయ ఖర్చులకే డబ్బు లేని పేద, మధ్య తరగతి రైతులకు తిప్పలు తప్పటం లేదు. రైతులు ఐఎస్ఐ పంపు సెట్లు, పివిసి పైపులు, కెపాసిటార్లు, ఫుట్ వాల్స్ అమర్చుకోవాలని ప్రభుత్వం ప్రచారం చేస్తున్నది. కొత్త కనెక్షన్లకు అవి తప్పని సరి కాగా గతంలో అమర్చుకున్నవారు 2006 మార్చి నాటికి సమకూర్చుకోవాలంటున్నారు. ఆత్మహత్యలు, ఆకలి చావుల బారిన పడిన రైతులకు ఇవి మోయలేని భారాలు కాబట్టి వీటి ఏర్పాటుతో విద్యుత్ శాఖకు ఎంతో ఉపయోగం కలుగుతుంది. కనుక విద్యుత్ కనెక్షను ఇచ్చే సమయంలో రైతులకు నచ్చచెప్పే పద్దతిలో నిర్వహణ విధానాలను, పొదుపు చర్యలను నేర్పాలి. రైతాంగం అమాయకంగా ఉంటూ సేద్యం సాగించే రోజులు పోతున్నాయి. కాబట్టి రైతు సేద్యం సమాచారంతో, నిర్వహణ సామర్థ్యంతో సాధికారం కావాలి. అందుకై వ్యవసాయ శాఖ రబీ సీజన్‌లో నైనా రైతులకు అందుబాటులో ఉంటూ వారికి సూచనలు, సలహాలు అందించాలి. అప్పుడే రైతు రాజ్య స్థాపన జరుగుంది.

## రైతుల ప్రయోజనాలకు కొన్ని సూచనలు

వ్యవసాయంలో పంపు సెట్ల ప్రాధాన్యత ఎంతో ఉంది. ఇవి పనిచేయకపోవడానికి అనేక కారణాలు ఉన్నాయి. వీటిలో కొన్ని మనం రిఫేరు చేయలేనివి ఉండగా, మరికొన్ని కొంత పరిజ్ఞానం ఉంటే మనమే బాగు చేసుకునే వీలుంటుంది. ఇలా చేయదల్చిన వారికి పంపు సెట్‌లోని ఏ భాగం ఎలా పనిచేస్తుందో దానికి గల కారణాలు తెలిసినట్లయితే వాటిని నివారించడం సులభతరమౌతోంది. రైతుల ప్రయోజనాలకు కొన్ని సూచనలు...

పంపు స్టార్ట్ కాకపోవడం: కరెంట్ సరఫరా ఉందో లేదో చూసుకోవాలి, ట్రిపుల్ స్విచ్ తెరిచి దానిలో ఫీజు ఉందో పోయిందో చూడాలి. పోయి ఉంటే ఫీజు వేసుకోవాలి. అప్పటికి ఆన్ కాకుంటే సెట్‌కు కరెంట్ సప్లయ్ ఆపివేసి అన్ని కనెక్షన్లు సక్రమంగా ఉన్నాయో లేదో చూసుకోవాలి. లూజు ఎండ్స్‌ను ఓపెన్ సర్క్యూట్ పరిశీలించి చూడాలి, పంపి ఇరుసును తిప్పి జామ్ అయిందో లేదో చూడాలి. స్టార్టర్ సక్రమంగా పనిచేస్తుందో లేదో చూసుకోవాలి. పంపు వెనుకకు తిరిగితే మోటార్ లీడ్స్‌లో ఏ రెండింటినైనా ఒకదాని స్థానానికి మరో దానిని మార్చాలి. పంపు ఆకస్మాత్తుగా ఆగిపోతే: స్టార్టర్ ట్రిప్ అయి వుండవచ్చు. దానిని స్థానంలో పెట్టి స్టార్ట్ చేయాలి. పంపు అపసవ్య దిశలో తిరగడం వల్ల నీటిని తోడి పోయలేదు. మోటర్ యొక్క ఏ రెండు లీడ్స్‌నైనా ఒక దాని స్థానంలోకి మరో దానిని మార్చాలి. లోవోల్టేజి వల్ల పంపు స్పీడు తగ్గి నీటిని తక్కువగా తోడి పోస్తుంది. అలా కాకుండా డెలివరీ పైపులో గాని, సెక్షన్ పైపులో గాని ఏదైనా అడ్డుపడి ఉండవచ్చు, పైపులైన్ పరిశీలించి అడ్డు తొలగించవచ్చు. అలాగే ఫుట్ వాల్స్ గాని, డెలివరీ వాల్స్ గాని కొద్దిగా మూత పడి ఉండవచ్చు. బావిలో నీటి మట్టం తగ్గి ఉండవచ్చు. అప్పుడు పంపును క్రింది లెవల్‌కు మార్చాలి. సెక్షన్ పంపు కేసింగ్‌లోకి గాలి చొరబడుచూ ఉండవచ్చు. పైపు జాయింట్లు గాలి చొరబడకుండా చూసుకోవాలి. మరచుట్లు ఉన్న పైపు జాయింట్లకు నార, వైట్ లెడ్ వాడాలి. ఫ్లాన్జ్‌డ్ కనెక్షన్లు ఉంటే గ్యాస్ కట్లు కొత్తవి వేసి బిగించాలి. పంపు భాగాలు అరిగిపోయి ఉండవచ్చు. ఆ భాగాలను తీసివేసి కొత్త వాటిని వేయాలి.

బేరింగ్‌లు వేడెక్కడం: బేరింగ్‌లలో కావల్సిన దానికన్నా తక్కువ గాని, ఎక్కువ గాని గ్రీజు ఉండవచ్చు. దీంతో బేరింగులు వేడెక్కుతాయి. అవసరమైన మోతాదులోనే గ్రీజు వాడాలి. బాల్ బేరింగ్‌లు అరిగి ఉంటే కొత్త వాటిని అమర్చాలి.



# పరిఢవిల్లుతున్న పర్యాటక రంగం



అనుపు పర్యాటక ప్రాంతం

(91వ పేజీ తరువాయి)

అంధ్రుల స్వర్ణసీమ అనుటలో అతిశయోక్తిలేదు. దక్షిణ భారతదేశంలో వాస్తవంగా యావత్ భారత దేశంలోనే బౌద్ధధర్మ చరిత్రలో ఆంధ్ర దేశంలోని అమరావతి, నాగార్జున కొండలు విశిష్ట స్థానాన్ని పొందాయి. శాతవాహనుల కాలంనాటి పూర్వమే ఆనాటి ఆంధ్ర శిల్పులు బుద్ధ భగవానుని దివ్యస్మృతికి నిర్మించిన శిల్పనిరాజనం అమరావతి స్థూపమని, ఆ స్థూపాన్ని అశోక చక్రవర్తికి పూర్వమే ఆంధ్ర దేశాన్ని పాలిస్తున్న నాగరాజు ప్రారంభించినట్టుగా తెలుస్తుంది. అశోకుడు దానిని వృద్ధి చేశాడు. అశోకుని అనంతరం శాతవాహనుల కాలంలో అమరావతి స్థూపం వృద్ధి చేయబడుటయేగాక వింతశోభను చేకూర్చుకొని దక్షిణపథ బౌద్ధచిత్రమందే సమున్నత స్థానం ఆక్రమించుకుంది.

ఆచార్య నాగార్జునుని కాలంలో అమరావతి మహాచైతన్యం చుట్టూ శిల్పచిత్రసంయుత ఆయక వేదికలు నిర్మించబడినట్లు తెలియుచున్నది. మహా ప్రాకార నిర్మాణం అశోకుని కాలం నాటికే అనగా, క్రీ.పూ.3వ శతాబ్దపు కాలం నాటికే జరిగింది. మొత్తం నిర్మాణం అంతా 4 దశలలో జరిగిందని, మొదటి దశ క్రీ.పూ. 300 సంవత్సరం నాటిది. కాగా 4వ దశ క్రీ.పూ.3వ శతాబ్దం నాటిదని చరిత్రకారుల అంచనా. ఆకుపచ్చని పాలరాయితో మలిచి అలనాటి శిల్పకళ, ఆంధ్ర శిల్పుల ప్రజ్ఞాకౌశల్యాలకు, భక్తిజ్ఞాన వైరాగ్యాలకు సాక్షీభూతాలుగా నేటికీమన కనులకు ఇంపును కలిగిస్తున్నాయి. 1958 తవ్వకాల్లో డాక్టర్ రాయప్రోలు సుబ్రమణ్యం ఆధ్వర్యంలో జరిపిన తవ్వకాల్లో పెద్ద ఎత్తున శిల్పాలు, శిల్పరేఖనాలు, వానితోపాటు ముఖ్యంగా స్పటిక భరిణిలో నిక్షిప్తం చేసిన సువర్ణ పుష్పాలతో కూడిన బుద్ధ భగవానుని ధాతువులు లభ్యమయ్యాయి.



ఎత్తిపోతల

1973 - 74లో శ్రీ ఇంగువ, కార్తికేయ శర్మ జరిపిన తవ్వకాల్లో బయల్పడిన అనేక నాణేలా శిల్ప శాసనాల వల్ల ఈ శిల్ప నికుంజాలు అలంకరించిన స్థూపం క్రీ.పూ. 3వ శతాబ్దినాటిదిగా నిరూపితమైంది.

శిరోభూషణాలు చూడామణి మేకరిక మకర కుండలాలు కర్ణికలు వంటి కర్ణభూషణాలు ఏకావళి రత్నావళి మణి బంధనం జలమయం రత్నవలయం వంటివి ఎంతో రమణీయంగా చెక్కారు. ప్రతిరేఖ, ప్రతివంపులోను విశేష నైపుణ్యం సౌకుమార్యం అమరావతి శిల్పాలలో కనిపిస్తాయి. కంటికి ఆనందంతో విశ్రాంతి కలుగుతుందే కాని విసుగుపుట్టదు. ఇది అమరాతి శిల్ప విశిష్టత. మహాచైతన్య నమూనా సంగ్రహాలయానికి ప్రత్యేక ఆకర్షణ కాగా, అలనాటి ఆంధ్ర శిల్పకళావైభవం బౌద్ధుల యుగంనాటిది కళ్లకు కట్టినట్టు అమరావతి సంగ్రహాలయం అత్యంత రమణీయంగా గేలరీలలో అమర్చారు.

## కాలచక్రతో ఖ్యాతి

అమరావతిని అభివృద్ధి చేయడంలో పాలకులు ఏళ్ళ తరబడి నిర్లక్ష్యాన్ని కనపర్చుతున్నారు. కాలచక్ర పుణ్యమా అని అమరావతికి ఎన్నో పేరు ప్రఖ్యాతులు లభించాయి. ఇక్కడి చారిత్రక కట్టడాలు బౌద్ధులను కట్టిపడేశాయి. కాలచక్ర తరువాత అమరావతి ప్రపంచ పర్యాటక చరిత్ర పుటల్లోకి ఎక్కిందని చెప్పవచ్చు.

# పరిశ్రమల ఖిల్లా-గుంటూరు జిల్లా

## రూ.1000కోట్లతో పరిశ్రమలు ఏర్పాటు

## త్వరలో ఫుడ్‌పార్కు మూడు సిమెంట్ ఫ్యాక్టరీలు

## టెక్స్‌టైల్ పార్కు ఏర్పాటు

(ప్రభాతవార్త-గుంటూరు)

జిల్లాలో సుమారు వెయ్యికోట్ల రూపాయల పెట్టుబడితో మధ్యతరహా పరిశ్రమల స్థాపనకు చురుగ్గా ఏర్పాట్లు జరుగుతున్నాయి. సంఘీ సిమెంట్సు, గుజరాత్ అంబూజా సిమెంట్స్ మరో వాణిజ్యసంస్థలు కూడా త్వరలో సిమెంట్ ఫ్యాక్టరీ ఏర్పాటు చేసేందుకు చర్యలు చేపట్టాయి.

ఈ కంపెనీలు ఉత్పత్తి కంపెనీలు సిమెంట్ ఉత్పత్తికి ప్లాంట్‌లు ప్రారంభించనున్నాయి. ఇందుకు జిల్లా పరిశ్రమలశాఖ అధికారులు అనుమతి కూడా మంజూరుచేశారు. ఈ కంపెనీలు సిమెంట్‌ఉత్పత్తి ప్రారంభిస్తే సుమారు వేయ్యిమందికి పైగా ఉపాధి అవకాశాలు లభించే అవకాశం ఉంది. ఈ సిమెంట్ ఫ్యాక్టరీలు పలనాడులో ప్రారంభించే అవకాశం ఉంది. 166కోట్ల రూపాయలు పెట్టుబడితో ఆరు వ్యవసాయాధిరిత పరిశ్రమలు స్థాపించేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక మౌలిక సదుపాయాల కల్పన సంస్థ జిల్లాలో జాతీయ రహదారి సమీపంలో టెక్స్‌పార్కు ఏర్పాటు చేస్తోంది. ఈ పార్కులో జిన్నింగ్‌మిల్స్, వీవింగ్ యూనిట్లు, రెడీమేడ్ గార్మెంట్. యూనిట్స్,బటన్స్ డైయింగ్ యూనిట్లు ప్రారంభించనున్నారు.

టెక్స్‌టైల్‌పార్కు ఏర్పాటునకు త్వరలో స్థలం సేకరించనున్నారు. జిల్లాలో 18స్పిన్నింగ్ మిల్స్ ప్రారంభించేందుకు చురుగ్గా ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఫుడ్‌ప్రాసెసింగ్‌పరిశ్రమల స్థాపనకు ఒక వ్యాపారసంస్థ 30ఎకరాల విస్తీర్ణంలో లేఅవుట్ కూడా సిద్ధం చేసింది.

ఈ పార్కులో మిర్చిపౌడర్, మిర్చి నుండి తయారు చేసిన ఇతర పదార్థాలు ఎగుమతి చేస్తారు.కెమికల్స్ తయారు చేసే పరిశ్రమలు రెండు స్థాపించేందుకు పారిశ్రామిక వేత్తలు ఆసక్తి చూపుతున్నారు. 20కోట్ల రూపాయల వ్యయంతో ఈ పరిశ్రమలు స్థాపించనున్నారు. పరిశ్రమల స్థాపనకు స్థలం సేకరించటం అధికారులకు తలకు మించిన భారంగా మారింది. జిల్లాలో ఒక మండలంలో పరిశ్రమల స్థాపించేందుకు అవకాశం ఉందని ప్రచారం జరగటంతో ఆప్రాంతంలో స్థలాల ధరలు కూడా పెరిగుతున్నాయి. దీంతో పరిశ్రమల స్థాపనకు పారిశ్రామిక వేత్తలు ముందుకు వచ్చిన పరిశ్రామిక వేత్తలు వెనుక్కి వెళ్లిపోతున్నారు.

ప్రస్తుతం జిల్లాలో 675.కోట్ల 60లక్షలతో 4వేల 525 చిన్న పరిశ్రమలు స్థాపించారు. వాటిలో 73 వేల 449మందికి ఉపాధి లభిస్తోంది. 1052 వ్యవసాయాధార పరిశ్రమలు 156కోట్ల 9లక్షల రూపాయలు వ్యయంతో స్థాపించారు. ఈ పరిశ్రమలు 16వేల 697మందికి ఉపాధి లభిస్తోంది. మధ్యతరహా పరిశ్రమలు 44ఉన్నాయి.వీటితో పాటు కోల్డు స్టోరేజ్‌లు స్థాపించేందుకు కూడా పారిశ్రామికవేత్తలు ఆసక్తి చూపుతున్నారు. ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలను ప్రోత్సహించేందుకు రాష్ట్ర ఆర్థికసహాయ సంస్థ రుణ మేళాలు స్థాపించి అక్కడిక్కడే రుణాలు మంజూరు చేస్తోంది. జిల్లా పరిశ్రమల స్థాపనకు జిల్లా పరిశ్రమల కేంద్రం అధికారులు సింగిల్ విండో పథకం కింద అనుమతి మంజూరు చేస్తున్నారు.విజయవాడ-గుంటూరు-తెనాలి-మంగళగిరి పట్టణాభివృద్ధిసంస్థ పరిశ్రమల స్థాపనకు వీలుగా విజయవాడ-గుంటూరు-తెనాలి నగరాలను ఇంటర్‌సిటీగా అభివృద్ధి చేసేందుకు చర్యలు చేపట్టింది.రాష్ట్ర ప్రభుత్వ ఆదేశాల మేరకు మూడు వేల ఎకరాల విస్తీర్ణంలో నాలెడ్జిపార్కు ఏర్పాటు చేసేందుకు చర్యలు చేపట్టింది. ఈ పార్కుఏర్పాటునకు ప్రభుత్వం త్వరలో అనుమతి మంజూరు చేస్తుందని అధికారులు భావిస్తున్నారు.

## గ్రంధాలయ వ్యవస్థ పునర్వ్యవస్థీకరణ



(ప్రభాతవార్త/గుంటూరు)

రాష్ట్రంలో గ్రంధాలయ వ్యవస్థను పరిపుష్టం చేసి పోటీ పరీక్షలకు హాజరయ్యే విద్యార్థులకు సహితం ఉపయుక్తం అయ్యేవిధంగా గ్రంధాలయ వ్యవస్థను తీర్చిదిద్దాలన్న లక్ష్యంతో రాష్ట్రస్థాయిలో ఈ వ్యవస్థను పరిపుష్టం చేసేందుకు చర్యలు ప్రారంభం అయ్యాయి. మొదటి సారిగా రాష్ట్రంలోని మొత్తం గ్రంధాలయాలకు పుస్తకాల కొనుగోళ్లకోసం 37 కోట్ల రూపాయల నిధులను విడుదలచేయించారు. అంతేకాకుండా రాష్ట్రంలో గ్రంధాలయ సంస్థలో పనిచేస్తున్న ఉద్యోగులు నేరుగా ప్రభుత్వం నుంచి జీతాలు తీసుకునే విధానాన్ని అమలుచేయడంతోపాటు, నిధుల బకాయిలను కూడా విడుదలచేయించడంలో ప్రస్తుత పాలకవర్గం అవిరళ కృషిచేసి సాధించింది. ప్రాథమిక విద్యాశాఖ పరిధిలో ఉన్న గ్రంధాలయ వ్యవస్థను ప్రణాళికాబద్ధంగా అభివృద్ధి పరిచి అన్ని వర్గాలకు ప్రయోజనకరంగా తీర్చిదిద్దాలన్నదే తనలక్ష్యమని రాష్ట్ర గ్రంధాలయ సంస్థ ఛైర్మన్,సీనియర్ కాంగ్రెస్ నాయకుడు కూచిపూడి సాంబశివరావు పేర్కొంటున్నారు. పరిశోధనలకు ఉపయోగం అయ్యే గ్రంథాలను కొనుగోలు చేయించడంతోపాటు, రాష్ట్ర, దేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ చరిత్రలను తెలిపే గ్రంధాలను నిక్షిప్తం చేయాలన్న తలంపుతో గ్రంధాలయ వ్యవస్థలో కొత్త సంస్కరణలకు శ్రీకారం చుట్టారు.

పదవీస్వీకారం చేసిన వెంటనే రాష్ట్ర గ్రంధాలయ వ్యవస్థలో అమలవుతున్న చట్టాలను అధ్యయనం చేసి, ఓ అవగాహన ఏర్పరుచుకున్న కూచిపూడి పార్టీపరంగాను, ప్రభుత్వంలోని మంత్రులు, ముఖ్యమంత్రి వై ఎస్, ప్రభుత్వ ప్రధాన సలహాదారు కె.వి.పి.ల వంటి ఉన్నత శ్రేణి నేతలతో ఉన్న పరిచయాలను సద్వినియోగం చేసుకుని సంస్థ పటిష్టతకు కృషిచేస్తూ వస్తున్నారు. తాడికొండ నియోజకవర్గం నుంచి పోటీచేసిన కాంగ్రెస్ నాయకుడుగా మంచి పేరున్న కూచిపూడి ఆదినుంచి కాంగ్రెస్ పార్టీ (మిగతా 94వ పేజీలో..)

(93వ పేజీ తరువాయి)

-వాది. పార్టీ సిద్ధాంతాలు, ఇందిరమ్మ ఆశయాలపట్ల అచంచల విశ్వాసం ఉన్న కూచిపూడి ఎన్నికల సమయంలో టికెట్ రాకపోయినా ముఖ్యమంత్రి వై ఎస్ అనుంగు శిష్యునిగానే కొనసాగారు. దీనితో నామినేటెడ్ పోస్టుల కేటాయింపులో

# సరస్వతీ నిలయాలుగా...

కూచిపూడికి రాష్ట్ర గ్రంధాలయ సంస్థ ఛైర్మన్ పదవిని కేటాయించారు. తన పదవీకాలంలో రాష్ట్ర గ్రంధాలయ వ్యవస్థను ఆమూలాగ్రం మార్పులు చేసి కొత్త సంస్కరణలు అమలుచేయాలన్న లక్ష్యం ఆయనలో ధృఢంగా ఉండటంతో కేంద్ర ప్రభుత్వం స్థాయిలో కూడా తీసుకువచ్చే నిధుల సౌలభ్యతపై దృష్టిసారించారు. శాఖా గ్రంధాలయాలకు లైబ్రేరియన్ పోస్టులను మంజూరుచేయించుకోవడంతోపాటు, వాటికి నెలసరి నిర్వహణ బడ్జెట్‌ను మంజూరుచేయించేందుకు కూడా కూచిపూడి శాయశక్తులా కృషిచేశారు. రాజారామ్మోహన్‌రాయ్ ఫౌండేషన్‌ద్వారా గ్రంధాలయాలకు లభించే ఆర్థిక వనరులను ఎప్పటికప్పుడు సద్వినియోగం చేస్తూ రికార్డులను కట్టుదిట్టంగా నిర్వహించేవీలును కలిగించారు. పాలనాపరంగాను, నిర్వహణ పరంగాను పలు ఆరోపణలు, విమర్శలు ఎదుర్కొంటున్న గ్రంధాలయ వ్యవస్థను పరిశోధకులు, పోటీపరీక్షలకు హాజరయ్యే విద్యార్థినీ విద్యార్ధులతోపాటు అన్ని వయస్కుల ప్రజలకు ఉపయుక్తంగా తీర్చిదిద్దాలన్నదే కూచిపూడి తన లక్ష్యంగా పేర్కొంటున్నారు.




# రోమ్ నగరాన్ని మైమరిపించే మరంపల్లి శుభవార్త ఆలయం

(ప్రభాతవార్త-మరంపల్లి)

నల్లగొండ జిల్లాలోనే కాక ఆంధ్రప్రదేశ్‌లోనే పేరెన్నిక గన్నది మరంపల్లి శుభావార్త ఆలయం. రోమ్‌నగరంలోని పెద్ద పెద్ద దేవాలయాలను కూడా మైమరిపించేదిగా అతి సుందరంగా, చూడ ముచ్చటగా తీర్చి దిద్దబడింది ఈ శుభవార్త ఆలయం. భక్తులు ప్రార్ధించుకునేందుకు ప్రశాంత వాతావరణం కల్పించబడింది. ప్రతి నిత్యం ఎందరెందరో ఈ దేవాలయాన్ని సందర్శించి, తరిస్తున్నారు.

1984 మార్చి 23న అప్పటి నల్లగొండ పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ మాథ్యు చెరియన్ కున్నెల్, వరంగల్ పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ అల్ఫోన్స్ బెరట్టా గార్లచే శంఖుస్థాపన గావింపబడింది. అప్పటి ఫాదర్ సిఐ అంథోని స్వావలంబనే ఆలంబనగా స్వశక్తితో ఇట్టి దేవాలయాన్ని నిర్మించ తలపెట్టారు. స్థానిక క్రైస్తవుల ఉదార విరాళాలతో, రెంటచింతల క్రైస్తవ సంఘం అర్థిక సహాయంతో బేస్‌మెంట్ పూర్తి చేసి ఆర్థిక ఇబ్బందులతో పనిని నిలుపుదల చేశారు. 1990లో మరంపల్లి విచార గురువులుగా వచ్చిన అల్లం మర్రెడ్డి ఇట్టి పనులను పునః ప్రారంభించారు.

ఇంటా బయట విరాళాలను విరివిగా సేకరించి, నిర్విరామంగా కృషి చేసి 1993 మే నెలలో పూర్తి గావించారు. ఇట్టి మహత్తర కార్యక్రమంలో క్రైస్తవ బృందం చిన్నలు, పెద్దలు, వృద్ధులు శ్రమదానం చేసి తమవంతుగా పాల్గొన్నారు. 8 వేల చదరపు ఆడుగుల విస్తీర్ణంలో 22.6 అడుగుల ఎత్తుతో గర్భగుడిని నిర్మించడంతో పాటు 101 అడుగుల ఎత్తులో 2 గోపురాలను 32 లక్షల వ్యయంతో నిర్మించారు. ఆలయ ముఖ ద్వారం ప్రతి ఒక్కరిని ఆకట్టుకునేటట్లుగా ఉంది. లోవల ప్రవేశించగానే మరో లోకంలోకి ప్రవేశించినట్లుగా ఉంటుంది.

మూల స్తంభాలు, భీములు, ప్రక్క గోడలు ఎంతో సుందరంగా డిజైన్ చేయబడ్డాయి. క్రీస్తు శిలువ మార్గం, కడారా భోజనం, క్రీస్తు పుట్టుక పెయింటింగ్స్ శ్రీరాఘవన్ మద్రాసు వారిచే తీర్చిదిద్ద బడ్డాయి. గర్భగుడిలో కన్య మరియకు గాబ్రియల్ దూత శుభావార్త వర్తమానం తెలియజేసే సన్నివేశం ఎంతో ముచ్చటగా రూపొందింపబడింది. దీనికి ఇరు వైపులా కర్రపని కెటివిలు, ద్వారాలు ఎంతో కళాత్మకంగా శ్రీజాన్ నల్లగొండ వారిచే తీర్చి దిద్దబడ్డాయి.

గర్భగుడి పై భాగం దైవ దూతల స్వరూపముల పరలోక రాజ్య వైభవమును చూపించినట్లుగా కనిపిస్తుంది. దేవాలయ ఆవరణ ప్రాంగణంలో పచ్చిక బయళ్ళు చక్కని డిజైన్‌తో తీర్చి దిద్దబడింది. ఈ శుభవార్త దేవాలయం మరంపల్లికి మణిపూస లాంటిది.

చాలామంది ఈ దేవాలయం ఇక్కడ ఉండాల్సింది కాదు ఎక్కడో పెద్ద పెద్ద పట్టణాలలో ఉండాల్సింది అని అశ్చర్యాన్ని వ్యక్త బరుస్తున్నారు. క్రైస్తవ సంఘం భక్తి విశ్వాసాలకు చిహ్నంగా ఆతి సుందరమైన దేవాలయం. దేవుని ఉనికికి ప్రత్యేక సాక్ష్యం, నిదర్శనం. దైవానికి, దైవ ప్రజలకు ఈ దేవాలయం పటిష్టమైన వంతెన. ఈ సత్యం మరంపల్లి శుభావార్త దేవాలయంలో ప్రతి ఒక్కరికి విశదమవుతోంది.

ప్రస్తుత అలయ విచార గురువులు ఎల్. ధన్‌రాజ్‌రెడ్డి అధ్వర్యంలో మండల వ్యాప్తంగా అనేక మంది నిరుపేదలకు చేయూత నందిస్తున్నారు. అక్షరాస్యత, విద్య, వైద్య, ఉపాధి ఆవద నమయాల్లో ఆశ్రయం కల్పిస్తున్నారు.

# ACHARYA NAGARJUNA UNIVERSITY
## CENTRE FOR DISTANCE EDUCATION
## NAGARJUNA NAGAR - 522 510. A.P.

### Special features :

- Poineer in starting PG and UG Science Courses under the distance mode.
- Admissions are made twice a year i.e., Academic year Batch (July to June), Calendar Year Batch (January to December).
- Examinations are held twice a year in May and December and Supplementary examination and betterment facility to the CDE students.
- Weekend Classes / Practicals through Study Centres of Student's Choice.
- Wide network of Examination Centres for the convenience of the students.
- No upper age limit for admission into any of the courses.
- Candidates studying other courses on regular basis are also eligible for admission into any one of the courses offered by the CDE, TC and MC need not be submitted.



Acharya Nagarjuna

### P.G. COURSES

| CODE | COURSE NAME |
|---|---|
| 01 | M.Sc. (Botany) |
| 02 | M.Sc. (Zoology) |
| 03 | M.Sc. (Physics) |
| 04 | M.Sc. (Chemistry) |
| 05 | M.Sc. (Microbiology) |
| 06 | M.Sc. (Mathematics) |
| 07 | LL.M. (Labour Laws) |
| 08 | LL.M (Constitutional Law and Administrative Law) |
| 09 | LL.M (Torts and Crimes) |
| 10 | LL.M (Corporate and Securities Law) |
| 11 | M.B.A. |
| 12 | M.Com. (Accountancy) |
| 13 | M.Com. (Banking) |
| 14 | M.A. (English) |
| 15 | M. A. (Telugu) |
| 16 | M.A. (Economics) Economics of Industry option |
| 17 | M.A. (History) |
| 18 | M.A. (Political Science) |
| 19 | M.A. (Sociology) |
| 20 | M.A. (Economics) Agricultural Economics and Rural Development Option |
| 21 | M.A. Social Work |
| 22 | M.A. Psychology |
| 23 | M.H.R.M. |
| 24 | M.C.A. |

### U.G. COURSES

| CODE | COURSE NAME |
|---|---|
| 40 | B.A. (Economics, History, Politics) |
| 41 | B.A. (Economics, Public Admn., Politics) |
| 42 | B.A. (Economics, Public Admn., Sociology) |
| 43 | B.A. (Economics, History, Sociology) |
| 44 | B.A. (Economics, Politics, Sociology) |
| 45 | B.A. (History, Politics, Sociology) |
| 46 | B.A. (Public Admn., Politics, Sociology) |
| 47 | B.A. (Public Admn., Politics, History) |
| 48 | B.A. (Maths, Politics, Economics) |
| 49 | B.A. (Maths, English, History) |
| 50 | B.A. (Maths, Telugu, History) |
| 51 | B.A. (English, Economics, Public Admn.,) |
| 52 | B.A. (English, Economics, Politics) |
| 53 | B.A. (English, History Politics) |
| 54 | B.A. (English, Politics, Public Admn.,) |
| 55 | B.A. (English, History, Telugu) |
| 56 | B.A. (Telugu, History, Sociology) |
| 57 | B.A. (Telugu, History, Politics) |
| 58 | B.Com. (General) |
| 59 | B.Sc. (Botany, Zoology, Chemistry) |
| 60 | B.Sc. (Maths, Physics, Chemistry) |
| 61 | B.Sc. (Costume Design & Fashion Technology) |
| 62 | B.Sc. (Information Technology) |
| 63 | B.Sc. (Maths, Statistics, Computers) |
| 64 | B.B.M. |

### PG DIPLOMA / ONE YEAR COURSES

| CODE | | COURSE NAME |
|---|---|---|
| 80 | B.L.I.Sc. | (Bachelor of Library & Information Science) |
| 81 | PGDBI | (PG Diploma in Bionformatics) |
| 82 | PGDBT | (PG Diploma in Biotechnology) |
| 83 | PGDHHM | (PG Diploma in Hospital & Health Care Management) |
| 84 | PGDBM | (PG Diploma in Business Management) |
| 85 | PGDMM | (PG Diploma in Marketing Management) |
| 86 | PGDHRM | (PG Diploma in Human Resource Management) |
| 87 | PGDFM | (PG Diploma in Financial Management) |
| 88 | PGDBFM | (PG Diploma in Banking and Financial Management) |
| 89 | PGDIB | (PG Diploma in International Business) |
| 90 | PGDTTM | (PG Diploma in Travel and Tourism Management) |
| 91 | PGDIM | (PG Diploma in Insurance Management) |

## ADMISSION NOTIFICATION - 2006 Calendar Year Batch

Applications are invited for admission into the following courses offered by the Centre for Distance Education, Acharya Nagarjuna University under the Distance Mode for the Calendar Year batch of January, 2006.

**UG Courses: B.A/B.Com./ BBM/B.Sc.** అర్హత పరీక్ష

1. జనవరి , 2006 నాటికి 18 సంవత్సరములు నిండి ,నిర్ణీత విద్యార్హత లేని వారు అర్హత పరీక్ష ద్వారా బి.ఎ./ బి.కాం./ బి.బి యమ్/. బి.యస్‌సి (మాథ్స్, ఫిజిక్స్, కెమిస్ట్రీ, బోటనీ, జువాలజీ, కెమిస్ట్రీ మాథ్స్, స్టాటిస్టిక్స్, కంప్యూటర్స్ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ; కాస్ట్యూమ్ డిజైన్ & ఫ్యాషన్ టెక్నాలజీ) (3 సంవత్సరముల డిగ్రీ కోర్సు) మొదటి సంవత్సరంలో అడ్మిషన్ పొందవచ్చును.

<u>పరీక్షా కేంద్రాలు మరియు మీడియం:</u> అభ్యర్థుల సంఖ్య ఆధారంగా సి.డి.ఇ. యొక్క అధ్యయన కేంద్రాలున్న ప్రదేశాలలో తెలుగు మరియు ఇంగ్లీషు మీడియంలలో అర్హత పరీక్ష నిర్వహించబడును.

- ★ దరఖాస్తు ఫారం ఖరీదు : రూ 150/- (అర్హత పరీక్ష ఫీజుతో సహా) (పోస్టు ద్వారా పొందుటకు : రూ. 200/-)
- ★ పూర్తి చేసిన దరఖాస్తులు చేరవలసిన ఆఖరు తేది : 15-04-06
- ★ అర్హత పరీక్ష తేది (ఆదివారం 2 PM నుండి 4 PM) వరకు : 30-04-06

<u>గమనిక :</u> గతంలో అర్హత పరీక్ష వ్రాసిన విద్యార్థులు సంబంధిత కోర్సులలో నేరుగా ప్రవేశం పొందవచ్చును మరలా అర్హత పరీక్ష వ్రాయనవసరం లేదు

**ఇంటర్మీడియట్ పాస్ అయిన విద్యార్థులకు నేరుగా ప్రవేశం**

ఇంటర్మీడియట్ లేదా తత్సమానమైన పరీక్ష వ్రాసిన అభ్యర్థులు బి.ఎ./ బి.కాం./ బి.బి.యమ్/ బి.యస్‌సి. (మాథ్స్, ఫిజిక్స్, కెమిస్ట్రీ, బోటనీ, జువాలజీ, కెమిస్ట్రీ, మాథ్స్, స్టాటిస్టిక్స్, కంప్యూటర్స్, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ; కాస్ట్యూమ్ డిజైన్ & ఫ్యాషన్ టెక్నాలజీ) మొదటి సం॥లో నేరుగా ప్రవేశం పొందవచ్చును దరఖాస్తు ఫారం ఖరీదు రూ. 100/- (పోస్టు ద్వారా రూ. 150/-)

- ★ **దరఖాస్తులు చేరవలసిన ఆఖరు తేది.: 31-05-06**
- ★ **రూ. 100/- అపరాధరుసుముతో దరఖాస్తులు చేరవలసిన ఆఖరు తేది. 15-06-06**

Note (1) Refer to the prospectus for the list of study centres (2) TC and MC need not be submitted for admission (3) Candidates studying other courses on regular basis are also eligible for admission into any one of the courses offered by the CDE

**PG Courses: MA/M.Com./M.Sc.**

**1. M.Sc. Botany 2. M.Sc. Zoology 3. M.Sc. Physics 4. M.Sc. Chemistry 5. M.Com. 6. M.Sc. Mathematics 7. M A. English 8. M.A. Telugu 9. M.Sc. Microbiology**

**PG Diploma Courses & B.L.I.Sc.**

10 Bioinformatics
11 Biotechnology
12. International Business
13. Business Management
14 Marketing Management
15 Insurance Management
16 Financial Management
17 Banking & Financial Mgt.
18 Travel & Tounsm Mgt.
19 Hospital & Health Care Mgt
20 Human Resource Mgt.
21 B L.I Sc

**Eligibility:** A pass in the qualifying Bachelor's Degree Examinations for all the courses (See the Prospectus for complete details)

Cost of Common Prospectus cum Application form for all the above courses: Rs 100/- in person (Rs. 150/- by post).

1. **Last date** for submission of filled in applications without late fee for all the courses: 31-05-06
II **Last date** for submission of filled in applications with a late fee of Rs. 100/-
a. M Sc. (Botany, Zoology, Physics, Chemistry & Microbiology), Biotechnology, Bioinformatics. 15-06-06
b M.A (English, Telugu), M Com , M Sc (Maths) Management Diplomas, B.L.I.Sc . 30-06-06

**Applications for all the courses can be obtained from the study centres and also from the Centre for Distance Education, Acharya Nagarjuna University by submitting Crossed Demand Draft drawn in favour of "Director, Centre for Distance Education, Acharya Nagarjuna University" payable at Andhra Bank or State Bank of India, A.N.U. Campus Branch. Applicant should invariably write his/her name and address on the reverse side of the D.D.**

**DIRECTOR, CENTRE FOR DISTANCE EDUCATION, ACHARYA NAGARJUNA UNIVERSITY**

# పారిశ్రామిక రంగంలో...

(88వ పేజీ తరువాయి)

స్వయంఉపాధివైపు దృష్టి సారించారు. స్థానిక వహ బ్రోడ్‌లో 1971లో ఆటోమొబైల్ స్పేర్‌పార్ట్స్ విక్రయించే షాపును ప్రారంభించారు. తొలినుండే ఆటోమొబైల్ ఇంజ నీరింగ్ పట్ల ఆసక్తి గలిగిన సుబ్రమణ్యం 1973లో తొలి పంప్‌సెట్‌ను తయారు చేసి 'కుమార్'గా పేరు పెట్టారు. ఆ రకంగా పిస్టన్ పంప్ తొలిసారిగా రూపొందించి వా డుకలోకి తెచ్చిన ఘనతను సాధించారాయన. ఆ క్రమం లోనే పంపులు, మోటార్లు రంగంలో జాతీయస్థాయిలో గుర్తింపును పొందారు. 1976లో ఇండస్ట్రియల్ ఎస్టేట్ లోకి మారి ఒక యూనిట్‌గా ఆవిర్భవించిన సంస్థ నేడు ప లు యూనిట్లుగా విస్తరించింది. పిస్టన్ పంపులు, మోనో బ్లాక్స్, అగ్రికల్చరల్ మోనోబ్లాక్స్, జెట్‌పంప్స్, హ్యాం డ్‌పంప్స్, ఆయిల్ ఇంజన్ల పంపులను 0.5 హార్స్‌పవర్ నుండి 7.5హెచ్.పి వరకు తయారుచేస్తున్నారు. ఒక అంగుళం నీటి ధార నుండి 2,3,4,5,6అంగుళాల నీటి ధారను వెలువరించే పంప్ సైజులకు డెలివరీ చేస్తున్నారు. షార్ట్‌బ్లాస్ట్ మెషీన్లు కలిగిన క్లీనింగ్ విభాగం, మౌల్డింగ్, లేత్‌ల విభాగాలు, అసెంబ్లింగ్, అబ్జర్వేషన్, పెయింటింగ్ విభాగాలున్నాయి.

రాష్ట్రంలోనే కాకుండా తమిళనాడు, కేరళ, ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, బీహార్, గుజరాత్ రాష్ట్రాలకు కుమార్ ఉత్పత్తులను ఎగుమతి చేస్తున్నారు. విద్యుత్ పంపుసెట్లనే కాకుండా చేతి పంపులను కూడా సంస్థ ఉత్పత్తి చేస్తోంది. సంస్థకు అవసరమైన ముడి సరుకును శ్రీకాకుళం, ఢిల్లీ, ముంబాయి, కోయంబత్తూరు, బెంగుళూరు నగరాల నుండి తెప్పిస్తుంటారు. దేశ వ్యాప్తంగా కుమార్ సంస్థకు 125మందికి పైగా డీలర్లు ఉన్నారు. మన్నిక, నాణ్యత విషయంలో రాజీపడని మనస్తత్వం కలిగిన సుబ్రమణ్యం తమ సంస్థలో ఎప్పటికప్పుడు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రవేశపెడుతుంటారు. సి.ఎస్.సి అనే కంప్యూటరైజ్డ్ యంత్రాన్ని కోస్తాజిల్లాలో ప్రప్రథమంగా ఏర్పాటు చేయటం ఆయన అభిరుచికి, నాణ్యత విషయంలో రాజీలేని మనస్తత్వానికి నిదర్శనంగా చెప్పొచ్చు. స్కిల్డ్ వర్కర్ కూడా చేయలేనంత నాణ్యమైన పనితనాన్ని కంప్యూటరైజ్డ్ యంత్రాల ద్వారా రాబట్టవచ్చని సుబ్రమణ్యం చెప్పారు. అంతేకాదు ప్రజలకు మెరుగైన ఉత్పత్తులను అందించే అవకాశం కోసం ఇండియాలో తన సామర్థ్యానికి తగిన ఆధునిక యంత్ర పరికరాలను తాను వినియోగించదలచినట్టు ఆయన స్పష్టం చేశారు. అన్నింటికి మించి ఉచిత సర్వీసింగ్ సంస్థ ప్రత్యేకత. కస్టమర్ నుండి పిలుపు వచ్చినంతనే వాహనంతో సహా మెకానిక్‌లు హాజరుకావటం విశేషం. సంస్థలోని అన్ని విభాగాల్లో 200మందికి పైగా పనిచేస్తున్న కార్మికుల్లో ఎక్కువభాగం సంస్థ తీర్చిదిద్దినవారే. ఏదో ట్రైనింగ్ సర్టిఫికెట్లు ఉన్నప్పటికీ తన కంపెనీలోని మిషన్లపై తగిన శిక్షణ నిచ్చి కార్మికులను పనిలోకి దింపటం 'కుమార్' ప్రత్యేకత.

అలాగే వారికి రావలసిన పి.ఎఫ్, గ్రాట్యుటీ, బోనస్ వంటి అన్ని సౌకర్యాలను అమలు చేస్తున్నారు. చిన్న తరహా మాన్యుఫాక్చరింగ్ రంగంలో రూ.5కోట్ల టర్నోవర్ కలిగి ఉండటం సాధారణ విషయం ఏమీకాదు. ఈ ఘనతతో తృప్తిపడటం జరగదని, రూ.10కోట్ల టర్నోవరుకు చేరుకోవాలనే పట్టుదలతో తమ ప్రయత్నం కొనసాగిస్తున్నామన్నారు.



కుమార్ ఉత్పత్తులు

## నాణ్యత మా నినాదం: సుబ్రమణ్యం

పంపుసెట్ల రంగంలో ఏ సంస్థ ఇవ్వలేనంత నాణ్యత కలిగిన ఉత్పత్తులను 'కుమార్' సంస్థ నుండి వెలువరించాలన్నదే తన భవిష్యత్ ధ్యేయంగా 'కుమార్' పంప్స్ అధినేత కొత్త సుబ్రమణ్యం వెల్లడించారు. ఏ ఉత్పత్తులైనా ప్రజలకు మెరుగైనవి అందించేవిగా ఉండాలని ఆయన అభిప్రాయపడ్డారు. మెరుగైన ఉత్పత్తులను ఇవ్వగలిగితే పరిశ్రమకు ఢోకా ఉండదు. ప్రజలకు సంతృప్తిని కలిగించే సర్వీసు చేశామన్న తృప్తి ఉంటుందన్నారు.

ఇండియాలోనే మంచి కార్లు ఉత్పత్తి చేయగలిగితే జపాన్ నుండి ఎందుకు వస్తాయని ఆయన ప్రశ్నించారు. ఒక సంస్థలో అభివృద్ధి కారణంగా వచ్చిన కీర్తి, డబ్బును చూసుకుని ఇతర రంగాలకు దృష్టి మళ్లించటం సమంజసం కాదని ఆయన అభిప్రాయపడ్డారు. దీనివల్ల సంస్థ ఒడిదుడుకులకు లోనయ్యే ప్రమాదం ఉందన్నారు. అదేరంగంలో అత్యున్నత స్థానానికి ఎదిగేందుకు నిర్విరామకృషి చేస్తూనే ఉండాలన్నారు.

పారిశ్రామిక ప్రగతిలో యువతరాన్ని భాగస్వామ్యం చేయటం నేటి ప్రధాన కర్తవ్యమని సుబ్రమణ్యం ప్రత్యేకంగా ప్రస్తావించారు. నిరుద్యోగ సమస్య పెరుగుతున్న తరుణంలో యువతరం నిరాశా నిస్పృహలకు గురై దారి తప్పే ప్రమాదం ఉందన్నారు. ఈ స్థితిలో పారిశ్రామికరంగంలో ఉన్న వారు యువతను ఉపయోగించుకుని సమాజానికి కూడా ఏదైనా సేవ చేయాలన్నారు. యువతకు సాంకేతిక శిక్షణనిచ్చి వారి అభివృద్ధికి బాట వేయాలనేది తన సంకల్పమని పేర్కొన్నారు. అలాగే విద్యార్థుల్లో ఎక్కువ భాగం ఇంజనీరింగ్ లేదా మెడిసిన్ చదవాలనే ఆరాటం కనిపిస్తోంది. ఇంకా ఎన్నో రంగాలున్నాయి. ఏదొకరంగంలో మాస్టర్లు కావటానికి యువకులు కృషిచేయటం అవసరమని కూడా సుబ్రమణ్యం సూచించారు.

# పుష్పాద్రి కొండపై శ్రీలక్ష్మీనృసింహుడు

## ఆలయానికి 500 ఏళ్ళ చరిత్ర!!

(ప్రభాతవార్త, గుంటూరు)

ప్రశాంతమైన వాతావరణం, మనోహరమైన ప్రకృతి దృశ్యాలతో నిండిన పుష్పాద్రి కొండపై గుహలో స్వయంభుః శ్రీలక్ష్మీనృసింహ స్వామి మహత్తుగల దైవంగా ప్రసిద్ధి. ఈ ఆలయం గుంటూరు రూరల్ మండలం నల్లపాడుకు సమీపంలోని లక్ష్మీనృసింహపురంలో ఉంది. శ్రీలక్ష్మీనరసింహస్వామి ఆలయంలో యాభై ఏళ్లుగా అర్చకుడిగా ఉన్న పరాశరం శాస్త్రాచార్యులు, వార సత్వంగా అర్చకత్వం చేస్తున్న వరాశరం శ్రీలక్ష్మీనరసింహచార్యులు స్థల పురాణం గురించి వివరించారు.



దాదాపు 500 సంవత్సరాల చరిత్ర కల్గిన శ్రీలక్ష్మీనరసింహాస్వామి దేవాలయం ఒకప్పుడు దట్టమైన చెట్లతో, విరివిగా కాసిన పుచ్చకాయలతో నిండి ఉండేది. ఈ ప్రదేశంలో ఎక్కువుగా పశువులను మేపుతుండేవారు. కొండగుహలో వెలిసిన స్వామిని మొట్టమొదట గుర్తించింది పశువుల కాపరులే. పుచ్చకాయలు ఎక్కువుగా ఉండటంతో 'పుచ్చకాయల నరసింహస్వామి'గా కూడా పిలుస్తారు.

చతుర్భుజుడు, అభయహస్తుడైన శ్రీలక్ష్మీనృసింహ స్వామి తన భక్తులైన ఆళ్వారులతో సహా దక్షిణాభిముఖంగా వెలవడం ఆలయ ప్రత్యేకత. ఒకప్పుడు అడవిని తలపించే విధంగా ఉన్న ఈ ప్రాంతంలో ఆలయ నిర్మాణానికి పాటువడిన వారిలో గుంటూరు వాస్తవ్యులు గోపు కృష్ణమ్మ, అంకమ్మలు ప్రథములు. అంకిరెడ్డిపాలెం, ఇతర గ్రామాలకు కరణంగా పనిచేసిన పెద్ది రాజు శాస్త్రులు దాతలను ప్రోత్స హించి, విరాళాలు సేకరించి ఆలయంలో కొన్ని సౌకర్యాలు కల్పించారు.

ఆలయ ప్రాంగణంలోన ఆకాశ మల్లికార్జున స్వామి, శ్రీరాజరాజేశ్వరి, శ్రీరాజ్యలక్ష్మి, ఆంజనేయ స్వామి ఉన్నారు. ప్రతి ఏటా లక్ష్మి నరసింహస్వామి ఆలయంలో వైశాఖ శుద్ధ చతుర్థినాడు నిర్వహించే నరసింహ జయంతి ప్రాముఖ్యత సంతరించుకుంది. మహాశివరాత్రి వర్వదినాన ఈ దేవాలయానికి భక్తులు పెద్ద నంఖ్యలో తరలి వస్తుంటారని ఆయన వివరించారు. ఈ నందర్భంగా వరమశివునికి రుద్రాభిషేకాలు, పూజా కార్యక్రమాలు ఎంతో వైభవంగా జరుగుతాయన్నారు. ఉత్సవం నందర్భంగా దేవాలయాన్ని నుందరంగా విద్యుద్దీపాలతో అలంకరణ జరుపుతామని ఆయన వివరించారు. శివకేశవుల క్షేత్రంగా ఈ ఆలయాన్ని అభివృద్ధి చెందాలనే తలం పుతో నల్లపాడు వాస్తవ్యులు బండ్లమూడి వెంకటశాస్త్రి శివాలయ నిర్మాణం, శ్రీ ఆకాశ మల్లికార్జున స్వామి ధ్వజస్తంభ ప్రతిష్ఠగావించారు. కాశీ నుంచి తెచ్చిన ఈ శివలింగం యజ్ఞో పవీతం కల్గివుండటం ప్రత్యేకతగా చెప్పవచ్చు. దేవాలయ కమిటీ సభ్యుల, మాజీ ఎమ్మెల్యే చల్లా వెంకటకృష్ణారెడ్డి, దాతల సహాయ సహకారాలతో కొంత మేరకు ఆలయాభివృద్ధి జరిగినట్లు దేవాలయ కమిటీ అధ్యక్షుడు నందిరాజు బాబు రావు పేర్కొన్నారు. పురాతనమైన ఈ దేవాలయం ఆశించిన మేర అభివృద్ధి జరగకపోవడానికి నిధుల కొరత ప్రధాన సమస్య అన్నారు.

ఆలయ అర్చకులు పరాశరం శాస్త్రాచార్యులు, లక్ష్మి నరసింహాచార్యులు





సుందరం.. సూర్యలంక సముద్ర తీరం



మున్సిపల్ కార్యాలయం



ఆచార్య ఎన్.జి రంగా వ్యవసాయ విశ్వ విద్యాలయం

# పుట్టినిల్లు బాపట్ల

(ప్రభాతవార్త-బాపట్ల):

**సాహితీ, సాంస్కృతిక, విద్యా, రాజకీయ రంగాల్లో ఎందరో ఘనాపాటిలను దేశానికి అందిస్తూ సముద్ర తీర గాలులతో ఎల్లప్పుడూ ప్రజలను సేదదీర్చుతూ, ఎన్నో పరిశోధనా కేంద్రాలకు నెలవు, శ్రీ భావన్నారాయణ స్వామి వారి కొలువుగా వర్ధిల్లుతోంది బాపట్ల...**

బాపట్ల పట్టణం ఆదినుంచి సాహితీ, సాంస్కృతిక, రాజకీయ, విద్యా రంగాల్లో రాణిస్తుంది. 14 13సంవత్సరాల క్రితం చోళ చక్రవర్తి క్రిమి కంఠ చోళుడు ఇక్కడి శ్రీమత్ సుందరవల్లీ భావన్నారాయణ స్వామి దేవాలయాన్ని ఇక్కడ నిర్మించడంతో ఈ ప్రాంతానికి భవపురి అనే పేరు వచ్చింది. కాలక్రమేణా అది బాపాపురం, భావపట్లలుగా మారి చివరకు బాపట్లగా స్థిరపడింది. 1936లో ఇక్కడ తొలి జాతీయ కాంగ్రెస్ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం తీర్మానం చేశారు. ఈ సమావేశ ఫలితంగా అప్పటి బాపట్ల తాలూకా పరిధిలోని పెదనందిపాడులో పన్నుల నిరాకరణోద్యమం, పేరాలలో ఉప్పు సత్యాగ్రహం, బాపట్లలో విదేశీ వస్తు బహిష్కరణ వంటి ఉద్యమాలు ఊపిరి పోసుకున్నాయి. స్వాతంత్ర్య సమరంలో కూడా బాపట్ల ప్రముఖ పాత్ర పోషించడమే కాకుండా ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు రావూరి శ్రీశైలపతి విదేశీ వస్త్రబహిష్కరణను మొదట తన ఇంటి నుంచే ప్రారంభించడంతో ఆ ఉద్యమానికి నాంది పలికిన ఘనత బాపట్లకే దక్కుతుంది.

సాహిత్య రంగంలో పేరు ప్రఖ్యాతలుగడించి బాపట్లకే వన్నె తెచ్చిన పద్మశ్రీ స్థానం నరసింహారావు, ఈలపాట రఘురామయ్య, డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు, డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, రచయిత డాక్టర్ రాయప్రోలు సుబ్బారావు, తొలి మహిళా మండలి ఏర్పాటుకు శ్రీకారం చుట్టి మహిళల విద్యాభివృద్ధి కోసం తన రచనల ద్వారా కృషి చేసిన కవయిత్రి, తొలి స్వర్ణ కంకణ గ్రహీత కనుపర్తి వరలక్ష్మమ్మ కూడా ఈ గడ్డకు చెందినవారే. చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా, గత వైభవమెంతో ఘనకీర్తి కలవాడా అనే గేయంతో స్వాతంత్ర్య సమర పోరాటంలో ఆంధ్రులను మేల్కొలిపిన అప్పటి యువ రచయిత వేములపల్లి శ్రీకృష్ణ బాపట్లకు ఎన్నికైన తొలి శాసన సభ్యుడు. కళా సాహిత్య రంగాల్లోనే కాకుండా విద్యా రంగంలో కూడా బాపట్ల పట్టణం ఉన్నత శిఖరాలను అధిరోహించింది. దేశానికి స్వాతంత్ర్యం రాకమునుపే గుంటూరు జిల్లాలోనే మొదటి హైస్కూలును బాపట్ల పట్టణంలో ఏర్పాటు చేశారు.



భావన్నారాయణ స్వామి దేవాలయం

1945 జూలై 11న దక్షిణాది రాష్ట్రంలో రెండవదైన వ్యవసాయ విశ్వ విద్యాలయాన్ని బాపట్లలో ప్రారంభించారు. అంతేకాక హోం సైన్స్, వ్యవసాయ ఇంజనీరింగ్, ఫుడ్‌ప్రాసెసింగ్ టెక్నాలజీ వంటి కళాశాలలు, తమలపాకు, వరి, జీడి మామిడి వంటి పరిశోధనా కేంద్రాలు, ఉప్పునీటి పరిశోధనా కేంద్రం, పోస్ట్ హార్వెస్ట్ టెక్నాలజీ సెంటర్, ఇండో డచ్ ప్రాజెక్టు, ఆంధ్రప్రదేశ్ సాగునీటి యాజమాన్య పథకం, భూసార పరీక్షా కేంద్రాలు వంటి ప్రతిష్ఠాత్మక కళాశాలలు, పరిశోధనా కేంద్రాలతో బాపట్ల పట్టణం భాసిల్లుతుంది. వేద పాఠశాల కూడా ఇక్కడ ఉంది. బాపట్లను విద్యా కేంద్రంగా తీర్చిదిద్దడంలో డి.సి.సి అధ్యక్షుడు ముప్పలనేని శేషగిరిరావు బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ద్వారా చేస్తున్న కృషి గణనీయమైనది. ఈ సొసైటీ నడుపుతున్న ఇంజనీరింగ్, పాలిటెక్నిక్, బి.ఫార్మసీ, ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి, పబ్లిక్ స్కూలు వంటి విద్యా సంస్థల్లో రాష్ట్రం నలుమూలల నుంచి వేలాదిమంది విద్యార్థులు వచ్చి విద్యనభ్యసిస్తున్నారు. బాపట్లకు శాసన సభ్యుడిగా కోన ప్రభాకర రావు వరుసగా మూడు పర్యాయాలు ఎన్నికయ్యారు. ఈయన పి.సి.సి అధ్యక్షుడిగా, స్పీకర్‌గా, ఆర్థిక శాఖా మంత్రిగా, మహారాష్ట్ర, సిక్కింలకు గవర్నర్‌గా ఆయన అలంకరించిన ప్రతి పదవికి వన్నె తెచ్చారు.



కోన ప్రభాకర రావు

అలాగే మరో శాసన సభ్యుడు మంతెన వెంకట్రాజు ఇసుక దిబ్బలతో నిండిన తీర ప్రాంతంలో రెండు పంటలు పండేందుకు వీలుగా ఇక్కడ నాగ రాజు కాలువ త్రవ్వకానికి కృషిచేసి నఖలీకృతులయ్యారు. బాపట్ల పార్ల మెంట్ సభ్యుడిగా, కేంద్ర మంత్రిగా పనిచేసిన ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు, మాజీ శాసన సభ్యుడు, బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షుడు ముప్పలనేని శేషగిరి రావులు రాజకీయ రంగంలో ఎంతో కీర్తిగడించారు.

# హైందవ సంస్కృతి, సంప్రదాయాల పరిరక్షణ ముఖ్యం

(ప్రభాతవార్త-గుంటూరు)

ఏ దేశమేగినా...ఎందుకాలిడినా.. పొగడరా నీ తల్లి భూమి భారతిని అనే మహనీయుల సూక్తిని స్ఫూర్తిగా తీసుకుని జన్మభూమిని అభివృద్ధి పరచాలన్న లక్ష్యంతో స్వస్థలం అభివృద్ధికి ఆ సంస్థ నడుం బిగించింది. 1999 అక్టోబర్ 12న ప్రారంభించిన డాక్టర్ రామినేని అయ్యన్న చౌదరి ఫౌడేషన్ ఆధ్వర్యంలో జిల్లాలోని బ్రాహ్మణకోడూరు గ్రామాన్ని సమున్నతంగా తీర్చిదిద్దాలన్న లక్ష్యంతో మౌలిక వసతులను ఏర్పాటుచేస్తున్నారు.



పతిభాపురస్కారాలు పొందిన విద్యార్థినీ విద్యార్థులు రామినేని ఫౌండేషన్ కన్వీనర్ వేదాచార్య, మాజీ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు తదితర ప్రముఖులు


డాక్టర్ రామినేని అయ్యన్న చౌదరి ఫౌండర్ రామినేని.ఫౌండేషన్

జిల్లాలోని ఒక కుగ్రామం నుంచి కఠోరశ్రమతో అంచలంచెలుగా ఎదిగి అమెరికాలో స్థిరపడిన డాక్టర్ రామినేని అయ్యన్న చౌదరి తనకు జన్మనిచ్చిన స్వస్థలంపైమమకారం పెంచుకున్నారు. హిందూ సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలపై అపార విశ్వాసం ఉన్న అయ్యన్న చౌదరి స్వతహాగా రైతుకుటుంబంనుంచి వచ్చిన వారు కావడంతో వ్యవసాయ రంగంపై ఎక్కువ శ్రద్ధ చూపించడంతోపాటు, సామాజిక సాంస్కృతిక సేవా రంగాల్లో కూడా ప్రాధాన్యత కనబరిచేవారు. ప్రస్తుతం ఆయన వారసులుగా ఆయన కుమారులు తమ జన్మభూమిని ఆమూలాగ్రం అభివృద్ధి చేయాలని కంకణం కట్టుకున్నారు. గ్రామంలో 30 సిమెంటు రోడ్లను నిర్మించారు. 85 లక్షల రూపాయలమేరకు సంస్థ సొంత వనరులను వెచ్చించి రోడ్లను నిర్మించారు. ఫౌండేషన్ ఆధ్వర్యంలో గ్రామ ప్రజలకు తాగునీటి వనరులను అందించే లక్ష్యంతో ఓవర్‌హెడ్ ట్యాంకును నిర్మించారు. గ్రామంలో పశుపోషణ వృత్తిగా చేసుకున్న రైతు కుటుంబాలకు చేదోడు వాదోడుగా నిలిచేందుకు డాక్టర్ రామినేని ఫౌండేషన్ ప్రస్తుతం బ్రాహ్మణకోడూరులో పశువైద్యశాలను శాశ్వత ప్రాతిపదికన నిర్మిస్తోంది. అంతేకాకుండా గ్రామంలో 800 సంవత్సరాలనాటి శివాలయాన్ని సమూలంగా జీర్ణోద్ధరణ చేసి ఆలయాన్ని సుందరీకరించాలని కూడా సంస్థ సభ్యులు నిర్ణయించారు.

ప్రవాసాంధ్రులుగా స్థిరపడిన గ్రామ ప్రముఖులు డాక్టర్ రామినేని అయ్యన్నచౌదరి తను జన్మించిన గ్రామంలో మౌలిక వసతులు ఏర్పాటు చేసి, రైతు కుటుంబాలకు చేయూతనివ్వాలన్న లక్ష్యం ఆయనమస్తిష్కంలో మెదిలిన నాటినుంచీ అభివృద్ధి పనులు ప్రారంభం అయ్యాయి. ప్రస్తుతం ఆ గ్రామంలో ఎటుచూసినా సిమెంలంగా ఆధునీకరించారు. తాగునీటికి ఇబ్బంది లేకుండా జిల్లాపరిషత్‌నిదులకు సొంత నిధులను జతచేసి అతిపెద్ద ఓవర్‌హెడ్ ట్యాంకును నిర్మించారు. భారతీయ సంస్కృతి, సాంప్రదాయాలను పరిరక్షించడంతోపాటు హిందూ మత విశ్వాసాలు, కట్టుబాట్లకు అత్యధిక విలువనిచ్చే స్వర్గీయ అయ్యన్న చౌదరి పరమపదించినా ఆయన వారసులు వాటిని కొనసాగిస్తూ తండ్రి ఆశయాలు, ఆదర్శాలను వెలుగులోనికి తీసుకువస్తున్నారు. తన


డాక్టర్ రామినేని అయ్యన్న చౌదరి కుటుంబ సభ్యులతో జడ్‌పి ఛైర్మన్ పాతూరి నాగభూషణం

యుడు ధర్మప్రచారక్, వేదాచార్య, సత్యవాది, బ్రహ్మానందలు వివిధ రంగాల్లో నిపుణులైనప్పటికీ తండ్రి అనుసరించిన ఆదర్శమార్గాలను విస్మరించకుండా తండ్రిపేరిట డాక్టర్ రామినేని అయ్యన్నచౌదరి ఫౌండేషన్ అనే సంస్థను స్థాపించి సామాజిక, సాంస్కృతిక రంగాల్లో నిపుణులను సత్కరిస్తూ వస్తున్నారు. ఆరు వార్షికోత్సవాలను పూర్తిచేసుకున్న రామినేని సంస్థ గ్రామీణ నిరుపేద విద్యార్థినీ విద్యార్థుల్లో నిబిడీకృతం అయి ఉన్న ప్రతిభను వెలికితీసి వారిని ఉన్నత చదువులవైపు ప్రోత్సహిస్తోంది. ప్రతి ఏటా జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాలల్లో పదవ తరగతి పరీక్షలు రాసిన విద్యార్థుల్లో అత్యధిక మార్కులు సాధింయ్యన్నచౌదరి జన్మదినోత్సవంరోజయిన అక్టోబరు 12వ తేదీ రాజధాని హైదరాబాద్‌లోను సత్కరించి వారికి మెరిట్ అవార్డులు, నగదు పురస్కారాలను అందచేస్తోంది. విద్యార్థినీ విద్యార్థులతోపాటు వారి తల్లి తండ్రులను కూడా రాజధానికి సొంత ఖర్చులతోనే తరలించి వారికి పురస్కారాలను అందచేయడంతోపాటు ఉన్నతవిద్యవైపు వారిని కార్యోన్ముఖులను చేస్తోంది. అయ్యన్నచౌదరి కుమారులు వేదాచార్య, ధర్మప్రచారక్‌లతోపాటు ఇతర కుటుంబ సభ్యులు ప్రతిఏటా ఈ ప్రతిభాపురస్కారాలను ఏర్పాటుచేస్తున్నారు. సామాజిక సేవా కార్యక్రమాలతోపాటు ఆధ్యాత్మిక భావనను పెంపొందించే కార్యక్రమాల్లో కూడా రామినేని ఫౌండేషన్ పాలుపంచుకుంటున్నది. మంగళగిరి మండలం పెదవడ్లపూడి గ్రామంలో కోటిరూపాయలతో నిర్మిస్తున్న షిరిడిసాయి మందిర ప్రాంగణంలోనే రామినేని సంస్థ ఆరు లక్షల రూపాయల సొంత నిధులను వెచ్చించి గణేశ మందిరాన్ని నిర్మించింది. ఫిబ్రవరి 3వ తేదీ ఈ మందిరం లాంఛనంగా ప్రారంభం అవుతోంది. శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నజీయర్‌స్వా

ఆశీస్సులతో హైందవ సంస్కృతి సాంప్రదాయాలను మరింతగా పరిరక్షించాలన్న లక్ష్యంతో సంస్థ ముందుకు సాగుతోంది. విదేశాల్లో ఉంటున్నప్పటికీ మాతృభూమిపై మమకారంతో ఆయన కుటుంబ సన్నిహితులు, సమీప బంధువు రామినేని శ్రీనివాసరావు ఇతర పెద్దల సహకారంతో అభివృద్ధి కార్యక్రమాలను నిరాఘాటంగా పూర్తిచేస్తున్నారు. అటు వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడం, పశుపోషణద్వారా ఆర్థిక వనరులు పెంపొందింపచేయడం, రైతులకు తక్కువ ఖర్చుతో ఎక్కువ నాణ్యతకలిగిన మందులను సరఫరాచేసి వారికి సేద్యపు మెళుకువల్లో తనదైన తోడ్పాటు నందిస్తున్న సంస్థ డాక్టర్ రామినేని ఫౌండేషన్ ఒక్కటేనని చెప్పకతప్పదు.దేశ విదేశాల్లో విశిష్టస్థానం పొందిన మేధావులు, నిపుణులు, ప్రముఖులను సత్కరించిన ఘనత డాక్టర్ రామినేని ఫౌండేషన్‌దేనని చెప్పవచ్చు. ఇటు జిల్లా సమగ్ర అభివృద్ధికి తోడ్పాటునందించడంతోపాటు గ్రామీణ ప్రజానీకానికి వైద్యసేవలందించడంలోను ఫౌండేషన్ అగ్రగామిగా ఉంది. తొలిసారిగా పాలకొల్లులోను, రెండవ పర్యాయం స్వస్థలం అయిన బ్రాహ్మణ కోడూరులోను నిర్వహించిన మెగా వైద్యశిబిరం వేలాది ప్రజలకు వైద్యసేవలందించిన శిబిరాలుగా నిలిచిపోయాయి. కంటివైద్య శస్త్రచికిత్సలకు కాకాని శంకర నేత్రాలయ సహకారంతో 300 మందికి శస్త్రచికిత్సలు చేయించేందుకు ఎంపికచేశారు. వీరందరికీ ప్రస్తుతం వైద్యసహాయం సంస్థ నుంచే అందుతోంది.


బ్రాహ్మణకోడూరులో రామినేని

# రాజకీయ వైద్యుడు ముక్కమళ్ల వెంకటప్పారెడ్డి

## అంచలంచెలుగా ఎదుగుతున్న వైనం



కాలచక్ర మహాసభల్లో దలైలామా సమక్షంలో సిఎం వైఎస్‌కు జ్ఞాపిక అందజేస్తున్న వెంకటప్పారెడ్డి చిత్రంలో మంత్రి కన్నా లక్ష్మీనారాయణ ఉన్నారు (ఫైల్‌ఫోటో)

(ప్రభాతవార్త-గుంటూరు)
రాజకీయాల్లో వైద్యులు రాణించడం ఇటీవలి కాలంలో ఎక్కువవుతోంది. వైద్యుడిగా ఎంతో పేరు ప్రఖ్యాతులు సాధించి రాజకీయరంగంలో తనదైన శైలిలో రాణిస్తూ ముందుకు దూసుకెళుతున్న వారు గుంటూరుకు చెందిన డాక్టర్ ముక్కమళ్ళ వెంకటప్పారెడ్డి. పిసిసి డాక్టర్స్ సెల్ కన్వీనర్‌గా డాక్టర్ వెంకటప్పారెడ్డి కాంగ్రెస్‌లో కీలక భూమికను పోషిస్తున్నారు. కాలం కలిసిరాక అసెంబ్లీకి వెళ్ళే అవకాశాన్ని డాక్టర్ వెంకటప్పారెడ్డికి త్రుటిలో తప్పిపోయింది. రాష్ట్ర రాజకీయాలను శాసిస్తున్న గుంటూరు జిల్లాలో ముఖ్యమంత్రి డాక్టర్ రాజశేఖరరెడ్డికి అత్యంత సన్నిహితునిగా గుర్తింపు పొందిన డాక్టర్ వెంకటప్పారెడ్డి సేవా కార్యక్రమాల్లో అగ్రగణ్యునిగా పేరు పొందారు. గుంటూరు నగరంలోని ఆర్టీసి బస్టాండ్ ఎదురుగా చందమామ ఆసుపత్రిని ఆధునిక వసతులతో ఏర్పాటు చేసి తద్వారా పేద బడుగు వర్గాల వారికి కార్పొరేట్ సేవలను అందిస్తున్నారు. ఆపదలో వున్న వారిని ఆదుకోవడం ఆయన నైజం. అమరావతి మండలం మునుగోడులో జన్మించిన వెంకటప్పారెడ్డి అంచెలంచలుగా ఎదిగారు. తండ్రి ప్రముఖ ఆయుర్వేద వైద్యుడు డాక్టర్ వెంకటనర్సిరెడ్డి స్ఫూర్తితో వైద్య విద్యనభ్యసించిన డాక్టర్ వెంకటప్పారెడ్డి పేదలకు వైద్య సేవలు అందిస్తున్నారు. పిల్లలను వైద్యం కోసం తీసుకువచ్చే తలిదండ్రులు వెంకటప్పారెడ్డి హస్తవాసితో రోగం నయమవుతుందనే ప్రగాఢ న



'ఆశ' పోస్టర్ ఆవిష్కరణలో

మ్మకంతో వుంటారు. కుమార్తె విశిష్ట మరణంతో తీవ్రంగా కుంగిపోయిన వెంకటప్పారెడ్డి పిల్లలకు వైద్యంలో ఎలాంటి కష్టం రాకుండా వైద్యం చేస్తుంటారు. తనకు కలిగిన కష్టం మరెవరికీ కలగకూడదని విశిష్ట ఫౌండేషన్‌ను ప్రస్తుత ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ చేతులమీదుగా ఏర్పాటు చేసి తద్వారా సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. కూతురు పేరు మీద ఏర్పాటు చేసిన ఫౌండేషన్‌ను ఏర్పాటు చేసిన డాక్టర్ రెడ్డిని వైఎస్ అభినందించారు. కూతురిపై డాక్టర్ రెడ్డికున్న మమకారాన్ని చూసి వైఎస్ సైతం చలించిపోయారు. నాటి సభలో వైఎస్ ఇచ్చిన ప్రోత్సాహంతో డాక్టర్ వెంకటప్పారెడ్డి జిల్లాలోని నలుమూలలా పలు కార్యక్రమాలు చేపట్టారు. ఈయన నిర్వహించిన వైద్యశిబిరాలు కోకొల్లలు. అధికారులు సహకరించకపోయినా సేవ చేయడం తన వంతని భావించిన డాక్టర్ రెడ్డి కాలచక్రలో విదేశీ యాత్రికులకు ఏ చిన్న కష్టం రాకుండా చూసుకొని బౌద్ధుల ఆధ్యాత్మిక మత గురువు దలైలామా ప్రశంసలు పొందారు. బౌద్ధుల ఆరోగ్యాన్ని పరిరక్షించడానికి మాస్క్‌లను కాలచక్రలో పంపిణీ చేశారు. లక్షలాది రూపాయల విలువ చేసే మందులను వాటర్ బాటిల్స్‌ను ఉచితంగా పంపిణీ చేసి తనకు సాటి ఎవరూ లేరని నిరూపించుకున్నారు.

### రాశి ద్వారా ఎయిడ్స్ మహమ్మారిపై పోరాటం

గతంతో పోల్చితే గుంటూరు జిల్లాలో హెచ్‌ఐవి,ఎయిడ్స్ రోగుల శాతం తగ్గిదంటే అది డాక్టర్ వెంకటప్పారెడ్డి గారి ఘనతేనని చెప్పవచ్చు. రాశి ద్వారా జిల్లాలోని మారుమూల గ్రామాలవారికి అవగాహన కల్పించడంలో డాక్టర్ రెడ్డి పాత్ర ప్రశంసనీయం. మహమ్మారిని పారద్రోలాలనే దృఢ చిత్తంతో డాక్టర్ రెడ్డి చేసిన కృషి అంతాఇంతా కాదు. ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డితో పాటు పలువురు సీనియర్ అధికారులు ఈ విషయంలో వెంకటప్పారెడ్డిని అభినందించారు.

### వెంకటప్పారెడ్డి స్వగతం

నాకు రాజకీయం తెలియదు.మాట తప్పటం,నోళ్ళు కొట్టడమే రాజకీయమైతే నాకు రాజకీయం తెలియదు. నిస్వార్థసేవచేయడం,ఆపన్నులను

మిగతా 100వ పేజీలో

(99వ పేజీ తరువాయి)
ఆదుకోవడం,బాధాతప్త హృదయులను ఆదరించడం,బుజు్రవర్తన,జవాబుదారి,కష్టపడడం,ఓర్పు,కార్యదీక్షలే రాజకీయమైతే మాత్రం అవి నాకు తెలుసు.నేను రచయితను కూడా కాదు అంటూనే ప్రస్తుత సిఎం డాక్టర్ వైఎస్ పాదయాత్రను జైత్రయాత్ర పేరిట పుస్తకాన్ని రచించారు. అర్ధమయ్యేటట్లు వ్రాయడం రచనయితేనేనా నేనే అదే ప్రయత్నం చేసాను అని వివరించారు. మధ్యతరగతి కుటుంభంనుండి మైళ్ళదూరం చెప్పులు లేకుండా ప్రయాణం చేసి పల్లెటూళ్ళలో పంచాయితీ బడి చదువులు చదివిన నేను,జీవితంలో కష్టాలను,నష్టాలను ఎదెర్కొని,పేదల వైద్య సేవలలో కోస్తాఆంధ్రలో "గుంటూరు చందమామ పిల్లల వైద్యశాల"తో పరిచయం ఉన్నా చెప్పుకుంటూరు. 1985 లో విద్యార్ది దశలో నా రోల్ మోడల్ డా॥ వై.ఎస్.రాజశేఖర రెడ్డి గారితో ఏర్పడిన అనుబంధం 20 సంవత్సరాలుగా పెరుగుతూనే వచ్చిందని తెలిపారు.రెండు సంవత్సరాల క్రితం కుమార్తె విషయంలో స్వయంగా అనుభవంలోకి వచ్చిన లక్షలు ఖర్చు పెట్టినా బ్రతకని రోగాలు ఒకవైపు,'రూపాయి మందుతో బ్రతికించ గల్గిన అదికూడా లేక చనిపోయేవారు ఒకవైపు,నిరంతర క్షామాలతో జవజీవాలుడుగుతున్న గ్రామీణ పరిస్దితులను చూసి చలించి ఎక్కువ మందికి మేలు చేయాలంటే రాజకీయ వేదిక ఒక మంచిదారిగా ఎంచి ఎన్ని అవరోధాలెదురైనా మొండి నమ్మకంతో పూర్తికాలంపాటు రాజకీయాలలోనే ఉంటూ,నేను చేయగలిగిన పనిని,పార్టీలోను,ప్రజలలోనూ చేస్తూనేవస్తున్నాను. కాంగ్రెస్ భావజాలాన్ని బహిరంగంగా వ్యక్తపరిచినందుకు గత దశాబ్దంగా అప్పటి ప్రభుత్వంలో అనేక రాకాలుగా ఇబ్బందులు పడిన నేను, ఆ పాలన నుండి ప్రజలను విముక్తి కలిగించడానికి చంద్రుడికో నూలుపోగులాగా డా. వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి గారు ఒక యజ్ఞంలా సాగించిన ఎన్నికల ప్రచార యాత్రలో, ప్రజాప్రస్థాన పాదయాత్రలో ఆయన అనుభవించిన అనారోగ్య పరిస్థితుల నేపధ్యంలో - ఆయనకు సేవచేయాలనే తలంపుతో) ఆయన అనుమతితో 20 రోజులు సాగిన 5500 ల కిలో మీటర్ల విభిన్న ప్రాంతాల రాష్ట్ర

## రాజకీయ వైద్యుడు ముక్కమళ్ళ వెంకటప్పారెడ్డి



జైత్రయాత్ర పర్యటనలో ఆయనకు, నా చిన్న కుమార్తె చనిపోయి విషాదంలో ఉన్న నా కుటుంబాన్ని వదిలి, 10 వ తరగతి వ్రాస్తున్న నా కుమార్తెను వదిలి నా స్నేహితులు - బంధువులు వెళ్లవద్దని చెప్పినా, నా కుమార్తె వియోగం జరిగిన గంటలో ఫోనులో పరార్శించి, ఎన్నికల వత్తిడిలో ఉన్నా నా కుమార్తె పేరున స్థాపించిన విశిష్ట ఫౌండేషన్ ప్రారంభానికి విచ్చేసి సానుభూతితో రెండు కన్నీటి బొట్లు రాల్చిన డా. వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి గార్కి సేవ చేయాలనే హృదయపూర్వక తలంపుతో జైత్ర యాత్రలో స్వచ్ఛందంగా పాల్గొనడం జరిగిందని తెలిపారు. త్వరలో తన అభిమాన అన్న డా॥ వై.యస్ మాతృవియోగాన్ని దృష్టిలో ఉంచుకొని జిల్లావాసులకు శాస్వితంగా గుర్తుండేలా ఒక మెగా మెడికల్ క్యాంప్‌ను నిర్వహించడానికి డా॥ వెంకటప్పారెడ్డి హైదరాబాద్ డాక్టర్లతో సంప్రదింపులు జరిపారు.

సామాజిక సేవ:400కు పైగా ఉచిత వైద్యశిభిరాలు మారుమూల గ్రామీణ ప్రాంతాలు,వెనుక బడిన షెడ్యూలు కులాల, తెగల హాస్టల్ విద్యార్దులకు,మురికి వాడల పేదలకు,అనాధలకు,వికలాంగులకు అనేక స్వచ్ఛంద సంస్థలలో కూడా ఉచిత వైద్యసేవలు చేసినారు.

అవార్డులు - రివార్డులు :1998లో "రాజీవ్ రాష్ట్రీయ ఏకతా అవార్డు" ను జాతీయ స్దాయిలో న్యూడిల్లీ లోని తీన్‌మూర్తి భవన్‌లో,సర్వశ్రీ అర్జున్‌సింగ్,శివరాజ్ పాటిల్,అంబికాసోని గార్ల సమక్షంలో మాజీ ప్రదానమంత్రి దేవగౌడ గారి చేతుల మీదుగా అందుకొన్నారు.అనేక మెడల్స్,అవార్డులు,రివార్డులను,విద్యాస్దాయిలో,సాంఘిక,వైద్యసేవలో అనేక సంస్థలనుండి పొందియున్నారు.

కాంగ్రెస్ పార్టీలో సేవలు: కీర్తిశేషులు గణపా రామస్వామి రెడ్డి గారి (పెదకూరపాడు నుంచి 22 సంవత్సరాల పాటు శాసన సభ్యునిగా ఎన్నికైనవారు)వంటి కాంగ్రెస్ కుటుంబం నుంచి సహజమైన సహజమైన కాంగ్రెస్ సిద్ధాంతాలతో పెరిగి 1985 నుండి విద్యార్దిదశలోనుండే డా॥వై.ఎస్.రాజశేఖర్ రెడ్డి గారి అభిమానిగా ఉంటూ 2002లో పి.సి.సి డాక్టర్స్ సెల్ రాష్ట్ర కన్వీనర్‌గా నియమింపబడి పార్టీకి పూర్తికాల సేవలు బాధ్యతలతో నిర్వహించుచున్నారు.

విశాఖ ఏజెన్సీ ప్రాంతావాసుల ఆరోగ్యసర్వే చేయడంతో పాటు,పి.సి.సి మేనిఫెస్టోలో రాష్ట్ర ప్రజల ఆరోగ్యవైద్య వసతుల అభివృద్ధికి సూచనలు అందించారు.జిల్లా,రాష్ట్ర మరియు జాతీయ పిలుపునందుకొని అనేక కాంగ్రెస్ కార్యక్రమాల్లో చురుకుగా మిగతా అనుబంధ విభాగాలతో కలిసి పాల్గొన్నారు.

### వెంకటప్పారెడ్డి వ్యక్తిగతం

పేరు; డా॥ముక్కమళ్ళ వెంకటప్పారెడ్డి
విద్యార్హత: ఎమ్.డి.,డి.సి.హెచ్.,
వృత్తి: పిల్లల వైద్యం
కాంగ్రెస్ పార్టీ పదవి :
పి.సి.సి డాక్టర్స్ సెల్ రాష్ట్ర కన్వీనర్
తల్లిదండ్రులు: డా॥వెంకటసర్సిరెడ్డి డి.తి లీఫీఠ (ప్రముఖ ఆయుర్వేదవైద్యనిపుణులు),
వెంకట నర్సమ్మగార్లు
భార్య: శ్రీమతి నాగ మల్లేశ్వరి
కుమార్తెలు: వింద్య జూ॥ఇంటర్,స్వర్గీయ విశిష్ట
జన్మతేది: 15-01-1962

స్వస్థలం: మునుగోడు(పోస్టు),అమరావతి (మండలం),పెదకూరపాడు(నియోజకవర్గం),గుంటూరు (జిల్లా)
విద్యాభ్యాసం :పదవ తరగతి -
ఊటుకూరు (నేషనల్ మెరిట్ స్కాలర్‌షిప్)
ఇంటర్ -అమరావతి (జిల్లార్యాంక్)
ఎమ్‌సెట్ (రాష్ట్ర 26వ ర్యాంక్)
ఎన్.సి.సి - సి - సర్టిఫికెట్
వైద్య విద్యాభ్యాసం -గుంటూరు మెడికల్ కాలేజ్,
వైద్య వృత్తి -
గుంటూరులో చందమామ
పిల్లల వైద్యశాల (1991లో స్దాపితం)













# గృహకల్ప తో నిరుపేదలకు శాశ్వత పక్కా గృహాలు



(ప్రభాతవార్త-గుంటూరు)

రాజీవ్‌గృహకల్ప పథకం కింద జిల్లాలోని పురపాలకసంఘాల్లో ఇళ్లు లేని 8వేల మంది నిరుపేదలకు పక్కాగృహాలు నిర్మించేందుకు జిల్లా గృహనిర్మాణశాఖ చర్యలు చేపట్టింది. ఈ ఇళ్ల నిర్మాణం అతి త్వరలో ప్రారంభించనున్నారు. ఇందుకు రంగం సిద్ధమైంది. ఈ వథకం కింద ఇళ్ల నిర్మాణానికి గృహ నిర్మాణసంస్థ చేపట్టిన ఏర్పాట్లను జిల్లా కలెక్టర్ జి.జయక్ష్మి ఇటీవల నమీక్షించారు. నిరుపేదలకు అపార్టుమెంట్ తరహాలో ఇళ్లు నిర్మించటంతో పాటు మౌలిక సదుపాయాలు కూడా కల్పించనున్నారు. ఈ అపార్టుమెంట్లకు తాగునీరు, కరెంటు సదుపాయం కల్పిస్తున్నారు. అప్రోచ్‌రోడ్లు కూడా నిర్మిస్తున్నారు. గ్రౌండ్‌ఫ్లోర్‌తో పాటు మరో రెండు ఫ్లోర్‌లు నిర్మించనున్నారు. గుంటూరు నగరపాలకసంస్థలో 4 వేలు, మంగళగిరి పురపాలకనంఘంలో 500, నత్తెనవల్లిలో 240, తెనాలిలో 1000, బావట్లలో 500ఇళ్లు, పొన్నూరులో 500, రేపల్లెలో 240, నర్సారావుపేటలో 750, చిలకలూరిపేటలో 750, మాచర్లలో 750ఇళ్లను మంజూరు చేసింది. ఇందు కోసం లబ్ధిదారుని నుంచి 7500రూపాయలు మొదటి వాయిదా సొమ్ము కూడా సేకరించారు.

మిగిలిన 75వేల రూపాయలను బ్యాంకు లబ్ధిదారునికి రుణంగా మంజూరు చేసింది. దీంతో లబ్ధిదారులు ఈ రుణాన్ని సులభ వాయిదాల్లో తిరిగి చెల్లించాలి. రాష్ట్ర ప్రభుత్వం తొలిసారిగా ప్రయోగాత్మకంగా నిరుపేదల కోసం అపార్టుమెంట్ల తరహాలో ఇళ్లు నిర్మించటంతో జిల్లాలోని మున్సిపాల్టీల్లో ఈపథకం కింద ఇళ్లు నిర్మిస్తోంది.

ఈ ఇళ్లకు కొన్ని పురపాలకసంఘాల్లో ఎక్కువ స్పందన లభించింది. పట్టణాల్లో ఇళ్ల స్థలాల కొరత ఎక్కువగా ఉంది. దీంతో నిరుపేదలకు ఇళ్ల స్థలాలు ఇవ్వటం అధికార యంత్రాంగానికి తలకు మించిన భారంగా మారింది. ఈ విషయాలను వరిగణనలోకి తీసుకుని పక్కా ఇళ్ల నిర్మాణానికి అయ్యే వ్యయాన్ని తగ్గించేందుకు ప్రభుత్వం అపార్టుమెంట్ల తరహాలో ఇళ్లు నిర్మిస్తోంది.

ఈ వథకానికి కొన్ని వురపాలకసంఘాల్లో తక్కువ స్పందన లభించింది. తక్కువ స్పందన లభించిన వురపాలకసంఘాల్లో దరఖాస్తులు స్వీకరించేందుకు రెండో విడుత దరఖాస్తులు పిలవాలని అధికారులు యోచిస్తున్నారు. తొలిదశలో కొన్ని ఇళ్ల నిర్మాణం పూర్తి అయిన తరువాత మిగిలిన ఇళ్ల నిర్మాణం ప్రారంభించాలని అధికారులు నిర్ణయించారు. ఈ ఇళ్ల నిర్మాణంలో నాణ్యతా ప్రమాణాలకు పెద్ద పీట వేయాలని అధికార యంత్రాంగం నిర్ణయించింది.

ఇందు కోసం లబ్ధిదారులతో కమిటీలు కూడా ఏర్పాటు చేసింది. ఇళ్ల నిర్మాణంలో నాణ్యతా ప్రమాణాలు పరిశీలన చేయటంలో లబ్ధిదారులకు శిక్షణా తరుగతులు కూడా త్వరలో నిర్వహించనున్నది. జిల్లాలో నిర్మించనున్న8వేల ఇళ్ల నిర్మాణంలో నాణ్యతా ప్రమాణాలు ఒకేసారి పర్యవేక్షించటంకష్టమని భావించి అధికారులు తొలివిడుత 1400ఇళ్ల నిర్మాణం ప్రారంభించనున్నారు. వీలైనంత త్వరలో తొలివిడత ప్రారంభించనున్న 1400ఇళ్ల నిర్మాణం పూర్తి చేయాలని అధికారులు నిర్ణయించారు.

# కుర్రకారు కలల రాకుమారి
# కాంచనమాల



(ప్రభాతవార్త, తెనాలి)
'రాక్సీలో నార్మా షేరర్..బ్రాడ్వేలో కాంచన మాల ఎటకేగుటో సమస్య తగిలిందొక వి ద్యార్థికి' అంటూ మహాకవి శ్రీశ్రీ తన కవిత లో అందాలతార కాంచనమాలను 'స్క్రీన్ గా డెస్' అనిపించుకున్న హాలీవుడ్ స్టార్ నార్మా షేరర్‌తో పోల్చారు. తెలుగుతెరపై కుర్రకారు కలల రాకుమారిగా గుర్తింపు పొందిన అలనా టి సినీతార కాంచనమాల వంటి హీరోయిన్ మళ్లీ రాలేదనే అభిప్రాయం ఇప్పటికీ ఉందం టే అతిశయోక్తి కాదు. అందమైన రూపలావ ణ్యం, పొడవైన ముక్కు, విశాలమైన కళ్లు, చిరునవ్వులు చిందించే పెదవులతో నా జూకుగా ఉండే కాంచనమాలది సహజసౌం దర్యం. ఆమె నటించిన చిత్రాల సంఖ్య తక్కువే అయినా ఈనాటికి ఆమెను గుర్తు చేసుకొనేవా ఎందరో ఉన్నారు. కాంచన మాల స్వస్థ ం తెనాలి. 1922 జూన్ 15న జన్మించింది. దాసరి నారాయణదాసు ఆమె తండ్రి. బాల్యంలో పినతండ్రి వీరాస్వామి ఇంట్లో పె ి పెద్దదయింది. కళలకు నిలయ మైన తెనాలిలో ఆమెకు సహజంగానే కళ లపై ఆసక్తి కలిగింది. పినతండ్రి వాద్యకారు డు కావటంతో కాంచనమాలకు సంగీతజ్ఞానం అలవడింది. ఆమె రంగస్థల ప్రవేశం అప్ప ట్లో ఒక సంచలనం. ఎందుకంటే, 1930 ద శకం వరకు నాటకాల్లో స్త్రీ పాత్రలను పురు షులే పోషించారు. నాటక ప్రదర్శనలు నిర్వహిస్తుండే కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులు స్త్రీ పాత్రను స్త్రీ చేతనే వేయించాలని అభిలషించారు. ఇంకేం! 'స్త్రీ పాత్రలను పోషించగల స్త్రీలు ఉంటే తనను సంప్రదించాలి' అంటూ దినపత్రికల్లో ప్రకటన ఇచ్చారు. ఆరోజుల్లో నాటకాల్లో హార్మోనిస్టుగా పనిచేస్తున్న దాసరి నారాయణదాసు, తన కుమార్తె కాంచనమాలను తీసుకొని రాజమం డ్రి వెళ్లి చిలకమర్తివారిని కలిశారు. ఆయన ఎంతో ఆనందించి 'సారంగధర' నాటకంలో చిత్రాంగి పాత్రకు రిహార్సల్స్ వేయించారు. ఆ నాటకం ప్రదర్శనకు మళ్లీ ప్రకటన ఇ చ్చారు. స్త్రీ పాత్రను స్త్రీ నటిస్తోన్న తొలి నాటకం అంటూ ఇచ్చిన ప్రకటనకు జనం క్యూ కట్టారు. తర్వా త విప్ర నారాయ ణ, సక్కు బాయి నాటకాల్లో నటించింది. ఆ క్రమంలో 1935లో ఆరోరా వారి 'శ్రీకృష్ణతులాభారం' సినిమాలో చెలికత్తె పాత్ర ద్వారా వెండితెరపై మొదటిసారి కనిపించింది. తర్వాత 'వీరాభి మన్యు (1936)లో ఉత్తర, 'విప్రనారాయణ (1937)'లో దేవదేవిగా నటించిన కాంచనమా లకు ప్రేక్షకుల గుర్తింపు లభించింది. వచ్చిన అవకాశాన్నల్లా వినియోగించుకుంటూ 1938 లో 'గృహలక్ష్మి' చిత్రంలో కన్నాంబతోపాటు హీరోయిన్‌గా నటించింది. అదే సంవత్సరం ప్రముఖ దర్శకుడు గూడవల్లి రామబ్రహ్మం అంటరానితనం నిర్మూలన ధ్యేయంతో నిర్మిం చిన 'మాలపిల్ల'లో కాంచనమాల కథా నాయిక. ఈ సినిమాతో కాంచన మాల పేరు మారుమోగి పోయింది. ఆమె ప్రదర్శించిన .నటన వి మర్శకు లను సై తం విశేషంగా ఆకట్టుకుం ది. మాలపిల్ల పాత్రధారిణి ఆమె. పల్లెటూరి అమ్మాయి అయిన మాలపిల్ల పాత్ర ఒక బ్రాహ్మణ యువకుడిని వివాహం చేసుకొని కలకత్తా పారిపోయి సంస్కారం పెంచుకొంటుంది. ఈ పాత్రలో స్లీవ్‌లెస్ జాకెట్, భుజం మీదికి వాల్జడ, చె వులకు రింగులు, చేతిలో కాఫీ కప్పు, పెద్ద కళ్లు, నవ్వుతున్న పెదాలతో కాంచనమాల ఆ నాటి సినీప్రేక్షకజనం మతిపోగొట్టింది. ఇదే స్టిల్‌తో ముద్రించిన ఆమె కాలెండర్ అప్పట్లో చాలామంది ఇండ్లలో ఉండేది. ఈవిధంగా మాలపిల్ల సినిమా అటు గొప్పసినిమాగా అ టు దర్శకుడికి, గొప్ప హీరోయిన్‌గా కాంచన మాలకు కీర్తిని సాధించిపెట్టింది. బి.ఎన్.రెడ్డి వాహినీ సంస్థను ప్రారంభించి తొలిచిత్రంగా తీసిన 'వందేమాతరం' సినిమాలో కాంచన మాలను హీరోయిన్‌గా తీసుకొన్నారు. ఇదే సి నిమాలో రెండో హీరోయిన్‌గా నటించిన క ళ్యాణి కూడా తెనాలి నటీమణి కావటం మరో విశేషం! అత్త, ఆడబిడ్డ ఆరళ్లకు గురయిన గృహిణి పాత్రలో కాంచనమాల సి నీవిమర్శకులను సైతం మెప్పించారు. 'మ ళ్లీపెళ్లి (1939), 'మైరావణ', 'ఇల్లాలు (1940), 'అపవాదు (1941) చిత్రాల్లో నటిం చింది. ప్రముఖ దర్శకనిర్మాత జెమిని వాసన్ తీసిన జానపద సినిమా 'బాలనాగమ్మ'లో న టించటంతో ఆమె సినీజీవితం 'రంగులవల' లో చిక్కుకుపోయింది. ఆ సంస్థతో కు దుర్చుకొన్న ఒప్పందం వల్ల ఇతర చిత్రాల్లో నటించేందుకు అవకాశం లేకుండాపోయింది. ఎవరి కుట్రో తెలియదుగాని ఆ సంస్థ సిని మాల్లోను కాంచనమాలకు చోటులేకుండా పోయింది. దీనితో ఆమె కళాహృదయం తల్ల డిల్లింది. సున్నితమనస్కురాలయిన ఆమె బా లనాగమ్మ పూర్తిచేశాక స్వస్థలం తెనాలి చేరుకుంది. అంతలో ఆమె సహచరుడు గాలి వెంకయ్య మరణించటంతో మరింతగా కుంగి పోయింది. మానసికంగా బాధపడుతూ మరి ది వెంకటేశ్వరరావు, చెల్లెలు సంరక్షణలో చా లాకాలం అజ్ఞాతజీవితం గడిపారు. ఆమె స్నేహితురాలయిన ప్రసిద్ధ నటి, నిర్మాత అయిన లక్ష్మీరాజ్యం బలవంతంతో 1964 లో రాజ్యంపిక్చర్స్ వారి శతదినోత్సవ చిత్రం 'నర్తనశాల'లో ఒక చిన్నపాత్రలో కనిపించిం ది. అదే ఆమె తెరపై ఆఖరుసారి కనిపించ టం. పదేళ్ల కాలంలో ఆమె నటించిన సిని మాలు తక్కువే అయినా ఎనలేని గ్లామర్‌ను సంపాదించింది. బాలనాగమ్మ సినిమాలో న టించేనాటికి ఆమె అత్యధిక పారితోషికం తీసుకునే నటిగా గుర్తింపు పొందింది. అం దుకే ఫిల్మిండియా బాబూరావ్ పటేల్ ఈమె ను 'ఊంఫ్ గర్ల్' 'అని వర్ణించారు. అంతటి గ్లామర్ శిఖరాలకు చేరుకున్నా కాంచనమాల జీవితం సినిమాల్లో మోస్తరుగానే విషాదంగా ముగిసింది. తన అందచందాలతో ప్రేక్షకుల్ని పిచ్చెక్కించిన కాంచనమాల చివరలో తనుకూ డా పిచ్చిది కావటం విషాదం కాక మరేమిటి! తెలుగు చలనచిత్ర చరిత్రలో ఆమె మరపురా ని మధురజ్ఞాపకంగా మిగిలిపోయింది. తెనా లి నాజరుపేటలో ఆమె నివసించిన భవనా న్ని కాంచనమేల మేడగా ఇప్పటికి పిలుస్తుం టారు. ఆవిధంగా ఇప్పటికీ ఆమె పేరు వి నిపిస్తూ ఉంటుంది.

నిరుద్యోగ యువతకు ఉపాధి కల్పిస్తోన్న

# శివా ఇన్‌స్టిట్యూట్



శివా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎలక్ట్రానిక్స్‌లో మెకానిజం నేర్చుకుంటున్న విద్యార్థులు

(ప్రభాతవార్త-గుంటూరు)

ఉన్నత విద్య చదవలేకపోయిన జీవితంలో పైకి రావాలని పట్టుదలతో టి.వి. మెకానిజం కంపెనీ టి.వి.టెక్నీషియన్‌గా చేయుచూ తనకు వచ్చిన ఈ విద్యను పది మందికి నేర్పాలని 1987లో ముగ్గురుతో శివా ఇన్‌స్టిట్యూట్ ప్రారంభించడం జరిగింది. రాష్ట్రంలో అన్ని జిల్లాల్లో వందలాది మంది విద్యార్థులు తమవద్ద విద్యను అభ్యసించి స్వయం ఉపాధి పొందుతున్నారని సంస్థ డైరెక్టర్ ఎం.యస్. కోటేశ్వరరావు తెలిపారు. నేడున్న పరిస్థితులలో ఉద్యోగాలు రాక నిరాశతో ఉన్న యువతీ, యువకులు స్వయంఉపాధి పథకం ద్వారా శిక్షణ పొంది తక్కువ పెట్టుబడితో టి.వి.,వి.సి.డి,సెల్ ఫోన్ మెకానిజం నేర్చుకొని ఉపాధి పొందుతున్నారని శివాఇన్‌స్టిట్యూట్ నిర్వాహకులు కోటేశ్వరరావు చెబుతున్నారు.

దీని ద్వారా తల్లిదండ్రుల పై ఆదారపడకుండా తన స్వంత కాళ్ళమీద నిలబడవచ్చని తెలిపారు.దీనికోసం రోజుకు 2 గంటలు కేటాయిస్తే సరిపోతుందని, 10వ తరగతి,ఇంటర్ క్వాలిఫికేషన్‌తో ఈ మెకానిజం కోర్సులలో శిక్షణ పొందవచ్చన్నారు.6నెలల కాలంలో మెత్తం కోర్సు పూర్తి స్థాయిలో పొందవచ్చని తెలిపారు. మెకానిజంలో పూర్తి అవగాహన కల్పించేందుకు బుక్స్ తయారుచేసి మెటీరియల్ రూపంలో ఇస్తున్నామని, ప్రతి విద్యార్థితో ప్రాక్టికల్స్ చేయస్తామని, మారుతున్న టెక్నాలజీకి అనుగుణంగా బోధన చేస్తున్నామన్నారు. తమ సంస్థలో పేద విద్యార్థులకు, వికలాంగులకు, మహిళలకు ప్రత్యేకంగా ఫీజులో రాయితీ ఇస్తామని చెప్పారు. ప్రతి నెల 6న క్లాసులు ప్రారంభమవుతాయని ఎం.ఎస్.కోటేశ్వరరావు తెలిపారు.

# వాస్తు శాస్త్రం పరమ సత్యం

(ప్రభాతవార్త-గుంటూరు)

మన ప్రాచీన శాస్త్ర విజ్ఞానం పరమ సత్యం. అది మానవ జీవిత పరమావధికి ఎంతో ఉపయోగకరం. మానవుడు తన ఉనికిని గురించి తెలుసుకునేందుకు జ్యోతిష్యం ఎంత ఉపయోగకరమో, అలాగే మానవుని జీవనాభివృద్ధికి వాస్తు శాస్త్రం అంతే ఆవశ్యకం. యుగయుగాల నుంచి భరత ఖండం శాస్త్ర విజ్ఞానానికి, ఆధ్యాత్మిక ప్రవృత్తికి నిలయంగా ఉన్నది. సత్యం అనేది ఒకటే గాని రెండు కాదు. అలాగే శాస్త్రం కూడా ఏదో ఒక నిర్ణయం చెబుతుంది గానీ బహుముఖ నిర్ణయం చెప్పదు. అందుకే దానికి ఆ ఘనత, ఆధిక్యత, పూజ్యత ఏర్పడింది. శాస్త్రం అగ్ని వంటిది. అది తెలిసి తాకినను తెలియక తాకినను కాలక మానదు. అదే విధంగా శాస్త్రం తెలిసి ఆచరించినా తెలియక ఆచరించినను వాటి ఫలములు పొందక తప్పదు.

2) మానవునికి ఉపయోగపడే నిత్య జీవితం సత్వర సత్యం వాస్తు శాస్త్రం. అందుకే గృహాలకు వాస్తు శాస్త్రం తప్పనిసరి. నిత్య జీవితంలో ఇది ఎందుకు ఎలా ఉపకరిస్తుందో తెలుసుకోవడం తప్పనిసరి. ప్రతి వ్యక్తి ముఖ్యంగా తన ఆయుర్ధాయము, ధనవృద్ధి, ఆరోగ్యం, సంఘంలో గౌరవం పలుకుబడి తదితరాలను పొందాలని ఎలా యోచిస్తాడోఅవి నెరవేరాలంటే తాను నిర్మించవలసిన గృహం యొక్క వాస్తు శాస్త్ర ప్రకారం షోడసవర్గ శుద్ధి మొదలగునవి చూసుకుంటే శుభ వలములు ప్రాప్తి పొందుతారు.

భూమికి 2 రకములయిన తత్వములు ఉంటాయి. 1) గుణతత్వం 2) వాస్తుతత్వం. ఈ భూగోళం ఒక వలయాకారంగా నుండి ఆనుక్షణం కదలిక కలిగినదై తను చుట్టూ తాను తిరుగుచూ సూర్యుని చుట్టూ తిరుగుచున్నదని సమాచారం. ఈ ప్రక్రియలో వివిధ తత్వాలు ఏర్పడడం, వాస్తు, జీవసంతతి వృద్ధి పొందే ఆలోచనకు అందనిది. జ్ఞాన దృష్టితో చూడదగినది. కావున వాస్తు శాస్త్రం తప్పనిసరి.

అలాగే మన వాస్తు శాస్త్రంలో 4 భాగములు ఉన్నాయి. అందులో 1) శిల్ప వాస్తు, 2) జలవాస్తు 3) గృహ వాస్తు 4) గర్భవాస్తు శాస్త్రములు ప్రాచీర్యము. వీటిలో గృహ వాస్తునకు వినియోగింపబడతాయి.ఒక గృహాన్ని నిర్మించ తలపెట్టిన తాన ముందుగా

## వాస్తు సిద్ధాంతకులు మాచిరాజు వశిష్ట

ఏర్పరుచుకొన్న స్థలం ఎట్టిది, తత్వ గుణములు ఎట్లా ఉన్నాయి, ఆ స్థల చుట్టు వైశాల్య కొలతలు, స్థల ఆకారము, దిక్కులు, వీధి దిక్కులు, మేరక పల్లములు, గోతులు, భూ సంతతి వగైరాల విషయాలు తెలుసుకోవాలి. అదే విధంగా గృహానికి ఎన్ని ద్వారములు, కిటికీలు, అలమారాలు ఉంచవలయును వాటి స్థానములు ఎక్కడెక్కడో తెలిసికొనుట మరియు గృహం కొలతలు, ద్వార ధనం, రుణం, ఆయం, ఆయుర్ధాయం వగైరా తెలుసుకోవడం ముఖ్యం.

5) మన ప్రాచీన శాస్త్ర విజ్ఞనము



పరమ సత్యం. శ్రీరాములు అరణ్య వాసం చేసే సమయంలో పర్ణశాల

(మిగతా 104వ పేజీలో)

# సాహితీ సౌరభాలు గుబాళించిన తెనాలి

(ప్రభాతవార్త, తెనాలి)

కళల రాజధాని తెనాలి సాహితీ రంగంలోను తనదైన ఖ్యాతి వహించింది. వివిధ సాహితీ ప్రక్రియలలో తెనాలి పండితులు ఘనకీర్తి వహించిన చరిత్ర ఉంది. 16వ శతాబ్దంలో విజయనగర శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలలో ఒకరిగా మహాకావ్యాలను రచించిన తెనాలి రామకృష్ణకవి (గార్లపాటి రామలింగం) తెనాలికి చెందిన పండితుడే. తెనాలి రామలింగకవి ఇక్కడి శ్రీరామేశ్వరస్వామి ఆలయానికి బహూకరించిన ఉత్సవ విగ్రహం నేటికీ ఈ ఆలయంలో ఉంది. ప్రాచీన తెలుగు సాహిత్యంలో తెనాలికి పదిలమైన స్థానాన్ని సమకూర్చిన రామకృష్ణకవి పేరిట తెనాలిలోని టెలిఫోన్ ఎక్స్చేంజ్‌కు రామకృష్ణ భవన్‌గా నామకరణం కావించారు. గత శతాబ్దంలో రెండు, మూడు దశకాలలో తెనాలి సాహితీ వైభవ పునరుద్ధరణకు అంకురార్పణ జరిగింది. పండితులు తల్లావజుల శివశంకరశాస్త్రి, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి వంటి ప్రముఖులు 'సాహితీ సమితి'ని ఏర్పాటుచేసి సాహిత్యానికి, కవిత్వానికి బాటలు వేశారు. 1940లో రాష్ట్రంలోనే ప్రప్రథమంగా 'అభ్యుదయ రచయితల సంఘం'(అరసం) తెనాలిలో ప్రారంభించారు. మహాకవి శ్రీశ్రీ, తాపీ ధర్మారావు, ఆరుద్ర, 'చాసో' వంటి సాహితీవేత్తలు హాజయ్యారు. ఆ తర్వాత సాహితీసేద్యం చేసినవారిలో త్రిపురనేని రామస్వామిచౌదరి, ఆయన కుమారుడు గోపీచంద్, గుడిపాటి వెంకటచలం, కొడవటిగంటి కుటుంబరావు ఉన్నారు. మహిళాభ్యుదయం, స్త్రీ విమోచన కోసం చలం తన రచనల ద్వారా చేసిన కృషి సాహితీలోకంలో ప్రకంపనాలు కలిగించిన విషయం తెలిసిందే. 'మైదానం',

(మిగతా 105వ పేజీలో)




త్రిపురనేని రామస్వామి, ఆలూరి బైరాగి





# వాస్తు శాస్త్రం పరమ సత్యం

103వ పేజీ తరువాయి

నిర్మాణంలో వాస్తు శాస్త్రం అనుసరించి, నిర్మించి వాస్తు పూజా కార్యక్రమములు చేసారని శ్రీ మద్రామాయణంలో చెప్పడం జరిగింది.

మయసభ వృత్తాంతము అందరికీ తెలిసిందే. మయ నిర్మితమగు లంకా శోభనము వాల్మీకి అద్వితీయముగా వివరించారు. అందులో నివసించిన రావణుడు నరసంపద, ధన సంపద, వస్తు వాహనాది సమస్త సంపదలతో తులతూగి త్రిలోక విజేయఅయ్యాడు. అందువల్లనే చరిత్ర ప్రకారం శ్రీ ఆంజనేయస్వామి లంకా దహనం కావించి, రావణున్ని వాస్తు బలహీనునిగా చేసి శ్రీరాములు రావణున్ని జయించినాడు.

మన ప్రథమ ప్రధాని అయిన నెహ్రూ యావద్భారతీయుల చేతనే కాక ఖండ ఖండాంతర ప్రజలచే ప్రశంసలు అందుకొని, చిరస్మరణీయుడయ్యేందుకు కారణం ఆయన నివశించిన అలహాబాదులోని ఆనందభవనమే కారణమని వాస్తు శాస్త్రజ్ఞులు చెబుతారు. ఈ కారణంగానే మన అభివృద్ధి మనుగడ, ఉజ్వల భవిష్యత్తు పొందుటకు వాస్తు శాస్త్రము ప్రాధాన్యత సంతరించుకొన్నది.

అటులనే మన దేవాలయ సంబంధ వాస్తును పరిశీలిస్తే తిరుమల శ్రీ వెంకటేశ్వర స్వామి గుడి, శ్రీశైలం శ్రీ భ్రమరాంబిక మల్లికార్జునస్వామి గుడి వగైరాలు ఆగమన వాస్తు శాస్త్ర ప్రకారము నిర్మితమై, దేదీప్య మానముగా నిత్యకళ్యాణము పచ్చతోరణముగా వెలుగొందుతోంది. కాని వాస్తు విధముగా కట్టిన కట్టడములు ప్రస్తుత పరిస్థితులలో వారి అవసరములను అనుగుణంగా మార్చి కొన్ని అనర్థాలకు దారి తీస్తున్నారని వినతి. మన దేవాలయంలకే వాస్తు ప్రభావం అంత వుంటే సమాన్య మానవ జీవితంలపై వాస్తు ప్రభావం ఎంత అధికంగా ఉంటుందో ఊహకందని సత్యం.

వాస్తు శాస్త్ర కనుగుణంగా కట్టుకున్న గృహాలకు శంకుస్థాపన గృహప్రవేశమునకు మంచి ముహూర్తములు, వాస్తు పూజ చేయుట అంతయే ముఖ్యం. వాస్తు పురుషుని షోడశోపచారములతో పూజించాలి.

శ్లో : వాస్తు పురుష నమస్తేస్తు భూశయ్యా నిరత: ప్రభో
మదహ్యాం ధనధాన్యాది సమృద్ధి కురు సర్వదా
మహా మేరుగిరి స్సర్వ దేవతా నామ ధామయా
తత్వం బ్రహ్మాది దేవానా మహం గేహ స్థిరోభవ
వాస్తు మూర్తి: పరం జ్యోతి వాస్తు దేవ: పరశి
వాస్తు దేవస్తు సర్వేషాం వాస్తు దేవం నమామ్యహమ్.

వాస్తు పూజ జరిపించిన యెడల సకల ఐశ్వర్యములు పొందుతారు. లేని పక్షంలో నానా అరిష్టములు పొందుదురు.

సర్వే జన సుఖినో భవంత్

శాంతి శాంతి శాంతి

# సాహితీ సౌరభాలు గుబాళించిన తెనాలి

104వ పేజీ తరువాయి

'దైవమిచ్చిన భార్య', 'బ్రాహ్మణీకం' వంటివి ఆయన రచనలలో ముఖ్యమైనవి. తెనాలి మునిసిపల్ చైర్మన్‌గా మూడు పర్యాయాలు ఎన్నికైన త్రిపురనేని రామస్వామి మానవతావాదిగా, అభ్యుదయవాదిగా, హేతువాదిగా పేరుగాంచారు. ఆయన నిర్వహించిన 'సూతాశ్రమం' ద్వారా భావవిప్లవ వ్యాప్తికి, సామాజిక చైతన్యానికి కృషిచేశారు. 'సూతపురాణం', 'ఖూనీ', 'భగవద్గీత', 'వివాహవిధి', 'సూతాశ్రమగేయాలు' వంటి ఎన్నో రచనలు ఆయన చేశారు. త్రిపురనేని కుమారుడు గోపీచంద్ నవలా రచయితగా, కథా రచయితగా నూతన ఒరవడి సృష్టించారు. 'అసమర్థుని జీవనయాత్ర', 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా', 'చీకటిగదులు', 'మెరుపులు-మరకలు' ఆయన రచనలలో ప్రధానమైనవి. కొడవటిగంటి కుటుంబరావు తన రచనలలో మధ్యతరగతి కుటుంబాలలోని 'కుళ్లు'ను కడిగారు. 'నాట్యవేదం' రాసి మంచిపేరు సంపాదించిన తెలుగు, సంస్కృత పండితుడు జమ్మలమడక మాధవరాయశర్మ స్వస్థలం తెనాలికి దగ్గరలోని పెదరావూరు. 'కళాప్రపూర్ణ' కొండూరు వీరరాఘవాచార్యులు వేదాల పైనా, శిల్పశాస్త్రంపైనా వ్యాఖ్యానాలనేగాక 'లేపాక్షి', 'మోహనాంగి','అమరావతి', 'శిల్ప కళాక్షేత్రాలు' వంటి అనేక రచనలు చేశారు. ఆంధ్రలో ఆర్య సమాజ ఉద్యమ సారధి వేదాలు, ఉపనిషత్తులపై ప్రామాణిక వ్యాఖ్యాత పండిత గోపదేవ్‌శాస్త్రి స్వస్థలం తెనాలి దగ్గర్లోని కూచిపూడి. 'మధురకవి' మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి, 'శివపురాణం' రచయిత ములుగు చంద్రమౌళిశాస్త్రి, డాక్టర్ రావూరి భరద్వాజ తన సాహితీ జీవితాన్ని తెనాలిలో ప్రారంభించారు. 'సమత', 'ఉరితాడు' నవలల రచయిత్రి వాసిరెడ్డి సీతాదేవి, రచయిత్రి డాక్టర్ కె.కృష్ణకుమారి, రచయిత డాక్టర్ కొత్త రవీంద్రబాబు తెనాలికి చెందినవారే.తెనాలికి చెందిన డాక్టర్ జి.వి కృష్ణారావు పాశ్చాత్య తత్వశాస్త్రంపై 'ప్లేటో జేగంటలు', 'కాంట్ పరతత్త్వవాదం' వంటి రచనలు, కవితా విమర్శనాగ్రంధం కావ్య జగత్తును, కీలుబొమ్మలు, పాపికొండలు, నాగార్జునాచార్యులపై 'విగ్రహ వ్యావర్తని' రచనలతో పేరెన్నికగన్నారు. 'నూతిలో గొంతుకలు' వంటి రచనల ద్వారా తెలుగు, హిందీ కవితా సాహిత్యాలలో ఆలూరి బైరాగి(బైరాగి) కీర్తిశిఖరాలను అధిరోహించారు. కళాతపస్వి డాక్టర్ సంజీవదేవ్ 'రసరేఖలు', 'తేజోరేఖలు', 'రూపారూపాలు', 'సంజీవ్‌దేవ్ లేఖలు', 'లేఖలలో సంజీవదేవ్' వంటి తెలుగు గ్రంధాలను, 'బ్లూబ్లూమ్స్', 'హార్‌లైఫ్' వంటి ఆంగ్ల రచనలను చేసి భాషా మాధుర్యానికి లాలిత్యానికి, పద సౌందర్యానికి తనకు తానేసాటిగా పేరు పొందారు. అనేక తాత్త్విక రచనలను ఆంగ్లం, తెలుగు భాషలలో రాసి ఖ్యాతినార్జించిన తిరుపతి ఎస్.వి విశ్వవిద్యాలయ మాజీ వైస్‌ఛాన్సలర్, తత్వవేత్త ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తి స్వగ్రామం తెనాలి మండల గ్రామం సంగంజాగర్లమూడి. 'రాష్ట్రగానం', 'ఉదయగానం', 'గాంధీ' వంటి దేశభక్తి ప్రబోధ రచనలు చేసి 'గాంధీకవి'గా, తెలుగులెంకగా పేరుగాంచిన తుమ్మల సీతారామమూర్తి కూడా తెనాలి డివిజన్‌కు చెందిన ప్రముఖుడే. 'అంతర్యామిని'. 'సామాన్యుని కామన' వంటి రచనల ద్వారా అంతర్యామినిగా మనిషిలో ప్రేమనిగూఢమై ఉంటుందని చెబుతూ జీవిత విలువలను చాటిన ప్రముఖ కథా రచయిత 'హితశ్రీ', 'అరవిందుల సాహిత్యాన్ని' తెలుగులోకి తీసుకువచ్చిన 'శార్వరి', 'శారద' కలం పేరుతో 'మంచీ చెడూ', 'అపస్వరాలు', 'విధివంచితురాలు' వంటి తన నవల ద్వారా నటరాజన్ పరిస్థితుల ప్రభావం వల్ల వ్యక్తులు తమ ఉనికిని కోల్పోయే వైనాన్ని కళ్లకు కట్టారు. బాలసాహిత్యం, గ్రంధాలయోద్యమంపై పరిశోధనలు చేసిన గ్రంధాలయ విజ్ఞాన పరిశోధకుడు డాక్టర్ వెలగా వెంకటప్పయ్య తెనాలికి చెందినవారే. ప్రముఖ రచయిత్రి పుటుకూరి లక్ష్మీకాంతమ్మ ఈ డివిజన్‌కు చెందినవారే. అలానే ప్రముఖ నవలా రచయిత నోరి నరసింహశాస్త్రి, రచయితలు రాజ్యలక్ష్మి, పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, కొండముది శ్రీరామచంద్రమూర్తి, భారతీనిరుక్తి గ్రంధాన్ని హిందీలోకి అనువదించి వేదాంతంపై తెలుగులో రచనలు చేసిన జనస్వామి సుబ్రమణ్యశాస్త్రి తెనాలికి చెందినవారే. కుటుంబ సమస్యలు, గ్రామీణ ఇతివృత్తాలపై ఆధారపడి 'కొత్తిల్లు' వంటి అనేక నవలలు, అసంఖ్యాకంగా కథలను రాసిన తాళ్లూరి నాగేశ్వరరావు స్వస్థలం తెనాలి. ప్రముఖ నవలా రచయితగా 'రేరాణి', 'అభిసారిక', 'జ్యోతి' మాసపత్రికల సంపాదకునిగా గుర్తింపు పొందిన ధనికొండ హనుమంతరావు, సినీసాహితీ స్రష్టలు చక్రపాణి, బొల్లిముంత శివరామకృష్ణ, మోదుకూరి జాన్సన్, వేటూరి సుందరరామమూర్తి, శతాధిక నాటకరచయత కొడాలి గోపాలరావు తెనాలికి చెందినవారే. నవలా, కథారచయితలు ఎం.డి సౌజన్య, బొల్లిముంత నాగేశ్వరరావు,దోనేపూడి రాజారావు, వడ్లమన్నాటి కుటుంబరావు, చారిత్రక అంశాలపై రచనలు చేసిన కొడాలి లక్ష్మీనారాయణ, కవులు బూర్గుల గోపాలకృష్ణమూర్తి, అత్తోట రత్నకవి, నూతక్కి అబ్రహాం, రచయితగా, హ్యూమనిస్టు ఉద్యమ ప్రముఖునిగా పేరుగాంచి 'సమీక్ష', రాడికల్ హ్యూమనిస్టు పత్రికలకు చాలాకాలం సంపాదకత్వం వహించిన స్వర్గీయ కోగంటి రాధాకృష్ణమూర్తి, 'జ్యోతి' 'రేరాణి', 'అభిసారిక','సినీమా' నిర్వాహకునిగా, 'మిసిమి' సంపాదకునిగా పేరుగాంచిన కీర్తిశేషుడు ఆలపాటి రవీంద్రనాథ్, ప్రస్తుతం మిసిమి పత్రికకు సంపాదకత్వ బాధ్యతలు వహిస్తున్న అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి, కవిరాజు త్రిపురనేని స్మారక అవార్డు గ్రహీత వరుచూరు అచ్యుతరాం, 'నూరేళ్ల తెనాలి రంగస్థలి' రచయత నేతి పరమేశ్వరశర్మ కూడా తెనాలికి చెందినవారే. సాహితీ రంగంలో ఇంతటి ఘనకీర్తి పొందిన తెనాలిలో ఆ ప్రాభవం క్రమేణా మసకబారుతోంది. సాహితీ కార్యక్రమాల నిర్వహణ దాదాపు మృగ్యమైంది. గత వైభవ పునరుద్ధరణ సాధ్యమో? కాదో? కాలమే చెప్పాలి.

# సేంద్రియ సేద్యంలో పరిశోధనకు ఉత్తమ అవార్డు

(ప్రభాతవార్త -అమరావతి)

కుల వృత్తికి సాటి లేదన్న సూక్తిని ఒంట బట్టించుకునేవారు చాలా అరుదుగా వుంటారు. కుల వృత్తి అంటే కుటుంబం అనాదిగా అవలంభిస్తున్న వృత్తి అని కూడా నిర్వహించుకోవాల్సి వుంటుంది. గతంలో ఈ సూక్తికి న్యాయమే జరిగింది కానీ తర్వాత కులమే కాదు వృత్తి కూడెట్టదు అనుకున్నట్లుగా పల్లెల నుంచి వచ్చే యువత సైతం ఇంజనీరింగ్, మెడిసిన్ లాంటి ఉన్నత విద్యలు అభ్యసించి విదేశాలకు ఎగిరిపోసాగింది. అయితే కాలం ఎల్లకాలం ఒక్కలా వుండదు, భూమి గుండ్రంగానే వుంటుందనేందుకు నిదర్శనంగా యిప్పుడు వైద్యుల పుత్రులు మెడిసిన్ చదివితే రాజకీయ రంగంలోను సినీ ఫీల్డులో సైతం వారసత్వాలు ఎదిగి వస్తున్నాయి. ఇంత జరుగుతున్న రైతు కుటుంబంలో మార్పు ఇంకా ఇలాంటి వారసత్వ వోజు నాటుకుంటున్న దాఖలాలు లేవు. కాకపోతే అక్కడకూడా అన్నిట్లో ఉన్నట్లు ఇందులోను మినహాయింపులుంటాయి. ఇలాంటి మినహాయింపులకు తార్కాణమే గోవిందరెడ్డి జీవనం. వ్యవసాయ శాస్త్రంలో నిష్ణాతులైన ఇటీవలే గణ తంత్ర దినోత్సవ సందర్భంగా గుంటూరు జిల్లా కలెక్టరు జయలక్ష్మి నుంచి ఉత్తమ సేవా పతకం పొందిన ఈ సీనియరు సైంటిస్టు జీవన రేఖ యువతులకు ఆదర్శ ప్రాయం కావాలి.



కలెక్టర్ చేతుల మీదుగా అవార్డు అందుకుంటున్న సీనియర్ శాస్త్రవేత్త కె.గోవిందరెడ్డి

రైతు కుటుంబం నుంచి వచ్చిన గోవిందరెడ్డి ఆ రంగంలోని కష్టనష్టాల గురించి బాగా తెలిసినవారు. స్వానుభవంతో వ్యవసాయ రంగానికి సంబంధించిన ఆయన ఎన్నో వ్యాసాలు వ్రాశారు. రసాయనిక వ్యవసాయమే రైతు ఆత్మహత్యలకు మూలమని తేల్చి చెప్పిన భూసార శాస్త్రవేత్త రైతు సోదరులందరూ తన సోదరులని భావిస్తుంటారు. అందుకే కరవు కాటకాల నుంచి ఇతర ఈతి బాధల నుంచి రక్షించాలనుకున్నారు. మరో వైపు మితిమీరిన రసాయనిక ఎరువులు పురుగుమందులు వాడకంలో నిర్వీర్యమైపోతున్న అనంలో భూసార శక్తిని కాపాడాలనేది ఆయన తపన. తద్వారా నానాటికి తరిగిపోతున్న పంట దిగుబడులు పెరిగిపోతున్న వ్యవసాయ ఖర్చులు అదుపుచేయాలనుకుంటావుంటారు. తద్వారా అప్పులు వడ్డీమీద చక్రవడ్డీలు అప్పుల ఊబిలో చిక్కి అందులో నుంచి బయటపడలేక కొత్త అప్పులు ఇచ్చే నాధుడు దొరకక కళ్ళ ముందు దైన్యంగా కనిపిస్తున్న భార్యా బిడ్డల్ని చూసి భరించలేక ఆత్మ హత్యల పాలవుతున్న రైతు సోదరుల్ని వారి భార్య బిడ్డల ఆర్తనాదాన్ని విని తట్టుకోలేక పోయారు.

అందుకే ఆయన రసాయన శాస్త్ర పారంగతుడైనను రసాయనిక వ్యవసాయ వ్యవసాయమే రైతు ఆత్మహత్యలకు మూల కారణం అని తేల్చి చెప్పిన వ్యక్తి అంతేగాక అభ్యుదయ రైతుల్ని సేంద్రీయ వ్యవసాయం వైపు మరల్చి రైతు ఆత్మహత్యలకు అడ్డుకట్ట వేయాలన్న ధృడ సంకల్పంతో అడుగు ముందుకు వేశారు. ఇందులో భాగంగా గుంటూరు జిల్లా గారపాడు గ్రామంలో అభ్యుదయ రైతు డాక్టర్ కె. వి.ఎన్.బి. కుమార్ సేంద్రీయ వ్యవసాయం ద్వారా తక్కువ పెట్టుబడితో ఎక్కువ నికర ఆదాయం తెప్పించి రైతులంతా సేంద్రియ వ్యవసాయం చేయబడితే రైతు సోదరుల ఆత్మహత్యల గురించి ఆలోచింపబని లేదన్నారు. రైతు కుటుంబంలో జన్మించిన గోవిందరెడ్డి వ్యవసాయ శాస్త్రంలోను బిఎస్సీ ఎంఎస్సీ కూడా చదివి పరిశోధనలు జరపడం ద్వారా డాక్టరేట్: పట్టా పొందిన నిష్ణాతుడు. మెట్ట భూముల్లో అధిక దిగుబడులు సాధించడం ఎలా అనే అంశంపై సాగించిన పరిశోధన 1996 లో ఆచార్య ఎన్.జి. రంగా విశ్వ విద్యాలయం నుంచి పిహెచ్‌డి పట్టా అందించింది.



సేంద్రీయ వ్యవసాయ ద్వారా అధిక దిగుబడి ఇచ్చిన వరి

బాపట్ల వ్యవసాయ కళాశాలలో అయిదేళ్ళు, లాంఫారంలో పదేళ్ళు హైదరాబాదులో ఆరేళ్ళు అసిస్టెంట్‌గా వ్యాపకం కొనసాగిన్తా మిర్చి మొక్కజొన్న తదితర పంట నాణ్యత దిగుబడి పెంచడానికి అవకాశాలు శోధించారు. గత నాలుగు సంవత్సరాలుగా అమరావతి వ్యవసాయ పరిశోధన శాలలో జీవన ఎరువుల ఉత్పత్తి నాణ్యత అమ్మకాలపై పరిశోధనలు జరుపుతున్నారు. ఈ పరిశోధనలు ఫలితంగా నిరుడు 30 శాతం అధికోత్పత్తి సాధించారు. ఈ విశిష్ట పరిశోధనలు సేవా పలితాలు చూసే కృష్ణా, గోదావరి సీమఅసోసియేషన్ ఫలితాలు పులకింతులై డాక్టరు గోవిందరెడ్డికి ఉత్తమ సేవా అవార్డు ప్రకటించారు. గణ తంత్ర దినోత్సవం నాడు వరకు అవార్డు ప్రదానం జరిగింది. **మిగతా 109వ పేజీలో**



డాక్టర్ కె.వి.ఎన్.బి.కుమార్, వరిరైతు



డాక్టర్ కె.గోవిందరెడ్డి, సీనియర్ శాస్త్రవేత్త

'వార్త'కు శుభాకాంక్షలతో.....

107

# అభివృద్ధి పథంలో పిడుగురాళ్ళ నగర పంచాయతి



శ్రీ డా॥ వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి | శ్రీ కోనేరు రంగారావు, మున్సిపల్ శాఖా మంత్రి | శ్రీ ధర్మాన ప్రసాదరావు, జిల్లా ఇన్‌చార్జ్ మంత్రి | శ్రీ కన్నా లక్ష్మీనారాయణ, రాష్ట్ర సహకార, రవాణా శాఖామాత్యులు | శ్రీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, పార్లమెంట్ సభ్యులు, నరసరావుపేట | శ్రీ జంగా కృష్ణమూర్తి, శాసనసభ్యులు, గురజాల | శ్రీ ముమ్మడి బలరామకృష్ణ, చైర్మన్ : పిడుగురాళ్ళ నగర పంచాయతీ

## నగర పంచాయతీగా మార్పుచెందిన పిడుగురాళ్ళ నందు ఈ క్రింది విధంగా అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టి నిర్వహించబడుతున్నాయి.

★ రూ. 30.75 లక్షలతో సెంట్రల్ లైటింగ్

★ రూ. 31.80 లక్షలతో సిమెంట్ రోడ్లు మరియు కాలువల నిర్మాణం

★ రూ. 35.60 లక్షలతో సెంట్రల్ డివైడర్లు

★ రూ. 10.00 లక్షలతో కొత్తగా విద్యుత్ స్తంభాలు

★ రూ. 24.30 లక్షలతో జాతీయ మురికివాడల పథకం కింద మురికివాడల అభివృద్ధి

★ రూ. 10.00 లక్షలతో కరువు ప్రాంతాల అభివృద్ధి

★ రూ. 5.00 లక్షలతో ప్రత్యేక పారిశుద్ధ్య చర్యలు చేపట్టడం జరిగింది.

★ ఇందిరమ్మ పథకం కింద ఎంపికైన 1, 5, 6, 9, 12, 14 వార్డులలో మౌళిక సదుపాయాల ఏర్పాటుకు కృషిచేయడం జరుగుతుంది.

★ జాతీయ మురికివాడల అభివృద్ధి కొరకు ఎన్.ఎస్.డి.పి.మరియు ఇఐ స్కీమ్ కింద సుమారు రూ. 30 లక్షలతో సిమెంట్ రోడ్లు, సైడుకాల్వల నిర్మాణం జరుగుటకు కృషి చేయుచున్నారు.

### నూతన ప్రణాళికలు

★ రూ. 11.26 కోట్లతో కృష్ణాజలాలతో మంచినీటి సరఫరా

★ రూ. 2.15 కోట్లతో మేజర్ డ్రైన్స్ నిర్మాణం

★ రూ. 11.93 కోట్లతో అండర్‌గ్రౌండ్ డ్రైనేజి నిర్మాణం

★ కుమ్మరిపాలెం, రజకకాలనీ తదితర ప్రాంతాలలోని మంచినీటి ఎద్దడి తొలగించుటకు గాను రూ. 15.00 లక్షలతో పైపులైన్లు పొడిగించుటకు చర్యలు

★ ఐ.ఎల్.సి.ఎస్. స్టేజ్ పథకం కింద అర్హులై పేదకుటుంబాల వారికి రూ. 45.00 లక్షలతో సుమారు 1000 వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణం చేపట్టుటకు ప్రతిపాదనల తయారీకి చర్యలు

★ రాజీవ్‌గృహకల్ప పథకం కింద పేద మరియు అల్పాదాయ వర్గాల కుటుంబాల వారికి రుణసౌకర్యంతో 240 గృహముల నిర్మాణం కొరకు చర్యలు

★ పట్టణ శాశ్విత గృహనిర్మాణ పథకం కింద 2005-06 సంవత్సరానికి కేటాయించబడిన 501 గృహ నిర్మాణముల కొరకు లబ్దిదారుల ఎంపిక పూర్తి

★ రాజీవ్ యువశక్తి పథకం కింద. 72 మంది నిరుద్యోగ యువతీ యువకులకు స్వయం ఉపాధికై 44 యూనిట్ల స్థాపనకు లబ్దిదారుల ఎంపిక, రుణముల మంజూరు కొరకు చర్యలు

★ నగర పంచాయతీ నందు 3,600 కుటుంబాల వారికి కొత్తరేషన్‌కార్డులు మంజూరు

★ ఉపాధి కార్యక్రమంలో భాగంగా నిరుద్యోగ యువతీ యువకులకు వృత్తివిద్యలో శిక్షణ ఇచ్చుటకు లబ్దిదారుల ఎంపిక కొరకు చర్యలు

★ పట్టణపు పూర్తిస్థాయి అభివృద్ధి కొరకు వార్డుల వారీ ప్రణాళికల తయారీకి చర్యలు

★ ఐ.డి.ఎస్.ఎం.టి. వంటి పథకముల ద్వారా షాపురూమ్‌లు, మార్కెట్లు మొదలగువాటి నిర్మాణం కొరకు ప్రతిపాదనల తయారీకి చర్యలు

★ మురికివాడలను గుర్తించి సమగ్రాభివృద్ధి కొరకు ప్రతిపాదనలు తయారీకి చర్యలు

★ పట్టణ ప్రజలను చైతన్యపరచి గృహముల నుండి వచ్చు చెత్త మరియు పదార్థములను ఇండ్ల వద్ద నుండే నగర పంచాయతీ పారిశుద్ధ్య సిబ్బందిచే సైకిల్ రిక్షాల ద్వారా సేకరణ చర్యలు

★ పేద కుటుంబాలలోని మహిళలను చైతన్యపరచి పొదుపుసంఘాల ఏర్పాటు కొరకు చర్యలు

★ నగర పంచాయతీ కార్యాలయం నందు సిటిజన్ చార్టర్ అమలుకు చర్యలు

★ ప్రజాసమస్యల పరిష్కారం పట్ల పూర్తిస్థాయి జవాబుదారితనము మరియు బాధ్యతతో మెలుగుటకు సిబ్బందికి శిక్షణ ఇప్పించుటకై చర్యలు

## పిడుగురాళ్ళ నగర పంచాయతీ కౌన్సిలరు

| | | | | |
|---|---|---|---|---|
| గుండా శ్రీనివాసరావు<br>వైస్‌చైర్మన్ | ఎం.డి. గఫార్<br>1వ వార్డు | వడ్డవల్లి ఉషారాణి<br>2వ వార్డు | వేముల శివపార్వతి<br>3వ వార్డు | తురకా వీరస్వామి<br>4వ వార్డు |
| బత్తుల పిచ్చమ్మ<br>5వ వార్డు | కొక్కెర కొండలరావు<br>6వ వార్డు | బాడిశ రవికుమార్<br>7వ వార్డు | తుంగా సీతమ్మ<br>8వ వార్డు | గుర్రం అప్పిరెడ్డి<br>9వ వార్డు |
| చల్లగుండ్ల సంతోషరావు<br>10వ వార్డు | కాండ్రకుంట కన్నయ్య<br>11వ వార్డు | చల్లా సీతారామిరెడ్డి<br>12వ వార్డు | మందా డానియేలు<br>13వ వార్డు | కొదమగుండ్ల లెనిన్‌కుమారి<br>15వ వార్డు |
| జూలకంటి సుబ్రహ్మణ్యం<br>16వ వార్డు | పిల్లి భారతి<br>17వ వార్డు | నాళం శకుంతల<br>18వ వార్డు | వెన్ను నీలాంబరి<br>20వ వార్డు | |
| కో-ఆప్షన్ సభ్యులు | పఠాన్ మాబు | పసుపులేటి ఏసమ్మ | పి. పూర్ణచంద్రరావు, కమిషనర్<br>పిడుగురాళ్ళ నగర పంచాయతీ | |

# నాటి ప్రతిభకు నేడు సన్మానం

## అంతర్జాతీయ క్రీడాకారులను గుర్తిస్తున్న వైనం

(ప్రభాతవార్త-గుంటూరు)
అంతర్జాతీయంగా ఎన్నో క్రీడా పోటీల్లో విశేష ప్రతిభ కనబరచిన క్రీడాకారులను ప్రస్తుతం క్రీడాలోకం గుర్తించడం జరుగుతోంది. ఆనాటి ప్రతిభకు నేడు సన్మానాలు చేయడం జరుగుతోంది. పలు క్రీడా పోటీల్లో అంతర్జాతీయ, జాతీయ క్రీడారంగంలో రాణించిన క్రీడాకారులను నిర్వాహకులు ఘనంగా సన్మానించి వారి క్రీడా న్పూర్తిని చాటి చెప్పారు. ఏ క్రీడాకారుడైనా తాను సాధించిన రంగంలో గుర్తింపు పొందినవాడే అతను వరిపూర్ణంగా, ఆనందాన్ని పొందగలుగుతాడు. దానికి నిదర్శనంగా గుంటూరు క్రీడారంగం క్రీడల్లో ఎంతో శ్రమించి జాతీయ, అంతర్జాతీయ పోటీల్లో పాల్గొని అటు దేశానికి, రాష్ట్రానికి, జిల్లాకు కీర్తి ప్రతిష్టలను తీసుకువచ్చిన క్రీడాకారులను గుర్తించి వారికి సన్మానం చేయడం గర్వించదగ్గ విషయం. ఇటీవల ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ ఆధ్వర్యంలో బి.ఆర్.స్టేడియంలో జరిగిన ఎం.పి.వి.అనంత మెమోరియల్ ఆర్టీసి రాష్ట్రస్థాయి అథ్లెటిక్ పోటీల ముగింపు కార్యక్రమంలో జిల్లా అథ్లెటిక్ క్రీడారంగంలో ప్రతిభ కనబరచిన క్రీడాకారులను, కోచ్‌లను సన్మానించారు.

అథ్లెటిక్ కోచ్‌గా ఎంతో మంది క్రీడాకారులను జిల్లా నుంచి తయారు చేసి జాతీయ స్థాయిలో పేరు ప్రఖ్యాతులు సాధించిన క్రీడాకారులను అందించిన అథ్లెటిక్ కోచ్ ఎం.రంగారావు, జాతీయ అథ్లెటిక్ పోటీల్లో డిస్కస్‌త్రోలో పతకాలు సాధించి ఎందరో మన్ననలు పొందిన ఎం.లక్ష్మిరాజ్యాన్ని, మలేషియాలో జరిగిన ఏషియన్ వెటరన్ అథ్లెటిక్ పోటీల్లో భారతదేశం నుంచి పాల్గొనడమే కాకుండా జిల్లా అథ్లెటిక్ సంఘం కార్యదర్శిగా ఎంతో మంది క్రీడాకారులను అందించిన జి.శేషయ్యను, అర్జున అవార్డు గ్రహీత ఎం.శ్రీనివాసరావులు పౌర సమాచార శాఖ మంత్రి షబ్బీర్ ఆలీ, రాష్ట్ర రోడ్డు రవాణా, సహకార శాఖ మంత్రి కన్నా లక్ష్మీనారాయణ, ఆర్టీసి వైస్‌ఛైర్మన్, మేనేజింగ్ డైరెక్టర్ ఎం.వి.కృష్ణారావు, గుంటూరు-1 శాసనసభ్యులు షేక్ సుభానీ, నగర మేయర్ కన్నా నాగరాజు, డిప్యూటీ మేయర్ తాడిశెట్టి మురళీమోహన్‌లచే సన్మానించబడ్డారు. ఈ పోటీల నిర్వహణకు విచ్చేసిన ఆర్ట్స్ కో స్పోర్ట్స్ ఆఫీసర్‌గా పని చేస్తున్న అంతర్జాతీయ వాలీబాల్ క్రీడాకారుడు వెంకట నారాయణను జిల్లా స్పోర్ట్స్ అధారిటీ క్రీడాభివృద్ధి అధికారి ఎ.పి. బాలకోటంరాజు, వాలీబాల్ కోచ్ సురేష్, జిల్లా పి.ఇ.టి.ల సంఘం, కార్యదర్శి డి.శంకరరావు, జిల్లా అథ్లెటిక్ సంఘం కార్యదర్శి జి.శేషయ్య, బాస్కెట్‌బాల్ అకాడమీ చీఫ్ కోచ్ రమణ, వాలీబాల్ క్రీడాకారులు, బాస్కెట్‌బాల్ అకాడమీ క్రీడాకారులు సన్మానించారు.

వెంకటనారాయణ దాదాపు 22 అంతర్జాతీయ వాలీబాల్ పోటీల్లో పాల్గొని భారతదేశానికి కీర్తి ప్రతిష్టలు ఇనుమడింపజేసారని, ఆయనను ఆదర్శంగా ప్రతి క్రీడాకారుడు తీసుకోవాలని వ్యాఖ్యానించారు.


అంతర్జాతీయ వాలీబాల్ క్రీడాకారుడు వెంకటనారాయణను సన్మానిస్తున్న డి.ఎస్.డి.ఓ. బాలకోటంరాజు


ఎం.రంగారావును సన్మానిస్తున్న మంత్రి షబ్బీర్ అలీ


ఎం.లక్ష్మిరాజ్యంను సన్మానిస్తున్న మంత్రి షబ్బీర్ అలీ


ఎం.శ్రీనివాస్‌ను సన్మానిస్తున్న మంత్రి షబ్బీర్ అలీ

# వరి సాగులో విజయుడైన అధ్యాపక రైతు డా.కెవిఎన్‌వి కుమార్

(ప్రభాతవార్త-అమరావతి)

ఆయన వృత్తి రీత్యా అధ్యాపకుడు ప్రవృత్తి స్వయం కృషి అందుబటులో ఉన్న వనరులలో అధికోత్పత్తి అంటే నాణ్యమైనది సాధించటమే ఆయన ధ్యేయం. గుంటూరు జాగర్లమూడి కుప్పల స్వామి చౌదరి కళాకారుల వాణిజ్య విభాగం రీడర్‌గా ఉన్న కె.వి.ఎన్. బి. కుమార్ దృష్టి వ్యవసాయం వైపు మళ్ళింది. అయినా వాణిజ్య పంటలపై మోజు లేకపోవడం విశేషం. పదుగురికి పొట్ట నింపే వరి సాగులో ప్రగతి సాధించాలన్న తపన మొదలైంది. అంతట అమరావతి వ్యవసాయ పరిశోధన స్థానం అధిపతి సీనియర్ శాస్త్రవేత్త డాక్టరు కర్నాటి గోవిందరెడ్డిని కలిసి సేంద్రియ వ్యవసాయ విధానం ద్వారా అధిక నాణ్యత, అధిక దిగుబడిని వరి పంటలో ఏ విధంగా సాధించగలమని ప్రశ్నించడం జరిగింది. వరిసాగులో సేంద్రియ, జీవన, రసాయనిక ఎరువులు సమ్మేళనంతో వరినారు పోత నుంచి వరి కోతవరకు దృఢమైన వరి నారు అధిక దిగుబడి, నాణ్యతగల వరి పైరు అనుసరించవలసిన విధానాన్ని ఈ కింది విధంగా అమలు చేయడం జరిగింది. వరి నారుమడి తయారు చేసిన విధానం 5 సెంట్ల వరి నారు మడిని ముందుగా దున్నించడం జరిగింది. రెండు సార్లు గొర్రు తోలించాలి. చదును చేసి 250 కిలోల మెత్తని పశువుల ఎరువుని చల్లి నీరు పెట్టాలి.

**వరి నారుమడి పోసిన విధానం :-**

500 గ్రాముల బెల్లాన్ని 3 లీటర్ల నీటిలో కలిపి వేడి చేసి చల్లార్చిన బెల్లపు ద్రావణంలో 500 గ్రాముల అజోస్పైరిల్లమ్ కలిపి బిపిటి5204 విత్తనానికి పట్టించి నీడ ప్రదేశంలో రెండు గంటలు ఆరబెట్టి నారుమడితో చల్లి నీరు పెట్టాలి. ఈ జీవన ఎరువును ఉపయోగించే ముందు విత్తన శుద్ధికి 60 కిలోల విత్తనానికి 300 గ్రాముల ట్రైకోడెర్మా విరిడి మరియు 300 గ్రాముల ఫ్లూరోకేర్‌ను ఉపనయోగించడం జరిగింది.

**వరి నారు పెంచిన విధానం :-**

నారు పోసిన తరువాత 5వ రోజున 1 కిల్తో జింక్ సల్ఫేట్ 1 కిలో ఫెర్రస్ సల్ఫేట్ ఇసుకలో కలిపి వరి నారు మడిలో చిమ్మించారు. నారుమడి చల్లిన పదవ రోజున ఒకసారి కలుపు తీయించి 5 కిలోల వేప పిండిని, 10 కిలోల 20:20 బలం మందుతో కలిపి నీళ్ళు చిలకరించి అరగంట ఆగాక బస్తాలతో ఎత్తించి మరునాడు నారుమడితో చల్లించారు. 300 గ్రాముల అజోస్పైరిల్లమ్‌ను 25 కిలోల మాగిన పశువులు ఎరువుతో క



లిపిచల్లడం జరిగింది. 10 లీటర్ల నీటిలో 20 మి.మీ అజాడిరాక్టివ్ కలిపి స్ప్రే చేయడం జరిగింది.

**వరి మడి దమ్ము చేసిన విధానం :-**

దమ్ము చేయడానికి ముందు రోజు (25వ రోజున) 12 కిలోల వేప పిండిని 30 కిలోల అక్షయ సేంద్రియ ఎరువును 15 టన్నుల పశువుల ఎరువును 700 గ్రాముల ఫ్యాస్పో బ్యాక్టీరియా, 200 గ్రాముల అజోస్పైరిల్లమ్ చిమ్మించి దమ్ము చేయడానికి నీరు పెట్టించడం జరిగింది. 26వ రోజున దమ్ము చేయించి పొలాన్ని నాటుక సిద్ధం చేశారు. '27వ రోజున ఉదయాన్నే ట్రైకోడెర్మా 60 గ్రాములు, ఫ్లూరోకార్ 60 గ్రాములు, 20 లీటర్ల నీటిలో కలిపి ద్రావణాన్ని తయారు చేయించడం జరిగింది.

పీకిన వరినారును 15 నిమిషాలు ఈ ద్రావణంలో ఉంచిన తర్వాత పొలంలో నాటటం జరిగింది.

**వరి నాటుకు ముందు వాడిన ఎరువు మోతాదు :-**

నాటే ముందు దమ్ము చేసిన పొలంలో 440 గ్రాముల ఫూరోకేర్‌ను 440 గ్రాముల ట్రైకోడెర్మాను 200 కిలోల కంఫొస్టు ఎరువుతో కలిపి చల్లడం జరిగింది.

6. వరినారు నాటిన తర్వాత వేసిన ఎరువుల మోతాదు నాటిన 5వ రోజున 20 కిలోల యూరియాను 7 కిలోల వేప పిండిని ముందు రోజే కలిపి ఉంచిన దానిని పొలంలో వేయించడం జరిగింది. నాటిన 10వ రోజున 50 కిలోల వానపాముల ఎరువు జీవన ఎరువులైన ఫాస్పో బ్యాక్టీరియా 4 కిలోలు, అజోస్పైరిల్లమ్ 4 కిలోలు వేయడం జరిగింది. నాటిన 28వ రోజున వానపాముల ఎరువు 65 కిలోల వేప పిండి 10 కిలోలు అక్షయ సేంద్రియ ఎరువు 30 కిలోల యూరియా 20 కిలోల ఫోటాష్ పది కిలోలు కలిపి వేయడం జరిగింది.

**పిలకలు వేయు సమయమున చల్లిన ఎరువుల మోతాదు :-**

నాటిన తర్వాత 45వ రోజున 10 కిలోల సూపర్, 10 కిలోల ఫోటాష్ 16 కిలోల వేపపిండి, 25 కిలోల అక్షయ సేంద్రీయ ఎరువు కలిపి వేయడం జరిగింది. 47వ రోజున ఒకేసారి 480 మి.లీ. అజాడి రాక్టిన్ 500 లీటర్ల నీటిలో కలిపి పైరు పై ఊ పిచికారి చేయడం జరిగింది. 8. పిలకలు వేసిన తర్వాత చల్లిన ఎరువులు, పురుగు మందులు ఎరువుల నాటిన తర్వాత 54వ రోజున 20 కిలోల వేపపిండి 1 కిలో పోర్ టాక్స్ గుళికలు 20 కిలోల అక్షయ సేంద్రియ ఎరువును 50 కిలోల వానపాముల ఎరువును ముందు రోజే కలిపి నీళ్ళు చిలకరించి బాస్తాలలో ఎత్తి మరసటి రోజున పొలంలో చిమ్మించారు. పురుగుమందులను 1 లీటరు అజాడి రాక్టివ్ 250 లీటర్ల నీటిలో కలిపి రెండు సార్లు (వారం వ్యవధిలో) పిచికారి చేయడం జరిగింది.

**వరి వెన్నులు రాక ముందు వాడిన ఎరువులు పురుగు మందులు :-**

ఎరువులను నాటిన తర్వాత 62 రోజున 20కిలోల వేప పిండి 12 1/2 కిలోల డిఎపి 25 కిలోల వానపాముల ఎరువు, పదికిలోల అక్రమ సేంద్రియ ఎరువు వేయటం జరిగింది. పురుగు మందులు బలేరియా బసియానా 1 కిలోను రెండు సార్లు వారం వ్యవధిలో 200 లీటర్లతో కలిపి పిచికారి చేశారు.

దానిలో తడవకి 1/4 లీటరు అజాడివిక్టిన్ కూడా కలపి స్ప్రే చేశారు.

**వరి వెన్నులు వచ్చిన తర్వాత వేసిన ఎరువులు పురుగు మందులు :-**

10 కిలోల వానపాముల ఎరువు,10 కిలోల వేప పిండి 20 కిలోల అక్షయ సేంద్రియ ఎరువును చల్లించారు. పురుగు మందులు :- 1 కిలో మెటారైజియమ్ ఎన్ సోప్లియాను 250 లీటర్ల నీటిలోకలిపి పిచికారి చేశారు. వారం రోజుల వ్యవధిలో రెండు సార్లు పిచికారి చేయడం జరిగింది. మరొక వారంలో 100 మి.లీ లీటర్ల కాంటాఫ్ 50 మిల్లీ లీటర్ల కాన్పిడార్‌ను స్ప్రే చేయడం జరిగింది. సేంద్రియ ఎరువులు వాడటం వలన ప్రయోజనాలుకు తక్కువ పెట్టుబడి అధిక ఆదాయం నాణ్యత గల సరుకు ఉత్పత్తి దోమ బెడద తట్టుకుంటుంది. బియ్యం విరుగుడు తక్కువ పురుగు పట్టకుండా నిల్వ ఉంచవచ్చు. గడ్డి పశువులకు ఆరోగ్యాన్ని కలుగ చేస్తుంది. అన్నం రుచిగా వుంటుంది. పర్యావరణ హాని ఉండదు.

పిచికారి బలం మందుల వినియోగం చాలా తక్కువ. పంట అందరి కన్నా పది రోజుల ముందుకు కోతకు వస్తుంది. రసాయనిక ఎరువులు తక్కువ వాడటం వలన భూసార నిల్వలు పెరుగుతున్నాయని శాస్త్రవేత్త గోవిందరెడ్డి చెప్పారు.

# ప్రపంచస్థాయి అత్యుత్తమ ఎయిర్‌కండీషనర్లను అందిస్తోన్న విజయ్ టి.వి వీడియో హోం

(ప్రభాతవార్త-గుంటూరు)

గత 25 ఏళ్ళుగా నాణ్యమైన ఎలక్ట్రానిక్ గృహోపకరణాల విక్రయంలో నమ్మకమైన సంస్థగా పేరుగాంచిన విజయ్ టి.వి.వీడియో హోం సంస్థల నుంచి రాబోయే వేసవిని దృష్టిలో పెట్టుకుని ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన 13 కంపెనీల ఎయిర్‌కండీషనర్లను అందిస్తున్నట్లు హోం అధినేత జవ్వాది గంగాధరరావు తెలిపారు. గుంటూరు జిన్నాటవర్‌ప్రాంతంలోని చందనబ్రదర్స్ వద్ద గల విజయ్ టి.వి. వీడియో హోం, అరండల్‌పేటలోని డిజిటల్ స్క్వేర్, జిన్నాటవర్ రెవెన్యూ కాంప్లెక్స్‌లోని విజయ్ వీడియో హోం, తెనాలి గాంధీ చౌక్‌లోని విజయ్ టి.వి. వీడియో హోం, ఒంగోలు కర్నూలు రోడ్డులోని డిజిటల్ స్క్వేర్ లో ప్రపంచపు అత్యున్నత స్థాయి ఎసిలను అందజేస్తున్నామన్నారు. అధునాతన టెక్నాలజీ గల వీడియోకాన్, కెన్‌స్టార్, ఓల్టాస్, ఎల్.జి., శ్యామ్‌సింగ్, టిసిఎల్, హుండాయ్, ఒనిడా, గోద్రేజ్, హిటాచీ, ఎలక్ట్రోలక్స్, షార్ప్, బ్లూస్టార్ తదితర ఎయిర్ కండీషనర్లు అందుబాటు ధరలలో తమ షోరూమ్‌లలో లభిస్తాయన్నారు. నాణ్యమైన ఎయిర్ కండీషనర్ల విక్రయాలతో పాటు నమ్మకమైన సర్వీసును సైతం అందజేయడం విజయ్ వీడియో హోం ప్రత్యేకతని గంగాధరరావు పేర్కొన్నారు. ఒకప్పుడు ఉన్నతవర్గాల వారు సైతం కొనగలిగేవారని, దిగువ మధ్య తరగతి వారు కూడా కొనగలిగే స్థాయిలో అందుబాటు ధరలలో ఉన్నాయన్నారు. వాతావరణ కాలుష్య నేటి పరిస్థితులలో మన వాతావరణానికి తగ్గ ఎయిర్ కండీషనర్లు వాడవలసిన అవసరం ఉందని, అటువంటి నేటి పరిస్థితులలో ఎయిర్ కండీషనర్ల ఆవశ్యకత ఎంతో ఉందని ఆయన వెల్లడించారు. రు. 12 వేల నుంచి లక్ష రూపాయల వరకు ఎయిర్ కండీషనర్ల అందుబాటులో ఉన్నాయన్నారు. ఎలక్ట్రానిక్ రంగంలో సాంకేతిక విప్లవం సంభవించి, పోటీతత్వం పెరిగి ధరలు అందరికీ అందుబాటులోకి రావడంతో నేడు సామాన్యులు కూడా టివిలు, ఎయిర్‌కండీషనర్లను నిత్యవసర వస్తువులుగా వినియోగించగలుగుతున్నారన్నారు. తొలినాళ్ళలో నాన్ రిమోట్ ఎసిలు ఉండేవని, నేడు విండో రిమోట్ ఎయిర్ కండీషనర్లు, స్ప్లిట్ ఎయిర్‌కండీషర్లు, టవర్ ఎ.సి.లు అందుబాటులోకి వచ్చాయన్నారు. నేటి రోటరి కంప్రెషర్లతో కూడిన ఎసిల సౌండ్ తక్కువగా ఉంటుందని, సామర్థ్యం ఎక్కువని, విద్యుత్ వినియోగం కూడా తక్కువగా ఉంటుందన్నారు. వీడియోకాన్, ఐనైజర్, ఎల్‌జి ప్లాస్మా, షార్ప్ ప్లాస్మాక్లస్టర్, శ్యాంసంగ్ సిల్వర్ నానో ఎయిర్‌కండీషనర్లు ఇందుకు ఉదాహరణగా ఆయన పేర్కొన్నారు. నాణ్యతతో పాటు అందుబాటు ధరల ఎసిలను తమ సంస్థ లక్ష్యమని గంగాధరరావు పేర్కొన్నారు. కొత్తగా ఎయిర్‌కండీషనర్లు కొనుగోలు చేసేవారికి తమ గ్రూపు సంస్థల షోరూంలలో డెమో ఇవ్వడం జరుగుతుందని, 0.5 టన్నుల నుంచి 3 టన్నుల వరకు ఎయిర్ కండీషనర్లు తమ షోరూంలో అందుబాటులో ఉన్నాయన్నారు. వినియోగదారులు తమకు కావలసిన ఎయిర్‌కండీషనర్లను హడావుడి పడకుండా ముందుగానే ఎంచుకుని కొనుగోలు చేసుకున్నట్లయితే బాగుంటుందని విజయ్ టి.వి., వీడియో హోం అధినేత గంగాధరరావు పేర్కొన్నారు.

## ప్రాచీన సంస్కృతి కేంద్రం ప్రకృతి సోయగాలకు నిలయం

# భైరవకోన

ఒక ప్రక్క రాచరికపు చిహ్నాలకు ప్రతీకగా మరో ప్రక్క ప్రకృతి సోయగాలతో పర్యాటకులను ఆకర్షించే భైరవకోన పుణ్యక్షేత్రం ఇప్పుడిప్పుడే పర్యాటక కేంద్రంగా రూపుదిద్దుకొంటున్నది. జిల్లాలోనే అతిప్రాచీన సంస్కృతితో ముడిపడి ఉన్న ఈ క్షేత్రం కేంద్ర ప్రభుత్వ పురావస్తు శాఖ ఆధీనంలో ఉండగా రాష్ట్ర ప్రభుత్వం పర్యాటక కేంద్రంగా గుర్తించింది. కాలగర్భంలో కలిసిపోయిన రాజసానికి, వైభవానికి, కళాతృష్ణకు, దైవభక్తికి మూగసాక్షిగా నిలిచిన శైవక్షేత్రం ఈ భైరవకోన.

### ఎలావెళ్ళాలి...

ప్రకాశం - నెల్లూరు జిల్లాల సరిహద్దుల్లో తూర్పు కనుమలు దగ్గరగా కనిగిరి నియోజకవర్గం సి.ఎస్.పురం మండల పరిధి కొత్తపల్లెకు తూర్పున

(మిగతా 115వ పేజీలో)

# రైతుల అభివృద్ధికి మరింత కృషి

## డిసిసిబి ఛైర్మన్ కుర్రి పున్నారెడ్డి



కుర్రి పున్నారెడ్డి

కేంద్ర సహకార బ్యాంకు ద్వారా రైతులను రెండు రకాల రుణాలు మంజూరు చేయడం జరిగింది. మొదటిగా స్వల్ప కాలిక రుణాలు పంటలు పండించుకోటానికి ఈ రుణాలు ఇస్తున్నట్లు జిల్లా కేంద్ర సహకారబ్యాంక్ ఛైర్మన్ కుర్రి పున్నారెడ్డి వెల్లడించారు. ప్రభాతవార్తకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆయన పలు అంశాలను వివరించారు. 2005 ఏప్రిల్ 5 వరకు 120 కోట్లు రుణాలు ఇచ్చినట్లు అధికారులు తెలిపారు. రెండవది దీర్ఘకాలిక రుణాలు ట్రాక్టర్లు, పంప్ సెట్లు, హార్టికల్చర్, గొర్రెలు, మేకలు, కొనుగోలు చేయడానికి ఈ రుణాలను మంజూరు చేస్తున్నట్లు వివరించారు. 2005 వరకు 12 కోట్లు మంజూరు ఇంకా మార్చి నాటికి అదనంగా 8 కోట్లు మంజూరు చేయాలని భావిస్తున్నట్లు తెలిపారు. ప్రభుత్వం తరపున 6 శాతం వడ్డీ రాయితీ ప్రకటించడం జరిగిందని తెలిపారు. ప్రతి ఏటా సకాలంలో రుణాలు కడుతున్న వారికి మాత్రమే ఈ అవకాశం కల్పించినట్లు అధికారులు చెప్పారు. గత సంవత్సరంలో జిల్లాలోని 120 వేల మందికి 10 కోట్లు రూపాయలు వడ్డీ రాయితీ ఇచ్చినట్లు వివరించారు. బ్యాంకు ద్వారా 2005 సంవత్సరంలో ఖరీఫ్‌లో 46 సంఘాలకు సుమారుగా 5 వేల మెట్రిక్ టన్నుల ఎరువుల వ్యాపారం చేయడం జరిగిందని, ఇది కూడా ఎరువు కొరతగా వున్న సమయంలో చేశామని తెలిపారు. గత సంవత్సరం 400 మెట్రిక్ టన్నులు ద్వారా వ్యవస్థకు ప్రాధాన్యత ఇవ్వడం జరిగిందని రాబోయే కాలంలో దీనిని 3 రెట్లు పెంచడానికి కృషి చేస్తున్నట్లు అధికారులు పేర్కొన్నారు. కాల చక్ర డిపాజిట్లు ద్వారా 26 రోజుల్లో 4.87 కోట్లు డిపాజిట్లు స్వీకరించినట్లు మార్చి నాటికి 20 కోట్లకు పెరుగుదల కృషి చేస్తున్నట్లు తెలిపారు. రాష్ట్ర ప్రభుత్వం ఎస్.హెచ్.జి. ద్వారా 100 కోట్లు ప్రణాళిక ఏర్పాటు చేయాలని భవిష్యత్ ప్రణాళికగా చెప్పారు. రానున్న సంవత్సరంలో 5 శాఖలు కంప్యూటరైజేషన్ చేస్తున్నట్లు అధికారులు తెలిపారు. రైతు మిత్ర సంఘాలు 52 కి 47 లక్షలు మంజూరు చేసినట్లు తెలిపారు. రానున్న సంవత్సరంలో బడ్జెట్ ద్వారా రుణాలు పెంచే అవకాశం కలదని తెలిపారు. భవిష్యత్‌లో 6శాతం డివిడెండ్లు ఇవ్వవలసి వస్తుందని, 2001 సంవత్సరంలో మొదటిగా ఇవ్వడం జరిగిందని కుర్రి వున్నారెడ్డి తెలిపారు.

**గోడౌన్‌లు :-** ఐ.సి.డి,పి. క్రింద చైర్మన్ ఆధ్వర్యంలో కేంద్ర ప్రభుత్వాలు నిధులు వస్తాయని తెలిపారు. 30గోడౌనుల నిర్మాణానికి కోటి 8 లక్షల రూపాయలు, 43వాటికి రిపేర్లు చేయనున్నామని ఇందుకు 27 లక్షల రూపాయలు కేటాయించామని 16 ఆఫీసులకు 30 లక్షలు కేటాయించినట్లు చెప్పారు. వ్యాపార సంఘాలు సంఘాలు 224 లక్షలు కౌంటర్ల నిర్మాణానికి 36 సొసైటీలకు 23 లక్షలరూపాయలు, ఫర్నిచర్ కు 39 సొసైటీలకు 8 లక్షలు 36 సంఘాలుకి బ్యాంకింగ్ కౌంటర్ ఐరన్ సేఫ్ లాకర్‌లకు 23 లక్షలు మంజూరు చేస్తున్నట్లు తెలిపారు. 39 సంఘాలకి ఫర్నిచర్ కొరకు 7 లక్షల 80 వేలు మంజూరు చేసినట్లు వివరించారు. 91 సంఘాలకు ఎరువులు వ్యాపారం చేసుకోవటానికి 2 కోట్ల 24 లక్షలు మంజూరు చేశామన్నారు. 34 పొదుపు సంఘాలకి 7 లక్షల 35 వేల మంజూరు చేశారు. పై వాటికి మొత్తం మీద 6 కోట్ల 80 లక్షలు మంజూరు చేసినట్లు కుర్రి పున్నారెడ్డి తెలిపారు.

**(ప్రభాతవార్త-గుంటూరు)**



# మహనీయ చిత్రకారుడు గుర్రం మల్లయ్య

(ప్రభాతవార్త-తెనాలి)

మనకంటూ మిగిలిన కొద్దిపాటి సంస్కృతి పరిరక్షణకు జీవితాంతం శ్రమించిన అరుదైన వ్యక్తులను సమాజం మరిచిపోయింది. కళను, కళాఖండాలను పదిలపరచి భావితరాలకు కళాసంపదను అందించాలని తపనపడ్డ ప్రఖ్యాత చిత్రకారుడు గుర్రం మల్లయ్య అలాంటి అరుదైన మహనీయుల్లో ఒకరు. కళ, దేశం ఉఛ్వాసనిశ్వాసాలుగా భావించిన మల్లయ్య గుంటూరుజిల్లాకు అంతర్జాతీయంగా గుర్తింపును తెచ్చారు. అయితే తన జీవితాన్ని మాత్రం సంపూర్ణంగా నాశనం చేసుకొని అనామకుడిగా రాలిపోయారాయన. సృష్టికి ప్రతిసృష్టి చేయగల చిత్రకారుడిగా తన కుంచెతో సాగర్ మోడల్ డ్యామ్ రూపకల్పన చేశారాయన. రోజువేతనంపై కూలీలను నియమించి ఆనాటి తవ్వకాల్లో కళాసంపదను ఏరించి జాగ్రత్తచేశారు. నాగార్జునకొండ మ్యూజియం ఏర్పాటుకు మల్లయ్య కారకుడు. 2005తో ఆయన శతజయంతి పూర్తయింది కూడా!

మాచర్ల మండలం కొత్తూరులో



గుర్రం మల్లయ్య

1904లో జన్మించారు గుర్రం మల్లయ్య. విశ్వకవి రవీంద్రుడు స్థాపించిన శాంతినికేతన్‌లో రచయిత అడవి బాపిరాజు, ప్రఖ్యాత చిత్రకారుడు దామెర్ల రామారావు సహధ్యాయిగా శిక్షణ పొందిన మల్లయ్య బందరు జాతీయ కళాశాలలో చిత్రకళ అధ్యాపకుడిగా జీవితాన్ని ప్రారంభించారు. కుటుంబ కారణాల వల్ల స్వగ్రామానికి తిరిగొచ్చి మాచర్ల కేంద్రంగా తన చిత్రకళను కొనసాగించారు. చిత్రకళలో మొఘల్, రాజపుత్రుల శైలిని తీసుకొని అందులో మనదైన సంప్రదాయాన్ని జోడించటం మల్లయ్య ప్రత్యేకత. ఒకవైపు చిత్రకళ, మరోవైపు శిల్పం, ఫొటోగ్రఫీ, మోల్డర్‌లో కూడా మల్లయ్య పేరుపొందారు. ప్రమోద్‌కుమార్ ఛటర్జీ, దేవీప్రసాద్‌రాయ్ చౌదరి వంటి కళాహృదయాలతో సమానంగా శిక్షణ సంస్థను ఏర్పాటుచేయాలని భావించి, 'నాగార్జున చిత్రకళా

మిగతా 113వ పేజీలో

# మహనీయ చిత్రకారుడు గుర్రం మల్లయ్య

112వ పేజీ తరువాయి

సమితి' పేరిట చిత్రకళాశాలను ఆరంభించారు. అప్పట్లో హైదరాబాద్‌లో లేని సంస్థను మాచర్లలో చంద్రవంక ఒడ్డున దేశవ్యాప్తంగా పేరొందిన గగనేంద్ర రాగూర్, నందన్‌లాల్ బసు వంటి అగ్రశ్రేణి చిత్రకారుల్ని తన సంస్థకు విజిటింగ్ ప్రొఫెసర్లుగా ఆహ్వానించి వారిచేత చిత్రకళలో మెలకువలను బోధించారు. అంతేకాదు..శాంతినికేతన్‌తో సహా మొత్తం దేశంలోని అనేక కళాకేంద్రాల్లో తెలుగు చిత్రకళ శైలి గురించి ప్రసంగించిన తెలుగువాడు గుర్రం మల్లయ్య. తెలుగు సినిమా పరిశ్రమలో తన కుంచెకు తిరుగులేని గౌరవం పొందిన కళాదర్శకుడు మాధవపెద్ది గోఖలే గుర్రం మల్లయ్య ప్రత్యక్ష శిష్యులు. ఆయనే కాదు..గంజి రామారావు, తోగటి రామారావు వంటి వారు కూడా మల్లయ్య కళావారసులే. అప్పట్లో ఆ చిత్రకళా కేంద్రాన్ని రాష్ట్రంలోని ప్రముఖ రాజకీయనాయకులు, ఇతరులు సందర్శిస్తుండేవారు. ఇంతటి కీర్తిని సంపాదించినా కళను అమ్ముకోవటం ఇష్టంలేని కారణంగా మల్లయ్య ఆర్థికంగా అవస్థలు పడాల్సి వచ్చింది. గోఖలే వంటి శిష్యుల ఆహ్వానంపై అయిష్టంగానే మద్రాసు వెళ్లి కొన్ని సినిమాలకు కళాదర్శకత్వం వహించారు. అయినా అక్కడి వాతావరణంలో ఇమడలేక సినీజీవితాన్ని వదులుకొని మాచర్లకు తిరగొచ్చారు. నిత్యం తన కుంచెకు పదునుపెడుతూ అద్భుతమైన కళాఖండాల్ని సృష్టించారు. ఇప్పటికీ ఆయన చిత్రాలు పలుచోట్ల సందర్శకులకు చక్కని అనుభూతుల్ని పంచుతున్నాయి. ఢిల్లీలోని నేషనల్ ఆర్ట్ గ్యాలరీ గుర్రం మల్లయ్య చిత్రాలను కొన్నింటిని భద్రపరచింది. కొన్ని చిత్రాలను కార్డులుగా ముద్రించారు. కర్ణాటకలోని శృంగేరీపీఠంలో పూజలందుకొంటున్న 'నటరాజు' వీరి సృష్టే. జీవితంలో ఎన్నో ఎదురుదెబ్బలు తిన్నా మనోనిబ్బరం పోగొట్టుకోకుండా కళకు జీవం పోశారాయన.



మల్లయ్య కుంచె జాలువారిన చిత్రం

### నాగార్జునసాగర్‌తో అనుబంధం

స్వాతంత్ర్యం కోసం జరిగిన సహాయ నిరాకరణోద్యమం, ఉప్పుసత్యాగ్రహం, క్విట్ఇండియా ఉద్యమాల్లో పాల్గొన్న గుర్రం మల్లయ్య ఇప్పటి నాగార్జునసాగర్ ప్రాజెక్టుతో ఎంతో అనుబంధం ఉంది. 1935లో నందికొండ ప్రాజెక్టు కోసం నిజాం నవాబు ఏర్పాటుచేసిన సర్వేసంఘంలో సభ్యుడిగా ఉన్నారు. పల్నాడు తాలూకా నందికొండ ప్రాజెక్టు కమిటీ కార్యదర్శిగా నాగార్జునసాగర్‌డ్యామ్ నిర్మాణం కోసం 1950లో జరిగిన ప్రజాందోళనకు నాయకత్వం వహించారు. ముక్త్యాలరాజా తయారు చేయించిన మ్యాపులు, పటాలు పరిశీలించి సాగర్ నమూనా ప్రాజెక్టును మల్లయ్య తన కుంచెతో వేశారు. ఖోస్లా కమిటీ పర్యటన కోసం రహదారి బాగుకు రైతులకు కలిసి శ్రమదానం చేశారు. ప్రాజెక్టు ఉద్భవిస్తున్న తొలిదశలో అనేక గ్రామాల్లో వందలాది ప్రజలకు రోజుకూలి ఏర్పాటుచేసి నాగార్జునకొండ తవ్వకాల్లోని కళాఖండాలను ఏరి జాగ్రత్తపరిచారాయన. సాగర్ ప్రాజెక్టు ఒక ఎత్తయితే నాగార్జునకొండ కళాసంపద ఒక ఎత్తు. ఎనలేని శిల్పరాశులను కాపాడి ఆంధ్రులకు మంచి చేసిన మల్లయ్య కారణంగానే ఇవాళ అక్కడి శిల్పాలకు,

మిగతా 114వ పేజీలో

113వ పేజీ తరువాయి

భౌద్ధనిర్మాణాలకు నమూనాలు తయారయ్యాయి. ఎక్కడి దొరికిన శిల్పం అక్కడ దొరికిన వివరాలు జాబితా తయారుచేసి ప్లాస్టర్ ఆఫ్ పారిస్ నమూనాలు చేసి మ్యూజియం రూపొందటానికి కృషిచేశారాయన. అంతేకాదు. ప్రముఖ చిత్రకారులను కూడగట్టి గుంటూరుజిల్లా మొత్తంమీద శిల్పకళాసంపదను పరిరక్షించే పథకాలు తయారుచేశారు. సంస్కృతి సంపదను పరాయివాళ్ల పట్టుకుపోకుండా రాస్తారోకో నిర్వహించి తన పట్టుదలను చాటారు. నాగార్జునసాగర్ ప్రాజెక్టు శంకుస్థాపనకు వచ్చిన అప్పటి ప్రధాని నెహ్రూకు గుర్రం మల్లయ్య స్వాగతోపన్యాసం చేశారు. అదేసభలో విలువైన బౌద్ధపలకాలు జలాశయంలో మునిగిపోకుండా కొండపై మ్యూజియం ఏర్పాటుచేయాలని మల్లయ్య ప్రతిపాదించారు. ఈ సభలో నెహ్రూ, జస్టిస్ ఖోస్లాలు మల్లయ్యను అభినందించారు. ఆవిధంగా ఆర్థిక ఇబ్బందులు అనుభవిస్తూనే చిత్రకళకు, కళాసంపద పరిరక్షణకు జీవితాంతం కృషిచేసిన మల్లయ్య నీతినియమాలకు మారుపేరుగా జీవించారు. స్వచ్ఛమైన ఖాదీని ధరించి నిర్మలంగా కనిపించే గాంధేయవాది అయిన మల్లయ్య తన 80వ సంవత్సరంలో తనకు జన్మనిచ్చిన మాచర్లలోనే కన్నుమూశారు. ఆయన సేవలకు గుర్తింపుగా మల్లయ్య విగ్రహాన్ని ప్రతిష్టించాలని అప్పట్లో కొంత ప్రయత్నం జరిగింది. ఇప్పటికి ఆ ప్రయత్నం కార్యరూపం దాల్చలేదు. కనీసం ప్రభుత్వమైనా ఇందుకు పూనుకోవటం ద్వారా ఆయనకు నివాళి అర్పించాలి.

# మహనీయ చిత్రకారుడు గుర్రం మల్లయ్య





మహనీయ చిత్రకారుడు గుర్రం మల్లయ్య కుంచె నుంచి జాలువారిన చిత్రాలు

# భైరవకోన

111వ పేజీ తరువాయి

అయిదు కిలోమీటర్ల దూరంలో వాతావరణ కాలుష్యానికి దూరంగా, సహజ ప్రకృతి సోయగాలతో, ఎటు



కొండ శిఖరం నుండి ప్రవహిస్తున్న జలపాతం

చూసినా ఎత్తైన కొండల సముదాయాల మధ్యలో ఈ క్షేత్రం విరాజిల్లుతోంది.

☆ ఒంగోలు - పొదిలి - కనిగిరి - సి.ఎస్.పురం ల మీదుగా భైరవ కోన చేరవచ్చు (145 కి.మీలు).

☆ ఒంగోలు - కందుకూరు - మాలకొండ - పామూరు - సి.ఎస్. పురం మీదుగా భైరవకోన చేరవచ్చు. (160 కి.మీలు)☆ ఉదయగిరి - సీతారామపురంల మీదుగా భైరవకోనకు చేరవచ్చు. (60 కి.మీలు)

☆ సి.ఎస్.పురం మండలం అంబవరం కొత్తపల్లి నుండి భైరవకోనకు కాలినడకన, లేదా వాహనాల ద్వారా 5 కి.మీలు ప్రయాణం చేసి క్షేత్రాన్ని చేరుకోవచ్చు.

**ఏకశిలా నిర్మిత అష్టగుహాలయాలు:** ఒకే రాతిలో, వివిధ కళారీతులతో నిర్మించిన ఎనిమిది ఆలయాలు ప్రాచీన హిందూ సంస్కృతి, వాస్తు శిల్ప కళారీతులకు అద్దం పడుతూ భైరవకోనకు తలమానికగా ఉన్నాయి. మూడంతస్థుల్లో నిర్మించిన ఈ గుహాలయాల్లో వివిధ పరిమాణాల్లో శివలింగాలు ప్రతిష్ఠించబడి ఉన్నాయి. వినాయకుడు, ఛండేశ్వరుడు, బసవేశ్వరుడు, సూర్యుడు, చంద్రుల్ని మలిచారు. ఈ ఆలయాల మధ్యలో తక్కిన ఏడు ఆలయాలకు సుమారు రెండడుగుల కింద భాగాన దుర్గాదేవి ఆలయం నిర్మించారు. ఇక్కడ సరస్వతి, లక్ష్మి, పార్వతి దేవతల మూడు ముఖాలను కలిగి భక్తులకు దర్శనమిస్తుంది. దుర్గాంబ దృష్టిని భక్తులు భరించలేరనే ఉద్దేశ్యంతో ఈశ్వర లింగాన్ని దుర్గాదేవి ముందు ప్రతిష్ఠించారని భక్తులు భావిస్తుంటారు. మానవుని సహజగుణాలైన సత్వ-రజో-తమో గుణాలకు దుర్గాదేవి మూడు ముఖాలు ప్రతిరూపాలని మరికొందరి అభిప్రాయం. దుర్గాంబ దేవాలయానికి సుమారు మూడడుగుల దిగువన ఏడాది పొడువునా సెలఏరు ప్రవహిస్తుంటుంది. వర్షాకాలంలో సెలఏరు నీటితో ఎంత ఉవ్వెత్తున ప్రవహించినా, మధ్యదూరం తక్కువైనా నీరు దుర్గాంబ గుడిలోకి ప్రవహించవు. చంద్రుని కాంతి కిరణాలు తక్కిన ఏడు దేవాలయాల్లో ప్రసరిస్తాయని అయితే ప్రతి సంవత్సరం కార్తీక మాసంలోని పౌర్ణమిరోజు రాత్రి 7-9 గంటల మధ్య చంద్రుని కాంతి కిరణాలు దుర్గాదేవి ఆలయంలో ప్రసరిస్తాయి. ఆ ఒక్క రోజు కోసం భక్తులు వేయికళ్లతో ఎదురు చూస్తుంటారు. ఆనాటి శిల్పులనైపుణ్యానికి నిదర్శనంగా దీనిని భక్తులు చెప్పుకుంటారు. దుర్గాదేవి ఆలయానికి ఎదురుగా ఉన్న పెద్ద రాతిపై ప్రత్యేకంగా క్షేత్ర పాల కుడైన కాలభైరవుడు విగ్రహాన్ని ప్రతిష్ఠించి ఆలయాన్నినిర్మించారు.

**అభేద్యమైన రాజుల కోట**

క్షేత్రానికి ఉత్తరం వైపు కొండ మీద పెద్ద పెద్ద రాళ్లతో అభేద్యమైన రాజుల నాటి కోట పల్లవ రాజులచే నిర్మించబడి ఉంది. కోటలోని రాజుల ప్రాకారాల వద్ద ఒక పెద్ద సొరంగ మార్గం ఉంది. ఈ సొరంగం పామూరు సమీపంలోని 'అనుమలగిరి' వరకు ఉందని ప్రజల అభిప్రాయం. దక్షిణంవైపు కొండ శిఖ రంపై పంచలింగాల ఘట్టం (లింగాలపెంట)అనే విశాలమైన ప్రదేశం ఉంది. ఇక్కడ పరశురాముడు శివాలయం నిర్మించియజ్ఞం చేశాడనిప్రతీతి.

**మనసును దోచే జలపాతం**

తూర్పువైపు పల్లపు ప్రాంతంలో కొండ శిఖరంపైనుండి జలపాతం ఏడాది పొడవునా పడుతూ ఉంటుంది. కొండ మీద త్రివేణి సంగమం, చిత్రకూటమి అనే పేర్లు గల సరస్సులు ఉన్నాయని, ఆ సరస్సుల నుండి నీరు పడుతూ ఉంటుందని, ఈ నీటిలో స్నానం చేస్తే దీర్ఘకాలిక, అంటువ్యాధులు పోతాయని భక్తుల నమ్మిక. నైరుతి ప్రాంతంలో ఉన్న గుహాలో

మిగతా 116వ పేజీలో



# భైరవకోన

115వ పేజీ తరువాయి

నారసింహం, మరొక గుహలో లక్ష్మీదేవి విగ్రహాలు ప్రతిష్టించి ఉన్నాయి. ఇక్కడ విస్తృత తవ్వకాలు జరిపితే అట్టగున పడి కనిపించని చరిత్ర వెలుగులోకి వస్తుంది.

**ఇక్కడ జరిగే ఉత్సవాలు**

ప్రతి ఏడాది శివరాత్రి, కార్తీక మాసంలోని పౌర్ణమి నాడు భైరవ కోన క్షేత్రం ఉత్స వాలు, తిరునాళ్లు, అడుగడుగునా భక్తకోటి జనసందోహంతో కళకళలాడుతుంది.

**పర్యాటక బస్ కూడా మూనాళ్ల ముచ్చటే**

ఈ క్షేత్రాన్ని పర్యాటక కేంద్రంగా గుర్తించిన నేపధ్యంలో జిల్లా అధికార యంత్రాంగం జిల్లా కేంద్రం నుంచి భైరవ కోనకు మాలకొండ మీదుగా ప్రతి శని, ఆదివారాల్లో పర్యాటక బస్‌ను ఏర్పాటు చేశారు. బస్‌లు ప్రారంభంలో పర్యటన కోసం వచ్చే విద్యార్థులతో కళకళలాడుతున్నాయి.

అయితే ఈ సంతోషం కొంత కాలానికే పరిమితమైంది. జిల్లాలో టూరిజం అధికారులు ఉండి కూడా ఈ క్షేత్రంపై ఎందుకు చిన్నచూపు చూస్తున్నారో అర్థం కావడంలేదు.

ప్రభుత్వం భైరవకోనను పర్యాటక కేంద్రంగా గుర్తించినా, పర్యాటకులను ఆకర్షించే విధంగా అవసరమైన సౌకర్యాలు కల్పించాల్సిన ఆవశ్యకత ఉంది.



క్షేత్ర పాలకుడు భైరవుడు, త్రిముఖ దుర్గాంబిక



ఏకశిలా నిర్మిత అష్టశివాలయాలు

# షడ్రుచుల విజ్ఞాన సరోవరం వేటపాలెం 'సారస్వత నికేతనం'

*నోరూరించే జీడిపప్పు చూస్తే అందరికీ ఠక్కున గుర్తొస్తుంది వేటపాలెం. సాహితీ ప్రియులకు షడ్రుచులందించే సార్వస్వత నికేతనం కూడా ఇక్కడ ఉంది. స్వాతంత్ర్యానికి పూర్వమే ఇక్కడ వెలసిన 'వేటపాలెం సారస్వత నికేతనం' సాహితీ ప్రియులకు విజ్ఞాన సరోవరంగా, విద్యావేత్తలకు, పరిశోధకులకు విజ్ఞాన బాండాగారంగా విలసిల్లుతోంది. ప్రాచీన గ్రంథాలు, సంస్కృత రాతప్రతులు, తాళపత్ర గ్రంథాలకు నిలయంగా ఉంది. 89 ఏళ్ళ నుంచి గ్రామ పంచాయతీ ఆధ్వర్యంలో నిర్వహిస్తూ వేలాది పుస్త కాలకు వేదికై ఎందరో పరిశోధ కులకు డాక్టరేట్‌లు అందిస్తూ దేశంలోనే అతిపెద్ద గ్రంథాల యాల్లో తనకంటూ ఉన్నత స్థానాన్ని సాధించింది సారస్వత నికేతనం. పాఠకులే పాలకులుగా మారి నడుపుతున్న ఏకైక విజ్ఞాన భాండాగారం ఇది.*

స్వాతంత్ర్యోద్యమ కాలంలో అప్పటి పరిస్థితులకు, అవసరాలకు అనుగుణంగా ఏర్పడిన ఈ గ్రంథాలయం నేటి ఆధునిక పోకడలను, నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని పరిజ్ఞానాన్ని ఉపయోగించుకుని దినదినాభివృద్ధి చెందుతున్నది. పాలకులు కూడా ఈ విజ్ఞాన బండాగారాన్ని కాపాడుకునేందుకు సహకరిస్తుండటం అభినందనీయం. ఈ గ్రంథాలయాన్ని జాతిపిత మహాత్మాగాంధీ వంటి ఎందరో జాతీయ నాయకులు సందర్శించి తమ అమూల్యమైన సందేశాలను ఇచ్చారు. సారస్వత నికేతనం ఆంధ్ర రాష్ట్రానికి ముఖ్యంగా ప్రకాశం జిల్లాకు తలమానికంగా నిలిచింది.



సారస్వత నికేతనం భవనం

ప్రకాశం జిల్లా వేటపాలెం గ్రామానికి చెందిన అభ్యుదయ భావాలు కలిగిన యువకులు కొందరు అప్పుడే ప్రజారంగంలో అడుగిడుతున్న ఊటుకూరి వెంకట సుబ్బా రావు శ్రేష్ఠి ప్రోత్స హంతో హిందూ యువజన సంఘం పేరుతో 1918 అక్టోబరు 15వ తేదీ విజయ దశమి రోజున ఈ గ్రంథాలయాన్ని ప్రారంభించారు. తొలుత నూరు గ్రంథాలు, రెండు దినపత్రికలు, మూడు వార పత్రికలతో ప్రారంభమై నేడు 79 వేల అరుదైన ప్రాచీన గ్రంథాలతో నిండి ఉంది. అయిదేళ్ళు నడిచిన పిమ్మట నిర్వహణ భారం పెరిగి మూతవేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఈ సమయంలో ఊటుకూరి వెంకట సుబ్బారావు శ్రేష్ఠి సంస్థ భారం స్వీకరించి మూడు వేల రూపాయల మూలధనాన్ని సమకూర్చి, ఒక పెంకుటిల్లును కొని మరమ్మతు చేయించారు. 1924 సంవత్స రం సెప్టెంబరు ఒకటవ తేదీ నుంచి సారస్వత నికేతనంగా పేరు మార్పు చేసి గ్రంథాలయ ఉద్యమంలో పాల్గొన్నారు. అనాడు మహాత్ముని అనుచరుడు సేట్ జమన్‌లాల్ బజాజ్ ప్రారంభించారు. నాటి నుంచి ఈ గ్రంథాలయ నిర్వహణలో నూతన శకం ప్రారంభమైంది. వెంకట సుబ్బారావు అనేక అమూల్య గ్రంథాలను సేకరించి పాఠకులకు ప్రయోజనకంగా ఉండేవిధంగా ఈ గ్రంథాలయాన్ని తీర్చిదిద్దారు. ఇక్కడ లభ్యం కాని కొన్ని గ్రంథాలను మద్రాసులోని కనెమరా పబ్లిక్ లైబ్రరీ నుంచి తెప్పించారు. ఈయన గ్రంథాలయ ఉద్యమంలో చురుకుగా పాల్గొని కొంతకాలం ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం ఉపాధ్యక్షునిగా, గుంటూరు మండల గ్రంథాలయ సంస్థ అధ్యక్షుడుగా పనిచేశారు. దినదిన ప్రవర్థమానమైన సారస్వత నికేతనం అమూల్య గ్రంథాలతో విలసిల్లడంతో మరో భవనాన్ని నిర్మించాలని భావించారు. ఆ సమయంలో ఆంధ్ర రాష్ట్ర

మిగతా 117వ పేజీలో

# షడ్రుచుల విజ్ఞాన సరోవరం...

(116వ పేజీ తరువాయి)
పర్యటన నిమిత్తం విచ్చేసిన జాతిపిత మహాత్మాగాంధీచే 1929 సంవత్సరం ఏప్రిల్ 18వ తేదీన నూతన భవనానికి శంకుస్థాపన చేశారు. ఆ సందర్భంగా గాంధీజి తన చేతి కర్రను గుర్తుగా అందించారు. నేటికి ఆ చేతికర్ర ఇక్కడ భద్రపరచబడి సందర్శిచే వారికి ఉత్తేజాన్ని కలిగిస్తుంది. 1930లో సారస్వత నికేతన్‌కు మండల కేంద్ర గ్రంథాలయంగా గుర్తింపు లభించింది. ఈ నూతన భవనాన్ని ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు 1935లో ప్రారంబించగా అనాటి కాంగ్రెస్ అధ్యక్షులు బాబూ రాజేంద్రప్రసాద్ సారస్వత నికేతనం ప్రాంగణంలో ధ్వజస్తంభ ప్రతిష్ట గావించారు. గ్రంధాలయోద్యమంలో అవిరళ కృషి జరుపుతున్న సుబ్బారావు శ్రేష్ఠి 1935 మే ఆరున మరణించారు. తన మరణశాసనంలో కొంత భూ వసతిని కల్పించారు. అనంతరం ఆయన సతీమణి కమలాంబ ఈ సంస్థ నిర్వహణకు ఎన్నో విధాలుగా తోడ్పడ్డారు. 1956 అక్టోబరు ఏడున కమలాంబ మరణించగా ఆమె సోదరులు కాకరపర్తి జ్వాలా నరసింహం, కాకరపర్తి సుబ్బారావులు తమ సోదరి జ్ఞాపకార్థం కమలాంబ స్మారక మందిరాన్ని నిర్మించారు. అలాగే గ్రామస్తుల విరాళాలతో మీనాక్షమ్మ, కోటిలింగం స్మారక మందిరం, బాపూజీ స్మారక మందిరం నిర్మించారు. ఈ గ్రంధాలయ నిర్వహణలో సాహితీపిపాసులైన మిత్రబృందం పాలకవర్గంగా ఏర్పడడంతో సారస్వత నికేతనం మూడు పువ్వులు ఆరుకాయలుగా వర్థిల్లింది. ప్రారంభం నుంచి సారస్వత నికేతన కార్యభారం వహించి సంస్థ అభివృద్ధికి ఒక జాతీయ సంస్థగా తీర్చిదిద్దిన అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులు 1981 మార్చి 12న మరణించగా, ఆయన స్థానంలో ఆర్.వి.శేషగిరిరావు గౌరవ కార్యదర్శిగా నియమితులయ్యారు. లైబ్రేరియన్‌గా కె.సుబ్రహ్మణ్యం పని చేస్తూ విశిష్ట సేవలందిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లోని గ్రంధాలయాలలో గ్రంధాలను భద్రపరచడంలోను, సేకరణలోను సారస్వత నికేతనందే ప్రధమ స్థానం.



1924 సంవత్సరంలో సేట్ జమన్‌లాల్ బజాజ్ గ్రంధాలయం ప్రారంభోత్సవం శిలాఫలకం.

### భద్రంగా తాళపత్ర గ్రంధాలు

సారస్వత నికేతనంలో అనేక ప్రాచీన తాళపత్ర గ్రంధాలు భద్రంగా ఉన్నాయి. తైత్రియోపనిషత్, పితృమేధం, శూలినీ దుర్గామహామంత్రం, సింధూరస్నానవిధి, శబ్దరూప బేధ ప్రదీపిక, నవగ్రహశాంతి, మహాన్యాన సారస్వత వ్యాకరణం,

# షడ్రుచుల విజ్ఞాన సరోవరం...

117వ పేజీ తరువాయి

సర్వప్రాయశ్చిత్తం, పూర్వోత్తరతావ నియోపనిషత్తులు, నృసింహమాల, ఏకాక్షరి, ఫలగ్రంథం, హేమాద్రి ప్రాయశ్చిత్తం, చిలుక ద్వాదశీ వ్రతకల్పం వంటి గ్రంధాలను అతి జాగ్రత్తగా భద్రపరిచారు.

పాదం మోపిన మహనీయులు

సారస్వత నికేతనాన్ని ఎందరో మహానుభావులు సందర్శించారు. మహాత్మాగాంధీ, బాబూ రాజేంద్రప్రసాద్, టంగుటూరి ప్రకాశం పంతులు, పింగళి లక్ష్మీకాంతం, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, అయ్యంకి వెంకట రమణయ్య, విశ్వనాధ సత్యనారాయణ, అడవి బాపిరాజు, కాటూరి వెంకటేశ్వరరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, నార్ల వెంకటేశ్వరరావు, పి.వి.నరసింహారావు, డాక్టర్ ఎం.చెన్నారెడ్డి, వావిలాల గోపాలకృష్ణయ్య వంటి విద్యావేత్తలు ఈ గ్రంథాలయాన్ని సందర్శించారు. ఏటా సుమారు వెయ్యి మందికిపైగా భారతదేశం నలుమూల నుంచి పరిశోధకులు విషయ సేకరణ కోసం వస్తూ ఉంటారు. సారస్వత నికేతన ప్రాంగణం విద్వత్ గోష్ఠులతోను, సాహితీ సభలతోను ఎప్పుడూ కళకళలాడుతూ ఉంటుంది. ఈ గ్రంధాలయంలో 2006 జనవరి 31 నాటికి 79 వేల గ్రంథాలున్నాయి. 49వేల తెలుగు, సంస్కృత గ్రంథాలు, 27 వేలు ఇంగ్లీషు పుస్తకాలు, 2000 హిందీ పుస్తకాలు, వెయ్యికిపైగా ఉర్దూ, ఇతర భాషల గ్రంధాలు ఉన్నాయి. ఈ గ్రంథాలయంలో 1942 నుంచిఆంధ్రపత్రిక, 1947 నుంచి ఆంధ్రప్రభ, ప్రారంభం నుంచి వార్త, ఈనాడు, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, ఉదయం, ప్రజాశక్తి, విశాలాంధ్ర దినపత్రికలు ఉన్నాయి. ఎన్నో వార పత్రికలు, 1901 నుంచి పంచాంగాలు ఉన్నాయి. భారతి, త్రివేణి, కృష్ణాపత్రిక, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, గృహలక్ష్మి, యంగ్ ఇండియా, మోడరన్ రివ్యూ మొదలగునవి కూడ పదిలపరచబడి ఉన్నాయి.

## ప్రచురణలకూ శ్రీకారం

సారస్వత నికేతనం అనేక ప్రచురణలకు శ్రీకారం చుట్టి యువ రచయితలను ప్రోత్సహించింది. దన్వంత లహరి, తులసీదాస హృదయం, భగవద్గీత సంగ్రహం, మాంచాల, శాంతిదూత, త్రిభాషాబోధిని, చీకటింట్లో నల్లపిల్లి తదితర గ్రంధాలను ఈ సంస్థ ప్రచురించింది. అనేక కరపత్రాలను విడుదల చేసి పలువురి ప్రశంసలందుకుంది.

ఈ గ్రంథాలయం స్త్రీ విద్యకు ప్రాధాన్యత ఇచ్చింది. స్త్రీల కోసం సంచార గ్రంధాలయాన్ని కొంతకాలం నిర్వహించింది. మహిళ కోసం ప్రత్యేకంగా విజ్ఞాన సభలను నిర్వహించారు. 1945లో ఈ గ్రంథాలయం వయోజన విద్యా తరగతులను నిర్వహించింది.

తద్వారా వయోజన విద్యా వ్యాప్తికి ఎంతగానో కృషి చేసింది. వావిలాల గోపాల కృష్ణయ్య అధ్యక్షతన 1947 లో జర్నలిజం శిక్షణ తరగతులు నిర్వహించారు.

## ప్రాచీన గ్రంథాల కంప్యూటరీకరణ

2002 మార్చి నుంచి ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ సారస్వత నికేతనంలోని గ్రంథాలను కంప్యూటరీకరణ చేసే కార్యక్రమాన్ని చేపట్టింది.



తాళపత్ర గ్రంథాలు

## పెరిగిన నిర్వహణా భారం

లైబ్రరి నిర్వహణకు రోజురోజుకు ఖర్చు పెరిగిపోడంతో ఇబ్బందులను ఎదుర్కొంటున్నది. సిబ్బంది జీతభత్యాలు, విద్యుత్ ఛార్జీలు, రోజువారి నిర్వహణ ఖర్చులు కలిపి సంవత్సరానికి లక్ష రూపాయల వరకు అవుతోంది.

అయితే ప్రభుత్వం రెండేళ్ళ నుంచి ఏడాదికి రూ 50 వేలు నిధులు ఇస్తోంది. పల్లెలో వెలసి, పాఠక దేవుళ్ళ ఆదరణతో కొనసాగుతోన్న స్వాతంత్ర్యోద్యమ కాలం నాటి మధుర చిహ్నమైన వేటపాలెం సారస్వతినికేతనం దిగ్విజయంగా కొనసాగాలని ఆశిద్దాం.



# విద్యారంగంలో పెను సంచలనం..గౌతమ్ కాన్సెప్ట్

(ప్రభాతవార్త-గుడివాడ)

కొత్త కాన్సెప్ట్‌తో విద్యారంగంలోకి అడుగిడిన కొద్ది కాలానికే సంచలనాలకు కేంద్రబిందువుగా మారింది గౌతమ్‌కాన్సెప్ట్ స్కూల్. అంతర్జాతీయ స్థాయి పాఠశాలను గుడివాడలో నిర్మించడం ఎందుకనీ, పెట్టుబడికి తగిన 'లాభాలు' వస్తాయా అని పాఠశాల చైర్మన్ డాక్టర్ కె.కోటేశ్వరరావును అందరూ నిరాశపర్చినవారే. అయితే విద్యను వికసింపచేయాలనే తపనతో, మొక్కవోని విశ్వాసంతో ఎన్నో వ్యయప్రయాసలకోర్చి గౌతమ్‌కాన్సెప్ట్ స్కూల్‌ను ఏర్పాటు చేశారాయన. పాఠశాల ప్రారంభమైన ఆరు నెలల వ్యవధిలోనే రికార్డు స్థాయి ఫలితాలను సొంతం చేసుకుంది. రాష్ట్రం నలుమూలల నుంచి విద్యార్థులు ఇక్కడ చదవడానికి ఆసక్తికనబర్చగా, అడ్మిషన్లు దొరకడం గగనకుసుమంగా మారింది. రాష్ట్రస్థాయి పోటీపరీక్షల్లో 'గౌతమ్' విద్యార్థులు ముందంజలో ఉన్నారు. వేలేరు, కొత్తగూడెం, హైదరాబాద్ ప్రాంతాల్లో నిర్వహించిన రాష్ట్రస్థాయి పోటీల్లో ఈ విద్యార్థులు విశేషప్రతిభ కనబరిచి, అగ్రస్థానంలో నిలిచారు. పాఠశాల ప్రారంభించిన ఆరునెలల్లోనే ఆలిండియా మ్యాథ్స్ ఒలంపియాడ్‌లో 10లోపు ర్యాంకుల్లో ఐదు ర్యాంకులు, సబ్ జూనియర్ విభాగంలో మూడు ర్యాంకులు సాధించి పాఠశాల రికార్డు సృష్టించింది. పాఠ్యాంశంపై సమగ్ర అవగాహన వచ్చేలా చేసి, సబ్జెక్టుపై పట్టు సాధించే విధంగా విద్యార్థిని తీర్చిదిద్దుతారు.

మిగతా 119వ పేజీలో

# మంచినీటి రొయ్యలను పెంచే పద్ధతులివే...!

మంచినీటి రొయ్యల పెంపకంపై తలెత్తే సమస్యలతో రైతులు సతమతమవుతూ ఉంటారు. దీంతోపాటు రొయ్యలకు వచ్చే వ్యాధులను సకాలంలో గుర్తించడంలోనూ అశ్రద్ధ వహిస్తుంటారు. సరైన సమయానికి మేతవేయలేకపోవుడంతోను, రొయ్యల చెరువు సాగుకు అవసరమైన వనరులను కల్పించడంలోనూ రైతులు నిరక్ష్యం వహిస్తుంటారు. ఈ మేరకు మంచినీటి రొయ్యల సాగుచేసే రైతుల కోసం మత్స్య శాఖ సహాయ సంచాలకులు కె.కనకరాజు, మత్స్య అభివృద్ధి అధికారి(లాబ్) డాక్టర్ కె. ఫణిప్రకాష్ 'ప్రభాతవార్త' పలు విషయాలను వివరించారు.

మంచినీటి రొయ్యలలో ప్రధానమైనవి :

మాక్రోబ్రేఖియమ్ రోజన్ బర్లై : దీని ఉదర భాగంలోని రెండవ ఖండితం యొక్క ప్లూరా, మొదటి, మూడవ, ఖండితంపై పాక్షికంగా కప్పబడి ఉంటుంది. శిరోవృక్ష భాగంలోని రెండవజత కాళ్ళు పొడవుగాను, బలిష్టంగాను ఉండి చివరలు పట్టుకారులుగా ఉంటాయి. రోస్ట్రం (ముక్కు) పొడవుగాను, చివరన పైకి వంపు తిరిగి దానిపై ముళ్ళు 12-13/11-3 ఉంటాయి.

రొయ్య పిల్లలను గుర్తించడం : కారాపేస్‌పై ముల్లు ఉండదు. కారాపేస్‌పై లేత గులాబీ లేదా గోధుమ రంగు చారలు పొడవుగా, వరుసగా ఉంటాయి.

మాక్రోబ్రేఖియమ్ మాల్కంసోనై : రోస్ట్రం(ముక్కు) పొడవుగాను, తిన్నగాను ఉండి 12-13/5-7 ముళ్ల ఉంటాయి.

రొయ్య పిల్లలను గుర్తియడం : కారాపేస్‌పై చారలు పూర్తిగా వరుసగా ఉండవు.

**ఆడ, మగ రొయ్యలను గుర్తించడం :**

మగరొయ్య : రెండు జత కాళ్ల పొడవుగాను, బలిష్టంగాను, కంటాలు కలిగి ఉంటాయి. ఉదరభాగం సన్నగా ఉంటుంది. ఉదర తలంలోగల మొదటి ఖండితం గట్టిగా ఉంటుంది.

ఆడరొయ్య : ఉదరభాగం వెడల్పుగా ఉంటుంది. అప్పెండిక్స్ మాస్కలైనా ఉండదు.

రొయ్యల సాగుచేసే విధానం :

మట్టి : పిహెచ్ 6.5-7.5, అర్గానిక్ కార్బన్ 1-1.5 శాతం, నైట్రోజన్ 25-20 మిల్లీగ్రాములు, పోటాషియం 1-2 శాతం, ఇసుక, నల్లరేగడి నేల కలిగి ఉండాలి.

నీరు : 28-34 సెంట్రీగ్రేట్ ఉష్ణోగ్రత ఉండాలి. పి.హెచ్-7.5-8.5, పారదర్శకత 30-35 సెంటీమీటర్లు మధ్య ఉండాలి. ఐరన్ 2.0 మిల్లీగ్రాములతోపాటు లేత ఆకుపచ్చరంగు కలిగి ఉండాలి. ఒక చదరపు మీటరుకు 25 చొప్పున వేసి రొయ్య పిల్లల సాంద్రతను పాటించాలి.

రొయ్యల సాగు చెరువు : 0.5 నుండి 2 లేదా 10 ఎకరాల విస్తీర్ణం కలిగి కనీసం 3-4 అడుగుల లోతు నుండి దీర్ఘ చతురస్రాకారం కలిగి ఉన్న చెరువులో రొయ్యల సాగు చేయవచ్చు.

రొయ్యలమేత : మంచినీటి రొయ్యలు సహజంగా లభ్యమయ్యే ప్లాంక్టన్, చెరువు అడుగుభాగన నివసించే జంతుజాలం, కుళ్ళిన మొక్కలను తింటాయి. బియ్యపు నూకలు, నూనెతీసిన తౌడు, పిష్‌మూల్, వేరుశనగ పిండిని అదనపు ఆహారంగా ఇవ్వవచ్చు.

మేతవేసే విధానం : రొయ్య చెరువులో 20 నుండి 5 శాతం మేతను ప్రతిరోజు ఉదయం, మధ్యాహ్నం, రాత్రివేళల్లో ఇవ్వాలి. రాత్రి ఇచ్చే మేతశాతం అధికంగా ఉండాలి. మేతను చెరువులో అన్ని ప్రాంతాల్లోను సమానంగా వెదజల్లాలి. ఇంకా రొయ్యలకు వచ్చే వివిధ వ్యాధుల నివారణ, సూచనల కోసం సమీప మత్స్యశాఖ అధికారులనుగానీ, కైకలూరులోని రాష్ట్ర మంచినీటి సంవర్ధన రిఫరల్ లేబొరేటరీని సంప్రదించాలని మత్స్యశాఖ అధికారులు పేర్కొన్నారు.

## విద్యారంగంలో పెను సంచలనం..గౌతమ్'కాన్సెప్ట్'

118వ పేజీ తరువాయి

ముఖ్యంగా బట్టీ విధానానికి ఇక్కడ తావుండదు. విద్యార్థిని ఫొటోస్టాట్ యంత్రంలా చూడకుండా కేవలం సబ్జెక్టు నాలెడ్జ్‌ను మాత్రమే ఇక్కడ పరిగణనలోకి తీసుకుంటారు. తద్వారా విద్యార్థిలో మానసిక వికాసం పెరుగుతుంది. ఈ మేరకు పాఠశాల చైర్మన్ డాక్టర్ కె.కోటేశ్వరరావు 'ప్రభాతవార్త'తో మాట్లాడుతూ తాము పదవతరగతి తర్వాత పోటీ పరీక్షల్లో మంచిర్యాంకు సాధించడం, మంచి ఉద్యోగం, రాణింపు, పదోన్నతి, మంచి వ్యక్తిత్వం, తల్లిదండ్రుల్ని ప్రేమాభిమానాలతో చూచుకోగల దృక్పథం, ఆనందకరమైన జీవితానికి కావాల్సిన ఆరోగ్యం అనే అంశాలపై ప్రత్యేక దృష్టిని సారిస్తున్నట్లు చెప్పారు. కేవలం 10వ తరగతిలో మార్కులపైనే దృష్టి కాకుండా 'గౌతమ్' విద్యార్థి ఎక్కడికి వెళ్లినా గౌరవం పొందుతాడు అనే విధంగా తమ భోదన ఉంటుందన్నారు.

# వరుస విజయాలు 'విశ్వభారతి'కే సొంతం!

(ప్రభాతవార్త-గుడివాడ)

గుడివాడలో విద్యాకుసుమాలను వికసింపచేస్తున్న విశ్వభారతి విద్యాసంస్థలు వరుస విజయాలను సొంతం చేసుకుంటున్నాయి. గత 36 సంవత్సరాలుగా పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో నూరుశాతం ఉత్తీర్ణత సాధించడంతో పాటు పుష్కర కాలంగా ఈ పాఠశాల నుంచి పదవ తరగతికి హాజరైన ప్రతి ఒక్కరూ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారంటే అతిశయోక్తికాదు. ఎస్ఎస్‌సి 2000, 2002, 2003 సంవత్సరాల్లో రాష్ట్రస్థాయి 6వ ర్యాంకును సాధించడం విశేషం. ఇలావుండగా పదవ తరగతి తర్వాత విద్యార్థుల భవిష్యత్తుపై తల్లిదండ్రులు ఆందోళన చెందుతున్న విషయాన్ని గమనించిన విశ్వభారతి డైరక్టర్ పొట్లూరి శ్రీమన్నారాయణ హైస్కూల్‌స్థాయి నుంచే పోటీ పరీక్షలకు విద్యార్థులను తీర్చిదిద్దుతున్నారు. ఐఐటి(జెఇఇ)లో మంచి ర్యాంకు సాధించడం విద్యార్థులకు క్లిష్టతరంగా మారిన నేటిరోజుల్లో ఐఐటి పితామహుడు రామయ్య సారథ్యంలో ప్రత్యేక శిక్షణా కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. 8,9,10 తరగతుల నుంచే ఈ పోటీ పరీక్షలకు విద్యార్థులను సిద్ధం చేయడానికి 2003-04 నుంచి అనుభవజ్ఞులైన అధ్యాపకులచే శిక్షణ ఇప్పిస్తున్నారు. మంచి ర్యాంకును సాధించడానికి ఇదే సరైన మార్గం. విద్యావికాసం పక్కన పెడితే, వారిలో సృజనాత్మక శక్తిని పెంపొందించడానికి పలుమార్లు విద్య, వైజ్ఞానిక ప్రదర్శనలనునిర్వహించింది. పాఠశాలలో గత ఏడాదినిర్వహించిన ప్రదర్శన జిల్లా వ్యాప్తంగా మంచి గుర్తింపును తెచ్చిపెట్టింది.

అలాగే విద్యార్థులు ఆసక్తికనబరిచిన ఇండోర్, అవుట్‌డోర్ గేమ్స్, పెయింటింగ్, డాన్స్, లలిత కళలు, ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ రంగాల్లో ప్రత్యేక శిక్షణ ఇస్తున్నారు. ఈ మేరకు సంస్థ డైరక్టర్ పొట్లూరి శ్రీమన్నారాయణ మాట్లాడుతూ రేపటి సమాజాన్ని రూపకల్పన చేసే విద్యార్థుల ఆలోచనల్లో వస్తున్న మార్పులను గమనించి, తదనుగుణంగా అధ్యయనం, పరిశీలన, ప్రవర్తనలో వైవిధ్యం తీసుకురావాల్సి ఉందన్నారు. విద్యారంగంలో వస్తున్న మార్పులను ఆకళింపు చేసుకుని, విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధికి విశ్వభారతి కృషి చేస్తోందని చెప్పారు.

జ్ఞాన విస్ఫోటంతో ప్రపంచమంతా కుగ్రామంగా మారిపోతున్న తరుణంలో తల్లిదండ్రుల ఆలోచనలు కూడా మారాలని విద్యార్థులకు ఆసక్తి ఉన్న రంగాల్లోనే వారు విజయవంతంగా పయనించేందుకు ఆసక్తి చూపాలన్నారు. మారుతున్న విద్యలో విద్యార్థికి కావాల్సిన అన్ని రంగాలలోనూ విశ్వభారతిలో ప్రత్యేక శిక్షణ ఇస్తున్నట్లు ఆయన చెప్పారు. విజయానికి చిహ్నంగా మారిన విశ్వభారతి విద్యాసంస్థలు భవిష్యత్తులో మరిన్ని విజయాలు సొంతం చేసుకోవడానికి ఉవ్విళ్లూరుతోంది.



# ఆదర్శవంతమైన క్రీడా ప్రాంగణంగా ఎన్టీఆర్ స్టేడియం

(ప్రభాతవార్త-గుడివాడ)

క్రీడా జగత్తులో ఆదర్శవంతమైన క్రీడా ప్రాంగణంగా కృష్ణాజిల్లా గుడివాడ ఎన్టీఆర్ స్టేడియం రూపుదిద్దుకుంటోంది. నూతన కార్యవర్గం ఏర్పడిన తర్వాత స్టేడియం కమిటీ ఆధ్వర్యములో పెద్దఎత్తున టోర్నమెంట్లు నిర్వహించారు. కమిటీ ఉపాధ్యక్షునిగా బొప్పన బాపినీడు ప్రసాద్, సహ కార్యదర్శి డాక్టర్ పొట్లూరి గంగాధరరావులు నేతృత్వంలో ఇక్కడ పలు క్రీడాంశాలను ప్రవేశపెట్టారు. అథ్లెటిక్స్, బాస్కెట్‌బాల్, క్రికెట్, జిమ్నాస్టిక్స్, షటిల్ బ్యాడ్మింటన్, వెయిట్ లిఫ్టింగ్ విభాగములలో కోచ్‌లను నియమించి 123 మంది ఔత్సాహిక క్రీడాకారులకు శిక్షణ ఇస్తున్నారు. స్టేడియంలో మండల స్థాయి రూరల్ స్పోర్ట్స్ నిర్వహించారు. అలాగే గత ఏప్రిల్ నుంచి మే నెల వరకు అథ్లెటిక్స్, బాస్కెట్‌బాల్, క్రికెట్, చదరంగం, జిమ్నాస్టిక్స్, కబడ్డీ, ఖోఖో, వాలీబాల్, షటిల్ బ్యాడ్మింటన్, టేబుల్ టెన్నిస్, వెయిట్ లిఫ్టింగ్ విభాగాల్లో 300 మంది క్రీడాకారులకు వేసవి శిక్షణ తరగతులను నిర్వహించారు.

కళారంగాన్ని ప్రోత్సహించే క్రమంలో గత మే 28న ఎన్.టి.ఆర్. కల్చరల్ కప్ పేరిట రాష్ట్రస్థాయిలో దుర్యోధనుని ఏక పాత్రాభినయ పోటీ నిర్వహించారు. గుడివాడ పట్టణ పాఠశాలలకు చెందిన బాలబాలికలతో ఒలంపిక్ రన్ ఏర్పాటు చేశారు. ఇదే క్రమంలో పద్మభూషణ్ గ్రహీత దివంగత ధ్యాన్‌చంద్ జయంతి సందర్భంగా కబడ్డీ, వాలీబాల్ టోర్నమెంట్స్, నడక పోటీలను నిర్వహించారు. గత సెప్టెంబరు నెలలో జిల్లాస్థాయి జిమ్నాస్టిక్స్ పోటీలు జరిగాయి. అక్టోబరు నెలలో జిల్లాస్థాయి అథ్లెటిక్స్ మీట్ నిర్వహించారు. బాలల "దినోత్సవం సందర్భంగా పట్టణంలోని వివిధ పాఠశాలలకు చెందిన 15 సంవత్సరాల్లోపు బాలబాలికలకు వివిధ క్రీడాంశాల్లో పోటీలు నిర్వహించారు. గత జనవరిలో గుడివాడ క్రికెట్ అసోసియేషన్, ఎన్.టి.ఆర్. స్టేడియం కమిటీ ఆధ్వర్యంలో జిల్లాస్థాయి ఓపెన్ క్రికెట్ టోర్నమెంటు ఏర్పాటు చేశారు. ఈ సందర్భంగా నిర్మించిన రెండు క్రికెట్ ప్రాక్టీసింగ్ పిచ్‌లు ప్రారంభించారు. గత జనవరి 15న రాష్ట్రస్థాయి 10కిలోమీటర్ల పరుగుపందెం నిర్వహించారు. ఈ పోటీలలో విజేతలకు ప్రథమ బహుమతిగా రు.10,116, ద్వితీయ బహుమతిగా రూ.5,116, తృతీయ బహుమతిగా రూ.2,516, 20 మందికి కన్సొలేషన్ బహుమతులు అందించారు. అదేనెలలో రాష్ట్రస్థాయి బాడీ బిల్డింగ్ పోటీలు నిర్వహించారు.

ఈపోటీలనుండి "మిస్టర్ ఆంధ్ర"కు నగదు బహుమతి అందచేశారు. ఎన్టీఆర్ ఆశయసిద్ధి మేరకు స్టేడియంలో మరిన్ని టోర్నమెంట్లు నిర్వహించి, క్రీడావ్యాప్తికి కృషి చేస్తామని కమిటీ ఉపాధ్యక్షుడు బొప్పన బాపినీడు ప్రసాద్, సహ కార్యదర్శి డాక్టర్ పొట్లూరి గంగాధరరావులు 'ప్రభాతవార్త'కు తెలిపారు.

## జగ్గయ్యపేట ప్రాంతంలో

# మహాత్ముని అడుగుజాడలు...!

(ప్రభాతవార్త - జగ్గయ్యపేట)

స్వాతంత్ర్యానికి ముందు గాంధి, కస్తూరి బాయి జగ్గయ్యపేట ప్రాంతంలో ఖద్దరు నిధికి యాత్రచేసి మధుర స్మృతులు మిగిల్చారు. స్వాతంత్రోద్యమంలో ధైర్య సాహసాలు ప్రదర్శించి తెల్లదొరలకు వ్యతిరేకంగా ఉద్యమించి ఈ ప్రాంత వాసులు కారాగార శిక్షలు సైతం అనుభవించార. గాంధీ 1929లో కృష్ణా జిల్లా పర్యటనకు విచ్చేసినప్పుడు పల్లె పల్లెంతా నీరాజనాలు పలికింది. సభలకు జనం దండుకట్టి కదిలారు. చేతికొద్ది సాయమందించారు. చరిత్ర గర్భంలో ఈ నిక్షిప్త నిజాలు భావితరాలను ఉత్తేజ పర్చేందుకు ఎంతగానో దోహదం చేశాయి. శాసన ఉల్లంఘన ఉద్యమం అనంతరం ఖద్దరు ఉద్యమం మొదలయ్యింది. విదేశీ వస్తువులు, వస్త్రాలు బహిష్కరించి, ఖద్దరు తవాడకంలోకి తేవాలని గాంధీజి పిలుపునిచ్చారు. ఖద్దరు ఉద్యమానికి యాత్ర చేపట్టారు. 1929 ఏప్రిల్ 8 నుంచి 16వ తేదీ వరకు తొమ్మిది రోజుల పాటు కృష్ణా జిల్లాలోగాంధీ యాత్ర జరిగింది. గాంధీజీతో పాటు కస్తూరిబాయి, ఇమామ్ సాహెబ్, ప్యారీలాల్ తదితరులు ఈ యాత్రలో ఈ ప్రాంతానికి వచ్చారు. జగ్గయ్యపేటకు ఐదు కిలోమటర్ల సమీపంలోని జయంతిపురంలో గాంధీజీకి జయంతిపురం రాజు వాసిరెడ్డి సదాశివేశ్వర ప్రసాద్, అయ్యదేవర కాళేశ్వరరావు పూల మాలలతో ఘన స్వాగతం పలికారు. బోనకల్లు నుంచి వచ్చే దారిలో లింగాల గ్రామస్థులు రూ.20లు, మక్కపేట గ్రామస్థులు రూ.40లు ఖద్దరు నిధికి విరాళాలు ఇచ్చారు. 8వ తేదీన గాంధీజీ జయంతిపురంలో బస చేసి, సాయంత్రం మౌనవ్రతం పాటించారు. ఆరోజు ఒక సంఘటన జరిగింది. వాసిరెడ్డి సోదరులైన వాసిరెడ్డి మహదేవ రాకూర్ స్వాతంత్ర్య పిపాసులు. అయితే గాంధీజి ప్రబోధించే అహింసా సిద్ధాంతంపై రాకూర్‌కు బొత్తిగా నమ్మకం లేదు. దీంతో గాంధీజీపై తరచు విమర్శలు చేస్తుండేవారు. ఈ విషయాన్ని గ్రామానికి చెందిన వెంకటప్పయ్య గాంధీ దృష్టికి తెచ్చారు. దీంతో రాకూర్‌ను పిలచి గాంధీ హితబోధ చేశారు. కరుడుగట్టిన బ్రిటిష్ పాలకులను విప్లవ వాదంతో సాధించగలమా అని ప్రశ్నించారు. ఇలాంటి ఉద్రేక వాదన జన నష్టానికి దారి తీస్తుందని హితవు పలికారు. అహింసాయుత సహాయ నిరాకరణే ఏకైక మార్గం అని ప్రబోధించారు. ఈ మహోత్సవంలో సుశిక్షితులైన శాంతి సైనికుల్లా పని చెయ్యాలని అదేశించి, పై పంచె కప్పి ఇక నుంచి ఈ ఖద్దరే నీ దుస్తులని హితబోధ చేశారు. అనంతరం జయంతిపురం రాజా రూ.500లు విరాళంగా అందజేశారు. తరువాత జగ్గయ్యపేట ఊర చెరువు మైదానంలో బౌద్ధ స్థూపం గట్టు పక్కన ఏర్పాటు చేసిన సభలో గాంధీజీ ప్రసంగించారు. ఈ సభకు అప్పట్లో ఎనిమిది వేల మంది హాజరయ్యారు. పూర్ణకుంభంతో, కర్పూర హారతులతో స్వాగతం పలికారు. ఈ ప్రాంత పౌరులు ఖద్దరు వస్త్రంపై ముద్రించిన సన్మాన పత్రం గాంధీకి సమర్పించారు. తరువాత గాంధీ ఉత్తేజకరమైన ఉపన్యాసం చేశారు. అటు పిమ్మట నందిగామ బయలుదేరి వెళ్ళారు. దారిలో కొణకంచి గ్రామ మునసబు కాకుమాను పిచ్చయ్య నాయకత్వంలో కొణకంచి అడ్డరోడ్డు వద్ద స్వాగతం పలికి రూ.101 విరాళంగా అందజేశారు. నందిగామలో పెద్ద సంఖ్యలో హాజరైన ప్రజానీకాన్ని ఉద్దేశించి గాంధీ ప్రసంగించారు. ఈ సభలో స్వరాజ్యానికి అర్థం మనశ్శాంతి, ప్రజా శాంతి అని అభిప్రాయపడ్డారు. గ్రామల్లో ఆరోగ్యం, పరిశుభ్రత అంశాలపై జవాబుదారీ పద్ధతి వుండాలని గాంధీ ప్రబోధించారు. మీ ప్రాంతంలో పత్తి వుంది. అందరూ ఖాదీ ధరించాలి. పురుషులతో పాటు స్త్రీలు కూడా ఖద్దరు ధరించాలని ఉపదేశించారు. రామాయణంలో సీతా దేవి ఖద్దరు ధరించారని, స్త్రీలు కూడా సీతమ్మలా ప్రవర్తించాలని హితబోధ చేశారు. సభానంతరం అయ్యదేవర లక్ష్మీ నరసింహం సతీమణి బాల త్రిపుర సుందరమ్మ బంగారు గాజుల జతను గాంధీకి విరాళంగా ఇచ్చారు. నుంకర నరసింహం సతీమణి,బసవ లింగయ్య సతీమణి గాజుల జతలను సమర్పించారు. చతుర్వేదుల అన్నపూర్ణమ్మ, యడవల్లి సీతారావమ్మ చెరొక పావు సదరు బంగారం ఇచ్చారు. కన్నెవీడు, జుజ్జూరు గ్రామాల్లో పన్నుల నిరాకరణోద్యమం నాడు రామకృష్ణయ్య నేతృత్వంలో జరిగింది. ఈ రీతిలో మహాత్ముని జ్ఞాపకాలు చారిత్రక తీపి గుర్తులుగా మిగిలాయి.

# గ్రామ స్వరాజ్యమే ధ్యేయం

### నిరంతరం పోరాటం చేస్తున్న యలమంచిలి బాబు

(ప్రభాతవార్త,ఉయ్యూరు)-

నిస్సారంగా, నిర్వీర్యంలో వున్న గ్రామ పంచాయతీలకు దిక్కై 11 సంవత్సరాలుగా గ్రామ స్వరాజ్యం కోసం నిరంతరం పోరాటం చేస్తున్న వ్యక్తి, యలమంచిలి బాబు రాజేంద్రప్రసాద్, 1995లో ఉయ్యూరు సర్పంచిగా గెలుపొందిన రాజేంద్రప్రసాద్ ముందుగా జిల్లా సర్పంచిల సంఘం, అనంతరం రాష్ట్ర సర్పంచిల సంఘం ఏర్పాటుచేసి వ్యవస్థాపక అధ్యక్షులుగా, ఆరేళ్ళు సుదీర్ఘ పోరాటం చేసి గ్రామ పంచాయతీ సర్పంచిలకు గౌరవ జీతం ఏర్పాటుచేయించటంతో పాటు గ్రామ పంచాయతీలకు ఉపయోగపడే 105 జి.ఓ.లను, ఏడాదికి 12 వందల కోట్ల రూపాయల అదనపు ఆదాయం రాష్ట్రంలోని పంచాయతీలకు అందేలా ఏర్పాటుచేశారు.

నాలుగేళ్ళ క్రితం ఉయ్యూరు నుంచి సెగ్మెంట్ నుంచి జిల్లాపరిషత్ ప్రాదేశిక సభ్యునిగా ఎంపికై స్థానిక సంస్థల హక్కుల సాధనకై ఆంధ్రప్రదేశ్ పంచాయతీరాజ్ చాంబర్ ఏర్పాటు చేసి స్థానిక సంస్థల హక్కులు, విధులు, నిధులకోసం రాష్ట్ర ప్రభుత్వంతో పోరాటం చేస్తున్నారు. ముఖ్యంగా రెవెన్యూ శాఖలో రాష్ట్రప్రభుత్వం చేస్తున్న మార్పులపై, రెవెన్యూ కార్యదర్శిల నియామకాన్ని వ్యతిరేకిస్తూ ఫిబ్రవరి 3న ఛలో హైదరాబాద్ పిలుపునిచ్చారు. రాజేంద్రప్రసాద్ ఆధ్వర్యంలో 73,74 రాజ్యాంగ సవరణ చట్టం ద్వారా స్థానిక సంస్థలకు దాఖలు చేయవలసిన హక్కుల కోసం ప్రభుత్వంపై పోరాటం జరుగుతుంది.

### స్థానిక సంస్థలకు దాఖలు కావలసిన అంశాలివి:

73,74వ రాజ్యాంగ సవరణ చట్టాలలోని ఆర్టికల్243(జి), 11వ షెడ్యూల్‌లో స్థానిక సంస్థలకు దాఖలు చేయమంటూ పేర్కొన్న 29 అంశాలు.

1. వ్యవసాయం, వ్యవసాయ విస్తరణతో సహా. 2. భూమి అభివృద్ధి, భూ సంస్కరణల అమలు, భూమి ఏకీకరణ, భూసార పరిరక్షణ. 3. చిన్న తరహా సాగునీరు, నీటి నిర్వహణ, వాటర్ షెడ్ అభివృద్ధి. 4. పశు సంవర్ధన, పాడి పరిశ్రమ, కోళ్ల పరిశ్రమ. 5. మత్స్య పరిశ్రమ. 6. సామాజిక అటవీ పెంవకం, తోట్ల పెంపకం.

7. చిన్న తరహా అటవీ ఉత్పత్తి. 8. ఆహారం ప్రాసెసింగ్ పరిశ్రమతో సహా అన్ని చిన్న తరహా పరిశ్రమలు. 9. ఖాదీ, గ్రామీణ, కుటీర పరిశ్రమలు. 10.గ్రామీణ గృహ నిర్మాణం. 11. మంచినీరు. 12. ఇంధనం, పశుగ్రాసం. 13. రోడ్లు , కల్వర్టులు, వంతెనలు, కాలువలు, జలమార్గాలు, ఇతర కమ్యూనికేషన్ విధానాలు. 14. గ్రామీణ విద్యుద్దీకరణ, విద్యుచ్ఛక్తి పంపిణీతో సహా. 15. సాంప్రదాయేతర ఇంధన వనరులు. 16. దారిద్ర్య నిర్మూలనా కార్యక్రమం. 17. సాంకేతిక శిక్షణ, వృత్తిపరమైన విద్య. 18. విద్య, ప్రాథమిక, సెకండరీ పాఠశాలలతో సహా. 19. వయోజన, అనియత విద్య. 20. గ్రంధాలయములు. 21. సాంస్కృతిక కార్యకలాపములు. 22.మార్కెట్లు, సంతలు. 23. ఆసుపత్రులు,ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు, డిస్పెన్సరీలతో సహా ఆరోగ్యము, పారిశుద్ధ్యం. 24. కుటుంబ సంక్షేమము, 25. స్త్రీ, శిశు అభ్యుదయము. 26. సాంఘీక సంక్షేమం, వికలాంగులు, మానసిక వికలాంగుల సంక్షేమముతో సహా. 27. బలహీన వర్గాల వారి సంక్షేమం, ముఖ్యంగా షెడ్యూల్డు తెగల వారి సంక్షేమంతో సహా. 28. ప్రజా పంపిణీ వ్యవస్థ. 29. సామాజిక ఆస్తుల నిర్వహణ.

# పులిచింతల ప్రాజెక్టు

రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా తీసుకొని నిర్మిస్తున్న ప్రాజెక్టు పులిచింతల. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి **2004 అక్టోబర్ 15న** రాష్ట్ర ముఖ్యమంత్రి భూమి పూజ చేసి పనులను ప్రారంభించారు. ఆ రోజు నుండి నేటి వరకు నిర్మాణ పనులు చకచకా సాగుతున్నాయి. ఇప్పటి వరకు ఎర్త్ డ్యాంతో పాటు స్పిల్‌వే, ఎస్.ఓ.ఎఫ్ డ్యాం పనులు చురుకుగా సాగుతున్నాయి. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి ప్రభుత్వం **565. 87** కోట్లు కేటాయించింది. మెసర్సు శ్రీనివాస కన్‌స్ట్రక్షన్స్ హైదరాబాద్ వారు టర్న్‌కీ సిస్టం పద్ధతిలో ఈ పనులను చేపట్టారు.



రాష్ట్రంలోని గుంటూరు జిల్లా పులిచింతల, నల్లగొండ జిల్లా







వజినేపల్లి సమీపంలో కృష్ణా జలాల పంపిణీ సంఘ పరిమితులకు లోబడి నాగార్జున సాగర్ డ్యాం దిగువున గల నదీ పరివాహక ప్రదేశం నుండి లభించు నీటి నిల్వ చేసే విధంగా పులిచింతల ప్రాజెక్టును రూపొందిస్తున్నారు. నాగార్జున సాగర్ ఎగువ కృష్ణా నది పైన కర్నాటక, మహారాష్ట్రలో ప్రాజెక్టులు అభివృద్ధి చెందాయి. ప్రకాశం బ్యారేజీ దిగువ ఆయకట్టుకు తగిన నీరు అందక ఆ ప్రాంతం తీవ్ర నీటి కొరత సమస్య ఏర్పడిందని దీనిని అధిగ మించేందుకు పులిచింతల ప్రాజెక్టు నిర్మించి సకాలంలో నార్లు పెంచి, నాట్లు వేసి అధిక దిగుబడులు పొందేందుకు ప్రభుత్వం కృషి చేస్తుంది. ఈ ప్రాజెక్టు నిర్మాణంతో ఆహార ధాన్యాల ద్వారా 808.80 కోట్ల రూపాయల ఆదాయంతో పాటు ఇతర ప్రయోజనాల ద్వారా 138.00 కోట్ల రూపాయల ఆదాయం లభిస్తుందని ప్రభుత్వ అంచనా. అదే విధంగా ఈ ప్రాజెక్టు ద్వారా 120 మెగా వాట్ల విద్యుత్ ఉత్పాదన జరిగి ఈ ప్రాంత ప్రజలకు ఉపయోగం కలగనుంది. బీడు వారిన భూములు, మోడు వారిన బతుకులను చిగురింప చేసేందుకు ఈ ప్రాజెక్టు ఎంతో ఉపయోగ పడుతుందని ప్రభుత్వం భావిస్తుంది. కాగా నల్లగొండ, గుంటూరు జిల్లాలో ముంపుకు గురయ్యే భూములను, ఇండ్లను ఇప్పటికే ప్రభుత్వం అనేక పర్యాయలు సర్వేలు నిర్వహించి గ్రామసభలు ఏర్పాటు చేసి ముంపు బాధితుల అభిప్రాయాలను సేకరించింది. ప్రభుత్వం మొదటగా ప్రకటించిన సమయంలో బాధితులకు నష్టపరిహారం అందించలేక పోవడంతో పలు చోట్ల ఆందోళనలు బయలు దేరాయి. ఈ నేపథ్యంలో ఇటీవల జిల్లా స్థాయిలో మంత్రులు, అధికారులు, బాధితులు సమావేశమై నష్ట పరిహారం చెల్లించే విషయంపై చర్చించి అతి త్వరగా నష్టపరిహారం చెల్లించేందుకు నిర్ణయించారు. జిల్లా ఉన్నతాధికారులు చర్యలు ప్రారంభించటంతో ఆందోళనలు విరమించారు. డిప్యూటీ కలెక్టర్లు, స్పెషల్ కలెక్టర్ ఆయా ముంపు గ్రామాల్లో పర్యటించి భూముల గ్రేడింగ్‌లను నిర్ణయిస్తున్నారు. ఏది ఏమైనప్పటికి ప్రభుత్వం పట్టిన పట్టు విడవకుండా పనులను వేగవంతం చేసింది.

-1872లో మెకన్జీ అనే బ్రిటీష్ ఇంజనీర్ పులిచింతల, వజినేపల్లి గ్రామాల మధ్య ప్రాజెక్టు నిర్మించ వచ్చని తెలిపారు.

- 1908లో కల్నల్ షెల్లింగ్, మిల్లింగ్‌లు పులిచింతల ఆనకట్టకు అంచనాలను తయారు చేశారు.

- 1951 డిసెంబర్‌లో ఖోస్లా కమిటీ నియమకం

-1984లో అప్పటి ముఖ్యమంత్రి నందమూరి తారక రామారావు గుంటూరులో పులిచింతల డివిజన్ కార్యాలయాన్ని ప్రారంభించారు.

-1988లో వజినేపల్లి సమీపంలో పులిచింతల కర్షక హిత జల నిధి పేరుతో బ్యాలెన్సింగ్ రిజర్వాయర్‌కు ఎన్టీఆర్ శంఖుస్థాపన చేశారు.

-2004 అక్టోబర్ 15న రాష్ట్ర ముఖ్యమంత్రి గుంటూరు జిల్లా మాదిపాడు సమీపంలో భూమి పూజ నిర్వహించారు.

-10-11-2004లో మేళ్ళచెరువులో ప్రజాభిప్రాయ సేకరణ

-2005 ఏప్రిల్ 27న మరోసారి ప్రజాభిప్రాయ సేకరణ

(ప్రభాతవార్త–గుంటూరు)

**పులిచింతల ప్రాజెక్టు ఊహా చిత్రం**

# ప్రసిద్ధ పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతున్న
# సింగరకొండ


సింగరకొండ పుణ్యక్షేత్రం

(ప్రభాతవార్త-అద్దంకి)

ప్రకాశం జిల్లా అద్దంకి సమీపంలో 5 కిలోమీటర్ల దూరంలోనున్న సింగరకొండ పుణ్య క్షేత్రంలోని శ్రీ ప్రసన్నాంజనేయ స్వామి, శ్రీ లక్ష్మి నరసింహస్వామి దేవాలయాలు జిల్లాలో ప్రసిద్ధిగాంచిన క్షేత్రాలుగా విరాజిల్లుతున్నాయి. శ్రీ లక్ష్మినరసింహస్వామి దేవాలయం దాదాపు 13వ శతాబ్దంలో నిర్మించినట్లు పూర్వీకులు చెబుతున్నారు. శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవాలయం షుమారు 250 సంవత్సరాల క్రితం నిర్మింపబడినట్లు చారిత్రక ఆధారాలను బట్టి తెలుస్తుంది. ఈ దేవాలయాలు నిత్యం భక్తుల రద్దీతో కికిటలాడుతుంటాయి. కోర్కెలు నెరవేరేందుకు మొక్కులు చెల్లిస్తుంటారు.

శ్రీ ప్రసన్నాంజనేయదేవస్థానం వార్షిక ఆదాయం షుమారు రూ.50లక్షలకు పైగా ఉంటుందని, శ్రీ లక్ష్మి నరసింహస్వామి దేవస్థానం ఆదాయం రూ.4లక్షలుగా ఉంది.

(మిగతా 124వ పేజీలో)

# ప్రసిద్ధ పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతున్న సింగరకొండ

**(123వ పేజీ తరువాయి)**

దక్షిణ ముఖంగా రెండు చేతులతో ప్రణామం చేస్తూ శ్రీ ప్రసన్నాంజనేయస్వామి మూలవిరాట్ విగ్రహం ప్రసన్నవదనంతో ఉండటమే ఈ క్షేత్ర ప్రాముఖ్యత. శ్రీ లక్ష్మీనరసింహాస్వామి భక్తులను చల్లగా చూస్తారని, శ్రీ ప్రసన్నాంజనేయస్వామి కోర్కెలు తీరుస్తారని ప్రతీతి. ఈ క్షేత్రంలో శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవాలయ ఆధ్వర్యంలో కళ్యాణ మంటపం, సత్రశాల, పొంగళిశాల, వనతిగృహాలు నడుపబడుతున్నాయి. వీటికితోడు పలు కుల సత్రాలు కూడా ఉండటంతో భక్తులకు అన్ని సౌకర్యాలు కల్పించబడ్డాయి. ఈ క్షేత్రంలో శ్రీ ప్రసన్నాంజనేయస్వామి, శ్రీ లక్ష్మీనరసింహాదేవాలయాలతోపాటు వినాయకస్వామి, రామమందిరం, భక్తాంజనేయస్వామి దేవాలయం, సుబ్రహ్మణ్యేశ్వర ఆలయం, కోదండరామస్వామి ఆలయాలు కూడా నెలకొని ఉన్నాయి. ఈ క్షేత్రానికి ఆనుకొని భవనాశి చెరువు ఉండటం ప్రత్యేక ఆకర్షణ. ఈ చెరువులో స్నానమాచరించి స్వామివారిని దర్శించుకొంటే సకల పాపాలు పరిహారమవుతాయని భక్తుల ప్రగాఢ నమ్మకం. దానికితోడు ఈ చెరువు ద్వారా ఇరిగేషన్ సౌకర్యాలు కూడా కల్పించబడ్డాయి. ప్రస్తుత పాలకవర్గ ఆధ్వర్యంలో ఈ చెరువులో టూరిజం ఆధ్వర్యంలో రీసార్ట్స్ సెంటర్, బోట్ షికార్ తదితర ఏర్పాట్లకు ముమ్మర ప్రయత్నాలు జరుగుతున్నాయి. అదేవిధంగా టిటిడి కళ్యాణ మండపం, దేవాలయం చుట్టూ వెడల్పాటి సిమెంట్ రోడ్డు, వేదపాఠశాల ఏర్పాటుకు కృషి జరుగుతున్నట్లు చైర్మన్ చిన్ని శ్రీమన్నారాయణ తెలిపారు. ప్రతి ఏటా జరిపే వార్షిక తిరునాళ్ళ ఉత్సవాలను ఈ సంవత్సరం మార్చి 12 నుంచి 15వ తేదీవరకు నిర్వహించనున్నట్లు ఇ.వో. పి.నాగేశ్వరరావు తెలిపారు.



సింగరకొండ ఆలయం సుందరరూపమిదే

# తీరప్రాంత ప్రజల జీవనశైలిని మార్చిన ఆక్వారంగం



(ప్రభాతవార్త – టంగుటూరు)

సుమారు రెండు దశాబ్దాల క్రితం టంగుటూరు మండలంలోని తీరప్రాంతంలో వెలసిన ఆక్వారంగం దినదినాభి వృద్ధి చెందుతూ వేలాది ఎకరాలకు విస్తరించింది. సుదూర ప్రాంతాల నుంచి వచ్చి ఇక్కడ భూములు కొని రొయ్యలు పండించి లక్షలాది రూపాయలు గడించిన ధనవంతులతోపాటు తీరప్రాంత గ్రామాలు కొంత ఆర్థికంగా బలపడ్డాయి.

అనంతవరం, తాళ్లపాలెం, వెలగపూడి, కేసుపాలెం, తేటుపురం సముద్రతీర గ్రామాలలో సుమా రు అయిదువేల హెక్టార్లలో ఆక్వా రంగం విస్తరించింది. తీరప్రాంత గ్రామాల సామాన్య ప్రజలు తొలుత భూములు అమ్ముకోవడంలోనే లక్షలు గడించా రు. ఆక్వా కోసం వచ్చిన ధనవంతులు ఈ గ్రామాలలోని చౌడు భూములను లక్షలు వెచ్చించి కొనుగోలు చేశారు. ప్రారంభంలో ఎకరా అయిదు వేలకే పలికిన భూమి ధర తరువాత కాలంలో లక్ష రూపాయలు అయినా దొరికే అవకాశం లేకుండాపోయింది.

తాము ఆక్రమించుకున్న ప్రభుత్వ భూములు సైతం వీరు బయటనుంచి వచ్చిన బడాబాబులకు విక్రయించి సొమ్ము చేసుకున్నారు. గ్రామాలలో కొందరు మధ్యదళారులు క్రయవిక్రయాల ద్వారా లక్షలు గడించారు. భూములు అమ్ము కోవడం ద్వారా ఆర్థికంగా స్థిరపడ్డ తీరప్రాంత ప్రజలు రొయ్యల చెరువులు వేయాలన్న ఆలోచనకు వచ్చారు. తమ సొంత భూములు, ఆక్రమించుకున్న ప్రభుత్వ భూములలో వీరు కుటుంబానికి ఒకటి, రెండు చెరువులు ఏర్పరచు కున్నారు. తొలినాళ్లలో చెరువు ఉంటే చాలు రొయ్యలు పెంచేందుకు అవసరమైన ఇతర వసతులన్నీ అప్పులరూపంలో వచ్చిపడేవి.

రొయ్య పిల్ల మేత, మందులు ఖర్చులకు అన్నీ కూడా కొందరు రొయ్యల మేత వ్యాపారులు రైతు లకు క్షణాలలో అందించేవారు. చెరువులో రొయ్యలు పెరగగానే ఈ వ్యాపారులే సరుకు తీసుకొని తమ అప్పులు జమ వేసుకునేవారు. దీనివలన రైతు కు రొయ్య పంట వేయడమంటే అప్పట్లో పెద్దగా లెక్క ఉండేది కాదు. 30 కౌంట్ రొయ్య ధర రూ.500 ఉండే రోజుల్లో ఎందరో చిన్న రైతులు సైతంలక్షలు గడించారు. దీనితో ప్రజల జీవనశైలిలో గణనీయమైన మార్పు వచ్చింది. ప్యాసింజర్ రైలు ఎక్కి తిరు పతి వెళ్లి దేవుని మొక్కుబడులు తీర్చు కునేందుకే ఇబ్బంది పడేవారు డబ్బు వచ్చాక టాటా సుమోలలో, ప్రత్యేక మిని బస్సులలో వెళ్లడం ప్రారంభించారు. ఇంట్లో చేసుకునే చిన్న శుభకార్యం అయినా ఘనంగా జరుపుకోవడం మొదలుపెట్టారు. పూట గడవక జీవన భృతి కోసం సొంత ఊరును వదిలివెళ్లిన అనేక తీరగ్రామాల కుటుంబాలు వెతుక్కుంటూ సొంత గూటికిచేరుకున్నాయి. గ్రామంలో ఉన్న తమ బంధువులతో కలిసి వీరూ సంపాదించుకోవడం మొదలుపెట్టారు. తమ పుట్టిన ఊరిలోనే తిరిగి స్థిరపడ్డా రు.

## 2001 తర్వాత....

2001 తర్వాత ఆక్వారంగంలో గడ్డు పరిస్థితులు ఎదురయ్యాయి. రైతులు దారుణంగా నష్టపోయారు. నీటికాలుష్యం, వైరస్ విజృంభణ, పెరిగిన పెట్టుబడులు, అమెరికా విధించిన యాంటీ డంపింగ్ సుంకం, ధరల పతనం రైతులను ఘోరంగా దెబ్బతీశాయి.

మందీమార్బలంతో వచ్చిన పెద్ద రైతులు ఉత్తచేతులతో వెనుదిరిగారు. చిన్న రైతులు నష్టాలుభరించలేక అప్పులపాలయ్యా రు. పదేళ్లపాటు సంపాదనతో వచ్చిన ఖరీదైన అలవాట్లు ప్రస్తుతం నడవక దిగాలుపడ్డారు.

ఊరును వెతుక్కుంటూ వచ్చిన కొన్ని కుటుంబాలు తిరిగి జీవనోపాధి కోసం ఇతర ప్రాంతాలకు వలసలు వెళుతున్నాయి. అప్పుల పడ్డీలు పెరిగి రైతుల నడ్డివిరుస్తున్నాయి. పైకి మేకపోతు గాంభీర్యం చూపే ఎందరో రైతులు అప్పుల దెబ్బకు నిద్రపట్టక ఇబ్బంది పడుతున్నారు. దూరప్రాంతాల నుంచి వచ్చిన ధనవంతులు ఆక్వా వదలి తమ పెట్టుబడులను ఇతర రంగాల కు మళ్లిస్తున్నారు.

వందల ఎకరాలలో చెరువులు అన్ని వసతులు ఉండి కూడా వేసే దిక్కు లేక అలాగే ఉండిపోయా యి. డాలర్లపై ఆశలు వదిలి కొందరు రైతులు సాంప్రదాయ పంటలు సాగు చేస్తున్నారు. అయితే పోగొట్టుకున్నచోటే తిరిగి సంపాదించాలనే ఆశతో ఆక్వా సాగునే నమ్ముకున్నవారు లేకపోలేదు.


వల్లూరమ్మ విగ్రహం

# భక్తుల కొంగు బంగారం వల్లూరమ్మ దేవాలయం

(ప్రభాతవార్త -టంగుటూరు)

దినదిన ప్రవర్ధమానంగా వెలుగుతున్న వల్లూరమ్మ దేవస్థానం భక్తుల పాలిట కొంగుబంగారం- అయ్యింది. భక్తితో అమ్మవారి ముందు శిరస్సు వంచి కోరుకుంటే ఎంతటి శుభకార్యమైనా జరుగుతుందని భక్తుల నమ్మకం. ఒకనాడు నామమాత్రంగా ఉన్న ఈ దేవాలయం భక్తుల నిరంతర ఆదరణతో నేడు దేదీప్యమానంగ్గా విరాజిల్లుతుంది. భక్తుల ఆదరణ, ప్రభుత్వ సహకారంతో దేవాలయం కొత్త శోభతో వర్ధిల్లుతుంది. దేవాలయ ఆవరణ పూజా కార్యక్రమాలకు అనుకూలంగా విస్తరించింది. ఆవరణలో వెలిసే కొత్త కట్టడాలు భక్తులకు మరింత సౌకర్యాలు పెంపొందిస్తున్నా యి. నిండుగా నీటితో కళకళలాడుతున్న విశాలమైన వంట చెరువున ఉన్న ఈదేవాలయం చల్లని గాలులతో పర్యాటకులను ఆకర్షి స్తుంది. ఎందరో భక్తులు ఆరాధ్యదైవంగా భావిస్తున్న వల్లూరమ్మ దేవస్థానం గత చరిత్ర ఒక్కసారి గుర్తెరుగుదాం !

శ్రీ యోగేంద్రుల ఆధ్వర్యంలో శ్రీ అద్దంకి రామచంద్రయ్య ద్వారా నిర్వహించిన అగ్నిగుండం నుంచి మొదట జ్వాలాముఖి అమ్మవారు ఉద్భవించారు. ఉల్కల నుంచి వచ్చిన ఈ శక్తి స్వరూపమే ఉల్కాముఖి అమ్మవారు అని భక్తుల నమ్మకం. అయితే అమ్మవారికి ముందే వల్లూరు గ్రామం ఏర్పడి ఉండడం వలనఈ గ్రామ పరిధిలో వెలసిన అమ్మవారిని వల్లూరమ్మగా వ్యవహరిస్తున్నారన్నది ప్రజల భావన. అమ్మవారు శక్తిస్వరూపం. అగ్నిగుండం నుంచి వెలసిన దేవత. ఒక మహా కార్యం కోసం వెలసిన శక్తిస్వరూపం అని భక్తుల నమ్మకం. ఈతిబాధలు దరిదాపులకు రాకుండా కాపాడుతుందని, చీడపీడలు అంటకుండా రక్షిస్తుందని అమ్మవారిపై భక్తుల భావన. ఉల్కాముఖి అమ్మవారుగా శిలయై వల్లూరులో అందరకు కనిపించడంతో గ్రామంలో అంతా వల్లూరమ్మగా పిలవసాగారు. అమ్మ రాత్రివూట గ్రామంలోప్రజలకు కాపలాగా ఉంటుందని, ఇతర గ్రామ పొలిమేరల నుంచి భూత ప్రేత పిశాచ గణాలను దరిదాపులకు రాకుండా కాపాడుతుందని భక్తుల నమ్మకం. పశువులకు, పంటలకు, మనుషులకు స్ఫోటకం లాంటి ఇతరవ్యాధులు సోకకుండా అమ్మవారు కాపాడుతారని ఇక్కడ ప్రజలు భావిస్తారు.

ఉల్కాముఖి వల్లూరమ్మ అద్దంకివారి ఆడపడుచు. పూర్వం మందపాటి రాజుల కాలంలో వల్లూరులో నివసించే పలుకుటుంబాలలో అద్దంకి వంశరాజులు ముఖ్యులుగా పేర్కొనవచ్చు. గ్రామాలలో కీలకపాత్ర వహించు నియోగుల బ్రాహ్మణులు ప్రముఖంగా భూతవైద్యం తెలిసినవారు. పక్కనే ఉన్న పెళ్ళూరు మందపాటి రాజుల వలన ఎట్టిప్రమాదం కలగకుండా శక్తిస్వరూపం ఏర్పడుటకు కాశకులు అద్దెడివారు. .వారి సలహా ద్వారానే అగ్నిగుండం నుంచి స్వయంగా పుట్టినది దేవతా స్వరూపమే కాని క్షుద్రశక్తి కాదన్నది భక్తుల విశ్వాసం. అందువల్లనే ఉల్కాముఖి అద్దంకి వారి ఆడపడచు అయ్యింది. వారు తమ ఇలవేల్పుగా తొలినుంచి పూజిస్తారు. వీరి తరువాతనే ఇతరులు పూజలు అందుకుంటారు. వీరు తమ ఆడపడుచుకు చీర, రవికలు, పసుపు, కుంకుమాది పూజాద్రవ్యములు ఒసగుచుందురు. వడపప్పు, పానకం మొదట అద్దంకివారు సమర్పిస్తారు. తరువాతనే ఇత రులు మొక్కుబడులు తీర్చుకుంటారు. అద్దంకి వారి ఆడవడుచుగా అభివర్ణిస్తారు.

ఉల్కాముఖి అమ్మవారు శిలా రూపంలో అవతరించాక అద్దంకివారు, భాగవతులువారు తదితర అగ్రహారికులు అమ్మవారికి గుడిగోపురాలు, నిత్య నైవేద్యాలు కల్పించుటకు పూనుకున్నట్లు చరిత్ర చెబుతుంది. భాగవతుల వంశజులలో దక్షిణామూర్తికి పిల్లలు లేరు. అద్దంకి వారు కౌండిశ్య గోత్రీకులై భాగవతుల వెంకటనరసయ్య చేత 1770లో శంకుస్థాపన చేయించి గుడి నిర్మాణం చేసినట్లు తెలుస్తుంది. కాకతీయులు, విజయనగరరాజులు, కొండవీటి రెడ్ల వరకు ఈ దేవాలయంలో పూజలు, తిరునాళ్ళు జరిగేవని పెద్దల భావన. అప్పటి రాజరిక సహకారంతోనే గుడినిర్మాణం జరిగింది. టంగుటూరి కోదండ్ల రామయ్య చుట్టూ ప్రహరీ నిర్మించారు. టంగుటూరి రామదాసుస్వామి దేవాలయానికి వచ్చువారి కొరకు సత్రం నిర్మించారు. తాము చేపట్టిన పని విజయవంతమైతే ఆ పనిద్వారా వచ్చిన ఆదాయానికి కృతజ్ఞతగా భక్తులు పూజలు చేస్తుంటారు. ఆదివారం వచ్చిందంటే ఇక్కడ భక్తుల హడావుడి అంతా ఇంతా కాదు. వారంలో రెండు రోజులు భక్తుల రద్దీ ఉంటుంది.

# సమాజ సేవే ఎంసిఎ లక్ష్యం

**(ప్రభాతవార్త-రేపల్లె)**

సమాజంలో ప్రజల సేవే పరమావధిగా భావిస్తూ ప్రారంభించిన మెడికల్ అండ్ కల్చరల్ అసోసియేషన్ (ఎంసిఎ) లక్ష్యసాధనలో పయనిస్తూ ప్రభుత్వ ఉన్నతాధికారుల ప్రశంసలు పొందుతోంది. ఈ అసోసియేషన్‌కు ప్రవాసాంధ్రుల విరాళాలు ఆర్థిక సహాయంగా అందుతున్నాయి. ప్రణాళిక ప్రకారం ప్రజలకు ప్రయోజనాన్నిచ్చే కార్యక్రమాలను నిర్వహిస్తోంది. తానా ఫౌండేషన్, ఎన్‌ఆర్‌ఐల నుంచి రూ.23,84,464 నిధులు సమకూరాయి. జీవితకాలపు సభ్యత్వాలు, స్వచ్ఛందంగా అందజేసిన నిధులు రూ.22,46,926 ఎంసిఎ ఖాతాకు చేరాయి. గుత్తికొండ లక్ష్మీనారాయణ,లక్ష్మీకాంతమ్మల జ్ఞాపకార్థంగా 1054 చదరపు గజాల స్థలం సమకూరింది. శ్రీగుత్తికొండ లక్ష్మీనారాయణ కళ్యాణ మండపం పేరిట నిర్మించిన కమ్యూనిటీ హాలును 4.5.2001న మంత్రి అరుణ ప్రారంభించారు. అప్పటి నుంచి ఉచిత వైద్యశిబిరాలు, క్రీడాపోటీలు, సాంస్కృతిక కార్యక్రమాలు, ఆరోగ్యం-అనారోగ్యంపై అవగాహన సదస్సులు, రక్తదానం శిబిరాలను మూడొందలకు పైగా ఎంసిఎ నిర్వహించింది. మెడికల్ అండ్ కల్చరల్ అసోసియేషన్ అధ్యక్షకార్యదర్శులుగా వ్యవహరిస్తున్న డాక్టర్లు కె.కృష్ణకుమారి, వేజళ్ళ ప్రకాశరావులు కార్యవర్గం సహకారంతో వివిధ రంగాల్లో రేపల్లె, నగరం, భట్టిప్రోలు, కొల్లూరు, నిజాంపట్నం మండలాల్లోని ప్రజలకు సేవలు అందిస్తున్నారు. *(మిగతా. 132వ పేజీలో)*


స్థలదాత లక్ష్మీనారాయణ,


స్థలదాత లక్ష్మీకాంతమ్మ

# వార్త దశమ వార్షికోత్సవ సదస్సు దృశ్యాలు



పదో వార్షికోత్సవాల సందర్భంగా వార్త గుంటూరు యూనిట్ కార్యాలయంలో జరిగిన సదస్సుకు హాజరైన విద్యార్థులు



సదస్సులో ప్రసంగిస్తున్న జిజిహెచ్ సూపరింటెండెంట్ డాక్టర్ భగవన్నారాయణ



గుంటూరు జిల్లా ఘనతను వివరిస్తూ ఉత్తేజభరితంగా ప్రసంగించిన విజ్ఞాన్ విద్యాసంస్థల అధినేత లావు రత్తయ్య



కార్డ్స్ స్వచ్ఛంద సంస్థ అధినేత రంజన్‌కుమార్ ప్రసంగిస్తున్న దృశ్యం

# పేదల పెన్నిధి ఎయంజి అధినేత జాన్‌డేవిడ్



(ప్రభాతవార్త-చిలకలూరిపేటరూరల్)

సేవాభావానికి చిరునామా, దాతృత్వానికి మారుపేరు డాక్టర్ సురా జాన్ డేవిడ్. ఆయన భౌతికంగా లేక ఏడాది గడిచినా ఆయన చూపినబాట, చేసిన సేవలు ప్రతిఒక్కరి హృదయాల్లో చిరస్మరణీయంగా నిలిచిపోయాయి. 2005జనవరి 9వతేదీన దేవునియందు నిద్రించినా ఆయనచూపిన మార్గం ద్వారా జీవనం కొనసాగిస్తున్న వేలాదిమందికి డేవిడ్ తమ కళ్ళముందు మెదులుతున్నట్లు ఉందని స్మరించుకోవడం జరుగుతూనే ఉంది. ఆయన విశాఖపట్నం జిల్లాలోని నర్సిపట్నం తాలూకా బల్లిఘట్టంలో గాబ్రియేల్, కృపమ్మల దంపతులకు 17 అక్టోబరు 1926లో జన్మించారు. చిన్నతనంలోనే తండ్రిని పోగట్టుకున్న ఆయన దేశసేవాభిలాషతో సైన్యంలో చేరారు. అయితే వృద్ధురాలైన తల్లికి సేవలనందించేందుకు ఉద్యోగాన్ని వదులుకుని సాధారణ జీవనాన్ని అలవర్చుకున్నారు. తన జీవనగమ్యాన్ని ప్రజాసేవకే అంకితం చేశారు. బాల్యంలో అనాధగా తన వితంతు తల్లి సంరక్షణలో ఎదగడం అనేది ఆయనలో మహత్తర సేవాకాంక్షకు ఊపిరిపోసింది. దీంతో రాష్ట్రంలోని పలు ప్రాంతాల్లో సువార్త సందేశాలు ఇస్తూ పలువురికి జీవనస్థితిగతులపై వివరిస్తూ ఉండేవారు. ఆ క్రమంలో భాగంగా చిలకలూరిపేటలోను సువార్త సందేశాలు ఇస్తూ స్థిరపడ్డారు. స్థానికంగా వైద్యవృత్తిలో ఉన్న సత్యవేదం ఆయనకు సహాయసహకారాలు అందిస్తూ జీవిత భాగస్వామిగా మారారు. వీరికి నలుగురు కుమార్తెలు, ఒక కుమారుడు కలిగారు. వారిలో ఒక కుమార్తె చనిపోగా, మరొక కుమార్తె లండన్‌లో ఉండగా, ఇద్దరు కుమార్తెలు, కుమారుడు సేవారంగంలో అత్యున్నతమైన సేవలు అందిస్తున్నారు. రాష్ట్రంలో విశిష్ట సే



వాసంస్థల్లో ఒకటైన ఎయంజి సంస్థను 1952లో చిలకలూరిపేట పట్టణంలో స్థాపించారు. అప్పటినుంచి నిర్విఘ్నంగా రాష్ట్రంలో పలు జిల్లాల్లో సంస్థను విస్తరించి పలు సేవాకార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. సామాజిక అభివృద్ధి కార్యక్రమాలు, వైద్య, ఆరోగ్య రంగాల్లో విశిష్టమైన సేవలను అందిస్తున్నారు. కంటి వైద్యశాలలు, క్షయ వ్యాధి నివారణా కేంద్రాలు నిరుపేదలకు అత్యున్నతమైన సేవలనుఅందిస్తున్నాయి. ఎయంజి ఆధ్వర్యంలో 22వేల మంది అనాధలు, కుష్టువ్యాధి నివారణా కేంద్రాలు, వ్యవసాయదారులకు సహాయకేంద్రాల నిర్వహణకు, చిన్నారులకు అందిస్తున్న సేవా కార్యక్రమాలకు 1995లో అప్పటి రాష్ట్రపతి శంకరదయాళ్ శర్మద్వారా జాతీయ బాలల సంక్షేమ అవార్డును పొందారు. 1979, 1982, 1986, 1994, 1998 సంవత్సరాల్లో అప్పటి రాష్ట్ర గవర్నర్లు కె.సి.అబ్రహాం, రాంలాల్, కుముద్‌బెన్‌జోషి, కృష్ణకాంత్, రంగరాజన్‌ల ద్వారా ఉత్తమ సేవా అవార్డులను అందుకున్నారు. 1995లో అమెరికాలో తానా మహాసభల్లో ఉత్తమ సంఘసేవా అవార్డు పొందారు. ఆయనకు రాజకీయాల్లో మంచి అవకాశాలు వచ్చినా సున్నితంగా తిరస్కరించారు. నేను రాజకీయాల్లోకి వస్తే ఇంతసేవచేయకలిగి ఉండేవాడినికానేమోనని పలువురి వద్ద తన అభిప్రాయాన్ని వెలుబుచ్చేవారు. రాజకీయాలకు అతీతంగా పలు పట్టణాలు, గ్రామాల్లో సామాజిక సేవా కార్యక్రమాలు నిర్వహించారు. ముఖ్యంగా తాగునీరు, మురుగుకాల్వల అభివృద్ధి, పేదలకు గృహనిర్మాణాల్లో ఎయంజి సంస్థ ద్వారా ఆయన విశేష సేవలను అందించారు. రాష్ట్రంలో జాన్‌డేవిడ్ చేస్తున్న సేవా కార్యక్రమాలకు ముగ్ధుడైన జర్మనీ శాస్త్రజ్ఞుడు డాక్టర్ డైక్‌మెన్ కోట్లాది రూపాయల విరాళం అందజేశారు. వీటితో రాష్ట్రంలోని పలు ప్రాంతాల్లో ప్రజల సామాజిక అవసరాలను తీర్చేందుకు డేవిడ్ విశేష కృషి చేశారు. వ్యభిచారవృత్తిలో మగ్గుతున్న మహిళలకు, గిరిజనులకు, బాలకార్మికులకు, మురికివాడల్లో నివశించే ప్రజలకు, యానాది వృత్తిలో ఉన్న వారి జీవనోపాదికి అనేక పధకాలు రూపొందించి వాటిని అమలుపర్చి వారి జీవితాలల్లో కొత్త వెలుగులు నింపారు. ప్రతి సంవత్సరం 75వేల మందికి లబ్దిచేకూరే విధంగా ఆరోగ్యం మరియు విద్యాసంస్థలను నిర్వహిస్తున్నారు. కుష్టువ్యాధి గ్రస్తులకు పదివేలకు పైగా గృహాలను నిర్మించారు. గ్రామీణప్రాంతాల్లోని నిరుపేదలకు ఇందిరా ఆవాస్‌యోజన పథకం కింద నిర్మిస్తున్న గృహాల లబ్దిదారులకు సంస్థ నుంచి అదనంగా రూ.8వేలు సహాయం అందించారు. ప్రకృతి వైపరిత్యాలు సంభవించినపుడు నిరాశ్రయులైన కుటుంబాలను ఆదుకోవడానికి సంస్థద్వారా తన వంతు సహాయ సహకారాలను అందించారు. గత మూడు సంవత్సరాలుగా కరువు,కాటకాలతో అల్లాడుతున్న రైతులకు ఉచితంగా పశుగ్రాసం కూడా పంపిణీ చేశారు. ఇటీవల రాష్ట్రంలో ఆత్మహత్య చేసుకున్న రైతుల కుటుంబాలకు సంస్థ తరపున సహాయసహకారాలను అందించారు. వారి పిల్లలకు ఉచితంగా విద్యను అందిస్తున్నారు. ఇటీవల సంభవించిన త్సూనామి భూకంప బాధిత కుటుంబాలను లక్షలాది రూపాయాలసహాయంతో ఆదుకుంటునే తుదిశ్వాస విడిచారు. 1985వ సంవత్సరంలో రోటరీ క్లబ్ ఆఫ్ చిలకలూరిపేటలో సభ్యునిగా చేరారు. పోలియో ఎరాడికేషన్ ఉద్యమంలో చిలకలూరిపేటలో కోల్డు చైన్ ఏర్పాటుకు కృషి చేశారు. 1989లో పోలియో శస్త్ర చికిత్సా శిబిరాలను నిర్వహించారు. రోటరీ జయపూర్ లింబ్ క్యాంప్‌కు తమ విశిష్టమైన సేవలను అందించారు. రోటరీ కమ్యూనిటీహాల్ నిర్మాణంలో ప్రకృతివైపరిత్యాల్లో సహాయం అందించినందుకు 1991లో ఆయనకు విశిష్ట రొటేరియన్ అవార్డును అందించారు. రోటరీ అత్యున్నత పురస్కారం సర్వీసు విజేత సెల్ఫ్అవార్డుకు సేవాప్రమణాలు నెలకొల్పిన దార్శనికుడు, మానవతావాది జాన్‌డేవిడ్.

# చారిత్రక కట్టడం ఆది బౌద్ధ స్థూపం

**మామిడికుదురు, (తూర్పు గోదావరి జిల్లా) (ప్రభాతవార్త)**

పవిత్ర వైనతేయ గోదావరి నదీతీరంలోని ఆదుర్రు గ్రామంలో చారిత్రక ఆది బౌద్ధస్థూపం ఎంతో ప్రాధాన్యం సంతరించుకొంది. పంచముద్ర(ఐదు ముద్రల సమ్మేళనం) కింద ఆదుర్రులో ఈ స్థూపం 1946లో బయల్పడింది. ఇది అశోక చక్రవర్తి కాలంలో నిర్మితమైందని పురావస్తు శాఖాధికారులు చెబుతున్నారు. ప్రపంచ ప్రసిద్ధి పొందిన సాంచి, సారనాథ్ స్థూపాల తరహాలో ఇక్కడి కట్టడాలు ఉండటం గమనార్హం. పురావస్తుశాఖ అధీనంలో ఉన్న ఇక్కడి బౌద్ధ స్థూపం వద్ద ప్రతి మట్టి రేణువుకూ ఓ చరిత్ర కనిపిస్తుంది. ఏ మూల తవ్వినా చారిత్రక ఆధారాలు బయటపడడం ఇక్కడి స్థల విశిష్టత. క్రీస్తుపూర్వం 211లో కళింగయుద్ధం తరువాత జీవహింస చేయరాదని అశోకుడు నిర్ణయించుకుని బౌద్ధమతం స్వీకరించాడు. ఆయన తన సామ్రాజ్యాన్ని ఏడు భాగాలుగా విభజించి 84 వేల బౌద్ధ స్థూపాలు నిర్మించినట్టు చరిత్ర చెబుతోంది. వీటిలో 60 స్థూపాలు మహా క్షేత్రాలుగాను, మూడు స్థూపాలు దివ్యక్షేత్రాలు గాను విభజించారు. ఆ మూడు దివ్య క్షేత్రాలలో మొదటిది ఆదుర్రులో నెలకొల్పిన ఆది బౌద్ధ స్థూపంగా చరిత్ర చెబుతోంది. దీనిని బట్టి బౌద్ధం ఏ స్థాయిలో ఇక్కడ విరాజిల్లిందో తేట తెల్లమవుతోంది. 1945 వరకు మరుగున పడిఉన్న ఈ దివ్య క్షేత్రాన్ని "దూబరాజు దిబ్బ"గా పిలిచేవారు. పలువురు ప్రముఖులతో ఏర్పాటైన "శిథిల దేవాలయ మహాభక్త మండలి" ఈ దిబ్బ వద్ద తవ్వకాలు చేపట్టింది. ఈ తవ్వకాల్లో మట్టితో కప్పుకు పోయిన ప్రధాన స్థూప రాజాన్ని గుర్తించారు. నాలుగు వైపులా మెట్లతో ఈ దివ్యక్షేత్రం దర్శనమిస్తుంది. అశోకుని కాలంలో బుద్ధుని ధాతువు మీద "ధాతు స్థూపాన్ని" నిర్మించారు. బౌద్ధ బిక్షువులు సుమారు పది, పన్నెండు శతాబ్దాలు ఇక్కడ బౌద్ధం విరాజిల్లింది. స్థూప పైభాగంలో 24 ఆకులతో ధర్మచక్రాన్ని పోలి ఉంటుంది. పూర్వం ఈ గ్రామాన్ని ఆది ఊరుగా పిలిచేవారు. ఆది బౌద్ధ స్థూపం చారిత్రక ప్రాధాన్యం రీత్యా గ్రామానికి ఈ పేరు ఏర్పడినట్టు పూర్వీకులు చెబుతున్నారు. ఆది ఊరు కాలక్రమేణ ఆదుర్రుగా రూపాంతరం చెందింది.

స్థూపం విశేషాలు ఇవి పురావస్తుశాఖ 1955లో ఈ స్థలాన్ని ప్రొటెక్టెడ్ మాన్యుమెంట్‌గా ప్రకటించి దీనిని స్వాధీనం చేసుకుంది. ఈ స్థూప రక్షణ పనులను ఇటీవల మూడు లక్షల రూపాయలతో నిర్వహించారు. ఇక్కడి తవ్వకాల్లో బుద్ధుని అవశేషాలుగా పేర్కొనే బొమికి, దంతం, మృణ్మయ పాత్రలు లభించాయి. స్థూపం చుట్టూ సన్నికేలు, రాగి నాణేలు గుర్తించారు. వీటిని చెన్నై మ్యూజియంలో భద్రపరిచారు. 1955లో శ్రీలంక బౌద్ధ మతాచార్యులు భంతీరత్నమాల మహదేవర ఈ స్థూపాన్ని సందర్శించారు. ఈ స్థూపానికి రెండు వైపులా ప్రార్ధనా మందిరాలతో పాటు పలు చైత్యాలు



ఆదుర్రు ఆది బౌద్ధ స్థూపం

వెలుగుచూశాయి. ఆదుర్రు కట్టడాలు బయల్పడిన సమయంలోనే నాగార్జునసాగర్, అమరావతి, జగ్గయ్యపేట, బట్టిప్రోలు, శాలిగుండం, కళింగపట్నంలలో బౌద్ధ స్థూపాలు వెలుగులోకి వచ్చాయి. స్థూపానికి సమీపంలో పలుచోట్ల ఇళ్ల నిర్మాణాలు చేపట్టినప్పుడు బౌద్ధమతానికి చెందిన కట్టడాలు వెలుగు చూశాయి. జపాన్, బర్మా, శ్రీలంక తదితర దేశాల నుంచి బౌద్ధమత ఆరాధకులు సముద్రమార్గం ద్వారా వైనతేయ నది నుంచి ఇక్కడికి చేరుకునేవారని చరిత్రకారులు చెబుతున్నారు. గౌతమ బుద్ధుని అస్థికలతోపాటు మౌర్య చక్రవర్తులు ఎంతో విలువైన వస్తు సామగ్రిని దీనిలో ఉంచారని చరిత్రకారులు చెబుతున్నారు. ఆదుర్రు ఆది బౌద్ధ స్థూపం పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది.



ఉప స్థూపం

# బౌద్ధ క్షేత్రంపై ఎందుకీ నిర్లక్ష్యం?

**కోరుకొండ, ప్రభాతవార్త**

తూర్పుగోదావరి జిల్లాలో మండల కేంద్రం కోరుకొండకు శివారున ఉన్న కాపవరం పాండవుల మెట్టపై వెలుగుచూసిన కీ.శ. రెండో శతాబ్దం నాటి బౌద్ధ నిర్మాణాలపై కేంద్ర ప్రభుత్వం నిర్లక్ష్యం చూపటంపట్ల పర్యాటకులు నిరాశ చెందుతున్నారు. స్వాతంత్ర్యానికి పూర్వం అప్పటి బ్రిటీష్ ప్రభుత్వం ఈ ప్రాంతాన్ని గుర్తించింది. 1972లో రక్షిత ప్రాంతంగా ప్రకటించి ప్రభుత్వం ఆర్కియాలజికల్ శాఖకు అప్పగించింది. 2001లో కేంద్ర పురావస్తు శాఖ హైదరాబాద్ సర్కిల్ సూపరింటెండెంట్ కె. వీరభద్రరావు ఆధ్వర్యంలో తవ్వకాలు జరిగాయి. ఎవరూ ఊహించని విధంగా సుమారు రెండు ఎకరాల స్థలంలో స్థూపాలు, చైత్యాలు, ఆరామాలు తవ్వకాలలో వెలుగుచూశాయి. లక్షలాది రూపాయలు వెచ్చించి తవ్వకాలను జరిపినప్పటికీ శిధిలాలను



వేల సంవత్సరాల చరిత్ర
కలిగిన కాపవరం పాండవ కొండ

పునర్నిర్మాణం చేయటంలో కేంద్ర పురావస్తు శాఖ నిర్లక్ష్య ధోరణి అవలంభిస్తోంది. కీ.శ.రెండో శతాబ్దం నాటి బౌద్ధ నిర్మాణాలలో బౌద్ధ బిక్షువులు నివశించే సంఘారామాలు 18 బయటపడ్డాయి. వీటిని పూర్తి ఆకారంలో తీర్చిదిద్దటంలో పురావస్తు శాఖ నిర్లక్ష్య ధోరణిలో ఉంది.

అలాగే మహాస్థూపం, చైత్యాలు అనేకం వెలుగుచూశాయి. వీటికోసం తిలకించడానికి వచ్చేవారికి చెప్పడానికి పూర్తి పరిజ్ఞానం ఉన్న గైడ్‌ను నియమించాల్సి ఉంది. బయటపడ్డ బౌద్ధ నిర్మాణాలు ఏ కాలానికి చెందినవి, తవ్వకాలలో ఏవి బయటపడ్డాయి తదితర వివరాలు తెలిపేవారు లేరు. స్థూప సంరక్షకులుగా ఆరుగురు వ్యక్తులు ఉన్నప్పటికీ వీరి విధులు ప్రజలకు, సందర్శకులకు ఉపయోగపడటం లేదు.

# ప్రజల కోసం పుట్టింది 'వార్త'



## పదేళ్లుగా ఎంతో చేశాం, చేయాల్సింది మరెంతో ఉంది: గిరీశ్ సంఘీ

■ దామెర్ల సాయిబాబ

ప్రజా సమస్యలు పరిష్కరించాలన్న నిరంతర అన్వేషణా క్రమంలో 'వార్త' పుట్టిందని సంస్థ సిఎండి గిరీశ్ కుమార్ సంఘీ చెప్పారు. వార్త పత్రిక పది వసంతాలు పూర్తి చేసుకున్న సందర్భంగా ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆయన అనేక అంశాలపై తన మనోగతాన్ని వివరించారు. ఇంటర్వ్యూ ముఖ్యాంశాలు.

◆ పత్రిక పెట్టాలన్న ఆలోచనకు ప్రేరణ, అంకురార్పణ ఏమిటి?

ఈ ప్రశ్నకు నా గతమే జవాబు. నేను పదోతరగతి చదువుకుంటున్నప్పుడే,అంటే నాకు 15ఏళ్ళ వయస్సులోనే నాకెరియర్ ప్రారంభమైంది. నేను వ్యవసాయం చేసేవాడిని. నిత్యం గ్రామీణ ప్రజానీకంతో మమేకం కావడంతో ఒటిక పేదరికం, వారిని దోచుకునే అవినీతి తదితర సమస్యలు నా లేత మనస్సుపై తీవ్రప్రభావం కలిగించాయి. తర్వాత పారిశ్రామిక రంగంలో అడుగుపెట్టి, అభివృద్ధిపథంలో పయనిస్తున్న దక్షిణ కొరియా, జపాన్, ఇజ్రాయిల్, చైనా వంటి దేశాలు పర్యటించే వీలుకలిగింది. అటు వ్యవసాయంలోను, ఇటు పారిశ్రామికరంగంలోనూ వ్యక్తిగతంగా స్థిరపడినా మనదేశప్రజలు ఎందుకు వెనుకబడిపోతున్నారోననేఅవేదన నన్ను వెంబ డించేది కలచి వేసేది. ప్రజల సమస్యలేమిటో, వారి రోజువారీబాధలు ఏమిటో పూర్తిగా అవగాహనఉన్న నాకు వాటిని పరిష్కరించే మార్గాలు అంతుపట్టేవి కాదు. ఈనిరంతర అన్వేషణా క్రమంలోనే ప్రజలపక్షం వహించే ఒక మంచిపత్రిక పెట్టి వారిసమస్యలను ప్రభుత్వం దృష్టికి తీసు కుపోవాలనే ఆలోచన స్ఫురించింది. ఇక మరోయోచనకు తావివ్వకుండా ఎబికెపబ్లికేషన్స్‌ను తీసుకుని 1995లో'వార్త'ను ప్రారంభించాను.

◆ మీ కుటుంబసభ్యులు,మిత్రుల సహకారంఏమేరకు అందాయి?

అన్నివిధాలుగా పూర్తి సహాయ సహకారాలందించారు.మరికొన్ని సందర్భాల్లో అలర్ట్‌కూడా చేశారు. ఇకమిత్రుల్లో చాలామంది రకరకాల అభిప్రాయాలు చెప్పారు. పారిశ్రామికవేత్తగా ఉంటూపత్రిక పెట్టి చేతులుకాల్చు కోవద్దని ఎక్కువమంది సలహాలిచ్చారు.అయితే పత్రిక పెట్టాలనే నాకృత నిశ్చయం. ఈప్రయత్నంలో సక్సెస్‌అవుతానన్న నమ్మకం, ఏదో చేయాల న్న ఆశయం నన్ను ముందుకు నడిపించాయి.

◆ మీ ఆశయం ఎంతమేరకు నెరవేరింది ? అడ్డంకులు రాలేదా?

కొంతవరకు చేయ్యగలిగాను. చేయాల్సింది ఇంకా చాలాఉంది. కొన్ని పరిస్థితులు కలిసిరాలేదు. అయినా పట్టుదల వీడలేదు. అందుకు చాలా కారణాలున్నాయి. రుణసహాయం అందిస్తామనివచ్చిన హామీలు కార్యరూపం దాల్చలేదు. ఇక స్వయంగా బ్యాంకులు మంజూరు చేసిన నిధుల్లో కేవలం అరవైశాతమే ఇచ్చాయి. దీంతో నలభైశాతం నిధులు చేతికి అందకపోవడంతో ఒకదశలో వర్కింగ్ క్యాపిటల్ లేక ఇబ్బందులను ఎదుర్కొనాల్సి వచ్చింది.

◆ ఒకేసారి తొమ్మిది ఎడిషన్లతో వార్తను ప్రారంభించడానికి కారణం?

తాజావార్తలతో పాఠకులకు ఎంత దగ్గరకు, ఎంత త్వరగా వెళ్ళగలుగుతామనే ఆలోచనతోనే అప్పటివరకు ఉన్న తెలుగు దినపత్రికలకంటే ఎక్కువ ఎడిషన్లు ఉండాలనే యోచన కార్యరూపం దాల్చింది. దీంతో ఆధునాతన సాంకేతిక పరిజ్ఞానం, యంత్రపరికరాలతో వార్తను ప్రజల ముందుకు తీసుకువచ్చాను. ఈ క్రమంలోఎన్నోసమస్యలుఎదుర్కొన్నాను.

◆ ఏమిటా సమస్యలు ?

ఆర్థికపరంగా ఎన్నోఇబ్బందులు పెట్టారు. ప్రింటింగ్ యంత్రాలు సకాలంలో డెలివరి కాకుండా అడ్డుకున్నారు. అనేక తప్పుడు ప్రచారాలు చేశారు.అయినా వాటన్నింటిని అధిగమించాం

◆ దినపత్రిక ప్రారంభించినందుకు ఎప్పుడైనా బాధ కలిగిందా ?

ఎప్పుడూ బాధపడలేదు. ఇంకా నాలుగు పత్రికలు పెట్టాలన్న కోరిక ఉంది. ముఖ్యంగా కష్టనష్టాల్లో నావెన్నంటి నిలిచి నాతో పాలుపంచుకుం టున్న 'వార్త' సిబ్బందిని ఎప్పటికీ మరచిపోలేను. నాకష్టాల్లో వారందరూ నాకుటుంబసభ్యుల్లా నిలబడ్డారు. 'వార్త'ను వారి సొంత పత్రికగా భావించారు. అందుకే పేరు పేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

◆ పత్రిక పాలసీలో మీ ప్రమేయం ఎంతమేరకు ఉంటుంది ?

మేనేజ్‌మెంట్ బోర్డుతో చర్చించి, ఎడిటోరియల్ బోర్డు ముందుంచి నిర్ణయాలు తీసుకుంటాము. ఏనిర్ణయమైనా సమిష్టిగా చర్చించడం, అంతి మంగా ప్రజలపక్షం వహించడమే వార్త పాలసీ. ఇందులో నేను ముఖ్యమైన పాత్ర వహిస్తాను.

◆ మీరు రాజకీయాల్లో చేరడం వల్ల పత్రికపై ప్రభావమున్నదా ?

'వార్త'పై రాజకీయ ప్రభావం పడలేదు. కానీ రాజకీయాల్లో చేరకపోతేనే బాగుండేదేమోనని అనిపిస్తున్నది. కానీ చేరినదానివల్ల నష్టమేమీలేదు. రాజకీయాల ద్వారా ఎన్నో విషయాలు తెలుసుకుంటున్నాను. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని ప్రజా సమస్యలను పరిష్కరించేందుకు నాశక్తిమేరకు కృషిచేస్తున్నాను.

◆ 'వార్త'పై కాంగ్రెస్‌పార్టీ ముద్ర పడడంలేదా ?

అలాంటిదేమీలేదు, ముందే చెప్పాను రాజకీయప్రభావం ఏమిలేదని. ప్రజాసంక్షేమమే ధ్యేయంగా 'వార్త' పనిచేస్తుంది. 'వార్త' ఏ ఒక్క రాజకీయ పార్టీకి వ్యతిరేకం కాదు, అలా అని ఏ పార్టీకి వంత పాడదు. ఇందులో ఎలాంటి రాజీలేదు. ఈ విషయం నిరంతం 'వార్త'ను హృదయాలకు హత్తుకునే పాఠకుల తెలుసు.'వార్త'పై ఉన్నది ప్రజల ముద్రే తప్ప రాజకీయాల ముద్ర ఎంతమాత్రం కాదు.

◆ అయితే తెలుగుదేశం పార్టీని ఎందుకు వ్యతిరేకించారు ?

మేం వ్యతిరేకించేది ప్రజావ్యతిరేక విధానాలను మాత్రమే తప్ప తెలుగుదేశం పార్టీనికాదు. నిజానికి 'వార్త'కు ఏపార్టీ పట్ల వ్యతిరేకత లేదు.

మిగతా 132వ పేజీలో

# ప్రజల కోసం పుట్టింది 'వార్త'

131వ పేజీ తరువాయి

తొమ్మిదేళ్ళపాటు తెలుగుదేశం పార్టీ అధికారంలో ఉంది. ప్రజాసమస్యలు వెలుగులోకి తీసుకువచ్చే క్రమంలో ఆ అభిప్రాయం ఏర్పడి ఉండవచ్చు. ఆ పనిని 'వార్త' ఇప్పుడు కూడా చేస్తూనే ఉన్నది.

◆ ఈ పదేళ్ళలో మిమ్మల్ని బాధపెట్టిన సంఘటన ఉందా ?

అన్నింటికంటే ఎక్కువగా నన్ను ఎన్.టి.రామారావు మరణం చాలా బాధపెట్టింది. ఆకస్మికంగా జరిగిన ఈసంఘటన కలచివేసింది.

◆ మిమ్మల్ని సంతోషపెట్టిన సందర్భం ఉందా ?

ఎన్నో సందర్భాలున్నాయి. వార్త పత్రికద్వారా ప్రజాసమస్యలకు పరిష్కారం లభించినప్పుడు పేద ప్రజల కళ్ళల్లో పెల్లుబుకుతున్న సంతృప్తిని చూసినప్పుడు నాకు కలిగే ఆనందం, సంతృప్తి మాటల్లో వర్ణించలేను.

◆ ఉదాహరణలు చెబుతారా ?

సివిల్‌సప్లై నిఘా విభాగం వల్ల వ్యాపారస్తులు, రైస్‌మిల్లర్లు పడుతున్న ఇబ్బందులు, చిన్నచిన్న ఆరోపణలపై వారిని చీటికి మాటికి జైలు పాలు చేస్తున్న విషయం 'వార్త' ద్వారా వెలుగులోకి తీసుకువచ్చాం. దీనిపై ప్రభుత్వం స్పందించి ఆవిభాగాన్నే రద్దుచేసినప్పుడు నాకు ఎంతో సంతృప్తికలిగింది. అలాగే రాష్ట్రంలో రవాణా ఆంక్షల కారణంగా ఒక మండలం నుంచి మరొక మండల పరిధిలోకి వడ్లు, బియ్యం తీసుకువెళ్ళలేక రైతులు పడుతున్న ఇబ్బందులను 'వార్త' వెలుగులోకి తీసుకువచ్చింది. దీనిపై కూడా ప్రభుత్వం స్పందించి ఆంక్షలను రద్దుచేసింది. గతఎన్నికల్లో బోగస్ ఓట్ల నమోదుపై 'వార్త' ఒకఉద్యమాన్ని నడిపింది. నిబంధనలకు విరుద్ధంగా వేలాది గ్రామాల్లో ఇష్టా నుసారంగా బోగస్ ఓటర్లను సృష్టించారు. కొన్ని గ్రామాల్లో జనాభాకన్నా ఓటర్ల సంఖ్య ఎక్కువైంది. దీన్ని 'వార్త' చాలాసీరియస్‌గా తీసుకుని వాస్త వాలను వెలుగులోకి తీసుకువచ్చింది. దీనిపై ఎన్నికల కమిషన్ స్పందించి ఇల్లిల్లూ తిరిగి తనిఖీలు నిర్వహించి దాదాపు కోటిపైగా బోగస్ ఓటర్లను తొలగించింది. ఇది వార్త పత్రిక ద్వారానే జరిగిన విజయం కావడం నాకెంతో ఆనందాన్ని కలిగించింది. ఇలాగే టెండర్ల విషయంలో కానీ, మానవ హక్కుల ఉల్లంఘన జరిగినప్పుడు కానీ, 'వార్త' వెలుగులోకితేవడం, వాటిపై ప్రభుత్వం స్పందించి చర్యలు తీసుకున్న సందర్భాల్లో నేను సంతృప్తి చెందినవి ఈ పదేళ్ళ కాలంలో కోకొల్లలు. వార్తలు ప్రచురించడంతో సరిపెట్టు కోకుండా ప్రజల్లో సమస్యలపట్ల అవగాహన పెంచి, పరిష్కారం వైపు నడిపించేందుకు 'వార్త' మార్గదర్శకంగా వ్యవహ రించిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి.

◆ అంటే ?

ఎయిడ్స్ లాంటి ప్రమాదకర వ్యాధి బారిన పడకుండా ప్రస్తుతం రాష్ట్రంలో సదస్సులు నిర్వ హిస్తూ, ప్రజల్లో చైతన్యం తీసుకువచ్చేందుకు 'వార్త' కృషి చేస్తున్నది. అలాగే గతంలో కూడా పాల రైతులకు గిట్టుబాటు ధర కోసం కృషి చేసింది. కొంతవరకు సఫలీకృతం అయింది కూడా. విని యోగదారుల హక్కులకోసం, సామాజిక న్యాయం కొరకు 'వార్త' ఎంతోకృషిచేసింది. విద్యుత్ చార్జీలు పెంచినపుడు ప్రభుత్వవిధానానికి వ్యతిరేకంగా 'వార్త'చేపట్టిన కార్యక్రమానికి ప్రజలు, రాజకీయ పార్టీలు ఎంతో మద్దతునిచ్చాయి. ఆర్.టి.సి పరిరక్షణలో ఉద్యోగులతో పాటు ఎంతో కీలక పాత్ర వహించింది. ఇలా ఎన్నో కార్యక్రమా లు 'వార్త' చేపట్టింది. ఇక ముందు కూడా ఇలాంటి కార్యక్రమాలను కొన సాగిస్తూనే ఉంటుంది.

◆ 'వార్త'ను అక్కున చేర్చుకున్న పాఠకుల గురించి మీ అభిప్రాయం?

పాఠకులు ఎంతో తెలివైనవారు. వారెంతో ఆదరించి ఆశీర్వదిస్తున్నారు. వారి ఆదరాభిమానాలతోఇంతటిస్థాయికి ఎదిగాం. అయితే వారి అభిరుచులకు అనుగుణంగా సమగ్రంగా'వార్త'ను అందించలేకపోతున్నాము. ఇంకా ఎంతో సమాచారం, వార్తలు, విషయ విశ్లేషణ లుఇవ్వాల్సిన అవసరంఉంది. ముమ్ముందు 'వార్త'ను మరింత మెరుగుపరచి పాఠకులఅభిరుచికి, అభిలాషకు అనుగుణంగా తీర్చిదిద్దాలనే ప్రయత్నం. అయినా కొన్ని పరిమితులు తప్పవేమో. పదేళ్ళకాలం ఒక మైలురాయి మాత్రమే, ఇంత గొప్ప ఆదరణ చూపినవారందకి ప్రత్యేకంగా కృతజ్ఞతలు.



## పేద ప్రజల ప్రతినిధి 'వార్త'



'వార్త', 'స్వతంత్ర వార్త' రెండూ గొప్ప వార్తా పత్రికలు. సమాజం తరపున నిలబడిన పత్రికలు. పేద ప్రజల ప్రతినిధిగా 'వార్త' పనిచేసిందని మరింత గట్టిగా చెప్పగలను

'వార్త' దినపత్రిక పదేళ్ళు పూర్తి చేసుకున్న సందర్భంగా శ్రీమతి అల్కా సంఘి ఇంటర్వ్యూ.

◆ మీ పెళ్ళికిముందు జీవితం గురించి చెప్పండి?

ఉన్నతసాంప్రదాయ విలువలు కలిగిన అగర్వాల్ కుటుంబంలో ముంబాయిలో పుట్టాను. ముంబాయిలోనే నా చదువు మొత్తం పూర్తయింది. కామర్స్‌లో గ్రాడ్యుయేషన్ చేశాను.

◆ మీ పెళ్లి ఎలా జరిగిందో చెప్పండి?

మాది పెద్దలు నిర్ణయించి చేసిన పెళ్ళి.

మీ కుటుంబనిర్వహణలో ఉన్న వ్యాపారాల్లో మీరు పాలుపంచుకుంటున్నారా? ఎలా?

పెళ్లి తరువాత మా అత్త, మామగార్లు నన్ను మా కుటుంబ నిర్వహణలోని వ్యాపారాల బాధ్యతని తీసు కోమని ప్రోత్సహించారు. నాకు టెక్స్‌టైల్ యూనిట్ నిర్వహణను అప్పగించారు. ఎక్కువ కాలం ఈ పనుల్లో నిమగ్నమవుతున్నాను.

◆ మిమ్మల్ని మహిళగా ఎలా నిర్వచించుకుంటారు?

మన భారత సంస్కృతిలో మహిళకు ఉన్నతమైన గౌరవం లభిస్తుంది. స్త్రీగా జన్మించడంవల్ల ఒక కూతు రిగా, తల్లిగా, భార్యగా జీవితంలో ఎన్నో మంచి అనుభూతులను పొందే అవకాశం దొరుకుతుంది. బాధ్యతలు నిర్వహించడం, వాటిని అర్థం చేసుకోవటంవలన మహి ళలకు ఎన్నో విషయాలు తెలుసుకునే అవకాశం ఉంటుంది. తల్లిస్థానాన్ని పొందగలగటం, అత్తమామల తోపాటు కలిసి జీవించ గలగటం ఇవన్నీ మహిళగా పుట్టటం వల్లనే సాధ్య మవుతాయి. రెండు విభిన్న కుటుం బాలతో కలిసి జీవించిన ఆనందం, అనుభూతి మగవారికి దొరకనిది. నేను అదృష్టవంతురాలిని. అటు అమ్మా నాన్నల దగ్గర, ఇటు అత్తగారింట్లోనూ ప్రేమాప్యాయ తలు పుష్కలంగా పొందగలిగాను.

◆ ఒక స్త్రీగా మీరు జీవితంలో అన్నీ పొందినట్టే అను కుంటున్నారా?

ఒక స్త్రీగా నేను జీవితంలో ఆశించినదానికంటే ఎక్కువే పొందగలిగాను. ప్రేమా ప్యాయతలతో బాధ్యతగా చూసు కునే భర్త, మంచి కూతురు, ఇద్దరు తెలివైన కుమారులు- వీరంతా నాకు ఉన్నారు. మేము ఉమ్మడి కుటుంబంలో ఉన్నాము. కుటుంబంలోని అందరి ఆదరాభిమానాలు నేను పొందాను. ఇంట్లో అత్తా మామగార్లు, పెద్దా, చిన్నా అందరూ నాతో ప్రేమగా ఉంటారు.

◆ మహిళలకు సంబంధించిన వార్తలు, సంఘటనలు, విశేషాలు ఇలాంటి వాటిని గురించి తెలుసు కుంటుం టారా? ఇంకా మీకు ఆసక్తికరమైనవి ఏమిటి? మహి ళలకుసంబంధించి మీకు గుర్తుండిపోయిన సంఘటన?

ప్రతిరోజు అన్ని దిన పత్రికలు చదువు తాను. టీవి చూస్తాను. మహిళలకు సంబంధించిన అంశం ఏదైనా నన్ను ఆకర్షిస్తుంది. మహిళలకు జరుగుతున్న అన్యాయాలు విన్నపుడు మనసుకి బాధ కలుగుతుంది.

◆ మహిళలు తమ జీవితంలో ఏఏ విషయాలకు ప్రాధాన్యత నివ్వాలని మీరు అనుకుంటున్నారు?

మహిళలు తమ పిల్లల చదువుకి ప్రాధాన్యత ఇవ్వాలి. అలాగే తమ భర్తలని చక్కగా అర్థం చేసుకోగలగాలి. ఇంట్లో చిన్న చిన్న విషయాలకు వాదనలు చేయ కూడదు. కుటుంబంలో ఆనందం నిలిపి ఉంచేందుకు ప్రయత్నిం చాలి. ప్రగతిదాయకంగా, పాజిటివ్‌గా ఆలోచించగలగాలి.

మిగతా 134వ పేజీలో





## సమాజ సేవే ఎంసిఎ లక్ష్యం

(127వ పేజీ తరువాయి)

సంగీతం, నృత్యం, షటిల్, బాల్‌బాడ్మింటన్ తదితర పోటీలకు సంబంధించి శిక్షణనిప్పిస్తున్నారు. ఈ పోటీలతో పాటు విద్యార్థులకు వ్యాసరచన, వక్తృత్వ, క్విజ్, చిత్రకళ పోటీలు నిర్వహించి బహుమతులను అందజేస్తున్నారు. ఇండియన్ మెడికల్ అసోసియేషన్, ఇండియన్ రెడ్‌క్రాస్ రేపల్లె బ్రాంచ్‌ల సహకారం తీసుకొంటున్నారు. ఎంసిఎకు అనుబంధంగా విద్యావిభాగం పనిచేస్తోంది. ఇటీవల దాతల సహకారంతో 40 ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలకు అవసరమైన ఫర్నేచర్‌ను జిల్లా ఎస్పీ సజ్జనార్ చేతులమీదుగా పంపిణీ చేయించారు. ఎస్పీ సూచన ప్రకారం 10వ తరగతి చదివే విద్యార్థులకు కెరీర్ యోజన కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ అసోసియేషన్ ఏర్పాటు చేసిన కార్యక్రమాలలో ప్రాథమిక విద్యాశాఖ మంత్రి నేదురుమల్లి రాజ్యలక్ష్మి, తానా మాజీ అధ్యక్షుడు నాదెళ్ళ గంగాధర్, ఐఎఎస్, ఐపిఎస్, ప్రజాప్రతినిధులు, ఎన్నారైలు ఎంసిఎ సేవలను స్వయంగా పరిశీలించి అభినందించారు. ప్రజలకు సేవచేయడంలోనే ఎవరికైనా సంతృప్తి మిగులుతుందని డాక్టర్లు కృష్ణకుమారి, ప్రకాశరావులు 'ప్రభాతవార్త' వద్ద అభిప్రాయపడ్డారు. ప్రజలకు ఉపయోగపడే కార్యక్రమాల నిర్వహణకు శ్రీగుత్తికొండ లక్ష్మినారాయణ కళ్యాణమండపంలో సౌకర్యం కల్పిస్తామన్నారు. పట్టణంలో టౌన్‌హాలు లేనందున తామే అవకాశం కల్పించగలమన్నారు.

# ప్రగతి పథంలో గుంటూరు జిల్లా సహకార కేంద్ర బ్యాంకు

## రైతన్నకు బాసట - జిల్లా అభివృద్ధికి బంగారుబాట



డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
ముఖ్యమంత్రి వర్యులు



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్రసహకార రవాణా శాఖామాత్యులు



శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జ్ మంత్రి

## జిల్లాలో సహకార సంఘముల ద్వారా రైతన్నకు సహాయ సహకారాలు

### బ్యాంకు ప్రగతి వివరములు

| వివరములు | 2003-04 సం॥ (రూ. లక్షలు) | 2004-05 సం॥ (రూ.లక్షలు) |
|---|---|---|
| 1. షేరు ధనము | 3589.26 | 3659.40 |
| 2. రిజర్వులు | 1090.24 | 1120.95 |
| 3. స్వంతనిధులు. | 4680.10 | 4780.35 |
| 4. డిపాజిట్లు | 17173.18 | 15413.94 |
| 5. అప్పులుమంజూరు | 42053.24 | 42816.12 |
| 6. నికర లాభము | 111.31 | 128.03 |

### రైతన్నకు ఋణ సహాయం

2004-05 ఖరీఫ్ సీజన్‌కు 63071 మందికి రూ.10500 లక్షలు ఋణములు మంజూరు చేయడమైనది. తీసుకున్న అప్పులు సక్రమముగా వాయిదా లోపల చెల్లించిన ప్రతి రైతునకు ప్రోత్సాహకము రూ.5000 అదనపు అప్పుగా 38425 మందికి రూ.1684 లక్షలు మంజూరు చేయడమైనది.

ఇంకను 10000 మంది కొత్త సభ్యులకు రూ. 500 లక్షలు అప్పు మంజూరు చేయుటకు ప్రణాళికలు సిద్ధం చేయబడినవి. రైతుమిత్ర గ్రూపులకు రూ.600 లక్షలు, స్వయం సహాయక

బృందాలకు రూ.600 లక్షలు మంజూరు చేయుటకు నిర్ణయం తీసుకొనడమైనది. అంతేకాక దీర్ఘకాలిక ఋణముల క్రింద, ట్రాక్టరు కొనుగోలు, సెకండ్ హ్యాండ్ ట్రాక్టరు కొనుగోలు, ట్రాక్టరు రిపేర్లు, పండ్ల తోటల పెంపకము, డ్రిప్ ఇరిగేషన్, ఆయిల్ ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటార్ల పైపులైన్ల నిమిత్తం రూ.3200 లక్షలు మంజూరు చేయుటకు నిర్ణయించడమైనది.

### కరువు రైతుకు బ్యాంకు ఊరట

కరువు రక్కసితో అల్లాడిన రైతన్నకు బ్యాంకు 30319 మందికి రూ. 696868372 దీర్ఘకాలిక ఋణములను రీ షెడ్యూల్ చేయడం జరిగినది. అంతేకాక స్వల్ప కాలిక ఋణముల క్రింద 95333 మందికి రూ. 1489218461 రీ షెడ్యూలు చేయడం జరినది.

### రైతన్నకు ప్రభుత్వ వడ్డీ రాయితీ

2003-04 5% రిబేటు 76670 మందికి రూ. 45885327

2004-05 6% రిబేటు 71752 మందికి రూ. 48499155

ఆందించడం జరిగినది.

• మార్చి 2006లోగా రుణాన్ని చెల్లించి 6శాతం రాయితీ పొందండి

### రైతన్నలకు ఎరువుల విక్రయం

**32 సంఘముల ద్వారా 3900 మెట్రిక్ టన్నుల ఎరువులు సరఫరా చేయడమైనది.**

### జిల్లా కేంద్ర సహకార బ్యాంకులలో పొదుపు బంగారు భవితకు మదుపు

ఆకర్షణీయమైన వడ్డీ, ఇన్సూరెన్స్ రూ. 100000 వరకు

| | | |
|---|---|---|
| 15 రోజుల నుండి | 45 రోజుల వరకు | 4.50% |
| 46 రోజుల నుండి | 90 రోజుల వరకు | 5.00% |
| 91 రోజుల నుండి | 179 రోజుల వరకు | 5.50% |
| 180 రోజుల నుండి | 1 సం॥లోపు | 6.00% |
| 1 సం॥ ఆపైన | 2 సం॥లోపు | 7.00% |
| 2 సం॥ | మరియు | ఆపై బడిన |
| కాలమునకు | 7.5% | |

### రూ. 15 లక్షల ఏక మొత్తము డిపాజిట్‌నకు

| | |
|---|---|
| 1 సం॥ ఆ పై బడిన కాలమునకు | 0.50% |
| 2 సం॥ ఆ పై బడిన కాలమునకు | 0.75% |

### అధిక వడ్డీ చెల్లించబడును



కుర్రి పున్నారెడ్డి, ఛైర్మన్
జిడిసిసిబి గుంటూరు

జె.నారాయణ
జనరల్ మేనేజర్



# పేద ప్రజల ప్రతినిధి 'వార్త'

132వ పేజీ తరువాయి

**◆ మీ భర్త రాజకీయాల్లోకి ప్రవేశించడం గురించి మీ అభిప్రాయం ఏమిటి?**

రాజకీయాల్లోకి ప్రవేశించాక ఆయన మరింత బిజీగా మారారు. చాలా సందర్భాల్లో ఆయనతో గడపలేని లోటు కనిపిస్తుంటుంది. రాజకీయాల్లో ప్రవేశించకపోయినా ఆయన ఇంకా ఎక్కువ సమాజ సేవ చేసి ఉండేవారు.

**◆ ఎక్కువ సమయం పనులతో గడిపే మీ భర్తతో కలిసి ఉండేలా మీరు ఎలా టైమ్‌ని మేనేజ్ చేసుకుంటున్నారు?**

వీలైనంత వరకు ఆయనతో పాటు కలిసి ఉంటుంటాను. ఆయన ఎంతో బాధ్యతాయుతంగా ప్రవర్తించే మనిషి కనుక టైమ్ మేనేజ్‌మెంట్ ఒక సమస్యలా కనిపించదు.

**◆ విజయపథంలో మీ భర్త వేసిన ప్రతి అడుగుని మీరు ప్రత్యక్షంగా చూశారు. ఈ క్రమంలో ఆయనలో మార్పులు ఏమైనా గమనించారా? ఒకవేళ ఉంటే వాటిని మీరు ఎలా తీసుకున్నారు?**

విజయాల దిశగా ప్రయాణం చేస్తున్న కొలదీ ఆయనలో కొత్త కొత్త ఆలోచనలు, జిజ్ఞాసల్ని గమనించాను. అయితే మనిషిగా ఆయనలో ఉదారత ముందు రోజులకంటే ఎక్కువగా పెరిగింది.

**◆ సంఘీసార్‌తో జీవితాన్ని పంచుకున్న వ్యక్తిగా మీ జీవితంలో అద్భుతమైన క్షణాలు చెప్పాలంటే ఏం చెబుతారు?**

నా భర్త, ఇతర కుటుంబ సభ్యుల ప్రేమ ఆప్యాయతల్లో తడిసి ముద్దయిన అనుభూతి నేను ఎల్లప్పుడూ పొందుతూనే ఉన్నాను. మరీ ముఖ్యంగా మా అత్త మామ గార్లకు ప్రత్యేకంగా కృతజ్ఞతలు చెప్పాలి. వారు నాపై తల్లిదండ్రులంతటి ఆదరాభిమానాలు చూపించారు.

**◆ నేటి పిల్లలతరంలో మీరు గమనించిన ప్రత్యేకతలు?**

నేటి తరం పిల్లలు ఎంతో తెలివైన వారు. మానసిక పరిణతి ఉన్నవారు. వారి నుంచి మంచి ఫలితాలు ఆశించవచ్చు.

**◆ మీ పిల్లలు ఎలా ఉండాలనుకుంటున్నారు?**

తెలివితేటలు, నిజాయితీ కలిగి ఉండాలనుకుంటున్నాను. జీవితంలో విజయం సాధించిన వ్యక్తులుగా రాణించాలని కోరుకుంటున్నాను. ఇక వాళ్ల కుటుంబ సంప్రదాయాన్ని నిలబెడతారనడంలో నాకేమీ సందేహం లేదు.

**◆ 'వార్త' గురించి మీ ఫీలింగ్స్, పరిశీలనలు, అభిప్రాయాలు, కామెంట్స్?**

'వార్త', 'స్వతంత్ర వార్త' రెండూ గొప్ప వార్తా పత్రికలు. సమాజం తరపున నిలబడి పనిచేస్తున్న పత్రికలు.

మరీ ప్రత్యేకంగా బాధిత పీడితుల తరపున నిలబడ్డాయి. పేద ప్రజల ప్రతినిధిగా 'వార్త' పనిచేసిందని మరింత గట్టిగా చెప్పగలను. 'వార్త' అంకిత భావాన్ని ప్రజలు అర్థం చేసుకోనపుడు నాకు చాలా బాధగా ఉంటుంది.

ఉదారత తోనూ, సింపుల్‌గానూ ఉండాలని నా భర్త ఎప్పుడూ చెబుతుంటారు. సమాజంలో వెనుకబడిన ప్రజల భావాల్ని అర్థం చేసుకోవాలని ఆయన అంటుంటారు.

**◆ 'వార్త' నిర్వహణ తదితర కార్యకలాపాలతో ఎప్పుడూ బిజీగా ఉండే మీ భర్తతో గడిపేందుకు మీకంటూ సమయాన్ని ఎలా సృష్టించుకుంటారు?**

పిల్లలు విదేశాలకు వెళ్లిన తరువాత ఆయనతో ఎక్కువ సమయం గడపలేకపోతున్న అసంతృప్తి ఉంటోంది. ఆయన ఎక్కువ సమయం ఆఫీసులో గడపాల్సి ఉంటుంది. ఆయన పనే అటువంటిది.

-ఇంటర్వ్యూ: శ్రీ



10 A Glorious Decade



## సంఘీ గ్రూప్ చైర్మన్ రామ్‌శరణ్ సంఘీ దంపతుల ఆకాంక్ష

# 'వార్త' దూసుకుపోవాలి

అందరికీ కలలు ఉంటాయి. కొందరు కలలు కంటూనే ఉండిపోతారు. మరికొందరు కలలు నెరవేర్చుకొనే ప్రయత్నంలో ఎక్కడెక్కడికో పయనం కడతారు. ఏ కలల రాజధానికో వెడతారు. కానీ వారి స్వప్నం నెరవేరుతుందన్న హామీ లేదు. 'సంఘీ' గ్రూపు చైర్మన్ శ్రీ రామ్‌శరణ్ సంఘీ కూడా ఒక కల కన్నారు. ఆయన పైకోవకు చెందిన వ్యక్తి కాదు. ఉన్న ఊరినే (కోహెడ) తన కలల రాజధానిగా చేసుకున్నారు. అక్కడ కొన్న భూమినుంచే తన వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరింపచేసుకున్నారు.

❖ ❖ ❖ ❖ ❖

ఇంతటి వ్యాపార సామ్రాజ్యానికి కేంద్ర బిందువైన స్త్రీ శ్రీమతి కమలారాణి సంఘీ. శ్రీ రామ్‌శరణ్ సంఘీ సతీమణి. అంత పెద్ద వ్యాపార సామ్రాజ్యంలో తనదైన వ్యక్తిత్వం కాపాడుకున్నారు. మహిళలు అన్నింటిలో రాణించాలని, సమానత్వాన్ని పురుషులతో ఘర్షణ పడి కాకుండా వారితో సహనం, ప్రేమగా మెదిలి పొందా లంటారామె. అందుకోసం వ్యాసాలు రాశారు. శాఖోపశాఖలుగా విస్తరించిన సంఘీ సామ్రాజ్యానికి ఈ ఇద్దరూ పెద్ద దిక్కు. 'వార్త' పది సంవత్సరాలు పూర్తి చేసుకున్న సందర్భంగా చైర్మన్ దంపతులు తమ ఆనందాన్ని పాఠకులతో ఈ విధంగా పంచుకున్నారు.

### 'విజయ స్ఫూర్తి కొనసాగాలి'

**రామ్‌శరణ్ సంఘీ**

'వార్త' దూసుకుపోవాలి, పదేళ్ల కిందట వార్తా పత్రిక పెట్టాలన్న యోచన వచ్చినపుడు మా అబ్బాయిలను ఎంతో ప్రోత్సహించాను. స్థానిక భాషలోనే పత్రిక రావాలనే ఉద్దేశంతో 'తెలుగు'లో పత్రిక మొదలుపెట్టాం. ఆదరించిన పాఠకులకు ధన్యవాదాలు. ఇందుకు భగవత్ కృప ఎంతో ఉంది. ఆ విజయ స్ఫూర్తిని కొనసాగించాలనే ప్రయత్నంలో భాగంగా 'హిందీ'లో కూడా 'వార్త'ను వెలువరించాం. అదే స్ఫూర్తితో ఇంగ్లీషులోనూ పత్రిక వస్తే బాగుంటుంది. నాకు పని అన్నా, కొత్త ప్రణాళికలన్నా ఎంతో ఇష్టం. నేను అవసరమైతే ఇంకా పనిచేయగలను. నేను ఇప్పటికీ హైదరాబాద్ స్టాక్ ఎక్స్ఛేంజిలో సభ్యుడిని.

కమలారాణి సంఘీ

నాకు రచనలు అలవాటు కాబట్టి, పత్రికా రంగంలోకి మావాళ్లు అడుగు పెట్టడం ఆనందదాయకమైన విషయమే. 'వార్త' ఇంకా ఇంకా ముందుకెళ్లాలని కోరుకుంటున్నాను. నా అభిప్రాయాలను, నేను కోరుకునే విలువలను చెబుతూ 'జీవన రేఖలు' కాలమ్ అందించాను.

### బిజీగా ఉండే బిడ్డలు

రామ్‌శరణ్ సంఘీ

వారలా ఉండటమే నేను కోరుకునేది. ఇంకా పనిచేయమనే ప్రోత్సహిస్తాను. నేనూ ఇప్పటికీ పని చేయాలని కోరుకుంటాను. కష్టపడే స్వభావం లేకుంటే కష్టమే. నేను నా వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకునే క్రమంలో సైకిల్ మీద తిరిగాను.

కమలారాణి సంఘీ

ఎప్పుడూ బిజీగా ఉండే బిడ్డలతో కొంచెం ఒంటరిగా అనిపిస్తుంది. కానీ వారూ ముందుకెళ్లాలి కదా.

### పత్రికాధిపతి- కుమారుడితో అనుబంధం

**రామ్‌శరణ్ సంఘీ**

గిరీష్ అందరిలోకి చిన్న వాడు. నాకతనిలో బాగా నచ్చేది కష్టించే స్వభావం. వ్యాపారంలో ఎంతో చేదోడు వాదోడుగా ఉండేవాడు. స్కూటర్‌మీద నాకోసం వస్తూ ఉండేవాడు. ఇంత అభివృద్ధి చెందాక ఇప్పుడు పిహెచ్‌డి చేయాలనుకుం టున్నాడంటే అతని కష్టించే స్వభావం అర్థం చేసుకోవచ్చు. అలానే మిగతా అబ్బాయిలు, అమ్మాయిలు తమ జీవితాల్లో కష్టించే పనిచేశారు. పైకి వచ్చారు.

**కమలారాణి సంఘీ**

మాకు మొత్తం ఆరుగురు బిడ్డలు. నలుగురు అబ్బాయిలు, ఇద్దరు అమ్మాయిలు. కుమారుల్లో చివరివాడు గిరీష్. మా కోడలు అల్కా వినమ్రంగా ఉంటుంది. ఎంతో కలిసి పోయింది. గిరీష్‌లో మొదట నుంచి కష్టపడడంతో పాటు శక్తి, సామర్థ్యాలు బాగా ఉన్నాయి.

ఇంటర్వ్యూ:శ్రీ

## సిమెంట్ పరిశ్రమల ద్వారా

# 17 లక్షల మందికి ఉపాధి

(ప్రభాతవార్త-మరంపల్లి) స్వాతంత్ర్యానంతరం మూడు దశాబ్దాల కాలంలో సిమెంట్ పరిశ్రమ మరింత అభివృద్ధి సాధించింది. రాష్ట్రంలో 23 మేజర్, 20 మినీ సిమెంట్ పరిశ్రమలు ఉండగా 60 గ్రైండింగ్ యూనిట్లు ఉన్నాయి. వీటి ద్వారా నెలకు 14.76 లక్షల టన్నుల సిమెంట్ ఉత్పత్తి సామర్థ్యంతో ఆంధ్రప్రదేశ్ విరాజిల్లుతోంది.రాష్ట్ర ప్రభుత్వానికి అమ్మకం పన్ను రూపంలో రాయితీలు పోను 330 కోట్ల రూపాయలు ఆదాయాన్ని సమకూర్చుతుంది. నేరుగా 2 లక్షల మందికి ఉపాధి కల్పించటంతో పాటు పరోక్షంగా 15 లక్షల మందికి జీవనోపాధికి దోహదపడుతుంది. పెరిగిన సున్నపురాయి క్వారీల లీజు, విద్యుత్,డీజిల్ రేట్లు పెరగడం వెరసి సిమెంట్ ధరలు పెరిగాయి. ఇవి కాక మినీ, సెమీమేజర్ సిమెంట్ ప్లాంట్లు నెలకు 2 లక్షల టన్నుల ఉత్పత్తి చేస్తుండగా దాదాపు 1.60 లక్షల టన్నులు మన రాష్ట్రంలోను, 0.40/0.45 లక్షల టన్నులు రాష్ట్రేతర ప్రాంతాలకు సిమెంట్ సరఫరా చేయబడుతుంది. గ్రైండింగ్ యూనిట్లు అన్నీ కలిపి నెలకు 0.45/0.50 లక్షల టన్నుల సిమెంట్ ఉత్పత్తి చేస్తున్నాయి. ప్రస్తుతం మేజర్, మినీ గ్రైండింగ్ ప్లాంట్ల ద్వారా నెలకు 13 లక్షల టన్నులు సిమెంట్ ఉత్పత్తి కాగా ఆంధ్రప్రదేశ్‌లో 6.30 లక్షల టన్నుల సిమెంట్ వినియోగం అవుతుంది. కాగా రాష్ట్రం నుండి బయటకు 6 లక్షల టన్నులు మాత్రమే పంపిణీ అవుతుంది. అయితే రాష్ట్రం వినియోగంలో ఇతర రాష్ట్రాల నుండి 0.75 లక్షల టన్నులు వస్తుంది.

అంటే ఆంధ్రప్రదేశ్ బ్రాండ్స్ రాష్ట్రంలో అమ్ముగలుతుంది 5.50 లక్షల టన్నులు మాత్రమే. నెలకు అయిన ఉత్పత్తిలోని 13 లక్షల టన్నుల సిమెంట్‌లో మొత్తం పంపిణీ 11.50 లక్షల టన్నులు కాగా ఇంకా నెలకు 1.50 లక్షల టన్నులు నిలువలు పేరుకుంటున్నాయి. పొరుగు రాష్ట్రా



లైన మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, మరియు ఇతర రాష్ట్రాల నుండి వత్తిడి ఎదుర్కొంటుండగా దక్షిణాది రాష్ట్రాలైన కర్నాటక, కేరళలలో డిమాండ్‌కు తగ్గ ఉత్పత్తి లేకపోవడం వల్ల ఆంధ్రప్రదేశ్ సిమెంట్ పరిశ్రమలు ఊపిరి పీల్చుకోగలుగుతున్నాయి. ఎక్సైజ్ డ్యూటీలో వ్యత్యాసం పెద్ద ప్లాంట్లకు 350, చిన్న ప్లాంట్లకు 200 రూపాయలు ఉండడం, అమ్మకం పన్నులో మినహాయింపు, బదలాయింపులు, పరిశ్రమల పరిపుష్టికి దోహదపడగా మార్కెట్‌లో రేట్లు తగ్గించి ఒకేసారి మార్కెట్ కావలింతకు చేసినప్రయోగాలు ముందు చూపు లేకపోవడం ఇటువంటి దురదృష్ట పనులు వారి వారికి ఎదురు దెబ్బలు తినిపించాయి. సిమెంట్ ముడి పదార్థాలైన లైమ్ స్టోన్, మినరల్ రైట్ ట్యాక్స్ ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కువ ఉంది. మన రాష్ట్రంలో సిమెంట్ గ్రౌండ్ లైమ్ స్టోన్ 30.434 మిలియన్ టన్నులు ఉండగా నార్మల్ గ్రౌండ్ లైమ్ స్టోన్ 15.348 మిలియన్ టన్నుల నిలువలు ఉన్నాయి. మొత్తం సున్నపురాయి నిలువలు మన రాష్ట్రం

లోనే 48 శాతం నిక్షేపాలు ఉన్నాయి. రాష్ట్రంలో సిమెంట్ పరిశ్రమలు నల్లగొండ, గుంటూరు, యర్రగుంట్ల, కర్నూలు, ఆదిలాబాద్‌లో ఉండడం చేత మార్కెట్‌కు చేరుకోవడానికి సుమారు 300 కిలో మీటర్ల రవాణా ఖర్చులు భరించాల్సి వస్తోంది. మన దేశంలో ప్రస్తుతం యావరేజ్‌గా 82 కేజీలు వినియోగం ఉండగా మన కన్న చిన్న దేశాలైన, టర్కీ, మలేషియా, థాయిలాండ్‌లలో ప్రపంచ సగటు అయిన 250 కేజీలు ఉంది. ఇవి ఎట్టి పరిస్థితుల్లోను పెరుగుతూనే ఉంటాయి. ఎందుకనగా రాబోవు రోజుల్లో అందరికి ఇళ్ళు అనేది పంచవర్ష ప్రణాళిక నినాదం. జాతీయ రహదారులు, అర్బన్ రోడ్లను కాంక్రీట్ రోడ్లుగా చేసే ప్రతిపాదనకు ప్రభుత్వాల ఆమోదం లభించడం వ్యవసాయ ఫలసాయం సమృద్ధిగా ఉంటున్నందున గ్రామాల్లో గృహం నిత్యావసరంగా మారడం కాగా రాష్ట్ర ప్రభుత్వం పెంచిన విద్యుత్ చార్జీలతో పరిశ్రమల పరిస్థితి మూలిగే నక్కపై తాటికాయ పడ్డ చందంగా ఉంది. అసలే తీవ్ర ఆర్థిక సంక్షోభంలో ఉన్న పరిశ్రమలకు పెంచిన చార్జీలు తోడై మరింత గడ్డు పరిస్థితులను ఎదుర్కొంటున్నాయి.

### కృష్ణా తీరంలో విస్తరించిన సిమెంట్ పరిశ్రమలు...

ఒకప్పుడు రాళ్ళు, అడవులతో కరవు కాటకాలతో నరకయాతనకు నిలయమైన కృష్ణా తీరం నేడు సిమెంట్ పరిశ్రమల ఏర్పాటుతో పారిశ్రామికంగా రూపొంది రాష్ట్రంలోనే కాక దేశంలోనే గుర్తింపు పొందగలిగే స్థాయిలో పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. నేడు నల్లగొండ జిల్లా సిమెంట్ పరిశ్రమలకు ప్రసిద్ధి చెందిన జిల్లాగా పేరు పొందిందంటే ఏ స్థాయిలో పరిశ్రమలు ఏర్పాటయ్యాయో అర్థం చేసుకోవచ్చు. మొత్తం జిల్లాలో 16 సిమెంట్ పరిశ్రమలకు పైగా ఉత్పత్తి రంగంలో ఉన్నాయి. ముఖ్యంగా మరంపల్లి, మేళ్ళచెరువు మండలంలో అధికంగా ఫ్యాక్టరీలు ఉన్నాయి. కృష్ణా తీర ప్రాంతంలో సున్నపురాయి నిలువ అధికంగా ఉండంతో ఈ ఫ్యాక్టరీల ఆవిర్భావం సులభతరమైంది. జిల్లాలో ఈ పరిశ్రమల ఆధారంగా అనేక రకాల చిన్న తరహా, మధ్యతరహా పరిశ్రమలు కూడా నెలకొన్నాయి. నల్లగొండ జిల్లా వెనుకబడిన జిల్లా కావడం వల్ల ఇక్కడే ఏర్పాటయ్యే పరిశ్రమలకు ప్రభుత్వం అనేక రాయితీలు ఇవ్వడం వల్ల

మిగతా 136వ పేజీలో

# 17 లక్షల మందికి ఉపాధి

135వ పేజీ తరువాయి

వివిధ ప్రాంతాలకు చెందిన వ్యాపారులు పరిశ్రమలు నెలకొల్పేందుకు ముందుకు వచ్చారు. దీంతో జిల్లాలో అనేక రకాల వ్యాపారాలు అభివృద్ధి చెందడమే కాక వివిధ రకాల ఉపాధి అవకాశాలు ఏర్పడ్డాయి. నల్లగొండ జిల్లా నుండే దేశం నలుమూలలకు, విదేశాలకు రోజుకు 15వేల టన్నుల చొప్పున సంవత్సరానికి 60 లక్షల టన్నుల సిమెంట్ ఎగుమతి అవుతుంది. జిల్లా వ్యాప్తంగా ఈ పరిశ్రమల వల్ల 50వేల కుటుంబాలు నేరుగా ఉపాధి పొందగా, పరోక్షంగా మరో 50వేల కుటుంబాలు జీవనం గడుపుతున్నాయి.

**పెరిగిన కాలుష్యం...**

సిమెంట్ పరిశ్రమలు ఎంత విపరీతంగా పెరిగాయో అదే రీతిలో కాలుష్యం కూడా పెరిగిపోయి కృష్ణా తీర ప్రాంత ప్రజలకు శాపంగా మారింది. సిమెంట్ పరిశ్రమల యాజమాన్యాల స్వార్థ చింతన మూలంగా ప్రభుత్వ నిబంధనలకు నీళ్ళు వదలడం వల్ల నేడు కాలుష్య విష కోరల్లో వ్యవసాయం, పశువులు, ప్రజలు ఇరుక్కుని తేలుకోలేని పరిస్థితి ఏర్పడింది. జిల్లాలోని అధిక సిమెంట్ పరిశ్రమలకు కాలుష్య నియంత్రణ యంత్రాలు ఉన్నప్పటికి వాటి నిర్వహణ ఖర్చుతో కూడుకోవడం వల్ల ఆయా పరిశ్రమల వారు యంత్రాలను వాడడం లేదనే విమర్శలు వస్తున్నాయి. కాలుష్య విష ప్రభావం వల్ల నేడు రైతులు కోలుకోలేని విధంగా వ్యవసాయ ఉత్పత్తులు తగ్గిపోయాయి. ఈ పరిస్థితుల వల్ల వ్యవసాయ భూముల రేట్లు కూడా గణనీయంగా పడిపోయాయి. దీంతో రైతాంగం తీవ్ర ఆందోళన చెందుతోంది. కృష్ణా తీర ప్రాంత ప్రజలతో పాటు పశువులు కూడా ఈ కాలుష్యానికి గురై చనిపోవడం వల్ల రైతులు తీవ్ర నష్టాలకు గురౌతున్నారు. ఇప్పటికే అనేక మంది రైతుల పాడి గేదెలు, ఎద్దులు ఈ కాలుష్యానికి గురై చనిపోవడం దిక్కుతోచని స్థితిలో రైతులు ఉన్నారు.

**కన్నీటి గాధలు**
**కార్మికుల సమస్యలు**

సిమెంట్ పరిశ్రమల్లో పని చేసే వేలాది మంది కార్మికులు అనేక రకాల సమస్యలతో సతమతమౌతున్నారు. ప్రభుత్వ నియమ నిబంధనలకు నీళ్ళు వదలడంతో చట్టాల్లోని లొసుగుల కారణంగా కార్మికులు అనేక సమస్యలను ఎదుర్కోవటమే కాక వాస్తవంగా వారికి అందాల్సిన సౌకర్యాలు అందటం లేదని కార్మిక సంఘాలు ఆరోపిస్తున్నాయి. సంవత్సరాల తరబడి తాత్కాలిక వేతనంతో కార్మికులతో వెట్టిచాకిరి ఈ పరిశ్రమల్లో నిరాటంకంగా కొనసాగుతుందని ఆరోపణలు ఉన్నాయి. పూర్తిగా ఉద్యోగ భద్రత లేకపోవటం వల్ల కార్మికుల చేత యాజమాన్యాలు తమ ఇష్టానుసారంగా పని చేయించుకోవటం సర్వసాధారణమైయిందని విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.

# దైవ మాన్వితం కృష్ణా తీరం ...

(ప్రభాతవార్త-మరంపల్లి)

కృష్ణా తీరం ఆసాంతం చారిత్రాత్మకమే ...కీ.శ. 11వ శతాబ్దం తరువాత నాగరికతలో మార్పు జరిగిన మార్పులకు ఇవి చారిత్రక ఆయువు పట్టుగా నిలిచాయి. స్వచ్ఛమైన కృష్ణా నీరు నాగార్జున సాగర్, వాడపల్లి, మట్టపల్లి, వెల్లటూరు తీరాల్లో ప్రవహిస్తుంది. ఈ ప్రాంత దేవాలయాలకు సాగర్ ఆనకట్ట నిర్మాణానంతరం ప్రధాన్యాత సంతరించుకున్నాయి. అప్పటి వరకు బౌద్ధ విహారంగా వెలు గొందుతున్న సాగర్‌కు ఆనకట్ట నిర్మాణంతో చారిత్రక ప్రాధాన్యత మరిత పెరిగింది. దీంతో జిల్లాలోని కృష్ణానదీ పరివాహక ప్రాంతం వెంబడి ఉన్న చిన్నా చితక దేవాలయాలు మరింత అబివృద్ధి పథంలోకి ప్రవేశించాయి. వాటిలో కొన్నింటి గురించి తెలుసుకుందాం...

మట్టపల్లి లక్ష్మీనర్సింహుని ఆలయం



మట్టపల్లి మహాక్షేత్రం : పురాతన కాలం నుండి నేటి వరకు విశేష స్థానం, చరిత్ర కలిగి భక్త జన బృందం నాలుకల పై కదలాడే దేవాలయంగా దీనిని చెప్పుకోవచ్చు, కృష్ణమ్మ తల్లి వినిపించే జల గీతం ఇక్కడికి వచ్చే లక్షలాది మంది భక్తులను ఆనంద డోలికల్లో ముంచివేస్తుంది. ప్రతి రోజు స్వామివారికి వినిపించే వేద మంత్రం, మంగళ వాయిద్యాలు క్షేత్రాన్ని, క్షేత్ర ప్రతిష్టను కాపాడుతూ దైవానుభూతిని కలిగిస్తాయి.

ఆలయంలోని స్వయంవక్త శ్రీ నరసింహునికి ఆది నుండి నేటి వరకు 11 వందల సంవత్సరాలుగా

(మిగతా 137వ పేజీలో)

# దైవ మాన్వితం.. కృష్ణా తీరం ...

136వ పేజీ తరువాయి

ఆరె వత్రితో పూజలు చేయటం ఇక్కడ ప్రత్యేకత. ఆలయం వెలుపల వివిధ కులాల వసతి గృహాలు, సత్రాలు, కళ్యాణమండపం, స్నాన ఘట్టాలు క్షేత్ర అభివృద్ధికి చిహ్నాంగా కనబడతాయి. పూర్వ కాలంలో ఈ



వాడపల్లి అగస్త్రేశ్వర ఆలయం

తీర్థమును భరద్వాజ మహార్షులు స్వయం వక్తను బహిర్గత పర్చగా తరువాతి కాలంలో కృష్ణానది ఆవలి తీరాన ఉన్న తంగెడ ప్రాంతమును పాలిస్తున్న అనుముల మాచిరెడ్డి అనే ప్రభువు అభివృద్ధిలోకి తెచ్చినట్లు నానుడి. కాగా పిల్లలు లేని దంపతులు, రోగగ్రస్తులు, మానసిక రుగ్మతులు కలిగిన వాళ్ళు అనునిత్యం స్వామివారిని దర్శించి తమ బాధలను తీర్చుకుంటారు.

**వాడపల్లి పుణ్యక్షేత్రం :**

ప్రాచీన నంన్కృతికి సాక్షిగా నిలిచిన శిధిల దుర్గాల మధ్య కృష్ణా, మూసీ నంగమ స్థలంలో భక్తుల పాలిట కైలానం, భాగవతులకు వైకుంఠం, నర్వజనులకు పుణ్యప్రసాదం వాడపల్లి పుణ్యక్షేత్రం. ప్రకృతి రమణీయ దృశ్యాల మధ్య పవిత్ర కృష్ణా, మూసీ నదులు నంగమించే చోట వెలసింది ఈ పుణ్యక్షేత్రం. నల్లగొండ జిల్లా దామరచర్ల మండలంలోని వాడపల్లికి పౌరాణిక ప్రాశస్త్యం, చారిత్రాత్మక ప్రాధాన్యత ఎంతో వుంది. ఆరువేల సంవత్సరాల క్రితం శ్రీ ఆగస్త్యేశ్వర మహాముని, శ్రీ మీనాక్షి ఆగస్త్యేశ్వర స్వామిని, శ్రీలక్ష్మీ నరిసింహ స్వామిని ఇక్కడ ప్రతిష్ఠించారు. ప్రాచీన కాలంలో ప్రతిష్ఠంచిన ఈ ఆలయాలకు ఎంతో మహిమ కూడా వుందని ప్రచారం. అందువలన వాడపల్లి దక్షిణ కాశీగా పిలువబడుతోంది. శ్రీలక్ష్మీ నరసింహస్వామి ఆలయ విశేషాల కృష్ణానది పరీవాహక తీరం వెంబడి వున్న వంచ నారసింహస్వామి అవతారాలలో ఈ స్వామి ఒకరు. ఈ ఆలయం కొన్ని వందల సంవత్సరాల క్రితం వరకు కూడా నిత్యకళ్యాణం వచ్చతోరణంగా విరాజిల్లింది. కొన్నాళ్ళ వరకు ఈ విగ్రహాలను ఎవరూ పట్టించు కోకపోవడం వల్ల మట్టిలో కలిసిపోగా రెడ్డిరాజులలో పెద్ద కోమటి వేమారెడ్డి నరసింహస్వామి విగ్రహాలను గుర్తించి భద్రపరిచి ఆలయం నిర్మించారని చరిత్ర చెబుతున్నది. రెడ్డిరాజుల కాలం నుండి నేటి వరకు ఆలయంలో నిత్యారాధన జరుగుతుంది. ఈ రెండు జ్యోతులలో పై జ్యోతి మాత్రమే మిణుకుమని చలిస్తుంది. క్రింది జ్యోతి నిశ్చలంగా వుంటుంది. ఈ ప్రక్రియ స్వామివారి ఉచ్ఛ్వాస నిశ్వాస ప్రక్రియలో జ్యోతి కదులుతుందని భావన. ఈ ఆలయాలను క్రీ.పూ. 1524 సంవత్సరం శాలివాహన శకమున స్థానాజీ పంతులు పౌత్రుడు, 1514 సిద్ధార్ధనామ సంవత్సరమున వైష్ణవి స్థానాచార్యులు వెంకట భట్టాచార్యులు సందర్శించినట్లు శాసన దృష్టాంతరం కలదు. ఈ ఆలయానికి సమీపాన వీరభద్ర జీర్ణ దేవాలయం కలదు. ఈ ప్రాంతం ఏడు కోటలు, ఏడు పేటలు, మూడు పురములుగా వుండేవి. దేవాలయంలో వేడుకల మహాశివరాత్రి, ఏకాదశి పండుగలు ఇక్కడే ఘనంగా నిర్వహిస్తారు. పండుగలకు ఈ పవిత్ర స్థలం వద్దకు వేలాది మంది భక్తులు వచ్చి పవిత్ర కృష్ణా, మూసీ సంగమంలో పుణ్య స్నానాలు ఆచరించి దైవదర్శనం చేసుకుంటారు. ఇక్కడ నిత్య కళ్యాణాలు జరుగుతుంటాయి. అన్నింటికి మించి ప్రతి పన్నెండు సంవత్సరాలకోసారి వచ్చే కృష్ణా పుష్కరాలు ప్రాముఖ్యత సంతరించుకున్నాయి. 1992 సంవత్సరంలో నిర్వహించిన పుష్కరాలకు సమారు పది లక్షల మంది భక్తులు హాజరయ్యారు. ప్రతి సంవత్సరం ఫాల్గుణ మాసంలో జరిగే శివరాత్రి ఉత్సవాలకు భక్తులు అధిక సంఖ్యలో పాల్గొంటారు. కృష్ణా నదిపై వంతెన నిర్మించడంతో నల్లగొండ జిల్లా నుండి గాక గుంటూరు, కృష్ణా జిల్లాల నుండి భక్తులు అధిక సంఖ్యలో తరలి వస్తున్నారు. వాడపల్లి పుణ్యక్షేత్రాన్ని పర్యాటక కేంద్రంగా చేయాలని భక్తులు కోరుతున్నారు.

**నాగార్జునసాగర్:**

హిల్‌కాలనీలో మూడేళ్ళ క్రితం పున: ప్రతిష్ఠించిన ఏలేశ్వరమల్లికార్జున మాధవస్వామి జంట ఆలయాలకు రెండువేల సంవత్సరాల చారిత్రక నేపథ్యం వుంది. కృష్ణానది ఉత్తర దిశలో క్రీ.శ ఒకటవ శతాబ్ధంలో విజయపురిని పరిపాలించిన ఇక్ష్వాకుల సైన్యాధ్యక్షులు 'ఎలిశ్రీ' బౌద్ధమతం విస్తృతంగా ప్రచారం పొందిన ఆ కాలంలో శైవ మతవ్యాప్తికి విశేష కృషి చేశారు. అప్పటి పాలమూరు పరిధిలోని ఈ శివాలయాన్ని ఎలిశ్రీ పునరుద్ధరించడంచేత ఇది ఏలేశ్వరాలయంగా పేరొందినట్లు చరిత్ర చెబుతోంది. నాగార్జునసాగర్ జలాశయం మధ్యలో జూలు విదిల్చి ఠీవిగా కూర్చున్న సింహం ఆకృతిలో ఇప్పటికీ గంభీరంగా కనిపించే ఎత్తైన కొండను ఇక్ష్వాకుల కాలంలో సింహపురిగా వ్యవహరించేవారు. ఇక్ష్వాకుల విజయపురి పరిధిలో గల సింహాపురి కొండకు దిగువన ఏలేశ్వరాలయం, మాధవస్వామి ఆలయం వుండేవి. యాదగిరిగుట్ట, వేములవాడ క్షేత్రాలు బహుళ ప్రాచుర్యం పొందడానికి ముందు కొన్ని శతాబ్దాల పూర్వమే శ్రీశైలానికి ఈశాన్య ద్వారంగా వినితికెక్కిన ఏలేశ్వరాలయం తెలంగాణ ప్రజలకు ఆరాధ్య దైవంగా వెలసిల్లినది. పూర్వము వేద ఋషులచే ప్రతిష్ఠంచిన ఏలేశ్వర సైకత (ఇసుక) లింగాలలో ఒకటి రామేశ్వరంలో వుండగా రెండవది ఈ ఆలయంలోనే వుంది. కాకాతీయుల కాలంలో ప్రతిష్ఠించిన మూడు శివలింగాలలో ఒకటి ఢిల్లీ పురావస్తుశాలలో, ఒకటి హైదరాబాద్ పురావస్తు శాలలోను వుండగా మరొకటి సాగర్‌లో పునప్రతిష్ఠించి ఏల్వేశ్వరాలయంలోనే వుంది. ఉత్తర వాహినిగా ప్రవహించే నదీతీరాలో వెలసిన ఆలయాలను మాత్రమే పుణ్యాక్షేత్రాలుగా పరిగణిస్తారు. కాగా ఉత్తర భారతం నుండి దక్షిణ పథానికి వలస వచ్చిన రాజవంశీయులు ఏలేశ్వరాలయం చెంత గల మాధవస్వామి ఆలయాన్ని ప్రతిష్ఠించినట్లు చరిత్ర ఆధారాల ద్వారా తెలుస్తుంది. కోడి పందాలలో తీవ్ర పరాజయం పాలై కృష్ణానదిని దాటుతూ మెునలిబారిన పడి ప్రాణాపాయస్థితిలో వున్న పల్నాటి బ్రహ్మనాయుడు ఇక్కడ పూజలు జరిపి స్వస్థత పొందినట్లు పలనాటి వీరభారత చరిత్ర చెబుతుంది. యదాదిగా ఈ ఆలయంపై అపారమైన గురి కుదిరిన బ్రహ్మనాయుడు మాధవస్వామి

మిగతా 138వ పేజీలో



వెల్లటూరు లోని శివాలయం

137వ పేజీ తరువాయి

ఆలయాన్ని పునరుద్ధరించి మాచర్ల ప్రాంతంలో జమ్మలమడుగులో 20 ఎకరాల భూమిని మాన్యంగా ఇనామ్ ఇచ్చినట్లు చరిత్రకారులు చెబుతున్నారు. కుడికాలువ నిర్మాణ పనులు సమయంలో ఇనామ్ భూమి కొంత భాగం నష్టపోగా నష్టపరిహారాన్ని కోరుతూ నర్సా రావుపేట కోర్టు అప్పీలు చేయడం కూడా జరిగింది. అలాగే పి.ఏ.వల్లి సాగర్ పరిసర గ్రామాలల్లో ఏలేశ్వరస్వామికి గల వందలాది ఆలయ భూములు అన్యాక్రాంతమైనట్లు తెలుస్తుంది. ఆలయ మాన్యానికి చెందిన ఖచ్చితమైన రికార్డుల కోసం దేవాదాయ శాఖ పూనుకోవలసియున్నది. ఇది ఇలా వుండగా నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణ సమయంలో కృష్ణానది లోయలో జీర్ణావస్థలో వున్న ఏలేశ్వరం, మాధవస్వామి ఆలయాల శిధిలాలను ముంపునకు గురికాకుండా అధికారులు పైలాన్ స్టోర్ యార్డుకు తరలించారు. అమూల్యమైన ఆధ్యాత్మిక సంపదను పరిరక్షించ గలిగారు. కాగా గత నాలుగు శతాబ్దాలుగా ఈ ఆలయ పునఃప్రతిష్టకు, ఉద్ధరణకు అనేక ప్రయత్నాలు జరిగాయి. అలనాటి సీతారామ లక్ష్మణ పంచలోహ విగ్రహాలను, విలువైన ఆభరణాలను ఇంతకాలంగా బ్యాంకు లాకరులో భద్రపరిచారు. ఆలయాల ఘూల విరాట్లును సత్యనారాయణస్వామి ఆలయం ప్రక్కన పాతిక సంవత్సరాలుగా రెండు చిన్న గదులలో వుంచి నిత్యనైవేద్యం, దీపారాధన నిర్వహించారు.

# దైవ మాన్యితం.. కృష్ణా తీరం ...

**జాన్‌పహాడ్:**

కృష్ణమ్మ నదీ తీరంలో వెలసిన జాన్‌పహాడ్ సైదులు దర్గా అన్ని వర్గాల ప్రజలను ఆకర్షిస్తూ సమైక్యతా రాగం వినిపిస్తోంది. ముస్లింల పవిత్ర క్షేత్రమైనప్పటికి అధిక సంఖ్యలో హిందువులు ఇక్కడికి వచ్చి ప్రార్థనలు జరువడం ఈ దర్గా ప్రత్యేకత. మత సామరస్యానికి ఈ దర్గా ప్రతీక. సుమారు నాలువందల సంవత్సరాల క్రితం వెలసిన ఈ దర్గా నేటికి తరగని ప్రజాదరణతో విలసిల్లుతోంది. ఒకనాడు ఈ ప్రాంతమంతా దట్టమైన అడవితో, క్రూర మృగాలకు ఆవాసంగా వుండేది. అక్కడక్కడా జనావాసాలు ఉండేవట. ఆ రోజులలో దీనిని జ్ఞానపాడు అనేవారట. క్రమంగా జానపాడు అయ్యిందని పెద్దలు చెబుతారు. ఇక్కడ జాన చెట్లు ఎక్కువగా ఉండేవట. గుర్రాలను అదిలించే చర్నా కోలాల తయారీకి ఈ చెట్టు కర్రను వాడేవారు. ఈ చెట్టు పేరు మీద ఏర్పడిన జానపాడు అనంతరం జాన్‌పహాడ్‌గా మారిందని ప్రతీతి.

**వెల్లటూరు:**


ప్రకాశం బ్యారేజ్

జిల్లాలో కృష్ణానది సుమారు 85 కి.మీ దూరంలో ప్రవహిస్తోంది. మేళ్ళచెరువు మండలం వెల్లటూరు ప్రాంతంలో కృష్ణానది దక్షిణం నుండి ఉత్తరం వైపు పయనిస్తున్నందున ఉత్తర వాహినిగా ఈ ప్రదేశానికి ఎంతో పురాణ ప్రాశస్త్యం ఉంది. పశ్చిమ కనుమల్లో పుట్టిన కృష్ణానది తూర్పున బంగాళాఖాతంలో కలిసేవరకు ఒక్క ఈ గ్రామం వద్దే ఉత్తరముఖంగా ప్రవహించడమే ఆ విశిష్టత.

అంతేకాక ఈ గ్రామంలో వందల సంవత్సరాలకు పూర్వం నిర్మాణమైన దేవాలయాలున్నాయి. నది ఒడ్డున కోటి లింగాలుగా ప్రసిద్ధి గాంచిన నూట ఒక్క లింగాలు వుండడమే కాక వందల సంవత్సరాల క్రితం నిర్మించిన శివాలయం, నర్సింహ స్వామి ఆలయం ఉన్నాయి. ఈ నది ఒడ్డున గొప్ప దేవాలయం నీలకంఠేశ్వరస్వామి ఆలయం. ఈ ఆలయంలోని శివలింగానికి నూట ఒక్క కలశాల నీటితో శివలింగం మునిగిపోయేంతగా ఏ రోజు నీటితో అభిషేకం చేస్తే ఆ రోజు అభిషేకం పూర్తికాకముందే కుండపోత వర్షం కురుస్తుందనేది గ్రామస్తుల ప్రగాఢ విశ్వాసం. కృష్ణా నది ఉత్తర ముఖంగా ప్రవహించే నది గర్భమున స్వర్ణ విరూపాక్షుని స్వర్ణ దేవాలయం మునిగిపోయినట్లు ఒక శాసనం తెలుపుతుంది. ఇంకా ఈ గ్రామంలో చెన్నకేశవస్వామి ఆలయం.

పావనీశ్వరస్వామి ఆలయం, ఆంజనేయస్వామి ఆలయం ఉన్నాయి. కాగా నేరేడుచర్ల, పెదవూర, రేబల్లె, చింత్రియాల, బుగ్గమాధారం, వజినేపల్లిలో కలిపి కృష్ణా తీరం వెంబడి సుమారు 20 దేవాలయాలు పైగా ఉన్నాయి.

వీటికి ప్రతి నిత్యం ఎక్కువ సంఖ్యలో భక్తులు రావడం విశేషంగా చెప్పుకోవచ్చు..







# కవితా వాణిని తన రాణిగా చేసుకున్న పిల్లలమర్రి

**"ఏను స్వయముగా కవితన్ వరించలేదు**

తానె వరియించె కైతల రాణి నన్ను" అని మీర్జాగాలిబ్ దర్జాగా అన్నా 'నను వరించిన శారద లేచిపోవునే' అని ఓ ఆధునిక కవికోకిల నుడివినా, అందరికన్నా ముందుగా ఆమాటను 15వ శతాబ్దంలోనే 'వాణి నా రాణి' అని సగర్వంగా చెప్పుకున్న ఓ మహాకవి-మన నల్లగొండ జిల్లాలోని పిల్లలమర్రికి చెందిన వాడు కావడం మనందరికీ గర్వకారణం. ఆతడే పిల్లలమర్రి పినవీరభద్రుడు. ఆయన పిల్లలమర్రికి చెందిన వాడేగానీ, విద్యాన్‌సర్వత్రా పూజ్యతే అన్నట్లుగా... అతను వికసించింది నల్లగొండ మొదలుగా ఇటు నెల్లూరు నుండి అటు విద్యానగరం వరకు. ఇక్కడ పుట్టిన కవి కుసుమం మూడు ప్రాంతాలకూ పరిమళాలు పంచింది.

"చెట్టు ఎంత విస్తరించినా-తన మూలాలు మరిచిపోనట్లు

పక్షి ఎంత దూరం విహరించినా-తన గూడును విస్మరించనట్లు.."

ఈ కవి తాను ఎక్కడ వికసిస్తున్నా-విరబూస్తున్నా తన స్వగ్రామ నామస్మరణను మాత్రం విస్మరించలేదు. ఎంతైనా "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" కదా! అందుకే తన జైమిని భారత పీఠికలో..

'అమృతాంశు మండలం బాలవాలము గాక-మెలిచె నొక్కటి జగన్మోహనముగ జిగిరించె విలయ సింధుగత కైతవ డింభ-శయనీయ వర పలాశ ములతోడ

బిత్రుదేవతలకు సంచిత సత్రశాలయై-చెట్టుగట్టెను గయాక్షేత్ర సీమ

నిలువనీడయ్యె నిందివరప్రియ కళా-కోటీరునకు భోగికుండలునకు

మర్రి మాత్రంబె పిల్లల మర్రి పేరు-పేరు వలెగాదు శారదా పీఠకంబు

వారి లోపల బిసవీరు వాక్యసర జీ-సరసులకునెన్న గర్గ రసాయనంబు"జైమినిభారంత వీఠికలో చెప్పుకున్నాడు. అంటూ తన ఊరు పిల్లలమర్రి శారదాపీఠానికి పర్యాయపదం అని కీర్తించాడు.

ఇందులో పేర్కొనబడిన 'ఇందివర ప్రియకళా కోటీరు'ని ఆలయం-నామేశ్వరాలయం నేటికీ చూపరులను అలరిస్తుంది.

ఇతని సమకాలీకుడైన అన్నమయ్య కుటుంబంలాగా వీరిదీ కవి కుటుంబమే! ఆ విషయాన్నే తన జైమినిభారత పీఠికలో తెలుపుతాడు ఇలా...

"తాతాయుదండ్రియు నగ్ర-భ్రాతయునుం దాను భువన భాసురకృతి నిర్మాతలు పిల్లలమర్రి వి-విఖ్యాతుని బినవీరు బాలగలరేసుకవుల్" పీఠిక 21

'విద్యాభారతీ జాని'గా కీర్తింపబడిన గాదిరాజునకు, నాగమాంబలమూ భారతీతీర్థ మునీంద్రుల ఆశీస్సులతో కలిగిన కవలపిల్లలు-పెదవీరభద్రుడు, పిన వీరభద్రుడు. వీరిలోని పినవీరభద్రుడే-మన కథనాయకుడు.

ఇతనికే చిన్నప్పటి నుండే జుట్టు జడలు కట్టినట్లుండడం వల్ల ఆ వీరభద్రుని అవతారమేనని భావించేవారట లోకులు. చిన్నవయసులోనే అఖిలశాస్త్రాలూ అభ్యసించాడు. కాళిదాసాదుల కంటే ఎక్కువగానే అనేక కావ్యాలు వ్రాసినట్లూ, ఆసేతు హిమాచలం సాటి లేని కవిగా పేరుపొంది 'వాణిని తన రాణి'గా చెప్పుకున్నాడని-అతని ఎనిమిది తరాల తదుపరి వారసుడు పెనుమళ్ళ సోమయ్య తన 'సీమంతినీ పరిణయం'లో పేర్కొన్నాడు ఇలా...'

మహానీయ పిల్లలమర్రి వంశభవుండు-గాదిరాజు సుతుండు ఘన యశుండు వీరేశ్వరుని యవతారమే యతడంచు-జనులెన్నదగిన సౌజన్యశాలి పినవీరభద్రుడు పిన్నప్రాయమునందు-నఖిల శాస్త్రంబులు నభ్యసించే గాళిదాసాది నత్కవులకు హెచ్చుగా-బహుకావ్య విరచనప్రౌఢిగాంచె 'వాణి యిల్లాలు'గా గవిశ్రేణికెల్ల- బృధుతరాశ్చర్యకరమైన బిరుదు పూనె దుహినగిరి రాజ రామసేతువుల నడుమ-నితని కెనయైన కవి వరుందెందుగలడు"? 1-42

**ఇంతకీ ఈ వాణి యిల్లాలు కథ ఏమిటి?**

పువ్వుపుట్టగానే పరిమళిస్తుందన్న చందంగా పినవీరభద్రుడు బాల్యంలోనే అఖిలశాస్త్రాలనూ వారి ఊరు పిల్లలమర్రిలోని నామేశ్వరాలయంలో కూర్చొని అధ్యయనం చేస్తూ వాటిలోని శాస్త్రరహస్యాలను విశ్లేషించి వివరిస్తుంటే నాటి పండితులే ఆశ్చర్యచకితులయ్యేవారట. అలా బాల్యంలోనే శాస్త్రపాండిత్యంతో పాటు ప్రాచీన సంస్కృతాంధ్రకవుల 'విద్యదౌషధ ప్రాయాలైన ప్రౌఢ కావ్యాలను పినవీరన అలవోకగా అధ్యయనం చేయసాగాడు.

ఆ కాలంలోనే నల్లగొండ జిల్లాలోని రాచకొండను 'సర్వజ్ఞ' బిరుదాంకితుడైన ముమ్మడి సింగభూపాలుడు రాజ్యం చేస్తున్నాడు. అతని స్వాధీనంలో

మిగతా 139వ పేజీలో

# కవితా వాణిని తన రాణిగా చేసుకున్న పిల్లలమర్రి

138వ పేజీ తరువాయి

ఉండిపోయిన రెడ్డిరాజుల గౌరవ చిహ్నామైన నందికంత పోతరాజు అనే కరారును విడిపించడానికి తన వార్థక్యంలో శ్రీనాథ కవి సార్వభౌముడు పిల్లలమర్రి మీదుగా రాచకొండకు బయలుదేరాడు. మధ్యలో పిల్లలమర్రిలో విడిది చేయగా చుట్టుపక్కల పండితులతో పాటు పినవీరన కూడా శ్రీనాథ దర్శనార్థం వెళ్లాడు. ఈశ్వరార్చన కళాశీలుడైన శ్రీనాథుడు అక్కడ నామేశ్వరాలయంలో తన శృంగారనైషద గ్రంథ ప్రవచనం చేస్తూ పండితుల సందేహాలను తీరుస్తున్నాడు. అంతలో బాలపినవీరన్న శ్రీనాథుని ఉద్దేశించి 'గమికర్మీకృతనైకనీవృతా' అన్న హర్ష పదబంధాన్ని ఎలా ఆంధ్రీకరించారని అడగ్గా శ్రీనాథుడు 'గమి కర్మీకృత నైకనీవృతుడనై' అని తెనిగించానని చెబుతాడు. దానికి పినవీరన 'నై' అని తెనిగించారా అని ఓ పరిహాసాస్పదమైన చిరునవ్వు అలవోకగా నవ్వాడట. ఒక్క క్షణం ఉలిక్కిపడ్డ శ్రీనాథుడు బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తూ అపరవీరభద్రుని అవతారంగా జడలతో ఒప్పుతున్న పినవీరన్నను నిశితంగా వీక్షించి అతడు భవిష్యత్‌లో ఒక మహిమాన్విత మహాకవి కాగలడని అక్కడివారికి చెప్పి అభినందించి నిండు మనసుతో ఆశీర్వదించాడట! పినవీరన శ్రీనాథుని ఆశీస్సులకు వినమ్రుడయ్యాడు.

అలా బాల్యంలోనే ఒక మహాకవి అభినందనలు-ఆశీస్సులు అందుకొని భారతీతీర్థమునీంద్రులచే యోగవిద్య, సరస్వతీ మంత్రోపదేశమును పొందిన పినవీరనకు వాణి వశవర్తి అయింది. అనేక గ్రంధాలు వ్రాస్తూ దేశాటనం ప్రారంభించాడు. నెల్లూరులో కొంతకాలం ఉన్నప్పుడు సమీపంలో గల సోమరాజుపల్లె గ్రామాధికారి చిల్లర వెన్నమంత్రి కోరిక మేరకు శృంగార శాకుంతలాన్ని వ్రాసి అతనికే అంకితమిచ్చాడు.

అనంతరం విజయనగర ప్రభువు సాళువ నరసింహరాయల అభ్యర్థన మేరకు నెల్లూరును వదిలి విజయనగర ఆస్థానాన్ని చేరుతాడు పినవీరన. పెదవీరన పోరాహెల రాజ్యంలో ఉన్నత పదవి లభిస్తుంది. ఆ విజయనగర ప్రభువుకు మహాభారతములోని అశ్వమేథ పర్వములోని కథను ఇతివృత్తంగా తీసుకొని సంస్కృతంలో వ్రాయబడిన 'జైమినిభారతం' అంటే చాలా ఇష్టం. అందుకే ఆ గ్రంధాన్ని ఆంధ్రీకరించడానికి ఎంతకాలం పడుతుందని తన ఆస్థాన పండిత మండలిని అడుగుతాడు. కొందరు ఒక సంవత్సరం అని, మరికొందరు ఆరు నెలలనీ, ఇంకొందరు మూడు నెలలని చెబుతారు. పిల్లలమర్రి పినవీరభద్రుడు మాత్రం నభికులందరూ ఆశ్చర్యపోయేలా ఒక్క నెలలోనే ఆంధ్రీకరించగలనని ప్రకటిస్తాడు. ప్రభువు సంతోషించి గ్రంథరచనకు ఉపక్రమించమని అర్థిస్తూ తాంబులాదాలు సమర్పించుకుంటాడు. దాదాపు నెలరోజులు పూర్తి కావస్తున్నా పినవీరన గ్రంధ రచనకు శ్రీకారం చుట్టాడు. తన అన్న పెదవీరభద్రుని మనసులో గడువులోపల గ్రంథం పూర్తి కాకపోతే ప్రభువు ఆగ్రహానికి గురికావాల్సి వస్తుందన్న ఆందోళన అధికం కాసాగింది. అందుకే గడువు సమీపిస్తున్న కొద్దీ పెదవీరన్న తన తమ్ముని హెచ్చరిస్తూనే ఉన్నాడు. గడువు ఇంకా ఒక రోజు ఉందనగా పినవీరభద్రుడు ఒక గదిని శుభ్రం చేయించుకొని తాళపత్రాలను సిద్ధపర్చుకొని ఎవరినీ ఆ గదిలోనికి రావద్దని హెచ్చరిస్తాడు. లోనికి వెళ్లి తలుపులు బిగించుకొని కొన్ని కృత్యాది పద్యాలు వ్రాసి ఆ శారదాదేవిని ధ్యానించి నిద్రకు ఉపక్రమిస్తాడు. పినవీరన గురక శబ్ధం క్రమంగా బయటకు వినిపించసాగింది. పెదవీరన నిద్ర రాక లేచికూర్చొనగానే పినవీరన గది నుండి గురకశబ్దంతో పాటు కాసేపట్లోనే గంటముల రాపిడి శబ్దపు గరగరలు కూడా వినిపించసాగాయి. విషయం తెలుసుకుందామని ఆసక్తితో కిటికి తలుపును నెట్టి చూడగా లోన దివ్యాభరణ భూషితయైన సరస్వతిదేవి పినవీరన పక్కన కూర్చొని నాలుగు చేతులతో గంటము ఆపకుండా వ్రాస్తూ కనిపించిందట. వెంటనే సరస్వతి కిటికీ గుండా తనను చూస్తున్నందుకు బిడియపడి పెదవీరన వైపు తన చేతిలోని ఘంటమును విసిరి అదృశ్యమైనదట. అన్న ఆక్రందన విని పినవీరన నిద్రలేచి జరిగింది తెలుసుకొని 'బావవైన నిన్ను చూచినంతనే సిగ్గుపడి నిన్నిట్లు పరాభవించింది. దీనికి బాధపడటమెందుకొని రాలిన తాటాకు పొడిని కంటిపై వేయగా తక్షణం నొప్పి అదృశ్యమైనదట. మిగిలిన చివరికొన్ని పద్యాలు పూర్తి చేసి మరునాడు సభకు బయలుదేరాడు పిల్లలమర్రి పినవీరభద్రుడు. సభలో అప్పటికే గత నెల రోజులుగా కావ్యరచనకు శ్రీకారం చుట్టలేదన్న విషయం తెలునుకున్న సాళువ నరసింహరాయులు బృహద్గంధరాజముతో సభలో ప్రత్యక్షమైన పిన వీరభద్రుని చూచి ఇది ఎలా సాధ్యమైనది అని ప్రశ్నిస్తాడు. అప్పుడు విరించి అంశతో వెలిగిపోతున్న పిన వీరభద్రుడు గంభీరంగా దెల్లము గానొక్క రాతిరి-తెల్లగ తెల్లవారు వరకు తీగలడె కృతిన్?"

అని నిండు కొలువులో అందరి హర్షాధ్వానాల మధ్య ప్రకటిస్తాడు. మరుక్షణంలో సింహాసనమునకు వెనుకనున్న తెరలో ఒక దివ్యకాంత తన కరకంకణములు మ్రోగగా దక్షిణహస్తమునెత్తి "రాజా! ఈ మహాకవి అన్న మాటలు సత్యము ఈయన విరించి యువతారము గనుక నేనితని రాణి"నని చెప్పి అదృశ్యమైనదట! ఈ కథలో వాస్తావాస్తవాలు ఎలా ఉన్నా-పిల్లలమర్రి పిన వీరభద్రుడు తన గ్రంథంలో పిల్లలమర్రి పేరును, ఆ ఊరిలోని శివాలయాన్ని స్మరించడం, శ్రీనాథుడు తన వార్థక్యంలో రాచకొండను దర్శించి'నందికంత పోతరాజు' అనే కరారిని విడిపించడం-దాదాపు అప్పుడే బాలునిగా ఉన్న పినవీరన అతడిని కలవడం, శ్రీనాథుని ప్రభావంతోనే తన కావ్యానికి శృంగార శకుంతలం అని పేరు పెట్టడం మొదలైనవి చారిత్రాకాంశాలే.





# జనం గుండెల్లో జాన్‌పాడ్ సైదులు దేవుడు

(ప్రభాతవార్త-నేరేడుచర్ల)

భిన్నత్వంలో ఏకత్వానికి ప్రతీకగా హిందూ. ముస్లిం ఐక్యతకు చిహ్నంగా విరాజిల్లుతున్న జాన్‌పాడ్ దర్గా తెలంగాణ ప్రాంతంలో ప్రసిద్ధిగాంచింది. మానవత్వానికి, ధర్మానికి , త్యాగానికి గుర్తుగా భక్తులు పూజిస్తారు. భక్తుల కోరికలను తీరుస్తున్న హజరత్ సయ్యద్ మొహినోద్దీన్‌షా, జాన్‌పాడ్‌షహిద్, రహమతుల్లా జనం దేవుడు జాన్‌పాడ్ సైదులుగా ప్రసిద్ధి గాంచారు. నల్గొండ జిల్లా నేరేడుచర్ల మండలకేంద్రానికి సుమారు 23 కి.మీ.దూరంలో కృష్ణానది-మూసీనది పరివాహక ప్రదేశంలో హిందూ, ముస్లిం పుణ్యక్షేత్రంగా జాన్‌పాడ్ సైదులు దర్గా విరజిల్లుతోంది. కోరిన కోర్కెలు తీరిన భక్తులు శుక్రవారం కందూరు పేరుతో దర్గాకు వచ్చి జంతువులను బలిచ్చి ప్రార్ధనలు, పూజలు చేస్తారు. జాన్‌పాడ్ సైదులు వార్షిక ఉర్సెషరీఫ్ సందర్భంగా వేలాది మంది భక్తులు హాజరై పవిత్ర గంధం కళ్ళకు అద్దుకుంటారు. ఉర్సు సందర్భంగా హైద్రాబాద్ నుంచి గంధను పవిత్ర కాలశంలో తీసుకువచ్చి జాన్‌పాడ్‌లో ఉంచి పూజలు నిర్వహించిన అనంతరం సుమారు 4 కి.మీ.దూరం అశ్వంపై ఉంచి ఉరేగింపు జరిపి దర్గాలో పవిత్ర సమాధులపై ప్రార్ధనలు నిర్వహిస్తారు. ఈ గంధం కళ్ళకు అద్దుకుంటే అదృష్టం కలిసి వస్తుందని, కోరిన కోర్కెలు తీరుతాయని, ఇంట్లో పెట్టుకుంటే ఆయు, ఆరోగ్య, ఆర్థిక సంపద చేకూరుతుందని భక్తులు భావిస్తారు.

## దర్గా అభివృద్ధికి రూ.47లక్షలు మంజూరు

జాన్‌పాడ్ దర్గా వద్ద రోడ్డు, డ్రైనేజీ, పారిశుద్ధ్యం, స్నానాల గదులు, సత్రాల నిర్మాణానికి ఆంధ్రప్రదేశ్ వక్ఫ్‌బోర్డు రూ.47లక్షలు మంజూరు చేసినట్లు సిఇఓ అహ్మద్‌అలీ తెలిపారు. అలాగే శిధిలావస్థలో ఉన్న సత్రాన్ని పునర్నిర్మాణం చేయడానికి నిధులు మంజూరు చేయనున్నట్లు తెలిపారు.

సంతానం లేని వారికి సంతానం కలుగుతుందని భక్తుల నమ్మకం, గంధం ఉరేగింపులో ఎలాంటి అవాంచనీయ సంఘటనలు జరగకుండా పటిష్టమైన పోలీస్ వలయంలో గంధాన్ని ఉరేగించుతారు. భక్తులు గంధం కలగం ముట్టుకోవడానికి విశ్వయత్నం చేస్తారు.దర్గాకు వచ్చే భక్తులు సమీపంలోని కృష్ణానదిలో స్నానమాచరించి తడి, మడి బట్టలతో దర్గా చుట్టూ పానసారం పడుకుంటే వారికి కలలో జాన్‌పాడ్ సైదులు దర్శనమై, వారి ప్రశ్నలకు బదులిచ్చి కోరికలు తీరుస్తాడనే విశ్వాసం భక్తలలో ఉంది. దర్గాను దర్శించిన భక్తులు ప్రక్కనేయున్న నాగేంద్రుని పుట్ట వద్ద పూజలు నిర్వహిస్తారు. అలాగే సమీపంలోనున్న గోల్లబామ గట్టకు' వెళ్ళి పాలు అమ్ముకోస్తాని దర్శించి రాయివేస్తారు.

### జాన్‌పాడ్ దర్గా చరిత్ర

జాన్‌పాడ్ సైదులు దర్గాపై విభిన్న కథనాలు చెబుతుంటారు. మద్రాస్ రాష్ట్రంలోని నాగూరులో సుమారు 400 ఏళ్ళ క్రితం వెలిసిన నాగూర్‌షరీఫ్ ఖాదర్‌దర్గా విశిష్టతను నలుమూలలకు చాటాలని ప్రచారంలో భాగంగా ఆంధ్రరాష్ట్రంలో వ్యాప్తి చేయడానికి జాన్‌పాక్ సైదా, బాజీసైదా మొహినోద్దీన్‌లు ప్రచారం పేరుతో ఈ ప్రాంతానికి వచ్చి నాగూర్‌షరీఫ్ గొప్పతనాన్ని గ్రామాల్లో ప్రచారంలో తమ వ్యతిరేకులతో పోరాడి అమరులయ్యారనే కధనాన్ని చెబుతుంటారు. ఇరాన్‌గా పిలవబడుతున్న నాటి పర్షియా దేశంలోని పాక్‌పట్యా అనే గ్రామంలో హజరత్ జాన్‌పాక్‌షహిద్ 1302 సంవత్సరంలో మరొక ప్రచారంలో ఉంది. మత ప్రచారం కోసం వచ్చిన జాన్‌పాక్ సైదాను అప్పటి వాడపల్లి జమీందార్ భూపతిరాజు నిర్బందించాడని ఫలితంగా జాన్‌పాడ్ అడవుల్లో కృష్ణ, మూసీనది తీరంలో యుద్ధం జరిగిందని, ఆయుద్ధంలో జాన్‌పాక్ సైదా అమరులై కొన్ని రోజులకు భూపతిరాజు సైన్యాన్ని అప్పటి రాఘవాపురం గ్రామం జాగిర్ధార్ వేముల శౌషరెడ్డికి జాన్‌పాక్ సైదా భగవంతుని అవతారంగా కలలో కనిపించి, తప్పిపోయిన ఆవుల మంద గురించి చెప్పడంతో అక్కడే దోరికాయట' దీంతో జాన్‌పాక్ సైదా కోరికపై దర్గాను నిర్మించాడనే కధ ప్రచారంలో ఉంది.

జాన్‌పాడ్ దర్గా సమస్యల దుర్గం

దర్గా వద్ద డ్రైనేజీ నిర్మాణం చేయకపోవడంతో పరిసరాలు బురదమయంగా తయారయారై దీంతో భక్తులు ఇబ్బందులకు గురవుతున్నారు. స్త్రీలకు స్నానాల గదులు లేకపోవడంతో,నిర్వహణ లోపంతో అవి శిధిలావస్థకు చేరుకున్నాయి. దర్గా వద్ద బైపాస్ రోడ్డు నిర్మాణం గురించి అధికారులు, ప్రజాప్రతినిధులు పట్టించుకోవడం లేదు.

దర్గా చుట్టూ సిమెంట్ రోడ్డు నిర్మాణం పనులు కాగితాలకే పరిమితం అయ్యాయి. దర్గా వద్దనున్న అన్ని వీధులను సిమెంట్ రోడ్డు నిర్మాణం చేయిస్తానని హామీలు ఇస్తున్నారు కాని అమలు జరగడం లేదు.

దర్గాలోని రోడ్లు పై నుంచి వస్తున్న దుమ్ము, దూళి నుంచి భక్తులు పల్లు ఇక్కట్లకు గురవుతున్నారు. వక్ఫ్ బోర్డుకు లక్షలాది రూపాయల ఆదాయం ఆర్థించి పెడుతున్న అభివృద్ధి గురించి పట్టించుకోవడం లేదనే ఆపవాదు ఉంది.















# మాఘ మాసం 'పెళ్లికళ'

ప్రకాశంవార్త-హైదరాబాద్

మాఘ మాసం ... చిరోజే ...వస్నాడే ... మూహార్తాన సినారె ... కాని, మాఘం వచ్చినప్పటి ...ండి ... ష్టం ... మంగళవా...ఘోషలతో ...గుతున్నది. ఎక్కడ చూసినా అడపడుచుల కళకళలతో, పట్టుచీరల ధగధగలతో కళ్యాణమంటపాలు జగేలుమని మెరిసిపోతున్నాయి. పెండ్లివేదికల మీద యువజంటలు ముసిముసినవ్వులతో మురిసిపోతున్నారు. ఫిబ్రవరి 2 వతేదీనుండి సుముహార్తాలు ప్రారంభమయ్యాయి. ఈ ముహూర్తాలు ఈ నెల 23 వ తేదీతో ముగుస్తున్నాయి. 21 రోజులు మాత్రమే మంచి ముహూర్తాలు ఉన్నందున, ఈ ... ముహూర్తాలు ఉం... ...న్నారు. ఈ నేపథ్యంలోనే బంగారం, వెండి, వస్త్రసామాగ్రి ధరలతో పాటు బ్రాహ్మణులకు, ..., ... కళ్యాణమంటపాలకు చెప్పలేనంత గిరాకీ ఏర్పడింది.

వివాహం, గృహప్రవేశం, ఉపనయనం, ప్రతిష్ఠలు వంటి అన్ని ముహూర్తాలలో వహ్నిమాగ్నిని కోరుకునే అంగారకుడు గత 203 రోజులుగా మేషం స్తంభించి ఉండడంతో చక్కని ముహూర్తాలకు అవకాశం ఏర్పడ లేదని. ఫిబ్రవరి 5వ తేదీనుండి మేషసంధననుండి వెలువపలికి వస్తున్నాడని, అందుకే సుమూహార్తాలకు మంచి బలం వచ్చిందని. కుర్తా

## పెళ్లిళ్లు, ఉపనయనాలు, గృహప్రవేశాలు, దేవుళ్ల ప్రతిష్టలు, భగ్గుమంటున్న ధరలు

మంచి రోజులలోనే పెళ్ళిళ్ళు చేసేయాలని, తల్లిదండ్రులు ఉవ్విళ్ళూరుతున్నారు. ఒకకాలు విమానాశ్రయంలో, మరోకాలు కళ్యాణవేదికమీద ఉన్న పెళ్లి కొడుకులకు మంచి గిరాకీ ఉన్నది. ఉపనయన ముహూర్తాలు, గృహప్రవేశముహూర్తాలు ఈ మాసంలోనే ఉన్నందున అన్నీ వస్తువుల ధరలు చుక్కలంటుతున్నాయి. చల్లని ఆశల పందిళ్లకింద, అత్తరుపన్నీరు గుబాళింపుల మధ్య, విరిదండల సాక్షిగా జరుగుతున్న పెళ్లి పందిళ్లలో ఆడపిల్లల తల్లిదండ్రులు అంతరంగంలో సంతోషాన్ని, వేదనను ఏకకాలంలో అనుభవిస్తున్నారు. వసిడి ధరలు భగ్గుమంటూ ఉండడంతో మరింత వేదనకు గురవుతున్నారు. పుష్య మాసంశూన్యమాసంగా ఉన్నందున, వచ్చే ఫాల్గుణంలో తక్కువగా ముహూర్తాలు ఉన్నందున మాఘ మాసం మంచిరోజులకోసం వధూవరులు ఆశగా ఎదిరిచూస్తున్న మాటలు నిజమే. మాఘశుద్ధపాడ్యమి నుండే బ్రాహ్మణులందరూ 'సుమూహర్త సావధాన, శభలగ్న సావధాన' అంటూ సిద్ధమయ్యారు. 21 రోజుల మాత్రమే ముహూర్తాలు ఉండడంతో రాష్ట్ర వ్యాప్తంగా 20 రోజులలో లక్ష జరుగుతున్నాయని అనధికారిక అంచనా. మాసం రోజులలో పెళ్లి , ఉపనయనం, గృహప్రవేశం, కొత్త దేవుళ్ల

ళం పీఠం పంచాంగకర్త, సిద్దాంతి శ్రీనివాన గార్గేయ వ్యాఖ్యానించారు. వార్తలో జనవరి 14న 'ఖగోళంలో గ్రహసమ్మేళనం ' అని రాసినట్లు స్వస్తిక్ మార్కులోని గ్రహాలు నూతన వధూవరుకు శుభాశీస్సులందచేస్తున్నాయని ఆయన వివరించారు. వివాహ ప్రక్రియలోని స్నాతకం, స్థాలీపాకం హోమాలతో అంగారకుడు నూతన తేజస్సుతో విరాజిల్లుతాడని, అందుకే మాఘంలోని ముహూర్తాలు గొప్ప ముహూర్తాలవుతున్నాయని అనుభవజ్ఞులైన సిద్ధాంతులు, పండితులు అభిప్రాయపడుతున్నారు. ఇదే నెలలో వసంతపంచమి, రథసప్తమి, భీష్మఏకాదశి వంటి దేవతాసంబంధమైన శుభపర్వదినాలు వచ్చాయని, ఈ మాసంలో వివాహం చేసుకునే దంపతలు ఆయురారోగ్యాలతో, సిరిసంపదలతో, భోగభాగ్యాలతో, వర్ధిల్లుతారని, ఇది స్వస్తిక్ చిహ్నం ద్వారా వచ్చిన మంగళవాక్యమని విశాఖ శారదాపీఠం స్వరూపానందేంద్ర స్వామీజీ భాష్యం చెప్పారు. 20 రోజులలో సుమారు 15 అద్భుతమైన ముహూర్తాలు ఉన్నాయని, ఫాల్గుణంలో మరో ఆరు శుభ ముహూర్తాలు ఉన్నాయని, సంప్రదాయాలను గౌరవిస్తున్న తెలుగువారందరూ ఈ శుభఘడియలలోనే వివాహాలను జరుపడానికి ఇష్టపడుతున్నారని అర్చక సమాఖ్య ఉపాధ్యక్షులు భాస్కరభట్ల రామశర్మ పేర్కొన్నారు. మాఘ ప్రారంభంలోనే శని, గురు, శుక్ర గ్రహాలు వరుసగా పుష్యమి, విశాఖ, పూర్వాషాఢ స్వనక్షత్రాలలో సంచారం మొదలు పెట్టారని, తద్వారా ముహూర్తాలకు చక్కని బలం చేకూరుతున్నదని సిద్ధాంతులు చెప్తున్నారు.

# ప్రత్యామ్నాయ ఇంధనవనరు బయోడీజిల్ మొక్కలు

(ప్రభాతవార్త-నరసరావుపేట)
బయోడీజిల్ మొక్కలు పెంపకాన్ని ప్రభుత్వాలు ప్రోత్సహిస్తున్నాయి. చౌడుభూములు, బీడుభూములు, ఎందుకూ పనికిరాని భూముల్లోకూడా బయోడీజిల్ మొక్కలు పెంచితే గ్రామీణ భారత రూపురేఖలే మారిపోతాయి. గ్రామాలన్నీ ఆర్థికంగా వర్ధిల్లుతాయి. ఈమార్గాన్ని ఎంచుకున్న ఓ యువకుడు ఓసంస్థను స్థాపించి వివిధప్రాంతాల్లో 1500ఎకరాల్లో బయోడీజిల్ మొక్కల పెంపకాన్ని చేపట్టారు. రానున్న కాలం బయోడీజిల్‌దేనన్న నమ్మకంతో నరసరావుపేటకు చెందిన టిఎల్‌పి రాయల్‌బాబు విజయరాయల్ బయోడీజిల్ ఎనర్జీస్ అనేసంస్థను మూడేళ్ళక్రితం స్థాపించారు. కేవలం రూ.3లక్షల పెట్టుబడితో ఇప్పటికి 1500ఎకరాల్లో బయోడీజిల్(జట్రోపా) మొక్కలు పెంపకాన్ని



బయోడీజిల్ మొక్కల ప్యాకెట్లు, మట్టి కూరుస్తున్న కార్మికులు

ప్రారంభించారు. ఈరంగాన్ని ఎంచుకోవడానికి ముందు అదిలాబాద్ జిల్లా ఉట్నూరువెళ్ళి అక్కడ కానుగ నూనె ఉత్పత్తి, దానిద్వారా జనరేటర్లు నడిచేవిధానం అధ్యయనం చేశానని దీంతో 'మననూనె-మనవిద్యుత్' అనే విధానంపై ఆత్మవిశ్వాసం పెంచుకున్నానన్నారు. నరసరావుపేట సమీపంలో ఉన్న అల్లూరివారిపాలెం భూమి తీసుకొని మొక్కలపెంపకాన్ని చేపట్టారు. ప్రస్తుతం మార్కెట్‌లో విత్తనాలు టన్ను రూ.6వేలు పలుకుతుందని ప్రారంభదశలో తావే పొలాలకు మొక్కలు అందజేస్తున్నామని నీటిఅవసరం పెద్దగా ఉండదని, పశువులు వీటిని తినవని ఇది రైతుకు వెసులుబాటని అన్నారు. మొక్కలు నాటిన ఏడాదికే రెండుపంటలు చేతికివస్తాయని బాబు చెబుతున్నారు. ఒక్కసారి నాటిన మొక్క40ఏళ్ళవరకుఅధిక దిగుబడులిస్తుందని మొదటిఏడాది పెట్టుబడులు సాధించి 39ఏళ్ళపాటు అధిక రాబడులు పొందవచ్చన్నారు. అందుకే రైతులంతా బయోడీజిల్ మొక్కలు పెంపకానికి ప్రాధాన్యతనివ్వాల్సిన అవసరం ఉందన్నారు. వచ్చే ఏడాదినుండి ఈసంస్థ ఏటా పది


చౌడుభూముల్లో బయోడీజిల్ చెట్టు

వేల ఎకరాల్లో బయోడీజిల్ మొక్కలు నాటాలన్న ఆలోచనతో కృషిజరుగుతుంది.ప్రకాశంజిల్లా మేదరమెట్ల వద్ద రూ. 5కోట్ల వ్యయంతో బయోడీజిల్ రిఫైనరీని ఏర్పాటు చేసేందుకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. దీనికితోడు అన్నిజిల్లాల్లో కార్యాలయాలు ఏర్పాటుచేసి సిబ్బందిని నియమించి బయోడీజిల్ మొక్కలు పెంపకంపై రైతులకు అవగాహన కల్పించి, వారిలో చైతన్యంతెచ్చేందుకు కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. ఇందులో భాగంగా నల్గొండ, ప్రకాశం, కృష్ణాజిల్లా మైలవరంలలో కార్యాలయాలు ఏర్పాటయ్యాయి. నెల్లూరుజిల్లా చర్లపల్లిపెర్ల వద్ద కూడా మొక్కల పెంపకం పూర్తయి పంట దిగుబడులు సిద్ధమయ్యాయి. ఎంఎం

ఇ చదివిన రాయల్‌బాబు ఈసంస్థను స్థాపించిన అనతికాలంలోనే ఎక్కువ ఎకరాల్లో పంటను పండించే దిశగా రైతులను ప్రోత్సహిస్తున్నారు. ప్రస్తుతానికి మొక్కలనుండి ఇతర సౌకర్యాలన్నీ ఈసంస్థే అందరికీ అందజేస్తుంది. తనను ఈరంగంలో ప్రోత్సహించిన వ్యక్తి డాక్టర్ పి.రమేష్‌బాబు అని ఆయన చెప్పారు. బయోడీజిల్‌లో సల్ఫర్ లేకపోవడంతో కాలుష్యం వెలువడదు. లూబ్రికేషన్ కెపాసిటీ ఉంటుంది కాబట్టి డెన్సిటీవల్ల వాహనం మైలేజి పెరుగుతుంది. పెట్రోడీజిల్‌లో 20శాతంవరకు బయోడీజిల్ కలిపినా ప్రస్తుత ఇంజన్లకు ఎటువంటి ఇబ్బందిఉండదని, బయోడీజిల్‌తో నడిచే ఇంజన్లు మార్కెట్‌కి వస్తే ఈ డీజిల్ డిమాండ్ ఊహించలేమన్నారు. ప్రభుత్వం బయోడీజిల్ మొక్కల పెంపకాన్ని ప్రోత్సహిస్తున్నా బ్యాంకులు మాత్రం రుణాలిచ్చేందుకు ముందుకు రావడంలేదన్నారు. బ్యాంకర్లు రుణాలిచ్చేందుకు ముందుకు వస్తే ఎక్కడా వృధాభూములు, బీడుభూములు కనిపించవని అంతా హరితవనంగా మారిపోతుందని బాబు పేర్కొన్నారు. రాయల్‌బాబులా బయోడీజిల్ మొక్కల పెంపకంపై రైతాంగం శ్రద్ధ వహిస్తే గ్రామాల ఆర్థిక పరిస్థితులు మెరుగవుతాయి.

## సేవలకోసం కాసు వెంగళరెడ్డి ట్రస్ట్

(ప్రభాతవార్త-నరసరావుపేట)
రాజకీయాల్లో 'పేదవాడికే ప్రాధాన్యం' అన్న సూక్తితో రాజకీయాలు నడిపి కింగ్‌మేకర్‌గా పేరుతెచ్చుకున్న రాజకీయ ఉద్దండుడు స్వర్గీయ సర్దార్ కాసు వెంగళరెడ్డి. ఎన్నో ఉన్నత పదవులు నిర్వహించినా పేదల గురించి అనుక్షణం తపన పడేవారు. ఆయన ఆశయాలకనుగుణంగా పేదవర్గాలకు సేవలందించేందుకు ఆయన కుటుంబ సభ్యులు కాసు వెంగళరెడ్డి మెమోరియల్ ట్రస్ట్‌ను ఏర్పాటుచేశారు. వైద్య, విద్యారంగాల్లో పేదవారిని ఆదుకోవాలన్న ఆశయంతో ఆయన కుమారులు కాసు వెంకటకృష్ణారెడ్డి, కాసు ప్రసాదరెడ్డి, కాసు రాజగోపాలరెడ్డి, శ్రీమతి శేషమ్మ ఇతర కుటుంబసభ్యులతో ఈట్రస్ట్ ఏర్పాటైంది. కాసు కృష్ణారెడ్డి నరసరావుపేట శాసనసభ్యునిగా ఉన్నారు. మరో కుమారుడు డాక్టర్ ప్రసాదరెడ్డి ప్రముఖ నేత్రవైద్యుడిగా ప్రపంచస్థాయిలో గుర్తింపు పొందారు. చిన్నకుమారుడు రాజగోపాలరెడ్డి ప్రముఖ బిల్డర్‌గా పేరుపొందారు. వీరిముగ్గురు తండ్రిపేరుతో ట్రస్ట్ స్థాపించి సేవాకార్యక్రమాలు చేపట్టేందుకు శ్రీకారం చుట్టారు. కాసు వెంగళరెడ్డికి రాజకీయంగా అండగా నిలిచిన ఉప్పలపాడుగ్రామంలో ఈనెల 5న ట్రస్ట్ సేవా కార్యక్రమాలు ప్రారంభించనున్నారు. పేదవాడలే దేవాలయాలుగా భావించే తమ తండ్రి ఆశయాలకనుగుణంగా ఈట్రస్ట్ ఏర్పాటుచేసినట్లు ఆయన కుమారుడు కాసు కృష్ణారెడ్డి, కాసు రాజగోపాలరెడ్డిలు తెలిపారు. తొలుత నేత్రవైద్యశిబిరాలు నిర్వహిస్తామని జిల్లాఅంతా ఈకార్యక్రమాలు చేపట్టినతరువాత విద్యారంగంలో పేద విద్యార్థులను ప్రోత్సహించేందుకు తమ తండ్రిపేరుతో స్కాలర్‌షిప్స్ ఏర్పాటుచేయనున్నట్లు తెలిపారు. వీటికితోడు వృద్ధాశ్రమాలు కూడా స్థాపించనున్నట్లు చెప్పారు. అంతేకాకుండా మరికొన్ని రంగాల్లో ఆయన పేరుతో అవార్డులు ఏర్పాటుచేయనున్నట్లు పేర్కొన్నారు. ఈట్రస్ట్ చేపట్టే కార్యక్రమాల్లో ఇతర సేవాసంఘాలవారిని కూడా పాల్గొనేలా కృషిచేస్తామన్నారు.

# కదిలిన 'కాలచక్ర'



(ప్రభాతవార్త-అమరావతి)
గుంటూరు జిల్లా అమరావతిలో 'కాలచక్రం' కదలింది. అంతర్జాతీయ ప్రాధాన్యం కలిగిన ఈ ఉత్సవాలు బౌద్ధుల సంప్రదాయ పూజలతో గురువారం వేకువజామున ప్రారంభమయ్యాయి. ఈనెల 16 వరకు కాలచక్ర-2006 ఉత్సవాలు ఇక్కడ జరగనున్న విషయం తెలిసిందే. ఉత్సవాల ప్రారంభం సందర్భంగా బౌద్ధ మత గురువు దలైలామా జనావళికి సందేశాన్ని ఇచ్చారు.

పవిత్ర కృష్ణా నది తీరాన ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన కాలచక్ర ప్రవచన వేదిక ఎదురుగా గురువారం తెల్లవారుజామున ఆరు గంటలకు ఉత్సవ ప్రారంభ పూజలు మొదలయ్యాయి. ఒక బల్లపై వరుసకు 22 చొప్పున మూడు వరుసల్లో 66 స్టీల్ గిన్నెలు (బౌల్స్) ఉంచారు. మొదటి రెండు వరసల్లోని గిన్నెలు నూనెతో ఉండగా, మిగతా వరసల్లోని గిన్నెల్లో బియ్యం పోసి అగరువత్తులను ఉంచారు. అక్కడే వివిధ రకాల పండ్లు పెట్టారు. కొంత పైభాగంలో మైదా, గోధుమపిండితో తమ సంప్రదాయ పద్ధతుల్లో తయారు చేసిన రంగురంగుల పదార్థాల ప్రతిమలను ఉంచారు. వీటికి రెండు పక్కల బుద్ధుడి చిత్రాలతో కూడిన పట్టు వస్త్ర చిత్రాలను వేలాడదీసి దలైలామా ప్రధాన శిష్యులు నిర్వహించిన ప్రార్థనల్లో పెద్ద సంఖ్యలో బౌద్ధ బిక్షువులు, సన్యాసినులు, టిబెటియన్లు, ఇతర దేశాల ప్రజలు అత్యంత భక్తి శ్రద్ధలతో పాల్గొన్నారు. ప్రవచన వేదికపైకి చేరుకున్న దలైలామా ప్రజలకు అభివాదం చేసి, పూజల నిర్వహణ తదుపరి అక్కడున్న వారికి ప్రసాద వితరణ చేశారు. వెంటనే తూర్పు ముఖం చేసిన ప్రత్యేక ఆసనంలో కూర్చున్న దలైలామా తన శిష్యులతో కలిసి ప్రార్థనలు చేశారు. ఈ ప్రార్థనలు ప్రమాణాల పూజ, మాధ్యమిక పూజ, ప్రజ్ఞాపారమిత పూజ అనే మూడు దశల్లో సాగాయి. మాధ్యమిక పూజ బౌద్ధ మేధావుల ఆధ్వర్యంలో జరగగా, 10 గంటలకు దలైలామా వేదికపై పడమర అభిముఖంగా ఉన్న ప్రధాన ఆసనంలో కూర్చొని ప్రజలకు తన సందేశాన్ని ఇచ్చారు. టిబెటన్ భాషలో దాదాపు గంటసేపు సాగిన ఆయన ప్రసంగం తదుపరి తిరిగి పూజలు నిర్వహించారు. మధ్యలో గంట భోజన విరామం తీసుకొని మళ్లీ మధ్యాహ్నం 2.30 గంటల వరకు ప్రార్థనలు చేశారు. అనంతరం దలైలామా బస చేసే వైజయంతి అతిథి గృహానికి వెళ్లారు.

కాలచక్ర-2006 ఉత్సవాలు గురువారం ప్రారంభమైన నేపథ్యంలో అమరావతికి వచ్చిన యాత్రికుల రాక గణనీయంగా పెరిగింది. ఇక్కడికి చేరిన 60,000 పైచిలుకు యాత్రికుల్లో భారత్‌లో నివసించే టిబెటియన్లే కాకుండా, 28 విదేశాలకు చెందిన 450 మంది కూడా ఉన్నారు.



కాలచక్ర పూజలకు హాజరైనటిబెటియన్ చిన్నారి (ఫైల్‌ఫోటో)

### రాజకీయ ఉద్దండుల ఖిల్లా

# గుంటూరు జిల్లా

(ప్రభాతవార్త-నరసరావుపేట)

రాష్ట్రరాజకీయ చిత్రపటంలో గుంటూరుజిల్లాకు ఉన్న ఘనచరిత్ర మరే జిల్లాకు లేదు. నలుగురు ముఖ్యమంత్రులకు, నలుగురు కేంద్రమంత్రులకు, రాష్ట్రతొలిశాసనసభ స్పీకర్‌కు, ఎందరో రాష్ట్రమంత్రులకు పుట్టినిల్లుగా వన్నెతెచ్చిన ఘనత గుంటూరు జిల్లాకే దక్కింది.

రాయలసీమకు ముఖద్వారంగా ఉండి ఫ్యాక్షన్ సీమగా పేరుగాంచిన (నక్సల్స్ ఖిల్లాగా) ఉన్న వల్నాడు ఆహార ధాన్యాలు, వాణిజ్యపంటల ఉత్పత్తికి కేంద్రబిందువుగా చెప్పుకునే తెనాలి డివిజన్ పారిశ్రామిక పర్యాటక శాఖలకు నిలయంగా సరిహద్దులతో ఉన్న గుంటూరు సీమకు వన్నెతెచ్చిన రాజకీయ మహామహులు ఎందరో ఉన్నారు. వారికి రాష్ట్ర, దేశ, రాజకీయ చిత్రపటంలో ప్రత్యేక స్థానం లభించింది. అలాంటివారిలో స్వర్గీయ కాసు బ్రహ్మానందరెడ్డి, కొత్త రఘురామయ్య, ఆచార్య ఎన్.జి.రంగా, భవనం వెంకట్రావ్, నందమూరి తారకరామారావు, కోన ప్రభాకరరావు, పాములపాటి అంకినీడు ప్రసాద్ తదితరులున్నారు. నాదెండ్ల భాస్కరరావు, ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు కూడా రాష్ట్ర, దేశ రాజకీయాల్లో కీలకపాత్ర పోషించారు. పై రాజకీయ ఉద్దండులలో కాసు బ్రహ్మానందరెడ్డి చరిత్ర ఘనమైనది. రాష్ట్రమంత్రిగా, సుదీర్ఘకాలం ముఖ్యమంత్రిగా కేంద్ర మంత్రిగా ఎఐసిసి అధ్యక్షుడిగా గవర్నర్‌గా రాజకీయ చక్రాన్ని తన కనుసన్నలలో నడిపారు. రాష్ట్రంలో కాంగ్రెసేతర ప్రభుత్వం తెలుగుదేశం హయాంలో జిల్లాకు చెందిన కోడెల శివప్రసాద్ హవాకు ఎదురేలేకుండా పోయింది. అయితే స్వర్గీయ కాసు బ్రహ్మానందరెడ్డి రాజకీయ వారసుడైన కాసు వెంకట కృష్ణారెడ్డి గతంలో మాజీమంత్రిగా పనిచేసినప్పటికీ ప్రస్థుతం ఎమ్మెల్యేగా ఉంటూనే జిల్లా రాజకీయాలను ప్రభావితం చేస్తున్నారు. ఉమ్మడి గుంటూరుజిల్లాగా ఉన్న సమయంలో జన్మించిన స్వర్గీయ టంగుటూరి ప్రకాశం పంతులు రాష్ట్ర తొలి ముఖ్యమంత్రి కాగా నరసరావుపేటకు చెందిన నల్లపాటి వెంకట్రామయ్యచౌదరి ఆంధ్ర రాష్ట్ర తొలిశాసనసభ స్పీకర్‌గా పనిచేశారు. ఆతరువాత జిల్లాకు చెందిన కాసు బ్రహ్మానందరెడ్డి, భవనం వెంకట్రావ్, నాదెండ్ల భాస్కరరావు రాష్ట్ర ముఖ్యమంత్రులుగా పనిచేశారు. కృష్ణాజిల్లావాసి అయినప్పటికీ విద్యాభ్యాసమంతా గుంటూరులో నెరిపిన స్వర్గీయ నందమూరి తారకరామారావు ముఖ్యమంత్రి పదవిని అదిష్టించి ఈజిల్లా పేరు ప్రఖ్యాతులు గాంచడంలో మరింత దోహదపడ్డారు. రాష్ట్రానికి మరో ముఖ్యమంత్రిగా పనిచేసిన నేదురుమల్లి జనార్థన్‌రెడ్డిని బాపట్ల, నరసరావుపేట పార్లమెంట్ సభ్యునిగా ఈజిల్లా ప్రజలు ఆదరించారు. ఇలాంటి రాజకీయ ఉద్దండులు జన్మించి నివశించిన గుంటూరు జిల్లా రాష్ట్ర, దేశ రాజకీయ చిత్రపటంలో పైనాయకులవల్ల ప్రత్యేకతను సంతరించుకుంది. నాటికాలం రాజకీయాల్లో నైతికవిలువలు నేడు కనిపించనప్పటికీ స్వాతంత్ర్యానికి ముందు తరువాత కూడా గుంటూరుజిల్లా ఖ్యాతి ఎనలేనిదిగా పేర్కొనవచ్చు.

ఇప్పటికీ నలుగురు ముఖ్యమంత్రులను నలుగురు కేంద్రమంత్రులను ఇరువురు గవర్నర్‌లను 31మంది రాష్ట్రమంత్రులను అందించిన ఘనత గుంటూరుజిల్లాకే దక్కుతుంది. ఎందరో సినీ, రాజకీయ ప్రముఖులకు కూడా పుట్టినిల్లు గుంటూరుజిల్లా. పార్లమెంట్ సభ్యులుగా పనిచేసిన స్వర్గీయ కొంగర జగ్గయ్య, ఘట్టమనేని కృష్ణ, శారద తదితరులంతా ఈజిల్లావారే. రాష్ట్ర రాజకీయ చరిత్రపుటల్లో గుంటూరుజిల్లాదే అగ్రస్థానం అన్నది నిజం.





కాసు వెంకట కృష్ణారెడ్డి



నల్లపాటి వెంకట్రామయ్యచౌదరి



కాసు వెంగళరెడ్డి



డా.కోడెల శివప్రసాదరావు

# హైందవ సంస్కృతి సంప్రదాయాలకు నిలువెత్తు నిదర్శనం

# డా॥ రామినేని ఫౌండేషన్



డాక్టర్ రామినేని అయ్యన్న చౌదరి
వ్యవస్థాపకులు
రామినేని ఫౌండేషన్

**(Dr. R.A.C) జననం 1929 అక్టోబరు 12**

## 'జన్మభూమి' అభివృద్ధికి కంకణం

**భారతీయ సంస్కృతి, హిందూ సాంప్రదాయాలు, ఆదర్శాలను పరిరక్షించి వాటిని అభివృద్ధి పరిచే లక్ష్యంతో స్థాపించిన డాక్టర్ రామినేని అయ్యన్న చౌదరి ఫౌండేషన్ జన్మభూమి అభివృద్ధితోపాటు, నిరుపేద విద్యార్థుల్లో నిబిడీకృతం అయి ఉన్న ప్రతిభను ప్రోత్సహిస్తోంది. USA లోని ఓహియో రాష్ట్రం సిన్‌సిన్నాటిలో స్వర్గీయ రామినేని అయ్యన్న చౌదరి కుటుంబ సభ్యులు ఉన్నత లక్ష్యాలతో స్థాపించిన ఫౌండేషన్ నేడు దేశవ్యాప్తంగా మన్ననలు పొందుతోంది. కళలు, శాస్త్రం, మానవ విజ్ఞాన శాస్త్రాల మిశ్రమ రంగాలనుంచి మేధావులు, నిపుణులు, పండితులు, సాహసవంతులను ఎంపికచేసి సత్కరిస్తోంది. వివిధ రంగాల్లోని ప్రముఖుల పరోపకార యత్నాలకు వీలు కల్పించడమే సంస్థ ప్రాథమిక లక్ష్యంగా పనిచేస్తోంది.**



**వేదాచార్య**
**కన్వీనర్, రామినేని ఫౌండేషన్**

### డాక్టర్ రామినేని అయ్యన్న చౌదరి (Dr. R.A.C)

ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లా బ్రాహ్మణకోడూరుగ్రామంలో రైతు కుటుంబంలో 1929లో జన్మించిన డాక్టర్ రామినేని అయ్యన్న చౌదరి అంచలంచెలుగా ఉన్నతశిఖరాలకు చేరుకున్నారు. స్వర్గీయ వీరయ్యచౌదరి, కన్యాకుమారికి జన్మించిన అయ్యన్న చౌదరి తండ్రి సలహా మేరకు వ్యవసాయంతోపాటు లలిత కళల్లో కూడా చొరవచూపించారు. గుంటూరు జిల్లాలో పాఠశాల విద్యపూర్తిచేసి బనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుంచి గణితంలో పోస్టుగ్రాడ్యుయేషన్ డిగ్రీ పొందారు. 1955 వరకూ ఆయన గుంటూరు జిల్లాలోని పాలపర్రు, కృష్ణా జిల్లాలోని మొవ్వల్లో ఉపాధ్యాయునిగా పనిచేశారు. ఉన్నత విద్యాభ్యాసం కోసం డాక్టర్ అయ్యన్న చౌదరి 1955లో అమెరికా వెళ్లారు. మిన్నీపాలిస్‌లోని మిన్నెసోట విశ్వవిద్యాలయం నుంచి మాస్టర్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ ఫైనాన్స్‌తోపాటు డాక్టరేట్‌కూడా పూర్తిచేశారు. విద్యాభ్యాస కాలంలో ఆయన తల్లితండ్రులపై ఆధారపడకుండా పార్ట్‌టైం ప్రాతిపదికన పనిచేస్తూ సొంతంగా ఆర్థిక వనరులను సమకూర్చుకున్నారు. 1963-1973 మధ్యకాలంలో నార్త్‌ల్యాండ్ కళాశాలలో ప్రొఫెసర్‌గాను, సిన్‌సిన్నాటిలోని ఆష్లాండ్ అండ్ గ్జేవియర్ యూనివర్సిటీల్లో పనిచేశారు. 1973లో ఆయన తన సేవలను సామాజిక సాంస్కృతిక రంగాలకు అంకితం చేసేందుకుగాను ముందుగానే పదవీవిరమణ చేశారు. డాక్టర్ అయ్యన్నచౌదరి పదవీవిరమణ తరువాత రియల్ ఎస్టేట్ వ్యాపారంలో ప్రవేశించి ఓహియోరాష్ట్రంలోని సిన్‌సిన్నాటిలో డౌన్‌టౌన్ ప్రాపర్టీ మేనేజ్‌మెంట్ ఇన్‌క్., అనే సంస్థను స్థాపించారు. ఈ సంస్థ నేడు అమెరికాలో ఉన్నతస్థానంలో ఉంది. డాక్టర్ అయ్యన్నచౌదరి 1967లో సుగుణను వివాహమాడారు. ఆయనకు ఆరుగురు పిల్లలు. భారతీయ సంస్కృతి సాంప్రదాయాలకుఅనుగుణంగావారికి ధర్మప్రచారక్, శారదాదేవి, సత్యవాది, బ్రహ్మానంద, వేదాచార్య, హరిచంద్ర అని సాంప్రదాయక వేదాల పేర్లు పెట్టారు. తన పిల్లలను పాశ్చాత్య సంస్కృతినుంచి తప్పించేందుకు ఇంట్లోనే విద్యాబుద్ధులు నేర్పారు. ఆయన ప్రారంభించిన వ్యాపారంలో శిక్షణపొందిన వారు ప్రస్తుతం ఆ సంస్థలను అప్రమత్తంగా చూసుకుంటున్నారు. డాక్టర్ అయ్యన్నచౌదరి 1958లో అమెరికాలో విద్యాభ్యాస కాలంలోనే హిందూ సంస్కృతి నాగరికతను వికసింపచేసేందుకు హిందూ అసోసియేషన్ ఆఫ్ మిన్నెసోటాను స్థాపించి క్రమేపీ భారతీయ ఉత్సవాలు సామాజిక కార్యక్రమాలను నిర్వహించారు. తన జన్మస్థలం బ్రాహ్మణకోడూరులో సంగీత, సాహిత్య, సంస్కృతి, హిందూ ధర్మ నిలయంను స్థాపించి భారతీయ లలిత కళలకు అంకితం చేశారు. దురదృష్ట వశాత్తూ అనారోగ్యకారణాల వల్ల వ్యవస్థాపకులైన డాక్టర్ అయ్యన్న చౌదరి 2000 సంవత్సరం ఏప్రిల్ 24వ తేదీ సిన్‌సిన్నాటిలోనే మృతిచెందారు. సన్మానాలు, ఇతర సామాజిక కార్యకలాపాలు అందచేసే సంస్కృతిని కొనసాగించాలన్న తండ్రి లక్ష్యాన్ని ఆయన కుమారులు కొనసాగించాలని నిర్ణయించారు. రామినేని పురస్కారాలపేరిట 1999 నుంచి 2005వరకూ తండ్రి జన్మదినం సందర్భంగా ప్రతి ఏటా అక్టోబరు 12వ తేదీ ఈ వేడుకలు నిర్వహిస్తున్నారు. పదవ తరగతి పరీక్షల్లో అత్యుత్తమ ప్రతిభ కనబరిచిన బాలబాలికలకు మెరిట్ అవార్డులు ఇవ్వాలని నిర్ణయించారు. ఎంపిక చేసిన పాఠశాలలన్నీ గ్రామీణ ప్రాంతాలకు చెందినవి కావడం గమనార్హం. జిల్లాలోని బ్రాహ్మణకోడూరు, పాలపర్రు, తెనాలి, కృష్ణా జిల్లాలోని మొవ్వ వంటి గ్రామాలు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలే. గ్రామీణ ప్రాంత నిరుపేద విద్యార్థుల్లో దాగి ఉన్న ప్రతిభను మరింత ప్రోత్సహించి వారిని ఉన్నత లక్ష్యాలకు చేరువ చేయడమే ప్రధాన లక్ష్యం. ఈ ప్రాంతాలు కూడా అయ్యన్నచౌదరి స్వస్థలం కావడమే కాకుండా ఆయన విద్యాభ్యాసం చేసి ఉపాధ్యాయునిగా పనిచేసిన ప్రదేశాలు కావడం విశేషం.

గ్రామీణులను ప్రోత్సహిస్తున్న నేపథ్యంలో పురస్కారాలు-2003కాలంలో ఒక్కొక్క అసెంబ్లీ నియోజకవర్గం నుంచి 19 మందికి పైగా పదవ తరగతి విద్యార్థులను మెరిట్ అవార్డులు బహూకరించడమే కాక ఈ సంవత్సరం గుంటూరు జిల్లాలో ఒక్కొక్క మండలంలో ఒక్కొక్కరు చొప్పున 57 మంది విద్యార్థులకు అందచేశారు.




**ఉపకార వేతనాలు పొందిన ప్రతిభావంతులయిన నిరుపేద విద్యార్థులతో జీయర్‌స్వామి, వేదాచార్య, జడ్పీ ఛైర్మన్ పాతూరి నాగభూషణం**




**రామినేని ప్రతిభాపురస్కారాల ప్రధానోత్సవ సభలో పాల్గొన్న రాష్ట్ర మంత్రి కన్నా లక్ష్మీనారాయణ, కన్వీనర్ వేదాచార్య, అప్పటికలెక్టర్ రామకృష్ణారావు, ఎస్‌పి జితేందర్, జడ్పీ ఛైర్మన్ పాతూరి, ఎమ్మెల్యేలు ధూళిపాళ్ల నరేంద్ర, రావి వెంకటరమణ.**

### సన్మానాలు, విశిష్ట పురస్కారాలు

విశిష్టపురస్కారం: డాక్టర్ కె.వరప్రసాద్‌రెడ్డి, ఎండి శాంతా బయోటెక్నిక్స్(ప్రై) లిమిటెడ్

విశేష పురస్కారం: డాక్టర్ లాల్జీ సింగ్, డైరెక్టర్ సిసిఎంబి, హైదరాబాద్, డాక్టర్ కె.విశ్వనాధ్, సినీ దర్శకులు, శ్రీ కాళోజి నారాయణరావు, విశేషానుభవం కలిగిన రచయిత

### డాక్టర్ రామినేని ఫౌండేషన్ (USA)

రాష్ట్ర రాజధానిలో 1999 సంవత్సరం అక్టోబరు 12వ తేదీ హోటల్ గ్రాండ్ కాకతీయలో డాక్టర్ రామినేని అయ్యన్న చౌదరి ఫౌండేషన్ ప్రారంభించారు. ఆనాటి వేడుకల్లో ముఖ్యఅతిధిగా డాక్టర్ సి.నారాయణరెడ్డి, విశిష్ట అతిధులుగా డాక్టర్ వెంపటి చిన్నసత్యం, ప్రొఫెసర్ ఎన్ గోపి, ప్రొఫెసర్ పి.శివారెడ్డి, డాక్టర్ గుమ్మడి వెంకటేశ్వరరావులు కూడా పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం:** డాక్టర్ వెంపటి చిన్నసత్యం బృందంచే కూచిపూడి నృత్యప్రదర్శన.

**సన్మానం: విశిష్ట పురస్కారం:** డాక్టర్ జి.ఎన్.రావు వ్యవస్థాపకులు మరియు డైరెక్టర్ ఎల్ వి ప్రసాద్ ఐ ఇనిస్టిట్యూట్.

**విశేష పురస్కారం:** బాపు-రమణ, ఆదర్శ స్నేహితులు మరియు రూపకర్తలు. డాక్టర్ నండూరి రామమోహనరావు విశేషానుభవం కలిగిన జర్నలిస్టు, తెలుగు కథా పోషకులు శ్రీకాళీపట్నం రామారావులను సత్కరించారు.

భారత దేశంలో 2000 సంవత్సరం హోటల్ గ్రీన్‌పార్కులో ఫౌండేషన్ తన మొదటి వార్షికోత్సవాన్ని జరుపుకున్నది. ఈ వేడుకలకు విశ్వవిఖ్యాత చలనచిత్ర నటుడు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు ముఖ్యఅతిధిగా హాజరుకాగా డాక్టర్ ఎన్ శివప్రసాద్; ప్రొఫెసర్ కాకర్ల సుబ్బారావు, శ్రీ ఎం మురళీ మోహన్ విశిష్ట అతిధులుగా హాజరయ్యారు.

**సాంస్కృతిక కార్యక్రమం:** అన్నమయ్య పదకోకిల శ్రీమతి శోభారాజు బృందంచే భక్తి సంగీత కార్యక్రమం నిర్వహించారు.

హైదరాబాద్‌లోని హోటల్ తాజ్ రెసిడెన్సీలో 2001 అక్టోబరు 12న రామినేని ఫౌండేషన్ తన ద్వితీయ వార్షికోత్సవాన్ని జరుపుకుంది. ఈ వేడుకలకు కేంద్ర రక్షణ శాఖ సహాయ మంత్రి శ్రీ యు వి కృష్ణంరాజు ముఖ్యఅతిధిగా హాజరుకాగా హైకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ జాస్తి చలమేశ్వర్, శ్రీ ఎ గంగాధరరావు, ఐ ఎస్ ఎస్ అధికారి శ్రీ పి వి ఆర్ కె ప్రసాద్, శ్రీ ఎం వి భాస్కరరావులు విశిష్ట అతిధులుగా పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం:** శ్రీవందే మాతరం శ్రీనివాస్ బృందం సంగీత కచేరి నిర్వహించారు.

**సన్మానం: విశిష్ట పురస్కారం:** ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ డి.సి.రెడ్డిని సత్కరించారు.

**విశేష పురస్కారం:** ప్రముఖ రచయిత్రి ఓల్గా, చెన్నైలోని కళాసాగర్ వ్యవస్థాపకులు శ్రీ ఎం ఎ సుభాన్, ప్రఖ్యాత సినటీ నటి శ్రీమతి జి.నిర్మలమ్మ. హైదరాబాద్‌లో 2002 అక్టోబరు 12వ తేదీ డాక్టర్ రామినేని ఫౌండేషన్ తన తృతీయ వార్షికోత్సవం తాజ్‌కృష్ణాలో నిర్వహించింది. ఈ వేడుకలకు ఆనాటి శాసనసభ స్పీకర్ శ్రీమతి కె.ప్రతిభా భారతి ముఖ్యఅతిధిగా హాజరయ్యారు. నాటి రాష్ట్ర హోం మంత్రి శ్రీ టి.దేవేంద్రగౌడ్, వైద్యఆరోగ్యశాఖ మంత్రి శ్రీ డాక్టర్ కోడెల శివప్రసాదరావు, ప్రెస్ అకాడమీ ఛైర్మన్ శ్రీ ఐ వెంకటరావు, ప్రముఖ శతావధాని మాడుగుల నాగఫణి శర్మలు విశేష అతిధులుగా హాజరయ్యారు.

**సాంస్కృతిక కార్యక్రమం:** ప్రఖ్యాత చలనచిత్ర హాస్యకళాకారులచే హాస్యవల్లరి.

**సన్మానం: విశిష్ట పురస్కారం:** డాక్టర్ చుక్కా రామయ్య (ఐఐటి), డాక్టర్ ఎన్ కోటేశ్వరరావు, సయ్యద్ ఎం డి ఆరిఫ్, నేషనల్ ఛీఫ్ బ్యాడ్మింటన్ కోచ్‌లను సత్కరించారు. రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌లో 2004 అక్టోబరు 12న హోటల్ వైస్రాయ్‌లోని కన్వెన్షన్ సెంటర్‌లో డాక్టర్ రామినేని ఫౌండేషన్ తన 5వ వార్షికోత్సవం నిర్వహించింది. శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ ప్రారంభించిన ఈ వేడుకల్లో మాజీ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు ముఖ్యఅతిధిగా హాజరయ్యారు. విశేష అతిధిగా కర్ణాటక, హిమాచల్ ప్రదేశ్ మాజీ గవర్నర్ రమాదేవి, గుంటూరు జిల్లా పరిషత్ ఛైర్మన్ పాతూరి నాగభూషణం గౌరవ అతిధిగాను, సినీ నటుడు ఎ వి ఎస్ తదితరులు పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం:** సినీ నటుడు టి ఎల్ కాంతారావు, బి.సుబ్బరాయన్.

**సన్మానం: విశిష్టపురస్కారం:** హేమలత లవణం

**విశేష పురస్కారం:** డా॥ యార్లగడ్డ నాయుడమ్మ, చిన్నపిల్లల వైద్యనిపుణులు

హైదరాబాద్‌లోని అక్టోబరు హోట్ వైస్రాయ్ కన్వెన్షన్ సెంటర్‌లోనే 2005 అక్టోబరు 12న ఫౌండేషన్ తన 6వ వార్షికోత్సవం నిర్వహించింది. శ్రీశ్రీశ్రీ త్రిదండి రామానుజ చిన జీయర్ స్వామీజీ ప్రారంభించగా శాసన సభ స్పీకర్ శ్రీ కె ఆర్ సురేష్‌రెడ్డి ముఖ్యఅతిధిగా పాల్గొన్నారు. కేంద్ర బొగ్గుగనుల శాఖ మంత్రి డాక్టర్ దాసరి నారాయణ రావు విశేష అతిధిగాను, జిల్లాపరిషత్ ఛైర్మన్ పాతూరి నాగభూషణం, పొన్నూరు ఎమ్మెల్యే ధూళిపాళ్ల నరేంద్ర కుమార్ గౌరవ అతిధులుగా పాల్గొన్నారు. సినీ నటులు తనికెళ్లభరణి, ఎ వి ఎస్‌లు కూడా పాల్గొన్నారు.

**సన్మానం: విశిష్ట పురష్కారం:** ప్రముఖ గ్యాస్ట్రోఎంటరాలజిస్టు పద్మశ్రీ డాక్టర్ నాగేశ్వరరెడ్డి, ప్రముఖ కవి పద్మభూషణ్ డాక్టర్ బోయిభీమన్న, ఆంధ్ర మహిళా సభ పూర్వ అధ్యక్షురాలు శ్రీమతి కె.సుగుణమణి, నవోదయ పబ్లికేషన్స్ ప్రచురణ కర్త శ్రీ రామమోహనరావులను సత్కరించారు

డాక్టర్ అయ్యన్న చౌదరి తన జన్మస్థలాన్ని విస్మరించ కుండా తన నాల్గవ కుమారుడు వేదాచార్య సహాయంతో బ్రాహ్మణకోడూరులో వ్యవసాయరంగాన్ని మరింత అభివృద్ధి చేశారు. భారత దేశాన్ని తరచుగా సందర్శించినపుడు విలువైన మార్గదర్శకాలను రూపొందించి హిందూస్థాన్ థెరప్యూటిక్స్ ప్రైవేట్ లిమిటెడ్ సంస్థపేరుతో ఫార్ములేషన్స్ తయారీ యూనిట్‌ను నెలకొల్పిరైతులకు తక్కువ ఖర్చు, నాణ్యతతో కూడిన పశుసంరక్షణ మందులను అందిస్తున్నారు. డాక్టర్ రామినేని 70వ జన్మదినోత్సవం సందర్భంగా ఆయన వారసులు డాక్టర్ రామినేని ఫౌండేషన్‌ను భారత దేశంలో 1999వ సంవత్సరం అక్టోబరు 12వ తేదీ ప్రారంభించి సామాజిక, సాంస్కృతిక కార్యకలాపాలను విస్తృతం చేసి తండ్రి ప్రాథమిక లక్ష్యాలను నెరవేర్చేందుకు శాయశక్తులా కృషిచేస్తుండటం ప్రశంసించదగిన అంశం.



**మంగళగిరి మండలం పెదవడ్లపూడి గ్రామంలో రామినేని ఫౌండేషన్ ఆధ్వర్యంలో 6 లక్షలతో నిర్మించిన గోశాల మందిరం**




**జిల్లాపరిషత్ హాలులో రామినేని ఫౌండేషన్ ఈశ్వరీ పురస్కారం సత్కరిస్తున్న జిల్లా కలెక్టర్ జయలక్ష్మి, ఎంపి బాలశౌరి, ఎస్‌పిసజ్జనార్, జడ్పీ ఛైర్మన్ పాతూరి నాగభూషణం.**



**స్వస్థలం బ్రాహ్మణకోడూరులో ప్రజలకు దాహార్తిని తీర్చేందుకు రామినేని ఫౌండేషన్‌నిర్మించిన రక్షితమంచినీటి పథకం ఓవర్‌హెడ్ ట్యాంక్**

8322 Arborcrest Drive Cincinnati Ohio 45236 40 USA
12 Madhuranagar Hyderabad 500 038 India

# నగరపాలక సంస్థ
## గుంటూరు



**శ్రీ కన్నా నాగరాజు**
గుంటూరు నగరమేయర్

**శ్రీ దువ్వారపు రామారావు**
కమీషనర్, గుంటూరు నగరపాలక సంస్థ

**శ్రీ మురళీమోహన్**
గుంటూరు నగర డిప్యూటీ మేయర్

## పరిపాలనా సంస్కరణలు

★ సమాచారహక్కు చట్టము, 2005 ప్రకారం నగర ప్రజలకు గుంటూరు నగరపాలక సంస్థ అనేక కార్యక్రమాలు ఆన్‌లైన్‌లో వెబ్‌సైట్ ద్వారా పొందుపరచడమైనది. చాలా ముఖ్యమైన సమాచారం ప్రజలకు అందుబాటులో తీసుకురావడమైనది. సమాచారం ప్రజలకు అందించేందుకు కార్పొరేషన్‌లో, సర్కిల్ కార్యాలయంలో, ప్రత్యేక అధికారులను నియమించాం.

★ ప్రజల ముఖ్యమైన పనులను పౌరసేవా కేంద్రము ద్వారా ప్రభుత్వము నిర్ణయించిన గడువులోగా పూర్తి చేయబడుచున్నవి. సమాచారము పూర్తిస్థాయిలో కంప్యూటరీకరించబడినది.

★ 802.11బి వైర్‌లెల్ టెక్నాలజీ ద్వారా ఆన్‌లైన్ విధానములో పన్నుల స్వీకరణ.

★ నీటి పంపిణీ విధానమునకు సంబంధించి హెడ్ వాటర్ వర్క్సుని కంప్యూటరీకరించి తద్వారా వెబ్‌సైట్ నుంచి మానిటరింగు చేయుట.

★ సత్వర బిల్లుల పంపిణీ / చెల్లింపుల కొరకు గృహేతర నీటి వినియోగదారులకు స్పాట్ బిల్లింగ్ సిస్టంను ప్రవేశపెట్టుట.

★ సత్వర సమాచారము కొరకు పౌర సేవా కేంద్రములో ఆన్‌లైను విధానములో తెలుసుకొనుటకు KIOSK ను ఏర్పాటు చేయుట.

★ ఇ-ప్రొక్యూర్‌మెంట్ విధానమును అవలంభించుట, తద్వారా టెండర్ల నిర్వాహణలో పారదర్శకత.

★ పూర్తిస్థాయిలో కంప్యూటరీకరించబడి అమలు చేయబడుతున్న పౌర సేవా కేంద్రము. ఈ సంస్థ సేవలను కొరియర్ సర్వీస్ ద్వారా ప్రజల ఇంటి వద్దకే అందించుట.

★ నగర సమగ్ర సమాచారము మరియు ఫిర్యాదుల నమోదు కొరకు www.gunturcorporation.com వెబ్‌సైట్ ప్రారంభించుట. నమోదు కాబడిన ప్రజా ఫిర్యాదులను 48 గం.ల వ్యవధిలో పరిష్కరించుట.

★ నగరంలో ఉత్పత్తి అవుతున్న ఘన వ్యర్థ పదార్థాలను మురికి నీటి కాలవలో వేయరాదు.

★ మీ ఇంటిలోపలగాని, ఆవరణలోగాని, పరిసరాలలోగాని నీరు 6 రోజుల మించి నిలవ ఉండకుండా చూడండి.

★ మీ సెప్టిక్ ట్యాంక్ లెట్రిన్‌కు, పగుళ్లు లేకుండా చూడండి. ట్యాంక్ నుంచి బయటకు వచ్చే అన్ని గొట్టాలకు నైలాన్‌మెష్ బిగించండి.

★ వర్షాకాలములో నీటిని 20 నిముషాలు మరగకాచి చల్లార్చి తాగవలెను.

146

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KLVA106M256 |
|---|---|
| పుస్తకం పేరు | వార్త ప్రత్యేక సంచిక |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | 4&3 |
| వెనుక అట్ట | 4&3 |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | naveeda |
| పేజీలు విడదీసినది | naveeda |
| స్కాన్ చేసినది | naveeda |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |